# "మాలపల్లి"
# విమర్శనాత్మక పరిశీలన


డా. సముద్రాల కృష్ణమాచార్య

ఎం.ఏ., పిహెచ్.డి.,


1990

డాక్టరేట్ పట్టాకోసం కాకతీయ
విశ్వవిద్యాలయానికి సమర్పించిన సిద్ధాంత గ్రంథం

సీతా శేషార్య యోరస్మత్ -
శ్రీమాతా పితృ పాదయోః
మాలపల్లి సమీక్షేయమ్
ఉపదా క్రియతే మయా ॥

# కృతజ్ఞతాంజలి

1987 లో డాక్టరేట్ పట్టాకోసం కాకతీయ విశ్వవిద్యాలయానికి సమర్పించిన సిద్ధాంత గ్రంథమిది. నా పరిశోధనాకృషి ఫలితమైన ఈ గ్రంథం ఈనాటికి సహృదయుల ముందుకు రావడం నాకెంతో ఆనందాన్ని కలిగిస్తున్నది. ఈ శుభ సమయంలో నేను ఇంతటివాడిని కావడానికి కారకులైన పూజ్యులు నా తల్లి దండ్రులకు ప్రణామాలర్పిస్తూ, భక్తిపూర్వకంగా ఈ కృతిని సమర్పిస్తున్నాను.

తెలుగు నవలా రంగంలో యుగకర్తగా పేర్కొనబడుతున్న ఉన్నవ లక్ష్మీనారాయణ గారి మాలపల్లికి తెలుగు సాహిత్య రంగంలో గల స్థానం అపూర్వమూ, అనన్యసదృశమూ. అట్లాంటి మాలపల్లిమీద పరిశోధన చేయడం సాహసమే అందువల్ల నా పరిశోధనా గ్రంథం సమగ్రమని నేను భావించడం లేదు. అయితే, నే వేసుకున్న ప్రణాళిక మేరకు మాలపల్లి యొక్క తత్వాన్ని వివరించే ప్రయత్నం చేసినాను. ఇందెంతవరకు సఫలమైనానన్నది సహృదయ పాఠకులకే వదలి పెడుతూ—

ఈ పరిశోధనా గ్రంథానికి పర్యవేక్షణ వహించి, డాక్టరేట్ పట్టాకు అర్హమైందిగా రూపుదిద్దుకోవటానికి సహకరించినవారు డాక్టర్ అనుమాండ్ల భూమయ్యగారు. నా పరిశోధనా కాలంలో నాకు అన్ని విధాలుగా సహకరించి, ఎప్పటికప్పుడు తగు సూచనలిస్తూ వచ్చినారు. ప్రచురణ విషయంలోనూ తగినంత ప్రోత్సాహాన్నివ్వడమే కాకుండా, 'అంతశ్శక్తి'ని వెలికితీసిన సహృదయులు శ్రీ భూమయ్యగారికి —

ఈ పరిశోధనా గ్రంథానికి న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించి, తమ ఆమోదాన్ని తెలియజేసిన డాక్టర్ ఏ. పున్నారావుగారికి, డాక్టర్ కె. మలయవాసిని గారికి—

అన్నివేళలా నాకు కావాల్సిన అనేక ముఖ్యమైన గ్రంథాల్ని ఇవ్వడంతో పాటుగా, ఏ సమయంలో వెళ్ళినప్పటికీ ఎంతో ఓపికతో పలుసార్లు చర్చలకు అవకాశమిస్తూ; మౌలికమైన సూచనలెన్నో చేసినవారు పూజ్యులు డాక్టర్ కోవెల సంపత్కుమారాచార్యులుగారు. ముఖ్యంగా 'మాలపల్లి' : 'ఐతిహాసికత' అనే అధ్యాయం విషయంలో ప్రత్యేకంగా చర్చించడానికి అవకాశమిచ్చిన శ్రీ సంపత్కుమారాచార్యులు గారికీ—

నాలోని పరిశోధకుడికి తమ ఉత్తేజకరమైన చర్చలద్వారా స్ఫూర్తి నిచ్చినవారు ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యగారు. 'మాలపల్లి : అచలం' అనే అధ్యాయంలో అచలానికి సంబంధించిన విలువైన సమాచారాన్నివ్వడమే కాకుండా, గ్రంథాలను సూచించడంతోపాటు, చర్చలకు అవకాశమిచ్చి ప్రోత్సహిస్తూ వచ్చిన శ్రీ సుప్రసన్నాచార్యులు గారికీ—

'అచలం' విషయంలో నాతో సమానంగా శ్రమించిన శ్రీ అడ్డగట్ల శ్రీధర్ గారికీ—

పరిశోధనాకాలంలో పలురకాలుగా సహకరించిన సహృదయులు, పూజ్యులు పలువురు ఉన్నారు. వారిలో ఆచార్య కె. వి. రామకోటిశాస్త్రి గారికి, ఆచార్య మాదిరాజు రంగారావు గారికి, డాక్టర్ హరిశివకుమార్ గారికి, డాక్టర్ బి. రుక్మిణిగారికి, ఆచార్య కేతు విశ్వనాథరెడ్డిగారికి, డాక్టర్ ఎమ్. రాజగోపాలాచార్యగారికి, శ్రీ ఎస్. ఎల్ నరసింహాచార్యగారికి, మిత్రులు డా॥ కె. యాదగిరి గారికి, శ్రీ కె. స్వామిగారికి మరియు వరంగల్లు, హైదరాబాదు నగరములందలి గ్రంథాలయ నిర్వాహకులకు, ఈ పరిశోధనలో నేను ఉపయోగించుకొన్నట్టి గ్రంథాల, వ్యాసాల రచయితలకూ—

ఈ గ్రంథం ప్రచురింపబడి సహృదయుల ముందుకు రావడానికి ఆర్థిక సహాయం అందించిన తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య సి. నారాయణరెడ్డి గారికి, తదితర కార్యనిర్వాహకులకూ—

నా పరిశోధనా కృషిని అభినందిస్తూ ఆశీస్సులతో పాటుగా విలువైన సమాచారాన్నందించిన గురువర్యులు శ్రీ శ్రీభాష్యం విజయసారథి గారు, ఆచార్య

# కృతజ్ఞతాంజలి

1987 లో డాక్టరేట్ పట్టాకోసం కాకతీయ విశ్వవిద్యాలయానికి సమర్పించిన సిద్ధాంత గ్రంథమిది. నా పరిశోధనాకృషి ఫలితమైన ఈ గ్రంథం ఈనాటికి సహృదయుల ముందుకు రావడం నాకెంతో ఆనందాన్ని కలిగిస్తున్నది. ఈ శుభ సమయంలో నేను ఇంతటివాడిని కావడానికి కారకులైన పూజ్యులు నా తల్లిదండ్రులకు ప్రణామాలర్పిస్తూ, భక్తిపూర్వకంగా ఈ కృతిని సమర్పిస్తున్నాను.

తెలుగు నవలా రంగంలో యుగకర్తగా పేర్కొనబడుతున్న ఉన్నవ లక్ష్మీనారాయణ గారి మాలపల్లికి తెలుగు సాహిత్య రంగంలో గల స్థానం అపూర్వమూ, అనన్యసదృశమూ. ఇట్లాంటి మాలపల్లిమీద పరిశోధన చేయడం సాహసమే అందువల్ల నా పరిశోధనా గ్రంథం సమగ్రమని నేను భావించడం లేదు. అయితే, నే వేసుకున్న ప్రణాళిక మేరకు మాలపల్లి యొక్క తత్వాన్ని వివరించే ప్రయత్నం చేసినాను. ఇందెంతవరకు సఫలమైనానన్నది సహృదయ పాఠకులకే వదలి పెడుతూ —

ఈ పరిశోధనా గ్రంథానికి పర్యవేక్షణ వహించి, డాక్టరేట్ పట్టాకు అర్హమైందిగా రూపుదిద్దుకోవటానికి సహకరించినవారు డాక్టర్ అనుమాండ్ల భూమయ్యగారు. నా పరిశోధనా కాలంలో నాకు అన్నివిధాలుగా సహకరించి, ఎప్పటికప్పుడు తగు సూచనలిస్తూ వచ్చినారు. ప్రచురణ విషయంలోనూ తగినంత ప్రోత్సాహాన్నివ్వడమే కాకుండా, 'అంతశ్శక్తి'ని వెలికితీసిన సహృదయులు శ్రీ భూమయ్యగారికి —

ఈ పరిశోధనా గ్రంథానికి న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించి, తమ ఆమోదాన్ని తెలియజేసిన డాక్టర్ ఏ. పున్నారావుగారికీ, డాక్టర్ కె. మలయవాసిని గారికీ —

# అభినందన

మాలపల్లి పైన విమర్శనాత్మక పరిశీలన చేసి సిద్ధాంత వ్యాసం వ్రాసిన శ్రీ కృష్ణమాచార్య గారికి నా హృదయపూర్వక అభినందనలు. మన రాష్ట్రంలోని విశ్వవిద్యాలయంలలో అనేక విషయాలపైన పరిశోధనలు చేసి సిద్ధాంత వ్యాసాలను వ్రాసి, ప్రతి సంవత్సరం యువక విద్వాంసులు డాక్టరేట్ పట్టాలు పొందుతున్నారు. కాని మాలపల్లివంటి ఉద్గ్రంథం పైన యింతవరకు ఎవ్వరును పరిశోధన చేయడానికి పూనుకోక పోవడం ఆశ్చర్యకరం. కొంచెం ఆలస్యమైనప్పటికినీ యన్. కృష్ణమా చార్యగారు ఈ పనికి పూనుకొని మాలపల్లి పైన వ్రాసిన సిద్ధాంత వ్యాసానికి డాక్టరేట్ పట్టం పొందడం సంతోషకరమైన సంగతి.

ఈ శతాబ్దంలో తెలుగుసాహిత్యం వివిధ రంగాలలో ముందడుగు వేసినది; వివిధ వాఙ్మయ ప్రక్రియలలో ఉత్తమ రచనలు చాలా వెలువడినవి. ఈ రచనా వ్యాసంగాన్ని స్థూల దృష్టితో పరిశీలించినప్పటికీ, నిస్సందేహంగా మాలపల్లి ఉత్తమోత్తమమైన రచనయని చెప్పితే, అతిశయోక్తి కాదు - మాలపల్లి రచయిత ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనిన గొప్ప సాహిత్యవేత్త; సమాజ శ్రేయస్సు కొరకు కృషి చేసిన సంఘ సంస్కర్త; మానవతావాదియైన మహారచయిత. శారదానికేతనం వంటి మహా సంస్థను స్థాపించి నిర్వహించిన కార్య శూరుడు. ఆధునిక ఆంధ్రదేశ చరిత్రలో ఉన్నవ లక్ష్మీనారాయణ గారి వంటి మహా మనీషి మరొకరు లేరని చెప్పితే సత్యానికి తలవంపు కలుగజాలదు

ఈ శతాబ్దపు భారతీయ సాహిత్యంలో మాలపల్లి వంటి మహారచనలు మిక్కిలి తక్కువ. భారతీయ సమాజాన్ని, భారత జాతీయ జీవనాన్ని చిత్రించే రచనలలో మాలపల్లి ప్రత్యేకంగా పేర్కొనదగిన గ్రంథం. రవీంద్రుడు, ప్రేమ్‌చంద్ వంటి మహా రచయితల సరసన కూర్చుండ దగిన తెలుగు రచయిత ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు గారు. రవీంద్రుని రచనలతోను, ప్రేమ్‌చంద్ గోదాన్‌తోను పోల్చి తులనాత్మక పరిశీలన చేయదగిన ఉద్గ్రంథం మాలపల్లి.

రవీంద్రుడు; ప్రేమ్‌చంద్; ఉన్నవ లక్ష్మీనారాయణ ముగ్గురు ఆధునిక భారతీయ సాహిత్యంలో త్రిమూర్తులు. భారతీయ సంస్కృతి, భారతీయ సమాజం, భారత జాతీయోద్యమం ప్రతిబింబించే దర్పణాలు యీ ముగ్గురి రచనలు- ఆధునిక భారతీయ సాహిత్యంలో పురాణాలవంటివి వీరి గ్రంథాలు.

కృష్ణమాచార్యులు గారు వ్రాసిన యీ సిద్ధాంత గ్రంథం ప్రామాణికంగా ఉన్నది. మాలపల్లికి పూర్వ రంగాన్ని, మాలపల్లి ఐతిహాసికతను కృష్ణమాచార్యులు గారు చక్కగా వివరించి సమర్ధవంతముగా విమర్శనాత్మక పరిశీలన గావించినారు. ఇందుకు వీరిని అభినందిస్తున్నాను.

/ఈ శతాబ్దంలోని మొదటి సగం భాగంలోని భారతీయ సమాజాన్ని ఉద్యమాలను మాలపల్లి కన్నులకు గట్టినట్లుగా వివరిస్తున్నది/ ఈ వివరణ కృష్ణమాచార్యులు గారు చక్కగా సమీక్షించినారు. లక్ష్మీనారాయణ గారి శైలిని గూర్చి కృష్ణమాచార్యగారు సముచితంగా వ్యాఖ్యానించినారు. తెలుగు రచయితలకు లక్ష్మీనారాయణగారి శైలి మార్గదర్శకమైనది. రవీంద్ర, ప్రేమ్‌చంద్‌ల వలె రచనలు గావించిన లక్ష్మీనారాయణ గారు స్త్రీ విద్య కొరకు, మహిళాభ్యున్నతి కొరకు ఉద్దేశించిన శారదా నికేతనం వంటి సంస్థను స్థాపించినారు. రవీంద్రుని విశ్వభారతి వీరికి ప్రేరణ కలిగించి ఉండవచ్చును.

తెలుగు సాహిత్యంలో ఉత్తమోత్తమ రచనయని చెప్పదగిన మాలపల్లిని తమ పరిశోధన కొరకు స్వీకరించిన కృష్ణమాచార్య గారు చక్కని సిద్ధాంత వ్యాసం వ్రాసినారు. ఇంత మంచి సిద్ధాంత వ్యాసం వ్రాసిన ఆచార్యుల వారికి నా హృదయ పూర్వక శుభాకాంక్షలు. భవిష్యత్తులో సమాజ శ్రేయస్సుకు, సాహిత్య అభ్యుదయానికి ఉపయోగపడే పరిశోధనలు మరికొన్ని గావించి ఆచార్యులవారు ఉత్తమ గ్రంథములు రచించి ప్రకటించవలెనని కోరుతున్నాను. ఇటువంటి రచనలకు ఆంధ్రావళి మోదం పొంది స్వాగతం యీయగలదని నిస్సందేహంగా చెప్పవచ్చును.

హైదరాబాదు

తేది 6-6-1990

డాక్టర్ దేవులపల్లి రామానుజరావు
అధ్యక్షులు
ఆంధ్ర సారస్వత పరిషత్తు,
హైదరాబాదు.

# ఆశంస

మా పూర్వవిద్యార్థి చిరంజీవి సముద్రాల కృష్ణమాచార్య డాక్టరేట్ పట్టా కోసం చేసిన కృషి ఫలితం 'మాలపల్లి : విమర్శనాత్మక పరిశీలన' అన్న ఈ గ్రంథ రూపంలో వెలువడుతున్నది. విశ్వవిద్యాలయాలలో తెలుగు శాఖలలో పరిశోధనలు ప్రారంభమై దాదాపు 30, 40 సంవత్సరాలు గడచినవి. ఈనాటికి ప్రక్రియాధ్యయన దశ నుండి యుగ సాహిత్య అధ్యయనం నుండి మహా కవుల కావ్యాల అధ్యయనం నుండి పరిణమిస్తూ తెలుగు పరిశోధన విశిష్టమైన అధునిక గ్రంథాల సుసూక్ష్మ అంశాల అధ్యయనంగా ఆధునిక కవుల విశిష్ట ప్రయోగాల అధ్యయనంగా సాగుతున్నది.

ఈ గ్రంథం ద్వారా సాఫల్యం పొందిన ఈ రచయిత తన పరిధిలో మాలపల్లి వంటి బృహద్గ్రంథానికి ఒక విధమైన విలక్షణ పరిష్కారం చేసినాడని చెప్పడం సత్య దూరమైన అంశమేమీ కాదు. సాహిత్యంలో ఒక గ్రంథం వెలువడటం, దానివల్ల సాహిత్య గతిలో ఒక మార్పు, నూతనమైన ధోరణి, ప్రయోగ వైలక్షణ్య సాధన కొనసాగటం సహజమైన అంశం అట్టి ప్రత్యేకత సాధించుకొన్న గ్రంథాల్లో ఉన్నవ లక్ష్మీనారాయణ గారి మాలపల్లి ఒకటి. మాలపల్లిలో రచయిత సృష్టించిన సమాజం విస్తృతంగా సమకాలీన సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక సీమలలో నుంచి ఆవిష్కృతమైందైనా, గ్రంథం లోని సన్నివేశాల పరిణామము, పాత్రల ఎదుగుదల, ఆఖ్యానంలోని సంక్లిష్టత దాన్ని సాధారణమైన నవలగా కాక జాతి చైతన్యానికి ఉపలక్షకమైన ఇతిహాసంగా రూపొందించాయి

ఒక వ్యక్తి సమాజంలోని అట్టడుగు దశలో పుట్టి అత్యున్నత శిఖరం దాకా ఎదగడం ప్రధానాంశం కాగా, వేరొక వ్యక్తి ఉన్నంతలో సమాజాన్ని కుదిపి అనేక సంఘర్షణలలో చిక్కుకొని కూడా అంతస్సులో సత్వాన్ని పీడక కసిలేని పరాక్రమంతో మాలిన్యం లేని శౌర్యంతో ప్రవర్తించి గురు దర్శనంతో 'కారణం' పొంది హఠాత్తుగా గ్రంథంలో మధ్యలో నిష్క్రమించి కూడా తన

చైతన్యాన్ని గ్రంథం నిండా వ్యాపింప చేయడం మరొక ప్రధానాంశం. ఈ రెండు అంశాలను గ్రహించకపోతే మాలపల్లి అర్థం కాదు. లోకంలో చాలా గ్రంథాలు తమను అర్థం చేసుకోలేనివారి చేతిలో పడి దుర్వ్యాఖ్యా విషమూర్ఛితాలు కావడం కద్దు మాలపల్లిని కూడా ఇటీవలి కాలం దాకా అప్రధానమైన అంశాలను కేంద్రంగా చేసుకొని కొందరు విమర్శకులు పరిశీలించడం జరిగింది. రచయిత మహా గ్రంథానికి తాత్పర్యంగా చెప్పిన అంశాన్ని వదలివేసి ప్రాసంగికంగా చెప్పిన అంశాలను నెత్తికెక్కించుకోవడం సంయమం గల విమర్శకులు చేయ దగిన పనికాదు. రామాయణంలో జాబాలి ప్రతిపాదించిన చార్వాకాన్ని ప్రధాన తత్వమని చెప్పడమెలాంటిదో ఇది అలాంటిదే.

ఉన్నవ లక్ష్మీనారాయణగారు జాతీయోద్యమ చైతన్యంలో పుట్టి పెరిగిన మహనీయుడు. తిలక్ మార్గాన్ని అనుసరించిన వాడు. మహాయోగులైన మాస్టర్ సి. వి. వి. యోగాన్ని సాధన చేసినవాడు. అచల సిద్ధాంతంలో జీవితాన్ని కొనసాగించినవాడు. ఐర్లండ్‌లో బార్ ఎట్ లా చదువు సాగిస్తూనే ప్రపంచ రాజకీయ సామాజిక ధోరణులు అర్థం చేసుకొన్నాడు. ఇలా అనేకానేక ధోరణుల సమన్వయం చేసుకొంటే తప్ప ఉన్నవ వ్యక్తిత్వం సంపూర్ణంగా అధ్యయనం చెయ్యడం సాధ్యం కాదు. తెలుగు నవలా ప్రపంచంలో తొలి ఇతిహాసమైన మాలపల్లి తీసుకొన్న విస్తృత కథా ప్రపంచము సంఘర్షణ కేంద్రంగా అయిదారు సంవత్సరాలలో జరిగిన కథను చిత్రిస్తున్నది. ఈ సంఘర్షణ భౌతిక దశలో అగ్రవర్ణ ఆచారాలకు అస్పృశ్యతకు సంబంధించినది/ భూస్వాములకు, కూలీలకు; పేదలకు, ధనికులకు సంబంధించినది. హైందవ ధర్మానికి, మతాంతరీకరణకు సంబంధించినది. ప్రేమకు వివాహానికి, గృహస్థ ధర్మానికి కామానికి; స్వదేశీయ భావానికి విదేశీయ పాలనకు - ఇలా విభిన్న స్థాయిలలో ఇది వ్యక్తమౌతున్నది కాని, వీటన్నిటి అడుగున మానవుడు తనలో తానే సాగించే పోరాటం, తనతో తానే సాగించే పోరాటం మూలభూతంగా చిత్రితమయింది. మొత్తం ఇతివృత్తానికి ఇదే కేంద్ర బిందువు. అన్ని పాత్రలు, ప్రవృత్తులు, ఆలోచనలు, తాత్విక ధోరణులు దీనిచుట్టే పరిభ్రమిస్తున్నవి

ఒక విధంగా మాలపల్లి నవల జాతీయ భావనామూర్తికి ఒక పార్శ్వం నుండి గీసిన సమూల చిత్రం నవలా రచయిత తీవ్రమైన ధర్మావేశంతో దీన్ని రచించాడు ఆవేశ ప్రవాహం ముంచెత్తినప్పుడు ఉక్కిరిబిక్కిరవటం తప్పదు.

అయినా రచయిత తన లక్ష్యాన్ని మరచిపోలేదు నవలగా మాలపల్లి శ్లిష్టమైన బంధం కలదిగా చెప్ప వీలులేకపోయినా శిథిలబంధమని చెప్పడానికి వీలు లేదు.

ఈ లక్షణాలచేత ఈ నవల భారతీయ సాహిత్యంలో ఒక అరుదైన స్థానాన్ని పొందింది. రామదాసు పాత్ర పొందిన ఆత్మ పరిణతి ఒక విధంగా ఆధునిక కాలంలో భారతీయ ఆధ్యాత్మిక చరిత్రలోనే అసదృశమైన సన్నివేశం. సమాజంలోని పరిణామాలను బహుముఖంగా, విశదంగా ఇంతటి విశాల భిత్తిక మీద చిత్రించిన గద్యప్రబంధం సమకాలీన భారతీయ సాహిత్యంలో అనన్యాదృశమైనది. గాంధీజీ ఉద్యమాలను చిత్రిస్తూ దానితోపాటు మౌలిక అంశాలయిన స్త్రీ పురుష సంబంధాలు, ఆర్థిక సంబంధాలు, తాత్విక సంబంధాలు సమాంతరంగా, సమన్వితంగా చిత్రించిన రచన కావడం దీని వైశిష్ట్యం. శబరి కథ చెప్పినప్పుడూ, అహల్య కథ చెప్పినప్పుడూ, కమల తన శిశువైన సాహును కృష్ణ భావనతో సేవించినపుడూ, సంగదాసు మరణించినపుడూ, రామానాయుడు తనకూ అతనికీ ఉన్న అభేదాన్ని చెప్పినపుడూ, అప్పాదాసు మరణించినపుడూ రచయిత అనుభూతి శిఖరాలమీదకు పాఠకులను ఆరోహింపజేస్తాడు. రామానాయుడు జైలులో పొందిన ఆధ్యాత్మిక అనుభూతి శ్రీ అరవిందులు కారాగారంలో పొందిన వాసుదేవ సాక్షాత్కారము అధిక సామ్యలక్షణాన్ని కలిగి ఉన్నవి.

ఈ నవలనుగూర్చి పరిశోధించడం సాహస కార్యమే. ఇతిహాస ప్రాయమైన ఈ రచనలోని ఏ పార్శ్వాన్ని కాపార్శ్వము విస్తృతమైన పరిశీలన కవకాశమిస్తుంది. ఈ రచయిత డాక్టర్ కృష్ణమాచార్య నిర్ణయించుకొన్న మార్గం దాని మౌలిక రూపాన్ని, తత్వాన్ని వ్యాఖ్యానించటమే ఈ పరిమితిలో ఈ నవలా రచనకి కారణంబులు ఉద్బోధకములు అయిన ఉద్యమాలనుగూర్చి నవలలో వాటి ప్రవేశాన్నిగూర్చి చర్చించి దీని సమగ్రభావ తత్వ స్వరూపాన్ని వ్యాఖ్యానించాడు. ముందు ముందు ఆంధ్రభాషా సాహిత్య అధ్యయనాన్ని కొనసాగిస్తూ తన ప్రతిభాశక్తికి ఒరపిడి పెట్టే ఉత్తమ రచనలు చేయవలెనని ఆశిస్తున్నాను.

ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య

16-6-1990

Principal, University Evening
College, Kakatiya University,
Warangal-506 009.

# అభినందన

మిత్రుడు డా॥ ఎన్. కృష్ణమాచార్యులు చిరకాలంగా నేను మా తెలుగు శాఖలో పరిశోధక విద్యార్థిగా ఎరుగుదును ఆయన వినయ సంపన్నుడు చాలా చురుకైనవాడు. ఈ రెండు లక్షణాలూ ఆయన సాహిత్య అధ్యయన వైఖరిలో ప్రతిబింబిస్తుంటాయి. ప్రతిపాదిత విషయాన్ని ఆమోద యోగ్యంగా చెప్పడంలో ఆయనలోని వినయం తొంగిచూస్తుంటుంది. సాహిత్య తత్వాన్ని విశ్లేషించడంలో ఆయనకున్న చురుకుదనం తూటలా వెల్లువికి వస్తుంటుంది.

'మాలపల్లి' గురించి ఇంతకు ముందే ప్రముఖ విద్వాంసులు తమతమ దృక్పథాల్ని, వైఖరుల్ని వెల్లడించి ఉన్నారు ఐనా, వాటికన్న భిన్నంగా తన దైన నూతన దృష్టిని మాలపల్లిపై ప్రసరించి శ్రీ కృష్ణమాచార్యులు చక్కని ప్రామాణికమైన సిద్ధాంత గ్రంథాన్ని రూపొందించినాడు. ఆయనలో అన్వేషణా సామర్థ్యం పుష్కలంగా ఉన్నది. అందుకు ఈ సిద్ధాంత గ్రంథమే నిదర్శనం.

ఈ అభ్యర్థికి తగిన సలహాలిస్తూ సాహిత్య పరిశోధన మార్గంలో నడిపించిన పర్యవేక్షకుడు డా॥ అనుమాండ్ల భూమయ్యనూ, అభ్యర్థి డా॥ ఎన్.కృష్ణమాచార్యనూ అభినందిస్తున్నాను. భగవంతుడు ఆయన్ని అన్నివిధాలుగా ముందుకు నడిపించుగాక!

ఆచార్య పేర్వారం జగన్నాథం

Head, Department of Telugu
Kakatiya University,
Warangal - 506 009.

28-6-1990

# సత్యధర్మాయ దృష్టయే

హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్
తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే

చిరంజీవి కృష్ణమాచార్యునకు అనేక శుభాశీస్సులు. మన కళాశాలయొక్క ప్రత్యయ ప్రతీకలుగా ప్రాగ్గతి ప్రకేతనాలుగా పరిఢవిల్లుతూ పరిణత్రమ ప్రతిభా పరివహంలో పరీవాహాలుగా పరిస్ఫురిస్తూ పరిస్పందిస్తున్న నీబోటి వ్యక్తులను చూస్తుంటే నాకు చాలా ఆనందము కలుగుతున్నది. మీరు అన్న పదం కంటే నీవు అన్న పదంలోనే ఏదో ఆత్మీయత గోచరిస్తుంది అందువల్ల త్వంకారమునే ఉపయోగిస్తున్నాను ఇక విషయానికి వస్తాం.

నీ కృషి విశ్వతోముఖమైనది. తెలుగు నవలా సాహిత్యంలోనే కాదు-ఉద్యమ నిర్వహణలో, సంఘ సంస్కరణలో, ఆత్మజ్ఞాన ప్రబోధములో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు ఇదం ప్రథములనుటలో అన్యతోక్తి లేదు. ఆనాటి ప్రవాహానికి ఎదురీత ఈదుతూ సర్వతోముఖంగా అన్ని రంగాలలో ప్రతిభను, కర్తవ్య దీక్షను అనుష్ఠానముతో మేళవించి ధ్యేయాన్ని సాధించిన మహర్షి ఉన్నవ లక్ష్మీనారాయణగారు. నీ సమీక్షాగ్రంథం ఐదు అధికరణములలో విభక్త మైంది. ప్రతివిషయం చాల లోతుగా తరచి తరచి ప్రదర్శించటం జరిగినది. మాలపల్లి ఒక నవలగా మనం తీసుకోగూడదు. మహాభారతంలో లేనిదంటూ లేనట్లే మాలపల్లిలో లేనిదంటూ లేదు. మాలపల్లి లోకజీవన దర్శనం. ఒక మహాకవి మహాకావ్యమున కుండవలసిన లక్షణాలను పేర్కొన్నారు......

కావ్యమాలోచనాధానం మూలవృత్తి పరిష్కృతి
చయనం చానుభూతీనాం లోకజీవనదర్శనం
ఋజువక్రోపదేశేన జనతాభ్యుదయావహం
నానాపాత్ర పరిస్ఫీత నైకాభిరుచి బంధురం ॥

ఈ లక్షణాలు మాలపల్లిలో స్పష్టంగా గోచరిస్తున్నవి. సంగదాసు, రామదాసు, జోతీ అప్పాదాసులు, కమలా మోహనులు, చౌదరయ్య మున్నగు పాత్రల చిత్రణ కాల్పనికత్వాన్ని తెల్పుటం లేదు. సహజ ప్రవృత్తులకు ప్రతీకముగా చిరస్థేమావహంగా కావింపబడినవి. ఏవో ప్రలాప, విలాప, అనులాప, విప్రలాపాలతోకొనసాగే ఎక్కువ నవలలలోని సంవాదములు మాలపల్లిలో మచ్చుతునకకైన కానరావు. ఆలంకారికులు పద్య, గద్య,వచన భేదమును పాటించలేదు ఇది అల్పుల దృష్టి. తాను వాడే భాషలో ముద్రా, ఛాయ, ఫణితి, పరితి, ఉక్తి, యుక్తి, వాకో వాక్యాదులనే పదునెనిమిది భాషీయములుంటవి ఇవి ఉన్నప్పుడు అది వ్యావహారికంగావచ్చు పద్యం గావచ్చు మరేదైనా గావచ్చు. కలకాలం జీవిస్తుంది.

ఒక కావ్యము లోకుల జీవనమును దర్శింపచేస్తూ, లోకులకు జీవన దర్శనమై వెలుగొందటమే కావలసిన లక్షణము ఉన్నవ వారి మహాకృతి లోకమునకు మహోపకృతి సిద్ధాంతం కొందరి వ్యక్తుల వర్గాలకు చెందినది కాకూడదు. అంతమనగా నిర్ణయము నిర్ణయము సిద్ధిని పొందినపుడు అది సిద్ధాంతమవుతుంది. మన నైయాయికులు సిద్ధాంతాన్ని నాలుగు విధాల విభజించినారు. 1. సర్వతంత్రము, 2 ప్రతితంత్రము, 3. అధికరణము, 4. అభ్యుపగమము. ఈ మధ్య విశృంఖలంగా సిద్ధాంతాల పేర వాదాలు వినిపిస్తున్నవి.స్వసంవేదనం, అత్యంతా భావం, ఉపాదాన కారణం, సత్ప్రతి పక్షం, బాధిత ప్రమాణా భావం, సంయోగ సమవాయ సామాన్య విశేష రూపేణ సన్నిషేధం, ఇంద్రియ ప్రత్యక్ష వైకల్పం, గుణద్వారా గుణిగ్రహణం, విశేష గుణ ద్వారా స్వతంత్రాస్తిత్వబోధ, సంశయిం, ద్రవ్యత్రైకాలికత్వం, సంకలనాత్మక జ్ఞానం, స్మృతి, జ్ఞేయజ్ఞాతృ పార్థక్యం, పూర్వ సంస్కారానుస్మృతి అనే పధ్నాలుగంశములను పురస్కరించుకొని వస్తువు యొక్క సత్తా నిషేధాలు నిరూపింపబడతవి. వీటి పరిజ్ఞానము లేనివారు విషయ విశ్లేషణం చేయలేరు.తెలుగులోవచ్చే అధిక సిద్ధాంత వ్యాసాలు అభ్యుపగమ సిద్ధాంత విభాగమునకు చెందుతున్నవి.కాని, ఉన్నవ వారి వ్యక్తిత్వము మొదలుకొని ఆయన సంఘసేవ, ఆయన ఉద్యమ నిర్వహణ, ఆయన దేశభక్తి, ఆయన సంస్కరణ, ఆయన అచల ప్రబోధము ఇత్యాది అంశములు సమ్యక్ దృష్టితో సమ్యఙ్మననము కావింపబడినవి. ఈ పరిశోధన సర్వతంత్ర సిద్ధాంతంగా భావించుటలో విజ్ఞులెవరూ సంకోచించరు. పట్టువల

ఆలోచన సరణి, విస్రమత, జిజ్ఞాస నీకు ఇతోధికంగా పురోగతిని ప్రసాదిస్తవి. అన్నిటికీ మించిన అంశము ఈ గ్రంథాన్ని ని మాతాపితరులకు అంకితమొసగటం. ఇది నేటి యువతరములో అరుదుగా కనిపిస్తున్నది. ఈ గ్రంథం పరిశోధకులకు మేలు చేకూరుస్తుందని ఆశిస్తున్నాను.

తేది 24-6-1990

శ్రీభాష్యం విజయ సారథి
సంస్కృతోపన్యాసకులు
శ్రీ విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాల
వరంగల్.

# హృదయావిష్కారం

ఇంచుమించు నూటఇరవై ఏళ్ళ తెలుగు నవలా సాహిత్య చరిత్రలో మాల పల్లి ఒక హిమగిరి శిఖరం. అంటే అంత ఉన్నతమైన దన్నమాట. ఆధునిక తెలుగు సాహిత్యంలో మాలపల్లి నవల వెలువడటానికి ముందు కాని, అటు తరు వాత కాని సాంఘికోద్బోధంలో కాని, పరిణామంలో కాని మాలపల్లికి సాటి వచ్చే నవల ఇంకొకటి కనపడదు. తెలుగు నవలా సాహిత్య చరిత్రలో స్వర్ణోత్సవ వైజయంతిక ఈ నవల. 1872లో తెలుగు నవల ప్రాథమికమైన రూపురేఖలు దిద్దుకొన్నదనుకొంటే సమకాలీన భారతీయ సాహిత్యంలో 1922 నాటికే అపూ ర్వమూ అద్భుతమూ అనన్య సదృశమూ అయిన స్థానాన్ని సంపాదించి పెట్టింది తెలుగు సాహిత్యానికి మాలపల్లి నవల. అస్పృశ్యతను కథా వస్తువుగా చేసుకొని సామాజిక ఆర్థిక రాజకీయ మత నైతిక పరిణామాలను సాంఘిక జన జీవన చైతన్యాన్ని ఆవిష్కరించి విశ్లేషించిన నవల మరి ఏ ఇతర భారతీయ సాహిత్యంలోనూ మాలపల్లి వచ్చేనాటికి వెలువడలేదు. 'అంటరానివాళ్ళు' (ది అన్ టచబుల్స్) అని ముల్కరాజ్ ఆనంద్ రచించిన నవల కూడా మాలపల్లి వెలువడ్డ తర్వాత పది, పన్నెండేళ్ళకు కాని వెలువడలేదంటారు వేత్తలు. అదీ కాక ఆ ముల్కరాజ్ ఆనంద్ ఆ నవలను ఇంగ్లీషులో రాశారు. ఏతావతా ఆధునిక భారతీయ సాహిత్యంలో ప్రాథమ్య వైశిష్ట్యమే కాదు ప్రకృష్ట సాహిత్య సృజనోత్కృష్టత కూడా మాలపల్లి దక్కించుకున్నది

అంతేకాదు, సృజనాత్మక సాహిత్య చరిత్రలో ఈ నవల ప్రభవం, ప్రాభవం అపూర్వమూ అసదృశమూ కదా! భారతీయ సాహిత్యం సంగతి అట్లా ఉంచి ప్రపంచ సాహిత్యంలోనే ఇటువంటి సన్నివేశం ఉన్నదో లేదో! శ్రీకృష్ణు డిలా ఈ నవల కారాగృహంలో పుట్టింది. కావలివాళ్ళను ఏమార్చి దేవకీనందనుడు నందగోకులానికి చేరినట్లే జైలు సిబ్బంది కన్నుగప్పి పమిడిపాడు అగ్రహారం

చేరింది. బెల్లంకొండ రాఘవరావుగారు మనస్వి. సాహిత్య ప్రియంభావుకుడు. ఆనాడు తెలుగు సాహిత్య ప్రియులకు ఈవిచెట్టు. ఈ బెల్లంకొండ రాఘవరావు మహోదయులే మాలపల్లిని మొదట అచ్చువేయించారు. బ్రిటీష్ ప్రభుత్వపు కంసుడు నిషేధించి, ప్రతిషేధించి ఈ నవల ప్రాచుర్యాన్ని భంగించాలని చాలా తాపత్రయ పడ్డాడు కాని ఆ ప్రయత్నాలు కలిసి రాలేదు. యువకులు, స్వాతంత్ర్యోద్యమ ప్రియులు ఈ నవల చదవాలని తహతహలాడారు. రహస్యంగా ఒక ప్రతి సంపాదించుకున్నారు. ఈ విధంగా తెలుగు నవలా సాహిత్య చరిత్రలోనే గొప్ప సంచలనాన్ని సృష్టించిన నవల మాలపల్లి. ఖైదీ దుస్తుల్లో కటకటాం వెనుక కిరోసిన్ దీపపు గుడ్డివెలుతురులో ఇంత ఉజ్జ్వలమైన నవలకు రూపకల్పన చేశారు ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు. తెల్ల కాగితాలు ఎలా సంపాదించారో, వ్రాతప్రతి ఎలా బయటకు చేరవేశారో-అదంతా ఉత్సాహ ప్రభు మంత్ర శక్తియుతం. గుహ్యాత్ గుహ్యతరం పరమోత్తేజకం

తెలుగులో ఇంత పెద్ద నవల ఇంతకు ముందు లేదు. ఇటు తరువాత డెబ్బై ఏళ్ళలో కూడా ఓ పదికంటే ఎక్కువ నవలలు రాలేదు ఇంత ఆవరణ వైభవం కలవి అయినా అటువంటి గొప్ప నవల లన్నిటిలోనూ మాలపల్లికి ప్రత్యేకమైన ప్రతిపత్తి ఉండనే ఉంది,

మాలపల్లి వైశిష్ట్యం ఎటువంటిది? మూడురకాల నవ్యతను రూపించిన నవల ఇది ఇతివృత్తంలో, భాషావిషయికంగా, శిల్పవిషయికంగా, భవ్యమైన నవ్యత జీవశక్తిగా గల నవల మాలపల్లి సాహిత్య ప్రయోజనం, సందేశం ఈ నవల ఉత్తమత్వాన్ని నిరూపిస్తున్నాయి. ఆనాటి జాతీయోద్యమాన్ని సర్వాత్మనా ప్రతిబింబించిన నవల ఇది

మాలపల్లి అనే పేరుతో పాటే సంగ విజయం అనే ఇంకో పేరుకూడా ఉంది ఈ నవలకు. భారతీయ సామాజిక వ్యవస్థలో పంచములని వ్యవహృతు లయ్యేవారి దుర్భర జీవన దైన్యాన్ని సమాజంలో స్వార్థపరులు కుట్రదారులు అహంకారులు వాళ్ళను పెట్టే కష్టాలను, అమానుషమైన ఈ వ్యవస్థను ఏవిధంగా సంస్కరించవలసిందీ నిరూపణం చేస్తున్న నవల మాలపల్లి.

అసలు భారతీయ సామాజిక సాంస్కృతిక ఐతిహాసిక పరిణామంలో ఈ పంచమ వర్ణ ఆవిర్భావమే జాతిజాతి అంతా సిగ్గుపడి కుమిలిపోవాల్సిన పర్యవసానం. చాతుర్వర్ణమయం సృష్ట్యా అనే భావాన్ని అంగీకరించినా అంగీకరించక పోయినా, సామాజిక పరిణామంలో ఒకనాటి సమష్టి ప్రయోజనాలకోసం ఒక వ్యవస్థ రూపుదిద్దుకొన్నదనుకున్నా పంచములనే వీరి సృష్టి ఎప్పుడు ఏ కాలంలో ఏ విధంగా రూపొందిందో చెప్పలేము. నాలుగు వర్ణాలవారు నాలుగు వేల కులాలుగా చీలిపోవడం భారత జాతీయ సంస్కృతి మహత్వ మందిరానికి ఇసుక పునాదిగా పరిణమిస్తూ వచ్చింది. అస్పృశ్యులలో కూడా అవాంతర అస్పృశ్య వర్గాలుండడం మరింత విస్మయకరం 1840ల దశకంలో కూడా పాశ్చాత్య దేశాలనుంచి వచ్చిన మిషనరీలుకూడా తమ పబ్బం గడుపుకోవటానికైనా భారతీయ సాంఘిక వ్యవస్థలోని ఈ కుల పట్టింపులను ఆంక్షలను పాటించవలసి వచ్చిందని ఆర్. టి. నోబుల్ అనే మిషనరీ జీవితచరిత్రను రచించిన ఆయన సోదరుడు జాన్ నోబుల్ సోదాహరణంగా ఎన్నో ఉదంతాలను పేర్కొన్నాడు (1867) ఆనాడు కృష్ణాజిల్లాలో మిస్టర్ బౌటన్ అనే మత ప్రచారకుడు చర్మకారులను మతంలో కలుపుకోవటానికి ప్రయత్నించగా ఆయన గృహపరిచారకులైన మాలవారంతా ఆయన్ను విడిచిపెట్టి పోయినట్లు నోబుల్ దొర తన తమ్ముడికి రాసిన లేఖలో పేర్కొన్నాడు. కేరళలో అయితే సాంఘిక స్తరంలో ఆయా వర్ణం వారి స్థాయినిబట్టి నిమ్నజాతులవారు వారితో వ్యవహరించ వలసినప్పుడు నిర్ణీతమైన దూరాన్ని నిన్న మొన్నటి వరకు పాటించవలసి వచ్చినట్లు శ్రీనారాయణ గురు మహాశయుల సాంఘిక చైతన్య పోరాటాలను బట్టి తెలుస్తున్నది. అగ్రవర్ణాల వారి అవాంతర సాంఘిక స్థాయిని బట్టి దిగువ కులాల వాళ్ళు ముప్పై ఆరు అడుగులు, ఇరవై నాలుగు అడుగులు-ఈ విధంగా దూరంగా నిలబడి వాళ్ళతో మాట్లాడవలసి ఉండేదట. అందువల్లనే స్వామి వివేకానంద కేరళను భారతదేశ ఉన్మాద ప్రదర్శనశాలగా వర్ణించారు.అయితే భారతీయ మతధార్మిక సాంస్కృతిక ప్రాణచైతన్యశక్తి ఎంత మహత్వ పరిపూర్ణమైనదంటే మళయాల రాష్ట్రంలో ఈఐవలనే అస్పృశ్యకులంలో జన్మించిన శ్రీ నారాయణ గురు తమ కృషి ఆదిశంకరుల భగవత్పాదుల వారి కృషి అని చెప్పుకోగలిగారు. ఆయన ఆధునిక భారతదేశంలో అంతటి గౌరవానికి పాత్రులు కాగలిగారు.

ఏది ఏమైనా పంచములను ఏ కారణం వల్ల సాంఘిక బహిష్కారానికి గురి చేసే అమానుషత్వం, అవివేకం భారతీయ వర్ణ వ్యవస్థలో ప్రవేశించి కొన సాగినా ఈ శతాబ్ది భారతీయ స్వాతంత్ర్యోద్యమంలో జాతీయ సాంఘిక పరివర్తన కృషిలో అస్పృశ్యతా నిర్మూలనం అన్ని సమస్యల కన్నా ముందుగా పరిష్కారాన్ని కోరింది. జాతిలో సమానత్వం సౌభ్రాత్రం లేకుండా స్వాతంత్ర్యం రాదనీ వచ్చినా అది మనజాలదనీ దేశ నాయకులు సంఘ సంస్కర్తలు గ్రహించారు. రాజా రామమోహన్‌రాయ్ కాలం నుంచే భారతీయ సాంఘిక వ్యవస్థలో దురాచారాలు అంధవిశ్వాసాలు దుష్ప్రవర్తనలు సమూలంగా రూపరిపోవాలన్న గాఢ వాంఛ బయలుదేరింది. శ్రీ రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద జాతీయ పునర్నిర్మాణానికి సాంస్కృతిక విలువల పునరుద్ధరణకు ప్రబోధించారు అద్వైతం కేవలం ప్రబోధ మాత్ర పర్యవసాయి, సిద్ధాంత శోభిత సుదూరాదర్శమన స్థాయి కాకూడదనీ అది నిత్య జీవితంలో ప్రవర్తితం కావాలనీ ఆది శంకరుల దగ్గర నుంచి ఆధ్యాత్మికాచార్యు లందరూ నొక్కి చెప్పారు. అయినా భౌతిక మాయావరణంలో ఈ అన్యాయం అపరిష్కృతంగానే ఉండిపోయింది. స్వామి వివేకానంద ప్రచ్ఛన్నంగా భారతదేశ సామాజిక స్వరూపావగాహనకు భారతదేశంలో పర్యటిస్తూ ఉండగా అలసి సొలసి ఉత్తర భారతదేశంలో ఒకసారి ఒక వ్యక్తి నుంచి పొగ గొట్టం ఆశించగా ఆ వ్యక్తి బాబూ, నేను కడజాతివాణ్ణి అని చెప్పగా ఆయన నిరాసక్తతో కొంచెం దూరం ముందుకు సాగినట్లూ ఆ తర్వాత ఆత్మ శోధన చేసుకొని ఇదేమిటి, నేను సర్వసంగ పరిత్యాగిని సర్వబంధ వినిర్ముక్తుణ్ణి అనుకుంటూ ఈ విధమైన జాతి భేదాలకు మనసులో చోటివ్వడమని విస్మయం పొంది మళ్ళీ వెనక్కి వెళ్ళి అతి ప్రీతితో ఆ వ్యక్తి నుంచి ఆ హుక్కా గొట్టం స్వీకరించి పొగ పీల్చి పరితృప్తుడైనట్లూ స్వామి జీవిత చరిత్రలో ఉంది. ఆదిశంకరుల మనీషా పంచకాన్ని అందరూ ఉదాహరించేవారే, భారతదేశంలో ఆధ్యాత్మిక విలువలను పరిరక్షించిన సాధు సంతుల ప్రబోధాలను అందరూ ఉట్టంకించేవారే అయినా ఆచరణలో మాత్రం ఈ ఘోర రాక్షసిని ఎవరూ - మట్టుపెట్టలేకపోయినారు. అందువల్ల ఆధునిక భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో అస్పృశ్యతా సమస్య ప్రధాన స్థానం వహించింది.

'మాలపల్లి: విమర్శనాత్మక పరిశీలన' అనే ఈ పరిశోధన వ్యాసంలో ఈ ఐతిహాసిక నవల సమగ్ర స్వరూప స్వభావాలు బాగా ఆవిష్కృతమైనాయి. పరిశోధకుని కృషి అభినందన పాత్రంగా ఉంది. ఐదు అధ్యాయాలలో మాలపల్లి నవలద్వారా ఆవిష్కరించవలసిన అంశాలన్నిటినీ చక్కగా విశ్లేషించి చూపి పరిశోధన విలువను పెంచారు రచయిత.

ఉన్నవ సమగ్ర వ్యక్తిత్వ వికాసంతో ఆరంభించి మాలపల్లి నవలలో ఉన్నవ వారు చూపిన గొప్ప ప్రతిభను సమీక్షిస్తూ ఆధునిక సాహిత్యంలో ఈ నవల ప్రథమగ్రణ్యతను ప్రతిపాదించడం సమర్థంగా నిర్వహించారు.

ఇరవయ్యో శతాబ్ది పూర్వార్ధంలో తెలుగునాట సమాజాన్నీ, సాహిత్యాన్నీ ప్రభావితం చేసిన అన్ని భావ వాదాలనూ భౌతిక సిద్ధాంతాలను రాజకీయోద్యమాలను సమగ్రంగా సమన్వయం చేయడం పరిశోధన కృషిలోని పరిశ్రమను వెల్లడిస్తున్నది. మాలపల్లిలో నాయకుడెవరు అనే అంశంనుంచి, ఆంధ్రదేశంలో అచలమత సిద్ధాంత వ్యాప్తి, మాలపల్లిపై గాంధీయోద్యమ ప్రభావం విపులంగా సరళ సుందరంగా ఆవిష్కరించడం జరిగింది మాలపల్లి నవలలో ఆయా పాత్రల సమగ్ర వ్యక్తిత్వ వికాసం అధికారికంగా సమీక్షితమైంది భక్తి జ్ఞాన కర్మ సిద్ధాంతాల సమన్వయం ప్రతిపాదితమైంది. ఈ నవలకు నాయకుడు రామదాసా, సంగదాసా అనే విచికిత్స చాలా తర్కబద్ధంగా, ఔత్సుక్యజనకంగా నిర్వహించడం జరిగింది. ఈ ఐతిహాసిక నవలలో ఉన్నవవారి దృక్పథం రామదాసుతో పూర్తిగా తాదాత్మ్యం చెందడమేనని చెప్పవచ్చు. భారతీయ చిరంతన భావధారకు రామదాసు ప్రతీకగా ఉన్నవవారు నిరూపించారు. అట్లా అని భౌతిక వ్యవస్థను ఉపేక్షించలేదు ఉన్నవవారు. ఉపేక్షించకూడదని కూడా హెచ్చరించారు.

సంఘ సంస్కరణ ప్రయత్నాలలో ఉన్నవవారి దృక్పథం అలనాటి మల్లికార్జున పండితారాధ్యులను తలపింపజేస్తుంది. బసవేశ్వరునిపై ఎంత భక్తి ప్రపత్తులున్నా మల్లికార్జున పండితారాధ్యులవారు పూర్తిగా వారితో మమేకం కాలేకపోయినారు. వర్ణ వ్యవస్థను ఏదోవిధంగా నిలబెట్టాలనీ సమర్థించాలనీ కాదు పండితారాధ్యుల వారి తాపత్రయం. అయినా చిరకాలాగతమైన ఆధ్యాత్మిక

విలువలు పరిరక్షించాల్సిన అవసరం ఉన్నదని గాఢంగా విశ్వసించారు. అటు వంటి సమన్వయ దృక్పథమే కనబడుతుంది ఉన్నవ వారిలో. ఈ శతాబ్ది ఆధ్యాత్మిక దివ్య పురుషులలో ఒకరైన మాస్టర్ సి. వి. వి. అనే పరమ యోగీశ్వరుల మహాయాన భృక్త రహిత తారక రాజయోగం ప్రభావం కూడా ఉన్నవ వారిపై ఉన్నట్లు తెలుస్తున్నది, అది అమృతయోగం; అరవిందుల మహా మానవాగమనానికి దగ్గరైనది.

ఈ పరిశోధన వ్యాసంలో అచల సిద్ధాంతానికి సంబంధించిన సమగ్రమైన సమాచారం కూర్చటం జరిగింది. నిర్వికల్ప సమాధిలో దృశ్యా దృశ్యమైన సర్వ అస్తిత్వం ఒకటేనని అనుభూతి చెందడమే అచల పరిపూర్ణ తత్త్వం అని బోధపడుతున్నది. పండితుల అద్వైత పరిభాషను సుగమం చేసి అందరికీ అర్థమయ్యేట్లు చెప్పడమూ అందరికీ ప్రవేశార్హతను కల్పించడమూ అచల సిద్ధాంత పరమాశయంగా కనపడుతుంది.

మాలపల్లి వంటి ఆధునిక ఐతిహాసిక నవలను అన్ని కోణాలనుంచీ సాకల్యంగా సమీక్షించి తెలుగు నవలా సాహిత్య చరిత్రలో ఆధునిక భారతం ప్రతిబింబింపచేసిన రచయిత ప్రతిభను చక్కగా వెలార్చిన శ్రీ కృష్ణమాచార్య కృషి సాహితీప్రియంభావుకుల అందరి మెప్పూ పొందగలదని ఆశిస్తున్నాను.

**డా. అక్కిరాజు రమాపతిరావు**

హైదరాబాదు
6-6-1990

# అంతశ్శక్తి

తెలుగు సాహిత్యంలో మొట్టమొదటి ఐతిహాసిక నవల మాలపల్లి. ఇందులో ప్రధానాంశాలు రెండున్నాయి. ఒకటి భౌతికపరమయింది; రెండు, ఆధ్యాత్మిక పరమయింది. మానవుడు భౌతికమైన స్థితినుండి అధ్యాత్మికమైన స్థాయికి ఎదుగవలెనన్నది ఇందలి విషయం చెట్టుకు నేల ఆధారం. అక్కడినుండి చెట్టు, పైపైకి, ఊర్ధ్వదిశగా కొనసాగుతుంది. అట్లే మానవుడు ఉన్నతమైన ఆధ్యాత్మిక భూమికలవైపు తన ప్రయాణాన్ని సాగించవలసిన ఆవశ్యకతను ఈ నవల చెబుతుంది.

నవలలో రామదాసు పాత్ర ప్రధానమైనది. నవల 'చేను'తో ఆరంభ మయింది. 'చేను' మానవుని భౌతిక జీవితానికి పరమాధారమన్నది సూచన. ఈ చేనును దున్నుతున్న రామదాసుతో నవల, మొదటి దృశ్యం, ఆరంభం. ఈ రామ దాసు క్రమక్రమంగా భౌతికమైన సంఘటనలనే మెట్లెక్కుతూ పై పైకి ఎదిగిపోయి నాడు. నవలారంభంలో ఉన్నవ వారు రామదాసును గురించి "రేగడి చేలో దుక్కి దున్నుతున్న రామదాసు" అని చెప్పినారు. ఈ రామదాసు నవలాంతా నికి "త్రిగుణాతీతుడునూ, స్థిత ప్రజ్ఞుడునూ, వేదాంతవేదియూ" నయినాడు. "సిద్ధుడయి కొండగుహలలో ఎవరికీ కనబడకుండా నిరంతర ధ్యానపరుడయి వుండి పరబ్రహ్మముతో ఐక్యమైనాడు." ఇది రామదాసు జీవిత యాత్ర. నేల నుండి నింగివైపు, భౌతిక జీవితమునుండి ఆధ్యాత్మిక భూమికలవైపు.

ఆధ్యాత్మికపరమైన భావన భౌతిక జీవితాన్ని శక్తిమంతం చేస్తుంది; ఒక దారి చూపుతుంది. ఈ విషయాన్ని ఉన్నవవారు నవలలో ప్రతిపాదించి నారు. నవలారంభంలో రచయిత ఆధ్యాత్మిక భావాన్ని ఒక పీఠంమీద ప్రతిష్ఠింపచేసినాడు. 7 వ అధ్యాయం 'సద్గురు' 8. 'కర్మయోగము' 9. 'ఉపా సన' 11. 'దేవాలయము' 12. 'అమ్మవారు'. ఇంతవరకు-నిజానికి నవలలో కథ మొదలు కానేలేదు. ఈ అధ్యాయాల తర్వాతనే 13 వ అధ్యాయములో సంగ

దాసు మరణానికి దారితీసిన కూలి సమస్యకు అంకురార్పణ జరిగింది. కథ ఇక్కడ మొదలయింది. ఆ తరువాత నడిచిన కథలో భౌతిక జీవితానికి సంబంధించిన అనేక రకాల ఒడుదొడుకులే చిత్రింపబడినాయి; సంగదాసు, వెంకటదాసు, జోతీ, అప్పాదాసు మొదలైనవాళ్ళంతా చనిపోయినారు. నవలాంతానికి రామదాసు 'యతీంద్రు'డయినాడు. దీన్ని గమనిస్తే ఉన్నవవారు ఆధ్యాత్మిక భావనకిచ్చిన ప్రాధాన్యత అవగతమవుతుంది.

భౌతిక జీవితానికి ఆధారభూతమైన 1. చేను, 2. దొడ్డి, 3. ఇల్లు, 4. కుటుంబము, 5. బర్రె, 6. గొడ్లకాపరులు- అనే అధ్యాయాలు చెప్పి, పిదప 'సద్గురువు' ఇత్యాది 5 అధ్యాయాల్లో ఆధ్యాత్మిక విషయాలు చెప్పటము, ఆ పిదపనే అసలు కథను ఆరంభించటాన్ని గమనిస్తే ఈ ఆధ్యాత్మిక భావ చిత్రణం నవల కథా శరీరానికి చేయబడిన శక్తిపాతమని స్పష్టమవుతుంది. నవలలోని ఈ క్రింది విషయాలు ఇందుకు నిదర్శనం.

తల్లి లక్ష్మమ్మతో కలిసి రామానాయుడు 'శక్తిదేవాల'యానికి వెళ్ళినాడు. పూజారి అప్పయ్య దేవాలయాన్ని గురించి, 'అమ్మవారి' మహిమలను గురించి చెపుతున్నాడు. అప్పుడు రామానాయుడిలో ఒక మార్పు వచ్చింది- "రామానాయుడు రక్తనాళములలో, స్వచ్ఛమైన వీరరసం విజృంభించింది. దేహమెల్ల నిండి నిబిడీకృతమైంది. దిగంతములకూ వ్యాపించింది. మనసు సంకల్ప రహితమై లీనమైంది. దేదీప్యమానమైన నీలకాంతులతో త్రిశూలధారిణి వీర స్వరూపిణి దృష్టి గోచరమైంది. రెప్పలు మూతలుబడ్డవి.

"హే విశ్వరూపిణీ, హే జగద్ధాత్రీ! సమస్త జగములూ నీవే, ముమ్మూర్తులకూ మూలాంకురాంబవు... నీవు నాయందనుగ్రహంచేత సౌలభ్యవశమున భీకర వేషము దాల్చి నవరస స్వరూపమును సయితము ప్రదర్శిస్తున్నావు. తల్లీ! నీ మహద్రూపం దర్శించి ధన్యుడనయినాను. నీ విశ్వరూపమును ఉపసంహరింపుము."

రామానాయుడి విచిత్రమైన ఈ స్థితిని చూచి అతని తల్లి భయపడితే పూజారి అప్పయ్య "అది అమ్మవారి చేష్ట"గా స్పష్టం చేసినాడు. నవలలో

భౌతిక జీవిత చిత్రణం విస్తృతంగా ఉన్నప్పటికీ దాని అంతశ్శక్తి ఆధ్యాత్మిక భావానిదే.

ఉన్నవ వారి ఈ విధమైన మాలపల్లి నవల మీద కృష్ణమాచార్య గారు వ్రాసిన పరిశోధన గ్రంథమిది. ఇందులో భౌతిక జీవితం, ఆధ్యాత్మిక భావ విషయాలను గురించిన విమర్శ ఉంది. ఈ నవలలోని 'ఐతిహాసికత' నిరూపించటం ఈ గ్రంథములో ప్రముఖంగా ఉంది. ఈ విధమైన నిరూపణలోను, 'గాంధీ ప్రభావ'మన్న అధ్యాయంలోనూ బౌతిక జీవితానికి సంబంధించిన విమర్శ ఉంది. 'అచల'మన్న ఆధ్యాయంలో ఆధ్యాత్మిక విషయాలకు సంబంధించిన విమర్శ ఉంది. నవలలో ఉన్నవ లక్ష్మీనారాయణ గారు భౌతిక, ఆధ్యాత్మిక జీవితాలను చిత్రించినారు. ఈ విమర్శ గ్రంథ రచయిత కృష్ణమాచార్య గారు కూడ ఆ ఉభయ జీవితాలకు సంబంధించిన విమర్శ చేసినారు. నవల తత్త్వాన్ని ఈ గ్రంథ రచయిత అర్థం చేసుకొన్నాడనడానికి ఇది నిదర్శనం. ఈ విమర్శ గ్రంథాన్ని వ్రాసిన కృష్ణమాచార్య గారికి అభినందనలు.

17-6-1990

**డా॥ అనుమాండ్ల భూమయ్య**
తెలుగుశాఖ, కాకతీయ విశ్వవిద్యాలము,
వరంగల్లు.

# సంకేత వర్ణవివరణ

| | |
|---|---|
| ఆం. ప. | ఆంధ్రపత్రిక |
| ఆం. స. | ఆంధ్రసర్వస్వము |
| తి. కా. శి. | తిక్కన కావ్యశిల్పము |
| నా. మ వే. | నాథయోగి మన వేమన |
| మా. ప | మాలపల్లి |
| మా న. ప్ర. ని. | మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు |
| ల. నా. | లక్ష్మీనారాయణులు |
| వి. భా. | విప్లవ భారతం |
| వి. వి. వే. | విశ్వదాభిరామ వినుర వేమ |
| వే. వి. దృ. | వేమన వివిధ దృక్కోణాలు |
| వే. ఆ. ఇ | వేయిపడగలు ఆధునిక ఇతిహాసము |
| స సా. | సమాజము సాహిత్యము |
| స. చ. | సహృదయ చక్రము |

అంకితం-III
కృతజ్ఞతాంజలి-V
అభినందన - డాక్టర్ దేవులపల్లి రామానుజరావు-VIII
ఆశంస - ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య-X
అభినందన - ఆచార్య పేర్వారం జగన్నాథం-XII
సత్యధర్మాయ దృష్టయే - శ్రీ శ్రీభాష్యం విజయసారథి-XIV
హృదయావిష్కారం - డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు-VXII
అంతశ్శక్తి - డాక్టర్ అనుమాండ్ల భూమయ్య-XXIII
సంకేతవర్ణ వివరణ : XXVI

# అధ్యాయాలు – అంశాలు

**అధ్యాయం : ఒకటి. మాలపల్లి: పూర్వరంగం** 1-16

ఉన్నవ సమగ్ర వ్యక్తిత్వ వికాసం - 1, విద్యాభ్యాస కాలం - 2, సంఘ సంస్కరణ దృష్టి - 3, రాజకీయాభినివేశం - 7, మతాభిమానం - 11, సూచికలు - 13

**అధ్యాయం : రెండు. మాలపల్లి : ఐతిహాసికత** 17-103

తొలి ఆధునిక ఇతిహాసం - 17, ఇతిహాస లక్షణాలు-21, ఇతివృత్తనిర్మాణం - 23, కథానాయకత్వం - 38, అను కథలు-45, సంఘర్షణ-58, కర్మఫలానుభవం - 75 విషాదం-87, సూచికలు-98

**అధ్యాయం : మూడు. మాలపల్లి: అచలం** 104-149

అచలం-104, అచలమత ఆవిష్కరణ: వ్యాప్తి-105, రాజయోగము అచలము - 110, అచలం: స్త్రీ - 111, అద్వైతము: అచలము - 112, నాథసంప్రదాయం: అచలం-115, సూఫీమతము : అచలం-117, అచలము: సర్వమత సామాన్యము-121, అచల లక్షణం - 122, మాలపల్లిలో అచలం 124, మాలపల్లి: నిష్కామకర్మ-128,

భక్తి-129, అచలబోధ-131, అచలపీఠము-131, జీవ సమాధి-132, ఆత్మోద్ధరణము-134, సూచికలు-144.

**అధ్యాయం : నాలుగు. మాలపల్లి; గాంధీప్రభావం** 150-198
ఆర్థికసమత-156, సహాయనిరాకరణోద్యమం-181, వ్యవసాయకూలీల ఉద్యమం-185, సూచికలు-193.

**అధ్యాయం : ఐదు. మాలపల్లి: భాషా-సాహిత్యోద్యమాలు** 199-229
వ్యావహారిక భాష: శైలి - 199, శైలి - 207, కాల్పనికోద్యమ ప్రభావం - 213, సూచికలు-225.

**అనుబంధం : ఒకటి. భాషావిశేషాలు** 230-243

**అనుబంధం: రెండు. ఉపయుక్త వాఙ్మయసూచి** 244-252

**తెలుగు గ్రంథములు** - 244,

**తెలుగు వ్యాసములు** - 249

**ఆంగ్లగ్రంథములు ; వ్యాసములు** - 252

# మాలపల్లి : పూర్వరంగం

## ఉన్నవ సమగ్ర వ్యక్తిత్వ వికాసం

ఉన్నవ లక్ష్మినారాయణ పంతులు సాహిత్యోపాసకుడు, నవలాకర్త, సంఘ సంస్కరణాభిలాష కలవాడు. చేపట్టిన కార్యమును సాధించువరకు వదలిపెట్టువాడు కాదు. కాశీనాధుని నాగేశ్వరరావుగారు ఉన్నవను గూర్చి-"సుప్రసిద్ధాంధ్ర నాయకులు, సంస్కర్తలు, సాహిత్య విశారదులు, కార్యశూరులు. శారదానికేతనము, మాలపల్లి లక్ష్మినారాయణగారి మానవధర్మ పరాయణత్వమునకు నిదర్శనములు [1] అని పేర్కొన్నారు.

పై అంశములన్నింటి సామూహిక సృష్టిగా సాహిత్య రంగంలో 'మాలపల్లి,' క్రియాత్మక రంగంలో శారదా నికేతనము రూపొందినవి. వీటి వినిర్మాణంలో ఉన్నవకు నాడు తెలుగునాడులో సాగిన వివిధోద్యమాలలో క్రియాశీలకమైన త్యాగస్వామ్యం భూమికగా నిలిచింది. ఇటువంటి ఉన్నవ క్రియాశీలకమైన పాత్ర ప్రధానంగా 'మాలపల్లి' రచనకు దారితీసింది.

'మాలపల్లి' నవలా నిర్మాణానికి భూమికగా ఉన్నవ జీవితంలో పొందిన వివిధ అనుభవాలే పూర్వరంగంగా [2] పనిచేసినవి. ఈ విషయం ఉన్నవ వ్యక్తిగత; బహిరంగ జీవితాల ద్వారా తెలుస్తున్నది.

ఉన్నవ సమిష్టిలాభానికి, సంఘ శ్రేయస్సుకు కృషిచేసిన వ్యక్తి. స్త్రీ జనాభ్యుదయాన్నీ, హరి జనాభ్యుదయాన్నీ ఆకాంక్షించి కృషి సల్పినవాడు. స్వాతంత్ర్య పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొన్నవాడు, వీటి కొరకు ఆయన తన జీవితంలో పొందిన అనుభవాలు, ఎదురైన పరిస్థితులు, కల్గించిన ప్రేరణ ఇన్నింటికి అక్షరరూపం కల్పించగా ఏర్పడిన నవల 'మాలపల్లి'.

విద్యాభ్యాస కాలంలో ఉన్నవపై ప్రభావం వేసినవి (1) అచలం (2)ఏసుక్రీస్తు జీవితం (3) సంస్కర్తల ప్రభావం (4) రాజకీయ నాయకుల ప్రభావం.

## విద్యాభ్యాస కాలం :

**అచలం :**

అచలంలో కుల నిరసన భావం ప్రధానమైంది. ఇటువంటి అచల ఉపదేశాన్ని ఉన్నవ బాల్యంలోనే తండ్రిద్వారా పొందినాడు తండ్రిలోని కుల నిరసన భావం ఉన్నవను ఉత్తమ సంస్కర్తగా తీర్చిదిద్దింది.[3]

సంఘ సంస్కరణంలోనూ పంచముల సమస్య ఉన్నవను ఆకర్షించింది. పంచముల దుస్థితి ఆయన మనస్సును కలచివేసింది. ఈ కలతతో కూడిన హృదయం 'మాలపల్లి' నవల యందంతటా కనిపిస్తుంది. ఈ పంచముల సమస్యే 'మాలపల్లి' రచనకు ప్రోద్బలకము, ప్రధాన వస్తువు.

## ఏసుక్రీస్తు

క్రీస్తు జీవితంలో కనిపించేవి జీవ కారుణ్యం, విశ్వవేదన ఆత్మబలిదానం. ఉన్నవ చదువుకొన్న పాఠశాలలో చాలమంది అధ్యాపకులు క్రైస్తవులు. వీరివల్ల ఉన్నవ క్రైస్తవమతాన్ని తెలుసుకోగలిగినాడు "ఏసుక్రీస్తు గుండెలో విశ్వవేదనతో ప్రతి కలుపుకొన్న దుర్భరవేదన ఎలా కొట్టుకొనేదో.[4]" గ్రహించ గలిగినాడు. ఇక్కడ ఏసుక్రీస్తు పొందింది విశ్వవేదన. 'మాలపల్లి'లో రామదాసు సంగదాసు, రామానాయుడులలో ఈ వేదన కనిపిస్తుంది. రామదాసు నవలారంభంలోనే పండిన పంటను చూసుకొని 'అందరూ బాగుంటేనే బాగు' (మా. ప. 22) అని అనుకొంటాడు; సంగదాసు "మహా సంఘాభివృద్ధి ప్రధానంగా యెంచుతుండే విశాల హృదయులు"....(మా.ప. 152); రామానాయుడు 'దిగువ జాతుల' హైన్యపు జీవితాలకు వ్యథచెందుతూ, అవిశ్రాంతంగా పంచమ, కార్మికోద్యమ అభివృద్ధికై కృషి చేస్తుంటాడు. ఈ విధంగా ఉన్నవ విద్యార్థి దశలో తెలుసుకొన్న వేదన 'మాలపల్లి'లో పలు పాత్రలద్వారా వ్యక్తం చేయబడింది.

ఒక గొప్ప కార్యం సాధింపబడాలంటే నిస్వార్థ త్యాగంతోపాటు, 'ఆత్మబలిదానం' అవసరం. ఈ విషయం క్రీస్తు ఆత్మబలి దానం' వల్ల తెలుస్తున్నది. ఈ భావాన్ని ఉన్నవ 'మాలపల్లి'లో పలుచోట్ల వ్యక్తికరించినాడు.[5] సంగదాసు పాత్ర చిత్రణావిధానం ఈ భావానికి అనుగుణంగా కనిపిస్తుంది. పంచమ, కార్మికాభివృద్ధికి కృషిచేస్తూ, 'మహాసంఘ నిర్మాణాన్ని' ఆకాంక్షించిన సంగాదాసు

'ఆత్మ బలిదానం' చేస్తాడు. సంగదాసు 'ఆత్మ బలిదానం'వల్లనే 'సంగ విజయం' సార్థకమవుతుంది. రచయిత ఈ భావాన్ని నవలలో పలుచోట్ల సూచించాడు.

## సంస్కర్తల ప్రభావం :

సంస్కర్తలు, పునరుజ్జీవనానికి పాటుపడుతున్న రాజారామ్మోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వంటి మహానుభావుల గూర్చి విద్యాభ్యాస కాలంలో తెలుసుకొన్నప్పటికీ, ఉన్నవపై వీరేశలింగం గారి ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. వీరందరి ప్రభావం ఉన్నవలోని సంఘ సంస్కారాభిలాష పెంపొందడానికి కారణమైంది. 'మాలపల్లి'వంటి గొప్ప నవల ఆవిర్భవించడానికి ప్రధాన కారణమైంది.

## రాజకీయ నాయకుల ప్రభావం :

ఉన్నవ మెట్రిక్యులేషన్ చదువుతున్న కాలంలోనే రాజకీయాలతో పేరు పొందిన బాలగంగాధర తిలక్ రాజకీయాలపట్ల ఆసక్తి పెంపొందించుకొన్నాడు.[6] "రాజకీయముగా దేశములో మార్పు రావలెనా, ముందుగా సంఘములో మార్పు రావలెనా అనే జిజ్ఞాస"[7] ఉన్నవలో కలిగింది. ఈ జిజ్ఞాసకు సమాధానం 'మాలపల్లి' రచనలో కనిపిస్తుంది. మార్పు ఎక్కడినుండి ప్రారంభం కావాలా ? అని ప్రశ్నించుకొన్న ఉన్నవ, రాజకీయ స్వాతంత్ర్యం వస్తేనే దేశంలోని పంచమ, కార్మికోద్యమాలు సత్ఫలితాలనివ్వగలవని 'మాలపల్లి'లో వ్యక్తం చేసినాడు. (మా.ప. 479). బీదల అభివృద్ధికై అనేక చట్టాలు రూపొందడానికి ముందుగా స్వాతంత్ర్యం యొక్క అవశ్యకతను గుర్తించిన ఉన్నవ 'మాలపల్లి'లో దీనికి రూపు గట్టించినాడు.

'మాలపల్లి' రచనకు పూర్వరంగంగా ఉన్నవలోని సంఘం సంస్కరణ దృష్టి, రాజకీయాభినివేశం, మతాభిమానం ప్రధాన ప్రేరకాలుగా పనిచేసినవి. విద్యార్థి దశలో ఉన్నవ మనస్సులోపడిన భావ బీజాలే ఆయన అనంతర జీవిత కాలంలో విరాడ్రూపాన్ని ధరించినాయి.

## సంఘ సంస్కరణ దృష్టి :

సంఘ సంస్కరణలో స్త్రీ జనోద్ధరణ, కుల వ్యవస్థ నిర్మూలన ప్రధానమైనవి దేశంలో ప్రప్రథమంగా సాంఘిక, మత, సంస్కరణోద్యమాలను

ప్రారంభించినవాడు రాజారామ్మోహనరాయలు. ఈయన సంఘ సంస్కరణకై అమితమైన కృషి సల్పినాడు. ఈయన తర్వాత ఈశ్వరచంద్ర విద్యాసాగర్ స్త్రీ విద్యా వ్యాప్తికి, స్త్రీ జనోద్ధరణకు విశేషంగా కృషిచేసినాడు. అతి బాల్య వివాహాలు, బాల వితంతువుల దుస్థితి ఇతని మనస్సును కలచి వేసినవి. వీరి కొరకు ప్రారంభించిన సంస్కరణను తన కుటుంబం నుండి ప్రారంభించిన మహనీయుడు. ఈ సంస్కరణ ప్రభావం ఆంధ్రదేశంలోనూ వ్యాపించింది.

ఆంధ్రదేశంలోని స్త్రీల పరిస్థితి కూడా వంగదేశంలోవలె బాధావహంగా ఉంది. ఒకవైపు అతి బాల్య వివాహాల వల్లా, మరొకవైపు వీరికి విద్యార్జనాది అవకాశాలు లేకపోవడం వల్లా దీనికితోడు బాల్యంలోనే వైధవ్యం ప్రాప్తించడం వల్లా, స్త్రీలు వ్యధాభరిత జీవితాల్ని గడుపుతున్నారు ఇట్లాంటి పరిస్థితులలో కందుకూరి వీరేశలింగం సంఘం సంస్కరణోద్యమాన్ని చేపట్టి స్త్రీ జనోద్ధరణకై పాటుపడుతున్నాడు. ఇతనితోపాటు రఘుపతి వెంకటరత్నం నాయుడు, చిలక మర్తి లక్ష్మీనరసింహం మొదలైనవారు కృషి చేస్తున్నారు.

సంఘ సంస్కరణ ఎడల అతురత ఉన్న ఉన్నవను ఆనాటి పరిస్థితులు కలవరపరచినవి. ముఖ్యంగా వీరేశలింగం సంస్కరణోద్యమం ఉన్నవను అమితంగా ఆకర్షించింది. ఉన్నవ సంఘ సంస్కరణ కృషి నాలుగు విధాలుగా కనిపిస్తుంది,

**సంస్కరణ పెళ్ళిళ్ళు :**

ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్న కాలంలో, 1902 లో మొట్టమొదటిసారిగా ఉన్నవ గుంటూర్లో వీరేశలింగం అధ్యక్షతన వితంతు వివాహాన్ని జరిపించినాడు. సంస్కరణ పెళ్ళి జరిపించడం కారణంగా ఇతన్ని బంధువులు, మిత్రులు బహిష్కరించారు. అయినా, ఉన్నవ అధైర్యపడక, వెలిని కూడా లెక్కచేయక, ఎదురొడ్డి నిలిచినాడు. పరంపరగా సంస్కరణ పెళ్ళిళ్ళు జరిపిస్తూ వచ్చినాడు. ఈ పెళ్ళిళ్ళ వల్ల ఉన్నవ 'గుంటూరు వీరేశలింగం'గా పేరు పొందినాడు.[8]

ఉన్నవ చేస్తున్న సంస్కరణ పెళ్ళిళ్ళు కారణంగానే కులపు వాళ్ళంతా అతన్ని బహిష్కరించి,[9] విమర్శించారు. తనను విమర్శించే వారికి ఉన్నవ ఇట్లా సమాధానం చెప్పాడు.

> "ధర్మం ధర్మం అంటారు. ధర్మస్వభావం తెలిసినవారు తక్కువ. ఒక కాలంలో ధర్మమైన కార్యం మరో కాలంలో ధర్మ కార్యంగా పరిగణింపబడక పోవచ్చు. ధర్మం అనుష్ఠేయం అనే జ్ఞానం మాత్రం మనుషులకుంటే చాలదు. ధర్మం యొక్క స్వరూపం తెలుసుకొని దాన్ని వ్యాపింప చేయాలి. దురాచారాల నణగద్రొక్కి సదాచారాలనూ, సంఘ సంస్కారణలనూ వర్ధిల్ల చేయడమే నాగరక సంఘ కర్తవ్యం. ఉత్తమ ధర్మాలని ... బోధించడం, ఆచరించ డం నా ఉద్దేశం." (లం. నా. 21, 21)

ఉన్నవ బంధువులచేత విమర్శింపబడిన విధానం 'మాలపల్లి'లో రామానాయుడిలో కనిపిస్తుంది. రామానాయుడు పంచమ, కార్మికుల అభివృద్ధికై ప్రయత్నిస్తూ, సహాయ సహకారాలు అందిస్తుంటే సహించలేని తండ్రి చౌదరయ్య ఇతని విమ ర్శిస్తుంటాడు.

ఈ విధంగా ఉన్నవ నిజ జీవితంలో విమర్శకు గురియైన విధానం 'మాలపల్లి'లో రామానాయుడిలో చోటు చేసుకొంది.

**శారదా నికేతనం :**

ఉన్నవ 1912లో వెంకటప్పయ్యగారితో పూనా పట్టణానికి వెళ్ళి, అక్కడ కార్వే పండితుడు నడుపుతున్న విద్యాలయ పని తీరును పరిశీలించి వచ్చాడు.[10] దీని ఫలితమే శారదా నికేతన ఆవిర్భావం. శారదా నికేతనం ఏర్పాటు చేయ డానికి ముందే ఉన్నవ స్త్రీలకు విద్యార్జనావకాశాలు లేకపోవడం మూలంగా, వీరి జీవితాలు అనేక అనర్థాలకు దారి తీసినవని తలంచాడు. అందువల్ల స్త్రీ విద్యార్జ నావశ్యకతకు 'మాలపల్లి'లో తగు ప్రాధాన్యత కల్పించినాడు.

'మాలపల్లి'లో సంగదాసు తన చెల్లెలు జోతికి చదువుమీద ఆసక్తిని కల్గి స్తాడు. అప్పాదాసు ఈమెను విద్యావంతురాలను చేస్తాడు. విద్యార్జన మూలంగానే జోతి ఆత్మస్థయిర్యంతో, వివేకంతో సరియైన నిర్ణయాల్ని ధైర్యంగా వెల్లడించ గలుగుతుంది. 'మాలపల్లి' నవలాంతాన స్త్రీ విద్యకు తగు ప్రాధాన్యమిస్తూ, ప్రథమ తీర్మానం చేయబడుతుంది (మా.ప. 649).

**పంచమోద్ధరణ :**

ఉన్నవకు మొదటినుండీ పంచముల అభివృద్ధిపై శ్రద్ధ ఉంది. "గాంధీ మహాత్ముని సహాయ నిరాకరణ ఉద్యమానికి పూర్వమే 1916లో నల్లపాటి హనుమంతరావుగారు, పుతుంబాక లక్ష్మీనరస్సయ్య, వాసిరెడ్డి సీతారామయ్య గార్ల సహాయముతో పెదపాలెంలో "కృష్ణాశ్రమం స్థాపించారు" (సా.ఉ. 7)

ఉన్నవ అమ్మమ్మగారి ఊరు గుంటూరు జిల్లా, బాపట్ల తాలూకా, పొన్నూరు ఫర్కాలో ఉన్న ఆరెమండ గ్రామం. దీనికి ప్రక్కనే తాళ్లపాలెమనే చిన్న పల్లె ఉంది ఇది హరిజనుల వాడ. ఇక్కడి వారందరూ పండితులు' వైద్యం తెలిసినవారు. శాస్త్ర పురాణాలు అధ్యయనం చేసినవారు. వీరు దాసులు. స్నాన సంధ్యాదులతో పాటు, నియమ నిష్ఠలు కలవారు. ఈ హరిజనవాడ పవిత్ర వాతావరణంతో ప్రశాంతంగా ఉండేది. చక్కగా ఆవుపేడతో అలికి ముగ్గులు పెట్టిన పెంకుటిండ్లు ఉండేవి. ఇక్కడి స్త్రీ పురుషులు శ్రీ వైష్ణవులవలె పరిశుభ్రంగా ఉండేవారు. ఈ గ్రామ పవిత్రతే 'మాలపల్లి' నవలా రచనకు ప్రోద్బలకంగా పని చేసింది. (సా ఉ. 15, 16) ఈ పవిత్ర వాతావరణం 'మాలపల్లి, నవలారంభంలో రామదాసు కుటుంబంలో ఉన్నట్లు, నవలాంతాన మంగళాపురం అంతటా వ్యాపించినట్లు చెప్పబడింది.

'శ్రీ కృష్ణాశ్రమం' స్థాపించడానికి పూర్వమే ఉన్నవ- 'రేపల్లెలో జరిగిన గుంటూరు జిల్లా సంఘ సంస్కరణ సభకు అగ్రసనాధిపతిగానూ, కొవ్వూర్లో జరిగిన కృష్ణా మండల సంఘ సంస్కరణ సభకు అధ్యక్షుడుగానూ వుండి తన ఉపన్యాసాలతో, చర్చలతో నూతన వుద్బోధలు కలిగించాడు." (మా.న.ప్ర.ని. 10) దేశంలో అట్టడుగు వర్గాలైన పంచమాదులు అభివృద్ధి చెందితేనే దేశం పురోగమిస్తుందని భావించినాడు. నిరంతరం వీరి అభ్యున్నతి కోసం ఆలోచించినాడు, కృషి సల్పినాడు ఈ ఆలోచనలు, కృషి 'మాలపల్లి'లో పలుపాత్రల్లో చూడవచ్చు.

నవలలో రామానాయుడు మంగళాపురంతోపాటు, చుట్టుప్రక్క గ్రామాల్లో వీరి అభివృద్ధి కొరకు సమావేశాలు ఏర్పాటు చేయించి, తన ఉపన్యాసాల ద్వారా వీరిలో చైతన్యం కలిగిస్తుంటాడు.

ఉన్నవలోని సంఘ సంస్కరణాభిలాష కారణంగానే హరిజనవాడ ప్రధాన కేంద్రంగానూ, హరిజనులు ప్రధాన పాత్రలుగాను 'మాలపల్లి' నవలలో రూపుదిద్దుకొన్నారు.[11]

## మద్యనిషేధం :

మద్య నిషేధ విషయంలో ఉన్నవపై గాఢ ప్రభావం వేసింది తిలక్ నడిపిన మద్యపాన నిషేధ ఉద్యమం. నాటి కాలంలో పంచములను, కూలీలను పట్టి పీడిస్తున్న సమస్య మద్యపాన వ్యసనం దీన్ని రూపుమాపేందుకు నాయకులు తీవ్ర ప్రచారం సాగించినారు. ఉన్నవ అభిమాన నాయకుడూ, రాజకీయాల్లో అతివాదిగా పేరు పొందిన బాలగంగాధర తిలక్ ఈ మద్యపాన నిషేధాన్ని ఒక ఉద్యమంగా కొనసాగించినాడు.

> "బ్రిటీషు ప్రభుత్వ కాలంలో 1903లో బొంబాయి రాష్ట్రంలో 60 లక్షల ఆదాయం ఉండేది. తిలక్ త్రాగుడు మంచిది కాదని, దానిని నిషేధించుటకు ఉద్యమం ప్రారంభించినాడు. ఇతనికి ఎంతో మంది దోహదమిచ్చి ఈ ఉద్యమాన్ని తీవ్రం చేయటం జరిగింది. శాంతియుతంగా కల్లు, సారాయి దుకాణాలను పికెటింగ్ చేయడం ద్వారా 1908వ సం॥లో ఈ ఉద్యమం ప్రారంభమైంది. దాంతో ప్రభుత్వం దీనిని నేరంగా భావించి కోర్టు శిక్షలు విధించటం ప్రారంభించింది. కాని రాజద్రోహ నేరం క్రింద తిలక్‌ను ప్రభుత్వం అరెస్టు చేసింది."[12]

'మాలపల్లి'లో కూడ నారాయణరావు పంతులు మద్యనిషేధానికై తీవ్రంగా ప్రచారం చేస్తుంటే ప్రభుత్వం అరెస్టు చేసి, శిక్ష విధిస్తుంది. నారాయణరావు పంతులుతోపాటు పలువురిని మద్యపాన నిషేధాన్ని ప్రచారం చేస్తున్నందుకు గాను ప్రభుత్వం వీరిపై తప్పుడు కేసులు పెట్టి నిర్బంధాలపాలు చేస్తుంటుంది. (మా.ప. 642, 643).

## రాజకీయాభినివేశం :

విద్యాభ్యాసం తర్వాత ఉపాధ్యాయ వృత్తిలోకి ప్రవేశించిన ఉన్నవ రాజకీయాలతో జోక్యం పెట్టుకోగూడదనే నిబంధన కారణంగా ఉపాధ్యాయ వృత్తిని

వదులుకొంటాడు. అటుతర్వాత 'ర్యాలీ బ్రదర్స్'లో పనిచేస్తున్న కాలంలోనూ పై నిబంధనల వల్లనే జీవితం కంటే రాజకీయోద్యమంలో పాల్గొని దేశసేవ చేయాలనే ఆకాంక్ష ప్రబలంగా ఉండడంతో పై ఉద్యోగాన్ని వదులుకొంటాడు. వ్యక్తి స్వాతంత్ర్యానికి భంగం కలిగేచోట్లలో ఉన్నవ ఉండేవాడు కాదు.[13] రాజకీయంగా దేశంలో మార్పు రావాలనుకొనే స్వభావం ఉన్నవది. ఈ భావాలు 'మాలపల్లి'లో పలుచోట్లలో వ్యక్తం చేయబడినాయి.

ఉన్నవ తన జీవితంలో జరిగిన రాజకీయ సంబంధమైన కొన్ని సంఘటనలు మాలపల్లిలో వ్యక్తం చేశాడు (1) ఐర్లండ్‌లో ఉన్నత విద్య (2) నిర్మాణ కార్యక్రమాల ప్రచారం (3) సహాయ నిరాకరణం (4) బోల్షివిజం (5) స్వరాజ్య భావన.

## ఐర్లండ్ - ఉన్నత విద్య :

ఉద్యోగాల్ని వదలిన ఉన్నవ ప్లీడరీ పూర్తిచేసి స్వతంత్ర జీవనం గడుపుతుంటాడు. ఇది కూడా రుచించక బారిష్టర్ చదువుకై ఐర్లాండ్‌కు వెళ్ళేందుకు సిద్ధపడతాడు ఆనాడు ఉన్నత విద్యకై చాలామంది ఇంగ్లండ్‌కు వెళ్ళుతున్న తరుణంలో, రాజకీయంగా స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న ఐర్లండ్‌ను ఎన్నుకోవడంలో రాజకీయాల పట్ల ఉన్నవకు గల మక్కువ తెలుస్తుంది.[14]

ఉన్నవ ఐర్లండ్ వెళ్ళడానికి పూర్వం అక్కడి ప్రజలు స్వరాజ్యం కొరకు 'హోమ్‌రూల్' పోరాటం సాగిస్తున్నారు. ఉన్నవ అక్కడికి వెళ్ళేప్పటికి అది 'షిన్ ఫెన్' ఉద్యమంగా రూపుదాల్చింది. సహజంగా రాజకీయాలపట్ల అభిరుచి ఉన్న ఉన్నవ దానిచేత ప్రగాఢంగా ఆకర్షింపబడతాడు. అక్కడ ఉన్నంతకాలం ప్రతీ రాజకీయ సభకు వెళ్తుండేవాడు. అక్కడి స్వాతంత్ర్యోద్యమ నాయకుడైన 'డీవెలరా'తో సన్నిహిత పరిచయం పెంచుకొంటాడు. అక్కడ చదువుకొంటూ సెలవుల్లో స్వదేశానికి వచ్చిన ఉన్నవ గుంటూర్లో జరిగిన ఒక సభకు అధ్యక్షత వహించి "రాజకీయ స్వాతంత్ర్యం లేనిదే యితర సంస్కరణలేవీ అభివృద్ధి కావనీ ఐరిష్ ప్రజలవలెనే భారతీయులు స్వరాజ్యాన్ని సాధించాలనీ" (మా.న. ప్ర. ని-)8 కర్తవ్యోపదేశం చేస్తాడు. ఐర్లండ్‌కు వెళ్ళిన ఉన్నవలోని భావాలు ఈవిధంగా తీవ్ర మార్పును పొందుతవి. ఇదే భావాన్ని అచ్చంగా వకీలు నారాయణరావు పంతులు చేత 'మాలపల్లి'లో ఇలా అనిపిస్తాడు. "స్వరాజ్యం రానిదే ఏఉద్యమాలూ సాగవు"

(మా. ప - 479). ఉన్నవలో గాఢంగా నెలకొని ఉన్న స్వాతంత్ర్య సంపాదనా భావమే 'మాలపల్లి' నవలలో రాజకీయ చిత్రణకు కారణం.

**నిర్మాణ కార్యక్రమ ప్రచారం :**

ఐర్లండ్‌నుండి తిరిగి వచ్చిన తర్వాత ఉన్నవ మద్రాసులో న్యాయవాద వృత్తి నవలంభించి, ధనార్జన ప్రధాన ధ్యేయంగా పెట్టుకొనక అనాటికి పేరు పొందిన నాయకులతో సంబంధం పెట్టుకొని, రాజకీయ, సాంఘికోద్యమాలలో చురుకుగా పాల్గొంటూ నిర్మాణ కార్యక్రమాలకు విశేష ప్రాచుర్యాన్ని కల్గిస్తుండేవాడు. ఈ విషయాన్ని గూడూరు నమశ్శివాయ గారు ఇలా తెల్పినారు.

> "ఉన్నవ వారికి సంఘ సంస్కరణోద్యమం, రాజకీయోద్యమం రెండూ రెండు కళ్ళు—దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు మొదలైన వారితో కలిసి గ్రామ గ్రామములలో పర్యటించి జాతీయ నిర్మాణ కార్యక్రమాలను గురించి ప్రచారం చేసి జాతిని జాగృతం చేశారు" (సా. ఉ. - 4).

ఉన్నవ వలెనే నవలలో రామానాయుడు అనేక గ్రామాల్ని సందర్శిస్తూ ఉపన్యాసాల ద్వారా, గ్రంథాలయ, పాఠశాలాది నిర్మాణ ప్రోత్సాహంద్వారా పల్లె జనులను జాగృతం చేస్తుంటాడు.

**సహాయ నిరాకరణ ఉద్యమం :**

ఉన్నవ సంఘ సంస్కరణ, రాజకీయోద్యమాలలో చురుకుగా పాల్గొంటున్న సమయంలోనే, గాంధీమహాత్ముని సహాయ నిరాకరణ ఉద్యమం దేశంలో వ్యాపించింది. గాంధీ భావాలచేత ఆకర్షింపబడిన ఉన్నవ 'సహాయ నిరాకరణ' పిలుపు నందుకొని తన బారిష్టర్ వృత్తిని వదులుకొంటాడు. ఈ విధానం నవలలో నారాయణరావుపంతులు పాత్రలో కనిపిస్తుంది. న్యాయవాదియైన నారాయణరావు పంతులుకు మహాత్ముని సహాయ నిరాకరణంపై గురి కుదిరిన తర్వాత తన న్యాయవాద వృత్తిని పరిత్యజిస్తాడు. కార్మికులలో సంఘాలు ఏర్పరచి స్వాతంత్ర్య సంపాదనకై పోరాడుమని ప్రబోధిస్తుంటాడు (మా. ప. - 504).

వెంకటదాసు కేసు విచారిస్తున్న కలెక్టరు కూడా "యీ కేసులు పూర్తి కాంగనే యీ నవుకరీ వదిలిపెడతాను." (మా ప. 520). అని అనటంవల్ల సహాయ నిరాకరణోద్యమం 'మాలపల్లి'లో ప్రత్యక్షంగా చోటు చేసుకున్న విధానం తెలుస్తుంది.

గాంధీ మహాత్ముడు నాయకుడుగా ఉండి విజయం సాధించిన 'చంపారన్' నీలిమందు రైతుల సత్యాగ్రహమూ, ఖేడా రైతుల పోరాటమూ, అహ్మదాబాదు మిల్లు కార్మికుల సమ్మె వీటి ప్రభావం కూడా ఉన్నవపై ఉంది. ఈ సహాయ నిరాకరణాన్ని సంగదాసు హరిజన కూలీల చేత ఆచరింప చేయిస్తాడు.

ఉన్నవ నాయకత్వం వహించినడిపిన పుల్లరి సత్యాగ్రహము[15] 'మాల పల్లి'లో ప్రత్యక్షంగా చోటు చేసుకొనక పోయినా, ఈ పుల్లరివల్ల బీదలు అనుభ విస్తున్న కష్టాలు 'ముతరాచు ముసలి' పాత్రద్వారా తెలుపబడినవి (మా. ప. 121, 122).

**బోల్షివిజం :**

ఉన్నవ 'మాలపల్లి' రచన ఆరంభించక పూర్వమే, రష్యాలో బోల్షివి క్కులు స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొని, ప్రజాప్రభుత్వాన్ని ఏర్పాటు చేసు కొన్నారు. ఈ భావాలు ఉన్నవలో ఉన్నవి. అందుకే బోల్షివిక్ పార్టీ ప్రస్తావన 'మాలపల్లి'లో[16] ప్రధానంగా చేయబడింది. ఈ భావాలు వెంకటదాసు మాటల్లో కనిపిస్తవి. ఈ పాత్ర చిత్రణా విధానాన్నిబట్టి ఉన్నవకు సమకాలీన ప్రపంచ రాజకీయ ఉద్యమాలపై గల అవగాహన తెలుస్తుంది.

**స్వరాజ్య భావన :**

ఉన్నవ జైలుకు వెళ్ళుతున్న సమయంలో గాంధీ మహాత్ముడు అసహా యోద్యమాన్ని అవలంభించినట్లైయితే ఒక్క ఏడాదిలోగా స్వరాజ్యం వచ్చి తీరుతుందని చాటినాడు. నవలలో రామానాయుడు జైలుకు వెళ్ళుతూ, వెంకట య్యతో - "నే బయటికి వచ్చే ఆరునెలల్లోగా స్వరాజ్యం వచ్చి తీరుతుందం" టాడు (మా. ప. 500).

జైల్లో ఉన్న ఉన్నవకు స్వరాజ్యం ఎట్లుండాలి అనే తపన ప్రారంభమో తుంది. స్వరాజ్యం సమతా రాజ్యంగా ఉండాలని కలగంటాడు. ఉన్నవ సహచ

రుడూ, జైలు మిత్రుడూ అయిన గంపలగూడెం కుమారరాజా గారన్నట్లుగా - "ఉన్నవ చాలా తెలివిగలవాడు సోషలిస్టు భావాలు గాంధీగారి భావాలతో మిళితమై ఉండేవి" (సా ఉ - 14). ఈ భావాల్ని సాహిత్యం ద్వారా ప్రజల వద్దకు తీసుకొని వెళ్ళాలనుకొన్నాడు. అందుకే 'మాలపల్లి'లో ఈ రెండు భావాలకు ప్రతినిధులుగా సంగదాసు, వెంకటదాసులను ప్రవేశపెట్టినాడు.[17]

ఈ రీతిగ నవలలో రాజకీయాలకు ప్రవేశం కల్పించిన ఉన్నవ జాతీయోద్యమ స్ఫూర్తిని కలిగించే భావాలతో 'మాలపల్లి'ని తీర్చదిద్దినాడు. తన రాజకీయ జీవితాన్ని 'మాలపల్లి'లో అద్దంపట్టినాడు. ఉన్నవ తరువాతి జీవితంలోనూ రాజకీయాలు అత్యంత ప్రాధాన్యతను పొందినవి.[18]

## మతాభిమానం :

ఉన్నవ పరమత సహనం, స్వమతాభిమానం కలవాడు. ఆధ్యాత్మిక భావాలు కూడా ఉన్నవలో కనిపిస్తవి. ఈ అధ్యాత్మిక భావాలు, పరమత సహనం 'మాలపల్లి'లో రామదాసు పాత్రద్వారా తెలుపబడినాయి.

ఉన్నవకు భారతీయ తాత్వికౌన్నత్యంపైన, సంస్కృతీ సంప్రదాయాలు, మతంపైన విశ్వాసం అధికం. వీటి పరిరక్షణ బాధ్యతగా భావించేవాడు. ఈ విషయాన్ని ఉపేంద్రశర్మగారు ఇట్లా తెలిపినారు.

> "వేదాంత శాస్త్రంలో వారికిగల అనుభవం ప్రతి ఒక్కరినీ చకితులను చేస్తుంది. తటస్థ దృష్టితో పరికించి, పరిశీలించి నిర్ణయానికి రావడం, నిస్వార్థ దృష్టితో వ్యవహరించడం, రాజకీయాదులను నిజాయతీతో, చిత్తశుద్ధితో విమర్శించడం, ఆ సమస్యలతో సన్నిహిత పరిచయం ఏర్పరచుకొనడం, మానవతా వాదిత్వం పట్టుబడ్డాయి పంతులు గారికి. వారి భక్తివిశ్వాసాలు స్వాతంత్ర్యం వైపు, నైతిక విలువలవైపు, విజ్ఞానంవైపు, మత సహనంవైపు విభాగమయ్యాయి" (ఉ.నా. 197)

ఉన్నవ నిజ జీవితంలో అనుసరించిన పై విధానం 'రామదాసు' పాత్రలో నవలారంభం నుంచి కనిపిస్తుంది. రామదాసు తన ఆస్తిమీద చౌదరయ్య దావా వేసి

నపుడు తాటస్థ్యం వహిస్తాడు. నిస్వార్థ దృష్టితో వ్యవహరిస్తుంటాడు. ప్రతీ సమస్యతోనూ సన్నిహిత పరిచయాన్ని పెంపొందించుకొని మానవతా వాదిగా, ఆదర్శమానవుడిగా అందరి మన్ననలకు పాత్రుడై మెలగుతుంటాడు.

ఉన్నవలో మూర్తీభవించిన పలు లక్షణాలు రామదాసు పాత్రలో కని పిస్తుండడం వల్ల ఉన్నవ రామదాసు పాత్రలో జీవించినాడని చెప్పవచ్చు.[19]

ఉన్నవకు ప్రార్థన మీద, ధ్యానయోగాదుల మీద శ్రద్ధ కలగడానికి అధ్యాపకుల బోధలే ప్రధానకారణం. ఈ ప్రార్థన, ధ్యానాది లక్షణాలు 'మాలపల్లి'లో రామదాసు, రామానాయుడులలో కనిపిస్తవి.

ఉన్నవలోని మతాభిమానం, సంస్కృతీ సంప్రదాయాలు, ఆచార వ్యవహారాల పట్ల గల గాఢత్వం స్వదేశంతోపాటు విదేశంలో కూడా చెక్కుచెదర లేదు ఇందుకు ఐర్లండ్‌లోని ఒక సంఘటన ఉదాహరణ—

ఒకనాడు 'లాన్సుబరీ' నల్లవాళ్లను నిందిస్తూ మాట్లాడిన ఒక సభకు ఉన్నవ హాజరవుతాడు. 'లాన్సుబరీ' విమర్శ ఉన్నవ హృదయాన్ని గాయ పరచ్చగా, కోపోద్రిక్తుడై, సభామధ్యం నుండి లేచి "నేనూ నల్లవాడినే నల్లవాళ్లను గురించి అలా అన్నందుకు క్షమాపణ చెప్పక తీరదు" అని నిరసన భావం వ్యక్తం చేస్తాడు. ఐర్లండ్‌లో ఉన్నంతకాలం అచ్చమైన భారతీయుడిలాగా తానుండడమేకాదు, తనతోపాటు వచ్చిన ఆంధ్ర మిత్రులు కూడా ఉండేలా చూస్తాడు.

> "తలపాగా తాను ధరించడమేకాదు - మిగతావాళ్లు (బారెట్లా చదవను తనతో వచ్చిన ఆంధ్ర మిత్రులు) కొన్న హాట్లు తగల పెట్టించినాడు. వాళ్లు ఆ దేశపు గుడ్డలు కొనుక్కోరాదు. వాళ్లు ధరించే ఉన్నిదుస్తులు హిందూదేశం నుంచి రావలెను. విదేశీవస్తు బహిష్కారమేకాదు విదేశీయాచార బహిష్కారం కూడా ఆయన ఆచరిస్తూ, తనతోడివారి చేత ఆచరింపచేసినాడు. మద్య మాంసా దుల, మహిళామణుల జోలికి పోమంటే పోమని వారందరి వల్లనూ ఆయన ప్రమాణాలు చేయించుకొన్నాడు."[20]

ఇట్లా భారతీయతను కాపాడిన విధానం 'మాలపల్లి'లో రామదాసు, సంగదాసు, రామానాయుడు మొదలైన పాత్రలలో కనిపిస్తుంది.

ఈ విధంగా ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు తన జీవితంలో ఒనరించిన సంఘ సంస్కరణాది కార్యక్రమాలను, ఉద్దేశాలను, పొందిన అనుభూతులను, అనుభవాల పరంపరను, ఎదురైన కష్టనష్టాలను 'మాలపల్లి' నవలలో వివిధ పాత్రలు, సంఘటనల ద్వారా ఆవిష్కరింప చేసినాడు. ఇట్లా ఉన్నవ సమగ్ర వ్యక్తిత్వ వికాసం 'మాలపల్లి'వంటి ఇతిహాసం ఆవిర్భవించడానికి 'పూర్వరంగం'గా పని చేసింది.

---

## సూచికలు

1. కాశీనాధుని నాగేశ్వరరావు
   'తొలిపలుకు' - పు. xviii
   'మాలపల్లి' చతుర్థ ముద్రణ - 1964.

2. బంగోరె - మాలపల్లికి పూర్వరంగంగా భారతదేశ పరిస్థితులను వివరించినాడు.
   చూడుడు : "మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు" (మా.న. ప్ర.ని)
   విశాలాంధ్ర పబ్లిషర్స్, విజయవాడ - ఏప్రిల్ 1979.

3. గూడూరి నమశ్శివాయ -
   "శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి జీవిత విశేషాలు" పు. 1.
   'సాహిత్యోపన్యాసములు' (సా. ఉ.)
   ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ - హైదరాబాదు, 1980.

4. మందలపర్తి ఉపేంద్రశర్మ -
   "లక్ష్మీనారాయణులు" (ల. నా.) పు. 12.
   గాంధీ సాహిత్య ప్రచురణాలయం, హైదరాబాదు-ఆగష్టు, 1974.

5. చూ: 'మాలపల్లి' - పుటలు 127,159, 178, 365.

6. మల్లెల శ్రీరామమూర్తి -
"మాలపల్లి నవలా రచయిత ఉన్నవ లక్ష్మినారాయణ పంతులు"
ఆంధ్రప్రభ (దినపత్రిక) ఆదివారం అనుబంధం,
తేది : 30-12-1984.

7. శ్రీనివాస శిరోమణి -
"మాలపల్లి నిర్మాత ఉన్నవ లక్ష్మినారాయణ" (మా. సి. ఉ. ల)
పు 398.
భారతి - నవంబర్, 1945

8. చూ : మా. న. ప్ర. ని. - పు. 6, 7.
నాళము కృష్ణారావు -

9. "స్త్రీ పునర్వివాహమున కాటపట్టును వీరేశలింగం పుణ్యక్షేత్రమునగు రాజమహేంద్రవరము ప్రదర్శించిన యుదాహరణము నిపుడు గుంటూరు పురమనుసరించుచున్నది. అచట న్యాయస్థానమున న్యాయవాదిగ నున్న ఉన్నవ లక్ష్మినారాయణ పంతులుగారు అనాథాంగనల పాలిట కొంగు బంగారమై విలసిల్లుచున్నారు. స్త్రీ పునర్వివాహ కార్యములే తనకు ఉచ్ఛ్వాస నిశ్వాసములుగ జరియింపుచున్నారు. స్వజనము తన్ను విడిచి పెట్టినను నిజ ధర్మచారిని తోడునీడయై తన్ను వెంటనంటి రాగ, నీతడీ కార్యమునకు తన ప్రాణధనంబుల నర్పించుచు నిజమగు సత్కార్యాభి నివేశనమును లోకమునకు వెల్లడించుచున్నాడు. -ఇంతియేకాక గుంటూరు నందు లక్ష్మినారాయణగారిచే స్థాపించబడిన శరణాలయమా ప్రాంతము లందు సుప్రసిద్ధమై యున్నది." - పు. 18, 22.
"వితంతు వివాహచరిత్ర"
హితకారిణీ సమాజము - రాజమహేంద్రవరము - 1950.

10. చూ: సా.ఉ. పు 6.

11. ననుమాస స్వామి-
"అంటరాని వారుగా అవమానాలకు గురవుతున్న అభాగ్యుల కన్నీళ్లను తుడిచి వారికోసం కలం పట్టాడు ఉన్నవ." పు. 1
"మాలపల్లి : గోదాన్ - తులనాత్మక పరిశీలన"
ఉదయశ్రీ ప్రచురణలు - సెప్టెంబర్, 1986.

12. ఎమ్. లక్ష్మీపతిరావు-
"బాలగంగాధర తిలక్" (వ్యాసం) పు. 200.
'భారత స్వాతంత్ర్యోద్యమ ప్రదీప్తి సంచిక'
ఎడిటర్ : ఆర్. సూర్యనారాయణమూర్తి - మార్చి, 1980

13. "దీని (మాలపల్లి) కర్త సాంఘిక, రాజకీయ, సంస్కరణాది విషయము లలో నారితేరిన చేయి. 'సహాయ నిరాకరణోద్యమము'లో సుప్రసిద్ధులు, ప్రఖ్యాత న్యాయవాదులు. సంఘసంస్కరణమునకును "సహాయ నిరాకరణ" రూపమైన రాజకీయ సంస్కరణమునకును నొక్కటే మూల సూత్రము. అది వ్యక్తి స్వాతంత్ర్యము. అట్టి స్వాతంత్ర్యమున కొక వేళ నిరోధక కారణము లేర్పడినచో వాని నన్నివిధముల ప్రతిఘటింతురు. అట్లుం బూనుకొనుట వారికి ప్రకృతి" పు. 278.
బి. వి. కుటుంబరావు "ఆంధ్రనవలా పరిణామము" జూన్, 1971

14. చూ : ఆ.నా. పు. 34, 35.

15. "1921లో పల్నాటిసీమలో అడవి పుల్లరి వసూలును పురస్కరించుకొని ఆంధ్ర దేశానికేగాక భారతదేశానికే మొట్ట మొదటిసారిగా సహాయ నిరాకరణోద్యమానికి మూల పురుషులలో ముఖ్యులు శ్రీ ఉన్నవ లక్ష్మీ నారాయణగారు"
సంపాదకీయం - కృష్ణా పత్రిక - 4-10-1958.

16. డా. పి. సంజీవమ్మ-
"కథా సంవిధానంలో భాగంగానే అక్టోబరు విప్లవాన్ని ప్రత్యక్షంగా ప్రస్తావించిన మొదటి నవల కూడా మాలపల్లి". పు. 104.

"తెలుగు నవలలో సామాజిక చైతన్యం"
అభ్యుదయ రచయితల సంఘం - ప్రచురణ, 1985.

17. చూ : మా. న ప్ర. ని. - పు. 15, 16.

18. చూ : సా. ఉ. - ఉ. ల. పం జీవి. (వ్యాసం)

19. పి. భాగ్యమ్మ
రామదాసు భావాలు చాలావరకు ఉన్నవవే అని ఉన్నవ వరలక్ష్మి, ఉన్నవ నాగేశ్వరరావు గారలు వ్యక్తం చేసినారు.
చూ : అనుబంధం - 1 - పు. 240, 242.
ఎం.ఫిల్. సిద్ధాంత వ్యాసం. సెప్టెంబర్, 1981 (అముద్రితం)
కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్.

20. మా. న. ప్ర. ని నుండి ఎత్తి వ్రాయబడినది.
చూ : పు. 8

## అధ్యాయం : రెండు

# మాలపల్లి : ఐతిహాసికత

### తొలి ఆధునిక ఇతిహాసం :

ఆధునిక కాలాన తొలిసారిగా తెలుగు సాహిత్యంలో నవలా రచన ఆరంభమైంది నరహరి గోపాలకృష్ణమచెట్టిగారి 'శ్రీరంగరాజ చరిత్ర'తోనే. ఇది 1872లో వెలువడింది దీని తర్వాత ఆరేండ్లకు 1878లో వెలువడిన కందుకూరి వీరేశలింగం గారి 'రాజశేఖర చరిత్ర' మలిరచన అయినప్పటికీ, తర్వాతి నవలా రచయితలకు ఈ నవలే మార్గదర్శకం కావడం, వీరేశలింగంగారు పోటీల ద్వారా నవలా సాహిత్యాభివృద్ధికి కారకులు కావడం కారణంగా, నవలా యుగం దీంతోనే ఆరంభమైందని చెప్పుకోవచ్చు. చెట్టిగారు తన రచనను 'నవీన ప్రబంధమంటే; కందుకూరివారు ఆ రచనా ప్రక్రియను 'వచన ప్రబంధం'గా నిర్ణయించినారు. చెట్టిగారి రచన స్వతంత్రింకాగా, కందుకూరివారి 'రాజశేఖర చరిత్ర'- 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' అనే ప్రసిద్ధమైన ఆంగ్ల నవలను మాతృకగా చేసుకొని వెలువడడం గమనించతగ్గ అంశం. అంటే, ఒక విధంగా వీరేశలింగంగారి నుండే తెలుగు సాహిత్యంపైన ఆంగ్ల నవల ప్రభావం వేయడం ఆరంభమైందని భావించవచ్చు.

ఇక్కడ చెప్పుకోవలసిన మరో అంశం ఏమంటే - కందుకూరివారు ఆంగ్ల నవలను మాతృకగాచేసుకొన్నప్పటికీ, తన రచనను 'వచనప్రబంధ'మని పిలిచినారే తప్ప, నవలగా పేర్కొనలేదు. పైగా, 1892 నుండి 'వచన ప్రబంధం'అనే పేరుతో రచనల పోటీ నిర్వహిస్తూ, చిలకమర్తి వంటి పలువురిచేత విరివిగా 'వచన ప్రబంధ'ములు వెలయింప చేసినారు. ఇట్లా వెలువడిన రచనలన్నీ 'రాజశేఖర చరిత్ర'ను మార్గదర్శకంగా చేసుకొని వెలువడినట్టివే. [1]

కొన్ని వందల సంవత్సరాల నుండి వస్తున్న 'ప్రబంధ' పదం ప్రధానంగా పద్య విభాగానికి చెందినట్టిది. ఇట్లాంటి 'ప్రబంధ' పదాన్ని కందుకూరివారు ఆధునిక వచన ప్రక్రియకు జోడించారు. చెట్టిగారు తమ రచనలో తెలుగువారి ఆచార వ్యవ

హారాలకు[2] ప్రాధాన్యమివ్వగా, కందుకూరి వారు మూఢాచార నిరసనకు, నీతిబోధలకు ప్రాధాన్యమివ్వడం[3] గమనింప తగింది.

ఇదిలా ఉండగా, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు రాజశేఖర చరిత్రను విమర్శిస్తూ 'వివేక చంద్రికా విమర్శ'ను వెలయించినాడు (రాజశేఖర చరిత్రకు మరోపేరు వివేక చంద్రిక). దీని పీఠికలో, పాశ్చాత్య సాహిత్యంలో ప్రశస్తంగా ఉన్న Novel అను పదానికి 'నవాన్ విశేషాన్ లాతి గృహ్ణాతీతి నవలా' అని సంస్కృతీయంగా వ్యుత్పత్త్యర్థం చెప్పి 'నవల'ను ఖాయీకరించినారు.[4] అప్పటినుండి వచన ప్రబంధానికి ప్రత్యామ్నాయంగా నవల అనే పేరు వ్యవహారంలో స్థిరపడిపోయింది.

వీరేశలింగంగారి ప్రోత్సాహంతో ఒకవైపు అసంఖ్యాకంగా స్వతంత్ర నవలలు వెలువడుతుండగా, మరొకవైపు వంగ సాహిత్యంనుండి అనేక నవలల అనువాదం కూడా విరివిగా సాగింది. ఈ కాలంలో ఇట్లా వెలువడిన స్వతంత్ర/అనువాద నవలల్లో స్వరూపం దృష్ట్యా విశేషమైన మార్పులతోబాటు, వంగ సాహిత్యం ప్రభావం కారణంగా జాతీయోద్యమ ప్రభావం నవలా స్వరూపంలో విస్తరించటం ఆరంభమైంది. డా॥ సంపత్కుమారగారు పేర్కొన్నట్లుగా-

> "ఈ కాలపు వచన ప్రబంధాల / నవలలను సమష్టిగా గమనిస్తే, ఈ ప్రక్రియ రకరకాలైన ఒడుదొడుకులనూ, బాలారిష్టాలనూ అధిగమించి, స్థిరంగానూ, పటిష్టంగానూ నిలదొక్కుకొనేందుకు సాగిన నిరంతర నిష్ఠాపూర్వకమైన కృషి సువ్యక్తమవుతుంది. ఒక ప్రక్రియ స్థిరపడి స్వారూపికమయిన విశిష్టమైన మార్పుతో ఒక మలుపు తీసుకునేందు కనువయిన వాతావరణం"[5]

ఏర్పడింది.

సరిగ్గా ఇట్లాంటి వాతావరణంలో ఉన్నవ 'మాలపల్లి' వెలువడింది. తెలుగు నవలాసాహిత్యంలో ఒక విశిష్టమైన, విలక్షణమైన మార్పును తీసుకొచ్చింది. అందుకే అడవి బాపిరాజుగారు 'మాలపల్లి'ని-

> "తెలుగు నవలా చరిత్రలో రెండవ యుగానికి గోపుర ద్వారం"[6]

గా పేర్కొన్నారు.

ఉన్నవ 'మాలపల్లి'కి సామాన్య వచన ప్రబంధ స్థాయిని మించి ఇతిహాస స్థాయిని కలిగించాడు. 'మాలపల్లి'కి ముందు తర్వాత అనేక రచనలు వెలువడి నప్పటికీ, మొదటిసారిగా 'మాలపల్లి'లో ఇతిహాస లక్షణాలు కన్పిస్తున్నవి. విస్తృతమైన ప్రాతిపదికపై, విశాలమైన ఇతివృత్త నిర్మాణంతో, సజీవ పాత్ర చిత్రణతో, అనేకాంశాల్ని కేవలం అంశికంగా మాత్రమేకాక, సమాజం యొక్క సమగ్ర వ్యక్తిత్వాన్ని బృహదావరణంలో, బహు విషయ సంధానంతో తరతరాల జీవన లక్షణాల్ని 'మాలపల్లి'లో చూపించడం జరిగింది. అందుకే 'మాలపల్లి'ని విమర్శకులు ఆధునిక ఇతిహాసంగా గుర్తిస్తున్నారు.

భారతీయ సాహిత్యంలో రామాయణ, మహాభారతాలు రెండే ఇతిహాసాలు. వీటి తర్వాత ఇతిహాస రచన ఆగిపోయిందనే చెప్పవచ్చు. అయితే, అనంతర కాలంలో కావ్యాలు, మహాకావ్యాలు, ప్రబంధాలుగా సాహిత్య రచన బృహదావరణం నుండి పరిమితమైన వస్తువుతో[7], వర్ణనాదులతో వెలువడింది

రామాయణ, మహాభారతాలు రెండూ వేర్వేరు కాలాల్లో రచింపబడినట్టివి. అందుకే వీటిల్లో దేని నిర్మాణ ధోరణి దానిదిగానే కన్పిస్తుంది. రామాయణంవ్యక్తి ప్రాధాన్యంతో, ధర్మం ప్రాతిపదికగా, ఏకనాయకంగా సాగితే; భారతం క్రియా ప్రాధాన్యంతో విస్తృతమైన ప్రాతిపదికపై కొన్నితరాల జీవన స్రవంతిని భిన్న భిన్న ప్రకృతుల నాలంబనం చేసుకొని ఉపకథలతో, ధర్మసూక్ష్మాలతో బహు నాయకత్వ భావన కలిగేట్లుగా సాగింది. రాజశేఖరుడు కావ్యభేదాల్ని విచారిస్తూ రామాయణాన్ని ఏక నాయకంగానూ, భారతాన్ని బహు నాయకంగానూ[8] పేర్కొనడం ఇక్కడ ఉదహరించుకోవచ్చు. ఇతిహాసాలు సుదీర్ఘమైన ఇతివృత్తంతోనూ అనేక ఉప కథలతోనూ, నానా రస భావాలకు ఆశ్రయంగానూ చిత్రింపబడటంవల్ల ఇతిహాస నిర్మాణం సాధారణంగా శిథిల బంధంగానే ఉంటుంది. మహాభారతం ఇందుకు ప్రథమోదాహరణం.

పాశ్చాత్య సాహిత్యంలో మన ఇతిహాసంతో సమానంగా భావింపబడుతూ 'ఎపిక్'[9] కన్పిస్తున్నది. మనం రామాయణ, భారతాల తర్వాత మళ్లీ ఇతిహాసాలు వెలువడలేదని భావిస్తుంటే, పాశ్చాత్యులు తమ సాహిత్యంలో 'ఎపిక్' ప్రక్రియ ఒక క్రమ పరిణామంతో ఈనాటికీ కొనసాగుతున్నట్లు భావిస్తున్నారు. పాల్ మర్చంట్-

"నిజానికి ఈ రూపం క్రమానుగతమైన వికాసంతో ఇంకా సజీవం
గానే ఉన్నది"10

అంటాడు.

కాలక్రమేణా పాశ్చాత్య సాహిత్యంలో 'ఎపిక్' భావన ఎంతగానో మార్పు చెందుతూ వచ్చింది. ఛందోబద్ధమైన కావ్యాలేకాక, ఇటీవలి కాలంలోని నవల, సినిమా, నాటకం11 మొదలైన అత్యాధునికమైన ప్రక్రియలు కూడా 'ఎపిక్'గా పిలువబడుతున్నాయి అంతేకాదు, 'ఎపిక్'కు సంబంధించిన ఏ ఒకటి, రెండు లక్షణాలున్నా, చివరికి 'ఎపిక్ స్పిరిట్'12 ఉన్నా అదికూడా 'ఎపిక్'గానే వ్యవహరింపబడుతున్నాయి దీన్నిబట్టి పాశ్చాత్య సాహిత్యంలో 'ఎపిక్' స్వరూపం పలు మార్పులకు లోనౌతూ వస్తున్నదని గమనింపవచ్చు.

కాగా, భారతదేశంలో ఆధునికంగా 'మహాకావ్య'మనే పదాన్ని 'ఇతిహాసా'నికి పర్యాయ పదంగా కొంతమంది విమర్శకులు భావిస్తున్నారు. రఘువంశం వంటి మహాకావ్యాలు ఈ దృష్టితోనే ఒకటి, రెండు ఇతిహాస లక్షణాలున్నప్పటికీ ఇతిహాసాలుగా గుర్తిస్తున్నారు.13

నిజానికి ఇతిహాసాలు మిగతా ప్రక్రియలవలె ఎప్పుడుబడితే అప్పుడు అలవోకగా రచింపబడేవికావు. డా. సుప్రసన్నగారి మాటల్లో-

"మహాకావ్యము ఒక జాతి యొక్క అనుస్యూతమైన పురోగతిలో ఏర్పడ్డ ఒక మహా సంకటాన్ని ఏట్లా అధిగమించిందీ, దాని ఆత్మ లక్షణం ఎలాంటిదీ ఆ సంస్కృతికి సమాపన్నమైన వైలక్షణ్యం ఎలాంటిదీ వివరించుతుంది. అయా జాతి చరిత్రలో విశిష్టమైన మలుపు వచ్చినప్పుడల్లా ఆ జాతికి ఒకానొక నూతనేతిహాసం అవసరమవుతుంది."14

సరిగ్గా ఇట్లాంటి అవసరంతో వెలువడిన తొలి ఆధునిక ఇతిహాసం 'మాలపల్లి'.

'మాలపల్లి' రచనాకాలం నాటికి ఒకవైపు దేశ ప్రజలు స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నారు. మరోవైపు, సామాజికంగా హరిజనోద్యమం, భాషా పరంగా వ్యావహారిక భాషోద్యమం ఉద్ధృతంగా కొనసాగుతున్నాయి. ఆంగ్లేయుల సంస్కృతీ, సంప్రదాయాల తాకిడి నుండి మన సంస్కృతీ, సంప్రదాయాల్ని

కాపాడుకోవాల్సిన అవసరంతో పాటు, పునర్విచారంతో పునరుజ్జీవింప చేసుకో వలసిన అవసరం ఏర్పడింది. సరిగ్గా ఇట్లాంటి సంకటస్థితిలో జాతి కొట్టుమిట్టాడు తున్న సమయంలో ఉన్నవ జాతి జనుల జాగృతికై 'ఆధునిక ఇతిహాసంగా' మాలపల్లిని ఆవిష్కరించినాడు.

## ఇతిహాస లక్షణాలు :

రామాయణ, మహాభారతాల తర్వాత వెలువడిన అలంకార శాస్త్రాలు ఇతి హాస లక్షణాలను స్థూలంగా పేర్కొన్నాయి. ఆధునిక విమర్శకులు ఈ అలంకారి కుల అభిప్రాయాలను, పాశ్చాత్య వాఙ్మయంలోని 'ఎపిక్' లక్షణాలను దృష్టిలో పెట్టుకొని, భారతాది గ్రంథాలను విమర్శిస్తూ, ఇతిహాస లక్షణాల్ని తమ విమర్శ గ్రంథాల్లో వివరించినారు. ఆ ఇతిహాస లక్షణాలు ఇవి. చారిత్రక సత్యమైన కథ, కొంత శాస్త్ర ప్రవృత్తి, ధీరోదాత్త నాయకుడు, ఉపాఖ్యానాలు, దేవాసుర సంబంధం, కర్మఫలానుభవం.[15] ఇవి కాక ఇతిహాసాల్లో కన్పించే మరో ప్రధాన లక్షణం విషాదం.[16]

ఈ ప్రాచీనేతిహాస లక్షణాలన్నీ యథాతథంగా కాకుండా, కాలానుగుణమైన మార్పులతో ఆధునీకరింపబడి 'మాలపల్లి'లో కన్పిస్తున్నాయి. ఇట్లాంటి మార్పులే తర్వాత వచ్చిన 'వేయిపడగలు' మొదలైన ఇతిహాసాల్లో చూడవచ్చు.

పూర్వులు చెప్పిన చారిత్రక సత్యమైన కథ గతకాలపు చరిత్రకు సంబం ధించిందిగా కన్పిస్తుంది. కానీ, సమకాలీన సమాజ చరిత్ర మాలపల్లిలో కన్పి స్తుంది. రామాయణ, భారతాల్లోనూ వాల్మీకి, వ్యాసుల ప్రవేశం ఉండడంవల్ల ఆ ఇతిహాసాల కథలు కూడా వారికి సమకాలీనమైనవే అని చెప్పడంలో అసామం జస్యం ఏమీలేదు. ఐతే, ఆ ఇతిహాసాలలో కథ ఏ ఒకరిద్దరో వ్యక్తులను కేంద్రం చేసుకొనగా, ఇందులో సమాజమే కేంద్రమవుతున్నది. అందువల్ల, ఇతివృత్త నిర్మాణ స్వరూపంలో సహజంగానే మార్పులొస్తున్నాయి. సమాజం ఏ ఒక్క వ్యక్తితోనో, ఏ ఒక్క అంశంతోనో ముడిపడింది కాకపోవడం వల్ల సమాజం కేంద్రమైన ఇతిహాస నవలల్లో వ్యక్తి బాహుళ్యం, కథానిర్మాణంలో శైథిల్యం సహజంగానే వస్తాయి. భారతేతిహాసంలో వలెనే మాలపల్లిలోనూ పరమపురుషార్థ మైన మోక్షాన్ని ప్రతిపాదించే శాస్త్రప్రవృత్తిని చూడవచ్చు. డా॥ కేతవరపు రామకోటిశాస్త్రిగారు పేర్కొన్నట్లుగా-

"భారతమున ప్రవర్తించిన శాస్త్రము ధర్మరాజు చిత్తమును మోక్షాభిముఖము చేసినది. అఖిల జ్ఞాతి వధవలని నిర్వేదముతోడి ధర్మజుని చిత్తము ఏతచ్ఛాస్త్రము ప్రవర్తించుట కాలంబనమై అవకాశము కల్పించినది. ఆ శాస్త్రము ప్రవర్తించుట వలనిఫలము ధర్మజుని యందు ప్రకాశమునకు వచ్చినది".[17]

మాలపల్లిలోనూ రామదాసులో ఈ విధానం కన్పిస్తుంది. ధర్మరాజువలె రామదాసు కూడా 'మాలపల్లి'లో చివరికి ఒంటరివాడై, మోక్షపదం పొందుతాడు. శాస్త్ర ప్రవృత్తితోపాటు అచలమనే మతంకూడా మోక్ష ప్రతిపాదకంగా చేయబడడం 'మాలపల్లి'లోని విశిష్టతను తెలుపుతుంది. ఈ అచలమత ప్రస్తావన, రామదాసు ఆత్మోద్ధరణకు మార్గం అన్వేషిస్తూ మోక్షపదం చేరడం తరువాతి అధ్యాయంలో వివరంగా చర్చింపబడుతుంది.

ఆధునిక కాలాన్నిబట్టి సమాజంలో సామాన్యుడికి వచ్చిన ప్రాధాన్యం వల్ల 'మాలపల్లి'లోనూ సామాన్య మానవునికే పట్టంకట్టబడింది. ఈ నవలలోని సామాన్యుడు తన వ్యక్తిగత ప్రయోజనాల కోసం కాక సమష్టి ప్రయోజనం కోసం పాటుపడడం, ఆత్మత్యాగం చేయడంవంటి ఉదాత్త లక్షణాలను 'మాలపల్లి' సంతరించుకొన్నది. ఆలంకారికులు చెప్పిన ధీరోదాత్తాది నాయక విభాగంకాని, మహాకులీనతాది లక్షణాలు కాని ఆధునిక ఇతిహాసాలకు పట్టవు. ఆ లక్షణాలు ప్రధానంగా మహా కావ్యాల నుద్దేశించి ప్రత్యేక వ్యక్తి ప్రాధాన్యాన్ని దృష్టిలో ఉంచుకొని చెప్పబడిన లక్షణాలుగా కన్పిస్తాయి ఆలంకారికులు చెప్పిన అంశాలన్నీ అనువర్తింపచేయడానికి వీలుకాదు కాలానుగతంగా ఇతివృత్త భావనలో కూడా మార్పు రావడం ఇందుకు కారణం 'మాలపల్లి'లో కొన్ని ఉపకథలు కన్పిస్తాయి. ఇవి ప్రధాన కథతో సంబంధం కలిగివుంటూనే, ఒక ప్రత్యేక ప్రయోజనం కోసం రచింపబడినవిగా, స్వంత వ్యక్తిత్వం కలవిగ కూడా కన్పిస్తాయి. ఇవి పూర్వేతిహాసాల్లో వలె ఒకేచోట చెప్పబడటం లేదు ఈ ఉపకథలు ప్రధాన కథను అనుసరిస్తూ అక్కడక్కడా కొంచెకొంచెంగా చెప్పబడుతూరావటం ఆధునిక ఇతిహాసాల్లో వచ్చిన మార్పు. అందువల్ల వీటిని అనుకథలు అనవచ్చు[18] ప్రాచీన ఇతిహాసాల్లో కన్పించే దేవాసుర సంబంధం ఆధునిక ఇతిహాసంలో దైవీ అసుర ప్రవృత్తులుగా, వాటిమధ్య సంఘర్షణగా[19] పరివర్తనంచెంది కన్పిస్తున్నది. ఈ ప్రవృత్తుల ననుసరించే వ్యక్తుల కర్మ, దాని ఫలితాలు, వాటి అనుభవాలు కూడా చర్చింపబడతాయి.

ఇతిహాసాలకు ఒక లక్షణంగా పూర్వులెవ్వరూ విషాదాన్ని ప్రస్తావించినట్లు కన్పించదు. పూర్వేతిహాసాలను గమనిస్తే ఆద్యంతాలలో ఏదో ఒక విషాద ఛాయా మనస్యూతి కన్పిస్తూనే ఉంటుంది. రామాయణం కరుణరస ప్రధానమని అందరూ అంగీకరించిందే. భారతం శాంతరస ప్రధానమని, ఇందుకు ఆద్యంతాలు కన్పించే విషాదం, నిర్వేదం మూలమని చెప్పవచ్చు. ఆధునిక ఇతిహాసాల్లో కూడా ఈ లక్షణం కన్పిస్తూనే ఉంటుంది.

ఇతిహాసాల్లో కన్పించే ఇతివృత్త నిర్మాణం, కథానాయకత్వం, అనుకథలు, సంఘర్షణ, కర్మఫలానుభవం, విషాదం అనే లక్షణాలు 'మాలపల్లి'లో ఉన్నాయి. ఈ లక్షణాలు ఎంతవరకు పరిస్ఫుటమైనాయన్నది క్రమంగా పరిశీలింపబడుతుంది.

## ఇతివృత్త నిర్మాణం :

ఏ మహాకావ్యానికైనా, ఇతిహాసానికైనా, నవలకైనా కథా వస్తువు సమ, కాలీన సమాజంలోనుంచే రూపొందుతుంది. అంటే రచయిత సమకాలీన సమాజంలో, సమాజాన్ని, తనను కలవరపరుస్తున్న అనేక సమస్యల్ని అవగాహన చేసుకొని వాటిని వ్యక్తీకరించడానికి, వాటికి తన ధోరణిలో పరిష్కారమో, పర్యవసానమో నిరూపించేందుకు కొంతమంది వ్యక్తుల్ని, కొన్ని సన్నివేశాలను, సంఘటనలను ఎన్నుకొంటాడు. రూపొందించుకొంటాడు. ఈ సన్నివేశాలు, పాత్రలు వీటి యొక్క ప్రవృత్తి మొత్తంగా కథావస్తువవుతుంది. కథావస్తువులోని సంఘటనలు వ్యక్తులు సమాజంలోనివారే అయినా, కొంతమంది వ్యక్తుల వ్యక్తిత్వాల సామూహిక సమన్విత రూపాలను నవలలో పాత్రలుగా రచయిత రూపొందిస్తాడు. సంఘటనలను, సన్నివేశాలను కుదిరించుకొంటాడు. ఈ మొత్తం కల్పనలాగే ఉన్నా మౌలికంగా వాస్తవమైనదే. ఈ స్థూలమైన కథావస్తువును తానుద్దేశించిన ప్రయోజనానుకూలంగా ఒకానొక క్రమపద్ధతిలో తీర్చిదిద్దుతాడు. ఈతీర్పునే 'ఇతివృత్తం' అని వ్యవహరించవచ్చు. ఇతివృత్త నిర్మాణాన్ని పరిశీలించటమంటే కథావస్తువులో ఉద్దేశింపబడిన సమస్యలు, వాటిని వ్యక్తీకరించడంలో తీర్చిన తీర్పును సమన్వయపరచి పరిశీలించుకోవటం.

మాలపల్లిని రచించిన ఉన్నవ సృజనాత్మక సాహిత్య రచనాశక్తి కలవాడు మాత్రమేకాదు, సామాజికమైన ఉద్యమంలో తలమునకలుగా పనిచేసిన

వాడు కూడా. ఈ కారణంగా సమకాలీన సామాజిక సమస్యల్ని సృజనాత్మక రచనకు కథావస్తువును రూపొందించుకోవడంలోనూ, ప్రయోజనాత్మకంగా తీర్చి దిద్దడంలోనూ గొప్పసౌకర్యం కల్గింది.

ఉన్నవ గాంధీయవాది. ఆయన జీవితాన్ని చూచినా, కార్యకలాపాల్ని పరిశీలించినా, రచనలను గమనించినా ఇది స్పష్టమవుతూనే ఉంటుంది. ఆనాడు ఉన్నవ గాంధీజీ సాగించిన ప్రధాన ఉద్యమాలన్నింటిలోనూ క్రియాశీలిగా, కార్య శూరుడుగా పనిచేసినవాడు. గాంధీజీ ఉద్యమానికి ముందే రకరకాలైన రీతుల్లో అనేక ఉద్యమాలు దేశంలో వ్యాపించినయి. జాతీయోద్యమం అనేది ఏ ఒక్క అంశానికి సంబంధించిందో కాక జాతికి సంబంధించిన ఉద్యమాలన్నింటిని ఏక మొత్తంగా వ్యక్తంచేసేమాట. సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమం వివిధ రంగాలకు వ్యాపించి, వివిధ ఉద్యమాలుగాసాగి, తిరిగి అవన్నీ జాతీయోద్యమంగా పరిణమించడానికి 19వ శతాబ్దంలోనే చక్కని అనుకూలమైన వాతావరణం ఏర్ప డింది. సమాజంలోని కుల, మత మౌఢ్యాలు, సాంఘిక దురాచారాలు సమాజాన్ని భ్రష్టుపట్టిస్తున్న స్థితిలో ఈ దురాచారాల్ని, మౌఢ్యాలను రూపుమాపి జాతిమను గడకు, పురోగతికి, ప్రతిష్ఠకు క్రొత్తమార్గాన్ని నిర్దేశించేందుకు మహానుభావులనే కులు ముందుకు వచ్చినారు. రాజరామ్మోహనరాయ్, రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, దయానందుడు, రవీంద్రుడు, శ్రీ అరవిందులు, గోవిందరానడే, దాదాబాయి నౌరోజీ, గోఖలే, తిలక్ మొదలైన వారెందరో ఈ వరుసలో మనకు దర్శనమిస్తారు. వీరందరూ సమాజంయొక్క భౌతిక జీవితాన్ని, ఆధ్యాత్మిక జీవితాన్ని కూడా లక్షించి ముందుకుసాగినారు. కొందరిలో ఒకటి, మరికొందరిలో ఇంకొకటి ప్రాధాన్యం వహించి వుండవచ్చు. అయినా వీరందరి ప్రయత్నాల్లో మౌలిక లక్షణం ఉభయ జీవితాల సమన్విత పురోగతియే. గాంధీజీలో ఈ పూర్వు లందరి ప్రయత్నాల, లక్ష్యాల సమగ్ర సమన్వయము కన్పిస్తుంది. వీరందరు భారత జాతీయ ధర్మాన్ని, ఆధ్యాత్మిక శక్తిని, భౌతిక జీవిత విధానాన్ని క్రొత్త మార్గంలో ప్రవర్తింప చేసినవారు. సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ, ఆధ్యా త్మిక రంగాల్లో ఆధునిక చైతన్యాన్ని కల్గించి, నవభారత నిర్మాణానికి దోహదం చేసినారు. ఈ మహనీయుల ప్రేరణ గాంధీజీ ద్వారా ఉన్నవపై గాఢంగా పని చేసింది. ఈ ప్రేరణతో, తన క్రియాశీల కార్యకలాపాల అనుభవంతో సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక, నైతిక, రాజకీయ, ఆధ్యాత్మిక చైతన్యాన్నంతటినీ భూమి కగాచేసుకొని మాలపల్లికి కథావస్తువును ఉన్నవ రూపొందించుకొన్నాడు.

కథావస్తువు రూపొందించుకోవడంలో ఒకటి, రెండింటిని ప్రధానంగా చేసుకొని మిగిలిన అనేక ఇతర సమస్యలను అనుబంధింపచేయటం సహజంగా జరుగుతుంది. మాలపల్లి రచనాకాలం నాటికి ప్రధాన సమస్య స్వాతంత్ర్య సముపార్జన. ఈ సముపార్జనకు భారతీయులందరూ కలిసి కట్టుగా ఆంగ్లేయులను ఎదిరించవలసి వున్నది కాని, నాటి పరిస్థితులలో కుల, మతాల పేరుతో సమాజంలో బాగా వెనుకబడివున్న పంచములను అగ్రవర్ణాలవారు అనేక విధాలుగా దోచుకోవటం సాధారణ విషయం. హిందువులలో గణనీయ సంఖ్యలో ఉన్న పంచములు ఈ విధంగా అగ్రవర్ణాలు, ధనికులు, భూస్వాములు మొదలైన వారి దౌర్జన్యాలకు గురియై దినదినానికి మరింత అధోగతిపాలవుతున్నారు. ఈ పంచములది జాతి సమైక్యతలో ఒక ప్రధానమైన అవరోధంగా తయారయింది. అందుకని గాంధీజీ ఈ సమస్యను తీసుకొని ఒక పెద్ద ఉద్యమాన్ని నిర్వహించినాడు. తరతరాలుగా హీన భావాన్ని స్ఫురింపచేసే మాల, మాదిగ, పంచమవంటి పదాలను కాదని వారందరినీ 'హరిజనులు'గా పేర్కొన్నాడు. హరిజనోద్యమాన్ని దేశ స్వాతంత్ర్యోద్యమంలో ఒక ప్రధానమైన భాగంగా నిర్వహించినాడు. గాంధీయవాదియైన ఉన్నవ అదే సమస్యను తన కథావస్తువుకి భూమిక చేసినాడు. అందుకే అయన నవల "మాలపల్లి".

హరిజన సమస్యను ప్రధానం చేసుకోవటంలో ఈ కథలోని పాత్రలు హరిజనులే కావటం సహజం. అయితే, కేవలం హరిజనపాత్రల వల్లనే హరిజన సమస్యను చిత్రించడం, పరిష్కరించడం కుదరదు. వారిని ఇప్పుడున్న స్థితికి దిగదార్చిన, ఇంకా పీడనకు గురిచేస్తున్న ఇతర వర్గాలకు, అగ్రవర్ణాలకు చెందిన పాత్రలు కూడా అవసరమౌతాయి. ప్రధానంగా హరిజనులు ఆర్థికంగా ధనికుల, భూస్వాముల దోపిడీకి గురియౌతున్నారు. సాంస్కృతికంగా అగ్రవర్ణాల ధూర్తత్వానికి బలియౌతున్నారు. ఈ స్థితిని నిరూపించేందుకు కథలో భూస్వామ్య వర్గం నుండి కూడా ప్రధాన పాత్రల్ని ఉన్నవ సేకరించినాడు. మాల, మాదిగలపై ఇతరుల దౌర్జన్యాన్ని నిరూపించే కొన్ని సంఘటనలను, సన్నివేశాలను భావించినాడు. దీంతోపాటుగా, సామాజిక దురన్యాయాలను, దోపిడీని అణచివేసేందుకు సమకాలీనంగా సాగుతున్న తీవ్రవాద మార్గాలను కూడా వాటి వైఫల్యాన్ని వ్యక్తీకరించేందుకు కథావస్తువులో సమీకరించినాడు. ఆనాడు తెలుగు సాహిత్యంలోనూ, దేశంలోనూ స్త్రీపురుషుల ప్రేమ సంబంధాలకు సంబంధించిన అంశాలను చేర్చుకొన్నాడు. పరాయి పాలన దుర్మార్గాలకు ప్రతిరూపమైన సెటిల్మెంటు, జైలు జీవి

తాన్ని కూడా పొందుపరచుకొన్నాడు. నిరక్షరాస్యతా నిర్మూలన, మద్యపాన నిషేధం, విద్యావ్యాప్తి మొదలైన సమస్యలు కూడా ఆయన దృష్టినుంచి పోలేదు. ఈ విధంగా రకరకాలైన అంశాల అమరికతో భావించబడిన కథావస్తువు మాలపల్లి నవలకు ఇతివృత్తంగా పరిణమించింది.

మానవధర్మ పరిణామం శాంతి, అహింస సూత్రాల ప్రాతిపదికపై జరగటం గాంధీయ సిద్ధాంతం. ఈ జరుగుదలకు ఔదార్యాన్ని, క్షమాగుణాన్ని అగ్రవర్ణాల వారితో పాటు బాధితులూ, పీడితులూ అయిన హరిజనులు కూడా కొంత ప్రదర్శించవలసిన అవసరం ఉన్నది. హరిజనులు కేవలం అగ్రవర్ణాల వారిచేత ఉద్ధరింపబడవలసిన వారుకాదు. వారు తమ జీవన విధానం ద్వారా, సంస్కారం ద్వారా తమను తామే ఉద్ధరించుకోవలసి వుంటుంది. హరిజనుల ఇట్లాంటి ప్రయత్నానికి తదితర వర్ణాల, వర్గాలవారు అనుకూల పరిస్థితులు కల్గిస్తూ, సహకార భావంతో మార్గదర్శకులు కావాలి. ఉన్నవ ఈ తీరులో సమస్యా పరిష్కారాన్ని భావించినాడు. అంతేకాదు, హరిజనుల ఉద్ధరణ సాంఘిక, రాజకీయ రంగాలతో పాటు నైతిక, ఆధ్యాత్మిక రంగాలలోనూ సమానంగా సాధింపబడాలి అని కూడా భావించాడు. ఈ సాధన కేవలం హరిజనులకే పరిమితం కాదు. సమాజం మొత్తానికి వర్తించేది. నవలలో కథావస్తువు హరిజన సమస్యా ప్రధానమైంది కాబట్టి హరిజనుల విషయంలో ఈ సాధన వ్యక్తీకరించినాకూడా, అది సమాజానికంతటికీ వర్తించే తీరులోనే ఆయన భావించినాడు. అట్లాసాధింపబడ్డప్పుడే సమాజం మొత్తంగా సమగ్రమై పటిష్ఠవంతమౌతుంది. బహిరంతరాల్లో జరగవలసిన పరిణామ పురోగతులలో ఏది ఉపేక్షింపబడినా కూడ సమగ్రత కొరవడుతుంది. సంఘర్షణలు చెలరేగి అవాంఛనీయ పరిస్థితులు ఏర్పడుతాయి. ఈ అభిప్రాయాన్ని మాలపల్లిలో స్పష్టంగా దర్శించవచ్చు.

స్థూలంగా చూస్తే మాలపల్లిలో పంచముల సమస్య, రైతు కూలీల ఉద్యమం, ఆధ్యాత్మిక జీవితం అనే త్రిపుటి ప్రాధాన్యం వహిస్తున్నది. దీన్నిబట్టి ఇతివృత్త నిర్మాణాన్ని రెండు అంతస్థులలో చూడవలసివుంటుంది. పంచములది సామాజిక సమస్య. రైతు కూలీలది ఆర్థిక సమస్య. ఈ రెండూ భౌతిక జీవితానికి సంబంధించినవి. సామాజికమైనవి. చివరిది వైయక్తికమైనది. ఆధ్యాత్మిక జీవితానికి సంబంధించింది. కాగా, డా. సంపత్కుమారగారన్నట్లుగా-

"సమాజానికి ఉభయ జీవితాలున్నాయి- భౌతికమూ, ఆధ్యాత్మికమూ. ఈ రెండు సమాంతరంగా వికాసం పొందినప్పుడే సామాజిక చైతన్యం సంతులితమూ, సమగ్రమూ అవుతుంది. ఈ రెండూ వీటికోసమయి ప్రయత్నాలూ పరస్పరం పూరకంగా పరిపోషకంగా సాగటమే యదార్థ జీవన మార్గంగా ఈ (మాలపల్లి) నవల రూపొందింది"[20]

మాలపల్లి ఇతివృత్త నిర్మాణంలో రామదాసు కుటుంబం కీలకమైంది రామదాసు కుటుంబం హరిజన వర్గానికి చెందింది. అది సమాజంలో అట్టడుగు స్థాయిని సూచిస్తూ ఉండగా, ఆ కుటుంబం దాసరి కుటుంబం కావటం వారి ఆధ్యాత్మిక చైతన్య లక్షణాన్ని స్ఫురింపచేస్తుంది. ఈ కుటుంబంలో రామదాసు కుటుంబానికి పెద్ద. వెంకటదాసు, సంగదాసులు ఆయన కొడుకులు. (మరో కొడుకు రంగడు ఉన్నట్టు చెప్పబడింది. కాని, కథాగమనంలో అతని ప్రసక్తి అంతగా లేదు. కుటుంబం యొక్క అనుస్యూతిని సూచించేందుకు చివరికి రామదాసు చేత రంగడి గృహప్రవేశం చేయించబడుతుంది.) రామదాసు ఆయన కొడుకులు ఒకవైపు కాగా, రెండవవైపు చౌదరయ్య, రామానాయుడు, పంతులు మొదలైన వారు. రామానాయుడు మొదలైన వారిని ఆ వైపు నుండి ఈ వైపు మరల్చడం ద్వారా, రామదాసు ఆయన కొడుకులు ఉన్నతీకరింపబడటం ద్వారా ఉన్నవ తన భావనను సమర్థవంతంగా వ్యక్తీకరించాడు.

సమాజానికి భౌతిక, ఆధ్యాత్మిక జీవితాలు రెండూ అవసరమైనప్పటికీ, మొదట సాధింపవలసింది భౌతిక జీవన రంగాల్లో అభివృద్ధి. దీంతోపాటు దీని తర్వాత కూడా ఆధ్యాత్మిక జీవితం సమగ్రమవుతుంది. ఈ అంశాన్ని మాలపల్లి ఇతివృత్త నిర్మాణంలో మనం చూడవచ్చు. భౌతిక జీవనరంగాల్లో అభివృద్ధి కోసం సంగదాసు తన జీవితాన్ని ధారపోయగా, రామదాసు ఆధ్యాత్మిక జీవితంలో క్రమ పురోగతి సాధిస్తాడు. ప్రాధాన్య దృష్టితో ఈ రెండు పాత్రల్ని గూర్చి ఇట్లు చెప్పవచ్చు. కాని, సంగదాసులో ఆధ్యాత్మిక భావన, రామదాసులో భౌతిక భావన అసలే ఉండవని కాదు. ఉంటాయనే అంశం-ఇవి పరస్పర విరుద్ధాలు కావు అనేది ఈ పాత్రల్లో అక్కడక్కడా ఈ అంశాల్ని సూచించటం ద్వారా రచయిత వ్యక్తీకరిస్తాడు. కాగా, కథా దృష్టితో సంగదాసు భౌతిక జీవితానికి అత్యంత ప్రాముఖ్యతనివ్వగా, రామదాసు ఆధ్యాత్మిక జీవితానికి ఎక్కువ మొగ్గ

చూపుతాడు. ఈ రెండు జీవితాలు మానవ జీవన సమగ్రతకు తప్పనిసరి అనే భావనతో రచయిత ఈ రెండింటి విజయాన్ని చివరకు సూచించినాడు.

మాలపల్లి చేను వర్ణనతో మొదలవుతుంది, ఆ వర్ణనలోనే రామదాసు ప్రవేశిస్తాడు. ఇక్కడ చేను అంటే మట్టిని ఆశ్రయించుకొని కనబడే రామదాసు ఒక్కొక్క మెట్టు నధిరోహిస్తూ, తన జీవితాన్ని ఆధ్యాత్మిక లక్ష్యంవైపు సాగిస్తుంటాడు. రామదాసుయొక్క ఆధ్యాత్మిక భావనా విధానానికి బీజం ఇక్కడే కన్పిస్తుంది. దీంతోపాటు సమాజంలో పంచములపై భూస్వాములు సాగిస్తున్న దౌర్జన్యం కూడా చెప్పబడుతుంది. కేవలం తన చేనిగట్టు మించి నడచివస్తున్న దన్న నెపంతో ఒక మోతుబరి ఆసామి రామదాసు చెల్లెలైన సుబ్బలక్ష్మిపై దౌర్జన్యంగా ప్రవర్తించి, రోజంతా కష్టపడి ఆమె తెచ్చుకొంటున్న గడ్డిని లాక్కుంటాడు. నవల ప్రారంభిస్తూనే నవల మౌలికవస్తువు ఇక్కడ స్ఫురింప చేయబడింది.

మరొక వైపు, భూస్వాములు, అగ్రవర్ణాల వారి దౌర్జన్యాలకు గురియౌతున్న కారణంగానే పంచములు విద్యాభివృద్ధులకు నోచుకోలేక పోతున్నారు. శుచీ, శుభ్రతలు తెలువని అజ్ఞాన స్థితిలో జీవనం సాగిస్తున్నారు. ఇట్లాంటి వీరి జీవితాల్ని చక్కదిద్దాలనే సదాశయంతో రామదాసు రెండవ కొడుకు సంగదాసు ప్రయత్నిస్తుంటాడు.

మంగళాపురంలో ధనికుడు, ప్రముఖుడు అయిన మోతుబరి చౌదరయ్య వద్ద గుమాస్తాగా పనిచేస్తూనే, సంగదాసు పంచములనుభవిస్తున్న దారిద్ర్యాన్ని, వారు మోసగింపపడుతున్న విధానాన్ని గమనిస్తూ, వారి అభివృద్ధికై రాత్రింబగళ్ళు మార్గాన్ని అన్వేషిస్తుంటాడు. చౌదరయ్య వద్ద పనిచేస్తూనే వ్యవసాయంలోని కష్టనిష్ఠూరాలను, కూలీల శ్రమను, వారికి లభిస్తున్న కూలిని, ఆసాములు పొందుతున్న రెట్టింపు లాభాల్ని ఎప్పటికప్పుడు గమనిస్తుంటాడు.

సంగదాసుకు చౌదరయ్య మనస్తత్వం బాగా తెలుసు. తను చేపట్టదలచు కొన్న పంచములు మొదలైన దిగువ కులాలవారి అభివృద్ధికి చౌదరయ్యలాంటి వారు సహకరించకపోగా, తన ప్రయత్నాలకు అడ్డుపడుతుంటారని తెలుసు. అయితే, మొదటగా పంచములలో దురభ్యాసాల్ని తొలగించి వారిలో ఉద్యమ

చైతన్యం కల్గించేందుకు ప్రయత్నిస్తూనే, పరోక్షంగా ధనికులలో హృదయ పరివర్తనం తేవడానికి శాయశక్తులా కృషిచేస్తుంటాడు. ధనికులలో హృదయ పరివర్తనం వచ్చినట్లయితే వారు స్వచ్ఛందంగా ముందుకు వచ్చి, తమ ధనాన్ని పంచమాభివృద్ధికి వెచ్చిస్తారని సంగదాసు ఆలోచన. దీనికి తోడు ఆనాడు స్వాతంత్ర్యం కోసం జరుగుతున్న పోరాటం విజయవంతమైనట్లయితే, సమాజంలో అణగారియున్న పంచములు మొదలైన దిగువ జాతుల శాశ్వతాభివృద్ధికి సమగ్రమైన చట్టాల్ని రూపొందించుకోవచ్చని సంగదాసు ఆకాంక్ష. ఈ భావనే నవలాసందర్భంలో రామదాసు ద్వారా ఇలా వ్యక్తంచేయబడ్డది

> “సంగడు వీళ్ళందరికీ బళ్ళుపెట్టించి చదువూ, వృత్తులూ నేర్పించాలంటాడు దీనికి ‘డబ్బూ, మనిషి చట్టమూ’, రెండూ కావాలి. ఇది క్రమంగా జరుగవలసిన పని మూకమంటే అయ్యేపనికాదు” (మా. ప. 30)

ఇందులో భాగంగానే సంగదాసు తన ఈడువాడు, ధనికుడు అయిన రామానాయుడితో స్నేహ భావాన్ని పెంపొందించుకొంటాడు. తన యజమానియైన చౌదరయ్యలో ఏ కోశానా జాలి, దయ అనేవి లేవు. అతడి దృష్టి కేవలం డబ్బు సంపాదన మీదనే తప్ప మరే ఇతర విషయాలమీద పడదు. కూలీలు అనుభవిస్తున్న కడగండ్లను వినే ఓపిక, తెలుసుకొనే ఆలోచన, నివారించేందుకు ప్రయత్నించే లక్షణాలు చౌదరయ్యలో మచ్చుకైనా కన్పించవు. అందుకే, సంగదాసు చౌదరయ్య మనసు మార్చు ప్రయత్నం మానుకొని అతని కొడుకుతో స్నేహం చేస్తాడు కష్టమంటే, ఆకలంటే ఏమిటో తెలియక, సుఖంగా పెరుగుతున్న రామానాయుడికి వీటి రుచిచూపి, అతనిలో హృదయ పరివర్తనానికై కృషిచేస్తుంటాడు. కూలీలు అనుభవిస్తున్న కడగండ్ల జీవితాన్ని, వారి దుస్థితిని సమగ్రంగా వివరిస్తుంటాడు.

రామానాయుడు ధనిక వర్గానికి చెందిన వాడైనప్పటికీ అతడిలో భూస్వామ్య వర్గ సంబంధమయిన అహంకారం కాని, అగ్రివర్ణానికి చెందిన వారమనే దర్పం కాని, ధనాకాంక్షకాని కన్పించవు. దానికి కారణం సామాజిక సంబంధాలను సరియైన మార్గంలో అవగాహన చేసుకోవటం. సరైన అవగాహన కల్గిన చోట ‘వర్గ మనస్తత్వం’ అనేది పనిచేయదు. పైగా, ప్రతీ సమస్యతోనూ సన్నిహిత పరిచయాన్ని కల్గివుండేందుకు ప్రయత్నం చేయబడుతుంది. అందుకే, కూలీలతో కలిసి కోతలకు వెళ్లవద్దని తనతల్లి చెప్పినప్పటికీ, రామానాయుడు అందులోని కష్టసుఖాల్ని తెలుసు

కొనేందుకై వెళతాడు. అక్కడ కూలీలతో సమానంగా శ్రమిస్తాడు ఆ శ్రమ వల్ల కల్గిన ఆకలిని గమనిస్తాడు. దీన్ని తీర్చడానికై ఆలోచిస్తుంటాడు.

సమాజంలో పంచములు తమవారిచేత ఎన్నిరకాలుగా దోచుకోబడుతున్నారో గమనించినందుననే, రామానాయుడు వారి దుస్థితికి సంగదాసుతో సమానంగా వేదన చెందుతుంటాడు. ఇట్లాంటి పరిస్థితులలో తన తండ్రి ఇతర భూస్వాములతోకలిసి కూలిని మరింత తగ్గించేందుకు చేస్తున్న ప్రయత్నాలు తెలుసుకొని మరింత బాధ చెందుతాడు. ఈ విషయాన్ని సంగదాసుకు తెల్పేందుకు ఆతురత పడుతుంటాడు. ఒక దశలో సంగదాసు కంటె ఎక్కువగా పంచముల స్థితికి వ్యథ చెందుతుంటాడు.

అసలే తమకొస్తున్న కొద్దిపాటి కూలి ఏ మూలకి సరిపోఎడం దనితే కూలీలు వాపోతుంటే, ఇదేమీ పట్టించుకోని భూస్వామ్య వర్గం ఆ కూలిని ధాన్యం నుండి డబ్బుకు మార్చాలని యత్నిస్తుంటుంది. అదైనా, అప్పటి ధరల ప్రకారం కూలి నిర్ణయించేందుకు భూస్వాములు నిరాకరిస్తారు. ఈ మార్పులనన్నింటిని గమనిస్తున్న సంగదాసు కూలీలకు వారి శ్రమను, వ్యవసాయంలో వారియొక్క కీలకమైన పాత్ర గూర్చి, వారికి భూస్వాములు చేస్తున్న మోసాన్ని గూర్చి వివరిస్తూనే, వారిలోని ప్రతి స్పందనను గమనిస్తుంటాడు. మరొక వైపు, రామానాయుడి సమక్షంలో చౌదరయ్యలో హృదయ పరివర్తనం తేవడానికి శతవిధాలా యత్నిస్తుంటాడు. వ్యవసాయంలో కూలివాడి యొక్క ప్రాముఖ్యతను వివరిస్తూ, అతడి వల్ల భూస్వామి పొందుతున్న రెట్టింపు లాభాన్ని బేరీజువేసి చూపుతాడు. అయితే, చౌదరయ్య వీటిని పట్టించుకొనే స్థితిలో ఉండడు. కాని, ఇదంతా గమనిస్తున్న రామానాయుడు ఒక వైపు సమస్యను సంపూర్ణంగా అవగాహన చేసుకొనేందుకు యత్నిస్తూనే, మరొకవైపు తండ్రిలోని హృదయ కాఠిన్యానికి బాధచెందుతుంటాడు. చౌదరయ్యకు బీదల జీవితాలపై ఎంతటి అల్పభావం, వారి ప్రాణాల ఎడల ఎంతటి నిర్లక్ష్య భావం ఉందంటే- తమ ఇంటి ముందు శోషవచ్చి పడిపోయిన ముతరాచు ముసలిదాని స్థితి జాలికొలిపేదిగా ఉంటే, దాన్ని కూటికొరకు వేసేవేషాలుగా భావిస్తాడు. ఇది రామానాయుడి మనస్సును మరింత దహించివేస్తుంది. తండ్రిలోని హృదయ కాఠిన్యం, నిర్దయ, ధనాశ, దుశ్చర్యలు ఇవన్నీ పరోక్షంగా రామానాయుడు పంచముల సమస్యవైపు దృష్టి సారించడంలో ప్రభావం వేస్తాయి.

రామానాయుడికి తండ్రిలోని పట్టుదల, అహంభావము తెలుసు. కాబట్టే వీలైనంత వరకు పంచముల కొరకై తండ్రిని ప్రత్యక్షంగా ఎదుర్కొనేందుకు

ప్రయత్నించడు. అయితే, తండ్రికి తెలియకుండా పంచముల సమస్యతో సన్నిహిత పరిచయాన్ని పెంపొందించుకొని, సంగదాసుకు అడుగడునా సలహా లిస్తుంటాడు. వీరైనంత వరకు పంచములకు సహకరించాలనే సదాశయంతో ఉంటాడు. ఇందులో భాగంగానే, పంచమ సభకు వెళ్ళుతాడు. అక్కడ తమ అగ్రవర్ణాలవారు దిగువజాతుల వారికి చేస్తున్న అపకారాన్ని ఒప్పుకొంటాడు. పంచములు అన్నివిధాల అభివృద్ధి సాధించుకొనేందుకై తోడ్పడడం తమ కర్తవ్యంగా ప్రవచిస్తాడు.

పంచమ, కార్మికుల అభివృద్ధికై దివారాత్రులు అవిశ్రాంతంగా శ్రమిస్తున్న సంగదాసును భూస్వామ్య వర్గం సహించలేకపోతుంది. ఆతని ఉనికి తమకు ప్రమాదంగా భావిస్తుంది. అందుకే అతని ప్రాణాల్ని బలిగొంటుంది

ఇతివృత్త నిర్మాణంలో సంగదాసు మొదటి భాగంలోనే మరణించడం ఒక ప్రధానమైన మలుపుగా భావించవచ్చు. భూస్వామ్యవర్గం యొక్క దౌర్జన్యాలు పతాకస్థాయికి చేరుకొన్నాయని చెప్పడానికి సంగదాసు మరణం ఒక నిదర్శనం. సంగదాసు మరణం చూపడంలో రచయిత ఔచిత్యాన్ని ప్రదర్శించినాడు. పంచమ కార్మికుల అభివృద్ధికై ఉద్యమాన్ని సంగదాసు ప్రారంభించినప్పటికీ, అది వ్యక్తి నిష్ఠమైందికాదు. సామాజిక పరమైంది. ఇక్కడ వ్యక్తిమరణం ఉద్యమానికి అవాంతరం కాకపోగా, సమాజం మరింత చైతన్యవంతమయ్యే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. ఇదే సంగదాసు విషయంలో జరిగింది. సంగదాసు మరణించినప్పటికీ అతడాశించిన ఆశయ సాధనకై సంఘం నుండి ఇతరేతరమైన అనేక వ్యక్తులు ముందుకురావడం జరిగింది.

సంగదాసు మరణంతో 'దిగువజాతుల' అభివృద్ధి బాధ్యతను రామానాయుడు స్వీకరిస్తాడు. సంగదాసు జీవించి ఉన్నంతవరకు అతని వెనుక ఉండి సహాయ పడిన రామానాయుడు, ఇతనితోపాటు కూలీలు వారంతట వారే ముందుకువస్తారు. సంగదాసు ఆకాంక్షించిన 'సంగవిజయం' సాధించాలనే తపన వీరిలో అధిక మౌతుంది. సంగదాసు మరణానికి కృంగిపోక, రామానాయుడు ద్విగుణీకృత ఉత్సాహంతో కార్యసాఫల్యానికై యత్నిస్తుంటాడు. ఇతనికి సహాయకులుగా వెంకటయ్య, నారాయణరావు పంతులు మొదలైన అగ్రవర్ణాలవారు ముందుకు వస్తారు, మరొకవైపు పంచములుకూడా సంగదాసు మరణానికి దుఃఖించడంకంటే, అతడి ఆశయాలు నెరవేర్చడమే తమ కర్తవ్యంగా భావిస్తారు (మా. ప. 190).

సంగదాసు ఉద్దేశంలో హిందూ సంఘమంతా పునర్నిర్మాణం జరిగితేనే అభివృద్ధి చెందుతుంది.

"సంఘ నిర్మాణమంటే వొక పెద్ద మేడగట్టడం మోస్తరు. ఆయానికి దగిన దూలాలూ, గోడలకు తగిన మొకరాలూ, తగినంత కలపావుండాలె. సమస్త భాగాలూ వొకదాని కొకటి పొసగేటట్లుగా అమర్చాలె. సంఘ నిర్మాణంయొక్క యేర్పాట్లన్నీ ఈ విధంగానే వుంటవి.... మహా సంఘం యొక్క క్షేమం దృష్టిలో లేకుండా జేసే ప్రయత్నాలు నేల విడిచి సాముచేసినట్లే అవుతవి... మహా సంఘ నిర్మాణం యొక్క రాస్తా గుర్తెరిగి దానికి అనుసంధానంగా చిన్న సంఘాల అభివృద్ధికి పాడుబడితే పెద్ద సంఘం యొక్క అభివృద్ధికి వొక విధంగా తోడ్పడ్డవాళ్ళమే అవుతాం"

(మా. ప. 144-145)

ఈ భావనతోనే సంగదాసు పంచమ, కార్మికుల అభివృద్ధితో హిందూ సంఘ పునర్నిర్మాణం ఆరంభిస్తాడు సంఘ నిర్మాణంలో రావలసిన మార్పులను సూచిస్తూ చేసిన తీర్మానాలు దిగువ కులాల వారికి చెందినవైనప్పటికీ, చిన్న సంఘం యొక్క అభివృద్ధి నుండి హిందూ సంఘం మొత్తం యొక్క అభివృద్ధికి మార్గమేర్పరుస్తాడు. మహాసంఘ నిర్మాణభారాన్ని రామానాయుడు మొదలైన వారిపై వేస్తాడు.

సంగదాసు మరణంతోటే కథపూర్తియైనట్లు అనిపించినా, వాస్తవంగా కథ మొదలై, అతడి ఆశయాలకు రూపకల్పన జరిగిన కాలం సంగదాసు మరణం తర్వాతనే.[21] సంగదాసు భౌతికంగా మరణించి తిరిగి తన ఉన్నతభావాల ద్వారా రామానాయుడిలో జీవిస్తాడు. సంగదాసు, రామానాయుడులు భౌతికంగా మాత్రమే వేరు వారిద్దరి ఆత్మలు మొదటి నుండీ ప్రతి విషయంలోనూ ఒకే విధంగా స్పందిస్తుంటవి (మా. ప. 123)

సంగవి మరణానికి దుఃఖిస్తూ రామానాయుడు-

"ఓ చౌదరయ్యా! సంగణ్ణి చంపినవాడివి నన్నుగూడా చంపరాదు. మా యిద్దరికీ యేమి భేదమున్నది." (మా.ప. 184)

అని అనటంలో ఇద్దరికీ గల భేదం తెలుస్తుంది. పైగా,

> "అతని సౌశీల్యం, పవిత్ర భావాలూ, ఉన్నతా దర్శాలూ కరువుగట్టి పోతబోసి మూర్తీభవింప చేసినట్లు మానస గోచరమవుతున్నవి. ఆ మూర్తి యందు మనసు విలీనమైంది. తాదాత్మ్య భావంబొందింది. రామానాయుడు రామానాయుడు కాడు" (మా ప. 184).

అని అనటంలో కూడా సంగదాసు రామనాయుడుల భావైక్యం ఎటువంటిదో తెలుస్తుంది

ఒకవ్యక్తి ఒక కార్యాన్ని సాధించాలంటే అతనికున్న ఏ బాంధవ్యమూ బంధము కాకూడదు. రామానాయుడికి ఒక వైపు భార్య, మరొకవైపు తల్లి దండ్రులు మొదటి నుండీ బంధంగా తయారవుతారు తల్లి తనను వదలి ఉండ లేనంటుంది. (మా ప 65) తను ఉద్యోగం చేయాలనీ, వేరే సంసారం పెట్టాలనీ భార్య ఉబలాటపడుతుంటుంది. (మా. ప. 208). తండ్రి నిరంతరం తనను ఖండిస్తుంటాడు. (మా. ప. 221).

సంగదాసు బ్రతికి ఉన్నంతకాలం తండ్రికి తెలియకుండా సహకారాన్నం దించిన రామానాయుడు సంగదాసు మరణానికి తన తండ్రి కారణం కావడంతో, ఆ బాధ్యతను తానే స్వీకరిస్తాడు. ఒక దశలో తండ్రిని ఖాతరు చేయని స్థితికివస్తాడు. పంచములను విజ్ఞానవంతులను చేసేందుకు వారు ఏర్పాటుచేసుకున్న సంగ మందిరానికి తన పుస్తకాలతో పాటు, తనకొచ్చే పత్రికలన్నీ పంపిస్తుంటాడు. చుట్టు పక్కల ఉన్న అన్ని గ్రామాల్లోనూ 'ధర్మపరన' మందిరాలను ఏర్పాటు చేయిస్తుంటాడు. ఇందుకొరకై ఉపన్యాసాలిస్తూ ధనాన్నీ, పుస్తకాలనూ సేకరి స్తుంటాడు (మా.ప. 217) తండ్రి ఎన్నిమాటలన్నప్పటికీ లెక్కచేయడు. చివరికి ఉద్యోగాన్ని కూడా నిరాకరిస్తాడు (మా. ప. 221).

రామానాయుడు విధి విరామం లేకుండా కృషిచేస్తున్న సమయంలో, అతడి భార్య కమల మోహనరావుతో లేచిపోతుంది. లక్ష్యసాధనలో లగ్నమనస్కుడైన రామానాయుడికి భార్య లేచిపోవడం చాలా అల్పక్రియగా తోస్తుంది. భార్య విష యమై తనతో 'తరచవద్ద'ంటాడు. తర్వాత కొద్ది రోజులకే తన ఒక్కడైన కొడుకు, పిదప తల్లిదండ్రులు మరణిస్తారు. అయినా రామానాయుడు చలించడు.

రామానాయుడు ఇలా స్థిర మనస్సుతో ఉండడానికి కారణం బుచ్చయ్యగారి శిష్యరికం. నవలారంభంలో బుచ్చయ్యగారు కల్గించిన నిష్కామ కర్మభావం రామానాయుడు పంచమ, కార్మికుల అభివృద్ధికై తపిస్తూ, స్థిర సంకల్పంతో కృషి చేయడంలో విశేష ప్రభావం వేసిందని భావించవచ్చు.

రామానాయుడికి భార్య లేచిపోవడం అతడి జీవితంలో జరిగిన అత్యంత విషాదకర సంఘటన. అయితే, ఇక్కడ రామానాయుడి భార్య కమల వరుసకు మరిదయైన మోహనరావుతో లేచిపోవడం, వీరికి సంబంధించిన కథ వాస్తవానికి ప్రధానేతివృత్తంతో అంతగా సంబంధం లేనిదైనప్పటికీ, నాటి సమాజంలోని ఒక లక్షణాన్ని రచయిత ఈ కథ ద్వారా సూచించినాడు. ఆంగ్లేయ సంస్కృతి ప్రభావంవల్ల కల్గిన స్నేహాన్ని ప్రేమగా భావించుకొని స్వేచ్ఛగా విహరిస్తూ, అనూచానంగా వస్తున్న వివాహవ్యవస్థను దెబ్బతీసేట్టుగా యువతీ యువకులు వ్యవహరిస్తున్నారని, ఇది అరిష్టదాయకమని దీనివల్ల కలిగే దుష్ఫలితాల్ని సూచించేందుకు ఈ కథ కల్పించబడ్డది. అంతేకాదు, అగ్రవర్ణాలలోని వికృతుల్ని కూడా రచయిత ఈ కథ ద్వారా సూచించడం గమనించాల్సిన అంశం.

మరొకవైపు, వివాహవ్యవస్థతో సంబంధం త్రెంచుకొన్న 'అమలిన శృంగార' మనే ఒక క్రొత్త భావన కూడా సమాజంలో ప్రబలజొచ్చింది ఇది వివాహవ్యవస్థను దెబ్బతీసేదికానప్పటికీ, వివాహాన్ని కాదనుకొన్న భావన. ఈ భావన కూడా సమాజ గమనాన్ని అడ్డుకొంటుందని, ఇది ఆచరణయోగ్యం కానిదనే భావనతో రచయిత మరొకవైపు జోతీ అప్పాదాసుల కథను ప్రవేశపెట్టినాడు. ఈ రెండు కథల ద్వారా పెడదారిబట్టిన అగ్రవర్ణాల వారి అల్పబుద్ధులను ఒకవైపు, నిమ్నకులాలకు చెందినప్పటికీ పవిత్రమైన మనస్సును కల్గివుండడాన్ని మరొకవైపు సూచించడం గమనించాలి.

పై ఉపకథలతో పాటు, సమకాలీనంగా సాగుతున్న తీవ్రవాద మార్గాలను వివరించేందుకు వెంకటదాసు పాత్ర కల్పించబడ్డది. సాత్విక మార్గంలో సంఘాభివృద్ధికి పాటుపడుతున్న తన తమ్ముడు భూస్వాముల దౌర్జన్యానికి గురికావడంతో, వెంకటదాసు ఈ మార్గాన్ని కాదని, ఇంతకంటే భిన్నమైన మార్గంలో తిరుగుబాటు ద్వారా సంఘాభివృద్ధికి ప్రయత్నిస్తాడు.

ఇక్కడ ఒక్క విషయం గమనించాలి. ఏ ఉద్యమమైనా వ్యక్తినాశ్రయించుకొని కొనసాగుతున్నప్పటికీ, అది అతని మరణంతో ఆగిపోదని సంగదాసు మరణం సూచిస్తున్నది. అట్లా ప్రారంభింపబడిన ఆ ఉద్యమం వెంటనే సార్వకాలీన ఫలితాన్ని ఇవ్వడమంటూ జరుగదు. ఆ ఉద్యమాన్ని అర్థంచేసుకొని సంపూర్ణమైన ఫలితం వచ్చేంతవరకు సన్మార్గంలో యత్నిస్తూ పోవడమే దాన్ని అనుసరించేవారి కర్తవ్యం. ఫలితానికై వెంటనే ఎదురు చూడకూడదు. ఇది ఉద్యమం యొక్క తీరు తెన్నులు. కాగా, ఈ ఉద్యమాన్ని సరిగా అర్థంచేసుకోని వెంకటదాసు భూస్వాముల దౌర్జన్యానికి తన తమ్ముడు బలికాగానే, విప్లవ మార్గంలో హింసా దౌర్జన్యాలతో సమస్యల సాధనకై తిరుగుబాటు లేవదీస్తాడు. ఇదే త్వరితగతిని ఫలితం సాధించే మార్గమని భావిస్తాడు.

వెంకటదాసు ఉద్యమం యొక్క స్వరూప స్వభావాల్ని అర్థం చేసుకోనందువల్లనే మరొక మార్గాన్ని అనుసరించినాడు. ఈ మార్గం తాత్కాలికంగా కొన్ని ఫలితాల్ని ఇవ్వగలదే. కాని, శాశ్వత పరిష్కారాన్ని చూపేదికాదు. అందుకే రచయిత వెంకటదాసు మార్గాన్ని కాదనటం జరిగింది. చివరికి వెంకటదాసు కూడా తను సాగించిన విప్లవ మార్గం సరియైంది కాదని తెలుసుకొంటాడు. తన అనుచరులతో అహింసా మార్గంలో స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొని, సమస్యలన్నీ సాధించుకోమని ఉద్బోధిస్తాడు. ఇక్కడ వెంకటదాసు పాత్ర తీర్చిదిద్దబడడంలో— ఆంగ్లేయులతో పోరాటం సాగించిన సంతానుల ఉద్యమ ప్రభావం ఒకవైపు, రష్యాలో వచ్చిన బోల్షివిక్ విప్లవ ప్రభావం మరొకవైపు కన్పిస్తాయి. ఈ పాత్ర వల్ల ఇతివృత్త నిర్మాణంలో అంతగా ఇమడనప్పటికీ, సమకాలీన సమాజంలోని అన్ని ధోరణుల్ని ఏకముఖంగా వివరించడమే రచయిత ఆకాంక్ష.

సంగదాసు మరణం రామానాయుడిని, వెంకటదాసులను ప్రభావితం చేసినట్లుగానే, కూలీలను, అప్పాదాసు మొదలైన పలువురిని ప్రభావితం చేస్తుంది. కాగా, రామానాయుడిలోని 'త్యాగబుద్ధి, ధర్మదీక్ష, ధర్మచింత' అగ్రవర్ణానికి చెందిన వెంకటయ్య, నారాయణరావు పంతులు మొదలైన వారిని జాగృత పరుస్తుంది. వీరంతా సంగదాసు ఆశయాల సాఫల్యానికై కృషి చేస్తుంటారు. ఒకవంక సంఘాభివృద్ధికై ప్రయత్నాలు కొనసాగుతుండగనే, వేరొకవంక భారతీయులు ఆంగ్లేయులతో శాంతియుత పోరాటం సాగించి భరతమాత దాస్యశృంఖలాలను ఛేదిస్తారు. ఫలితంగా స్వాతంత్ర్యం లభిస్తుంది.

నవలారంభంలో చెప్పబడ్డ 'డబ్బు, మనిషి చట్టము' స్వాతంత్ర్యానంతరము సాధింపబడ్డట్లు నవలాంతాన రచయిత చూపినాడు. రామానాయుడు, వెంకటయ్యలు తమ ఆస్తిపాస్తులను కార్మిక, పంచమోద్యమాల అభివృద్ధికై సమాజపరం చేస్తారు వీరితోపాటు పంతులు, మోహనరావులు కూడా తమ యావదాస్తిని 'కార్మిక కళాశాల' కర్పిస్తారు. వెంకటదాసు తను ఆర్జించిన ధనంలో పది లక్షలు 'విజయకళాశాల'కు కార్మికోద్యమానికి సమానంగా ధర్మం చేస్తాడు. అగ్రవర్ణానికి చెందిన కోటమ్మ ఆధ్యాత్మిక జీవనం గడిపే వారి కొరకై తన యావదాస్తిని ధారావత్తం చేస్తుంది పంచమ, కార్మికుల శాశ్వతాభివృద్ధికై స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కట్టు దిట్టంగా చట్టాలు రూపొందించబడతాయి. ఈ చట్టాలు సంగదాసు బెజవాడలోచేసిన తీర్మానాలను దృష్టిలో ఉంచుకొని రూపొందించబడటం గమనించాలి ఇట్లా పంచమ, కార్మికోద్యమాలు విజయం సాధిస్తాయి.22

ఇది రచయిత ఆకాంక్షించిన రెండు లక్ష్యాలలో ఒకటి. మానవుడు కేవలం భౌతిక రంగాలలో అభివృద్ధి సాధించడంతోనే ఆగిపోరాదనీ, వ్యక్తియొక్క జీవిత పరమార్థం ఇంతమాత్రమే కాదని ఉన్నవ భావన.

మానవుడు భౌతిక రంగాలలో విజయం సాధిస్తూనే, వైయక్తిక జీవితానికి ఆధ్యాత్మిక భావనతో పరిపూర్ణత చేకూర్చుకోవాలి. ఇది వ్యక్తియొక్క నైతిక, ధార్మిక, నైష్ఠిక జీవితాలపై ఆధారపడి ఉన్నది. ఇందుకు రామదాసు జీవితం ఒక ఉదాహరణ.

నవలలో ప్రధానంగా కన్పిస్తూ, ఆది నుండి అంతం వరకు విస్తృతంగా చోటు చేసుకొన్న పాత్ర రామదాసుది. రామదాసు 'గురువు వల్ల కారణం బొంది నప్పటి నుంచీ ఐహిక విషయముల యెడ కొంత విముఖత' కల్గి ఉన్నప్పటికీ, సంగదాసు మరణంవల్ల ప్రభావితుడౌతాడు. సంఘ సేవకు ఉపక్రమించి పిల్లలకు ఉచితంగా విద్య నేర్పుతుంటాడు. (మా ప. 2.2) సంగదాసు, రామానాయుడులు చేపట్టిన పంచమ, కార్మికోద్యమాలతో ప్రత్యక్షంగా సంబంధం కల్గి ఉన్నట్లుగా కన్పించనప్పటికీ, రామదాసు జీవితం నిరంతరం తోటివారిని సంస్కరించేందుకు ఉపయోగ పడుతుంటుంది.

నవలారంభంలో చేనును ఆశ్రయించుకొన్నట్లుగా కన్పించిన రామదాసు క్రమంగా కుటుంబానికీ, వర్గానికీ, సమాజానికీ ఎదుగుతూ చివరికి ఆత్మోద్ధరణ

సాధించుకొన్న విధానాన్ని రచయిత క్రమోదాత్తంగా చిత్రీకరించినాడు. ప్రియ పుత్రుడు సంగదాసు మరణం మొదలుకొని రామదాసు జీవితం పలుమలుపులకు గురియౌతుంది. పరమసౌమ్యుడు, శాంత చిత్తుడు అయిన ఈతడు నైతిక జీవితానికి ప్రాధాన్యమిస్తూ, ఎదురైన సంఘటనల్ని కర్మఫలంగా భావించుకొంటూ నైష్ఠిక రతో జీవయాత్ర సాగిస్తుంటాడు. అనుభవాల్ని, దారిద్ర్యాన్ని మోక్షమార్గంగా ఊహించుకొంటూ బ్రతుకుబాటలో పయనిస్తుంటాడు. తనకొచ్చి పడుతున్న ఆప దలనన్నింటిని మహాప్రసాదంగా స్వీకరిస్తుంటాడు. చివరికి తనలోని పూర్ణ మాన వత్వంతో ఆదర్శమూర్తియై వెలుగొందుతూ ఆత్మోద్ధరణ సాధించుకొంటాడు. 23 ఒక విధంగా చెప్పాలంటే-

> "రామదాసు పూర్ణ మానవుడు. భగవంతునకు తనకు మధ్య ఒక మహా వారధి నిర్మించుకొన్నవాడు. నైతిక, అధ్యాత్మిక పునాదుల మీద జీవితాన్ని నిర్మించుకొని, తను పొందిన సర్వానుభూతులను ఏకసూత్రముఖంగా మలచుకొని కడకు మహర్షియైన ఆదర్శ మాన వుడు రామదాసు."24

ఆత్మోద్ధరణ సాధించుకొన్న మహనీయులలో అన్ని కులాలవారు ముఖ్యంగా నిమ్న జాతులవారు కన్పిస్తున్నారు. ఆళ్వారుల ద్వారా ఈ విషయం సుస్పష్టం. ఈ విషయాన్నే రచయిత నవలాంతాన ఉట్టంకించినాడు. అంతేకాదు, అనహం కారులైన కడ జాతివారిని ఆదర్శంగా తీసుకొని అగ్రవర్ణాల వారు మోక్షానికి అర్హతపొందాలని, ఇది ఉభయులకు లాభదాయకమని ఉద్బోధిస్తూ రచయిత నవ లను ముగించినాడు.

ఈ విధంగా రచయిత 'మాలపల్లి'లో ప్రధాన ఇతివృత్తంగా భౌతిక, ఆధ్యాత్మిక జీవితాలకు ప్రాధాన్యాన్నిస్తూ, ఈ రెండూ ఇతివృత్త నిర్మాణంలో ఏక కాలికంగా పెనవేసుకొని పోయేటట్లు తీర్చిదిద్దినాడు. చివరికి ఈ రెండూ విజయ వంతమైనట్లు చూపినాడు. ఇట్లా సాగిన ఇతివృత్త నిర్మాణంలో ఇతరేతరమైన అంశాలెన్నో ప్రసక్తాను ప్రసక్తంగా చర్చింపబడ్డాయి. ఇవన్నీ సమకాలీన సమా జంలోని పలుసమస్యల్ని ప్రతిబింబిస్తుంటాయి.

## కథానాయకత్వం :

మాలపల్లిలో కథానాయకుడెవరు అనేది ఒక ప్రధాన సమస్య. కథ గమనంలో సంగదాసు, రామదాసు, వెంకటదాసు, రామానాయుడులు ప్రధాన పాత్ర వహిస్తున్నారు. కాగా, విమర్శక లోకంలో ప్రధానంగా సంగదాసు, రామదాసులు చర్చకు నిలుస్తున్నారు. వీరిద్దరిలోనూ, సంగదాసుకు నాయకత్వాన్ని కొందరు విమర్శకులు పేర్కొంటుండగా, మరికొందరు రామదాసును ప్రధాన పాత్రగా భావిస్తున్నారు ఇదిలా ఉండగా, మరికొందరు విమర్శకులు మాలపల్లిలో నాయకత్వం విషయమై కొన్ని అనౌచిత్యపు విమర్శలు చేయడం కూడా జర్గింది.

శ్రీనివాస శిరోమణిగారు మాలపల్లి మీద 1945లో భారతిలో ఒక సుదీర్ఘమైన వ్యాసం ప్రచురించినారు. ఆ వ్యాసంలో నాయికత్వం విషయమై చర్చిస్తూ—

> ''మాలపల్లి నవలలో నాయకుడు సంగదాసు అని అనుకోమని పంతులుగారు అంటారు. ఆ నాయకుడు మొదటి సంపుటములోనే ఖూనీ అయిపోయినాడు.
>
> మాలపల్లి నవల దారితప్పడము అయింది. సంగదాసు కాకుండా సంగదాసు తండ్రి మొదటిసంపుటములో హతుడయిపోయిఉన్నట్లైతే నవల చివరకు అటు ఖేదాంతమో, ఇటు మోదాంతమో అయితీరేది.25

అని పేర్కొన్నారు.

ఇక్కడ శిరోమణిగారు నాయకత్వం విషయంలో తమ అభిప్రాయం తెల్పలేదు సరికదా, సంగదాసుకు బదులు రామదాసు చనిపోతే బాగుండునని పేర్కొనడం, నవలను 'అయోమయాంతం'గా పేర్కొనడం గమనింపతగిన అంశాలు.

రచయిత సంగదాసుకు నాయకత్వం చెప్పినాడని అంటూనే, అతని మరణాన్ని నాయకత్వం చెప్పడంలో ఒక అవరోధంగా శిరోమణిగారు భావించినట్లు కన్పిస్తున్నది. అయితే, ఉన్నవ దృష్టిలో సంగదాసు మరణం అతనికి నాయకత్వం చెప్పడంలో అవరోధం కానేకాదు. ఎందుకంటే, నాయకుడైన సంగదాసు మహాసంఘ పునర్నిర్మాణాన్ని ఆకాంక్షించినవాడు. ఈ పునర్నిర్మాణం

వైయక్తికమైన సమస్యకాదు. సామాజికమైంది. అది కొనసాగబడుతూనే ఉంటుంది. అందుకే, సంగదాసు మరణించినప్పటికీ అతడు ప్రారంభించిన కృషి ఆగిపోలేదు. పైగా, ఆ ఒక్కని మరణం స్తబ్ధంగా ఉన్న వ్యక్తులెందరినో జాగృత పరచింది. జాగృతులైన వీరు సంగదాసు ఆశయాలకు రూప కల్పన చేయడమే తమ జీవిత పరమార్థంగా భావించి మరింత చురుకుగా వ్యవహరిస్తారు. ఇది కథ నిర్మాణంలో మనం స్పష్టంగా దర్శించవచ్చు.

ఇదిలా ఉండగా, మాలపల్లి కంటె పూర్వం తెలుగు సాహిత్యంలో నాయకుడు కథారంభంలో మరణించడం, తర్వాతి కథ అతని నాయకత్వాన్ని అంగీకరిస్తూ, ఉదాశయ సాధన దిశలో సాగడం ఈ వరకు చూపబడలేదు. 'మాలపల్లి' మొదటిసారిగా దీన్ని ప్రదర్శించింది. సంగదాసు మరణించినా, అతను చనిపోతూ 'మనమే గెలుస్తాం' అన్నమాట యథార్థమై 'సంగవిజయం' సాధింపబడుతుంది. అందువల్ల శిరోమణిగారన్నట్లుగా సంగదాసు మరణం అతనికి నాయకత్వం చెప్పడంలో ఆటంకంగా భావించాల్సిన అవసరంలేదు.

ఒకవైపు సంగదాసుకు నాయకత్వం చెప్పడంలో అతని మరణాన్ని ఒక అవరోధంగా భావించిన శిరోమణిగారు, సంగదాసు కంటె అతని తండ్రి చనిపోయినట్లయితే బాగుండేదని, కాని చివరికి 'ముసలిముతక' పాత్రలు మిగిలి మాలపల్లి 'అయోమయాంతము' అయిపోయిందని పేర్కొన్నారు.

ఇక్కడ రచయిత ఉద్దేశాన్ని శిరోమణిగారు పట్టుకొనలేక పోయినారు. సంగదాసు ప్రారంభించిన ఉద్యమం సామాజికమైంది. సామాజికమైన ఉద్యమం వ్యక్తిని ఆశ్రయించి ముందుకు సాగదు. ఉద్యమ నాయకులు మరణించినప్పటికీ ఆ ఉద్యమం అనుస్యూతిని పొందుతూనే ఉంటుంది. అందుకే రచయిత సంగదాసు మరణాన్ని చూపినాడు. సంగదాసు జీవితం క్రియాప్రాధాన్యంతో, విస్తృతమైన ప్రాతిపదికపై, భిన్న భిన్న ప్రకృతులు గల వ్యక్తుల నాశ్రయించుకొని, సమాజాభ్యుదయాన్ని ప్రాతిపదిక చేసుకొని కొనసాగింది. కాగా, రామదాసు జీవితం వ్యక్తి ప్రాధాన్యంతో ఆధ్యాత్మిక భావననాధారం చేసుకొని ధర్మం, నైతిక జీవనం ప్రాతిపదిక చేసుకొని సాగింది. అంతేకాదు, క్రియా ప్రాధాన్యమున్నచోట వ్యక్తికి ప్రాధాన్యముండదు. ఇక్కడ క్రియ బహుజనుల నాశ్రయించుకొని ఉంటుంది. అందువల్ల సంగదాసు మరణించినాడు. అయితే, ఆధ్యాత్మికతా

సాధనలో వ్యక్తికే అత్యంత ప్రాధాన్యత ఉంటుంది, కాబట్టి రామదాసు చివరి వరకూ జీవించినాడు.

సంగదాసు మరణం ద్వారా ఉద్యమ లక్షణాన్ని స్ఫురింప చేసిన రచయిత రామదాసును బ్రతికించి అతని ద్వారా వైయక్తికమైన ఆధ్యాత్మిక భావాన్ని ప్రజ్వలింపచేసినాడు. అంటే, సామాజిక ఉద్యమం అనేక మందిని ఆశ్రయించుకొని ఉంటే, ఆధ్యాత్మికత ఒకేవ్యక్తి నాశ్రయించుకొని ఉంటుందని తాత్పర్యం. రచయిత ఆంతర్యం ఇలా ఉంటే, శిరోమణిగారు చేసిన విమర్శ వారి అలవోకతనాన్ని తెలుపుతున్నది. మాలపల్లిలోనే ఉన్నవ ఒకచోట ఇలాతెల్పినాడు.

> "ధర్మ విజయమెప్పుడూ బలిగోరుతుంటుంది ధర్మ నిర్వాహణకై సోక్రటీసు విషం గ్రహించాడు. క్రీస్తువు శిలువనెక్కాడు. ప్రహ్లాదుడు సమస్తకష్టాలు పడ్డాడు. హరిశ్చంద్రుడు సర్వత్యాగం చేశాడు. అమరుడు శిరచ్ఛేదం బొందాడు. రామానుజ శిష్యుడు అంధుడైనాడు. సారంగధరుడు కరచరణచ్ఛేదమును బొందాడు. కన్యక అగ్ని ప్రవేశమయింది హేమలత ఆత్మహత్య గావించుకొన్నది, తిలక్ మహాశయుడు నిరంతర కారాగార బద్ధుడయినాడు. పశుపక్షిలేనిదే యజ్ఞంలేదు... మహానుభావులు పడిన బాధలు వారికపజయములు గావు. వారు పూనిన ధర్మానికి బలియై ధర్మస్థాపనకు మార్గమేర్పరచినారు" (మా. ప. 127–28)

అంటే, సామాజిక విజయానికి వ్యక్తుల ఆత్మత్యాగం అవసరమని తెలుపుతున్నది. రచయిత కూడా పలుచోట్ల సంగదాసుతో ఈ భావాన్నే వ్యక్తం చేయించడం జరిగింది కూడా (మా.ప. 125–26–27&159–60). మాలపల్లి నవలాంతము శిరోమణిగారు పేర్కొన్నట్లు ఏదీకాకుండా, అయోమయాంతము అయిపోలేదు. చివరికి మోక్షాంతమే అయింది. సంగదాసు ఆశయాలు ఫలించి[26] 'సంగ విజయం' సాధింపబడడం భౌతిక విజయం. ఇది మోక్షాంతమే కదా! రామదాసు క్రమంగాఎదుగుతూ చివరికి మోక్షాన్ని పొందడం, ఆమోక్షాంతానికి పరిపూర్ణత చేకూర్చిందని భావింపవచ్చు.

శిరోమణిగారి విమర్శ ఇలా ఉండగా, డా. బి. వి. కుటుంబరావుగారు తమ సిద్ధాంత గ్రంథంలో మాలపల్లిలోని నాయకత్వాన్ని ఇలా విమర్శించినారు.

"నాగరిక ప్రపంచము గొడ్డు పోయినట్లుగ నిందు చిత్రింపబడినది జానపద జగత్తు ధన విద్యా కుల సంపదలతో దులదూగు వారెందరో యుండగా నిందువర్ణింపబడిన ప్రధాన పాత్రలు సంఘ జఘన్య వర్గమువి." 27

ఈ ఏకమైన ఆలోచన కథా నాయకత్వంలో వ్యక్తిని గూర్చిన సంకుచిత భావాన్నే తెలియజేస్తున్నది

మాలపల్లిపై అనేక వ్యాసాలు ప్రముఖంగా వెలువడినప్పటికీ, 'మాలపల్లిలో నాయకుడు' అనే విషయం ప్రధానంగా చర్చింపబడలేదు. ఒకరిద్దరు మాత్రమే ఈ విషయమై ప్రస్తావించినట్లు కన్పిస్తున్నది. వాటిల్లో కూడా తేదాలు కన్పిస్తున్నాయి.

మూర్తిశ్రీగారు ఈ విషయమై చర్చిస్తూ-

"మాలపల్లి నవలకు నాయకుడుగా గణింపదగినవాడు సంగదాసు. గ్రంథము నాలుగవవంతు గడుచుసరికే ప్రతిపక్షియైన చౌదరయ్య యొక్క దౌర్జన్యమునకు బలియైపోయెను అయినప్పటికిని, మిగిలిన గ్రంథమంతయు సంగదాసు యొక్క యాశయములకు రూపము దిద్దుటకే ముందునకు సాగును. 28"

అని పేర్కొన్నారు. ఇక్కడ సంగదాసుకు ప్రాధాన్యమీయబడగా, ఆర్. ఎస్. సుదర్శనంగారు-

"మాలపల్లి నవలలో రామదాసు అనే మాలదాసరి కథానాయకుడు" అని పేర్కొంటూనే-

"....హరిజనులైన రామదాసూ, సంగదాసూ కర్తవ్యోపదేష్టలుగా, నాయకులుగా, క్షమామూర్తులుగా నవలలో ప్రధాన పాత్ర వహిస్తారు."29

అని పేర్కొనడం గమనించాలి. మొదట రామదాసుకే నాయకత్వం చెప్పిన సుదర్శనంగారు వెను వెంటనే సంగదాసుకు కూడా నాయకత్వం చెప్పడంలో నవలలో సంగదాసు యొక్క ప్రభావాన్ని, పాత్రయొక్క ప్రాధాన్యాన్ని గుర్తించినారని చెప్పవచ్చు. అంటే, ఒక విధంగా మాలపల్లిలో నాయకులు ఇద్దరని చెప్పక

చెప్పినట్లే. వాస్తవానికి మాలపల్లి యొక్క ఇతివృత్త నిర్మాణం కూడా సంగదాసు, రామదాసు లిద్దరికీ ప్రాధాన్యమిస్తూ చేయబడ్డది అయితే, ఒక రచనలో ఇద్దరు నాయకులు కావడానికి అస్కారముందా? ఇది ఒక ప్రశ్న. ఈ విషయంలో ఉన్నవ అభిమాన కవియైన తిక్కన 'నిర్వచనోత్తర రామాయణాన్ని' ఇక్కడ పేర్కొనవచ్చు

నిర్వచనోత్తర రామాయణం మొత్తం పది అశ్వాసాల రచన, ఇందులో మొదటి ఏడాశ్వాసాలు కేవల రావణమనోవాక్కాయ కర్మలను ప్రస్తావిస్తూ చేయబడ్డవి. చివరి మూడాశ్వాసాలలో శ్రీరాముని వృత్తాంతం వివరింపబడ్డది. ఈ విషయమై డా॥ కేతవరపు రామకోటిశాస్త్రిగారు తమ సిద్ధాంత గ్రంథంలో వివరణాత్మకంగా విశ్లేషిస్తూ-

> "నిర్వచనోత్తర రామాయణమునందలి మొదటి యేడాశ్వాసముల కథకు నాయకుడు రావణుడు. చివరి మూడాశ్వాసముల కథకు నాయకుడు శ్రీరాముడు. రావణ నాయకమైన కథ కొంత, రామ నాయకమైన కథకొంత నిర్వచనోత్తర రామాయణమున నున్నట్లు, ఇరువురు నాయకుల నాశ్రయించుకొని"30

నిర్వచనోత్తర రామాయణము రచింపబడినట్లు వీరు పేర్కొన్నారు. ఇక్కడ మొదటి ఏడాశ్వాసాలలో వరుసగా రావణుని కథ, చివరి మూడాశ్వాసాలలో రామకథ వర్ణింపబడింది. కాని, మాలపల్లిలో ఇట్లాకాదు. మాలపల్లిలో మొదటి భాగమంతా సంగదాసుకు ప్రాధాన్యమిస్తూనే, మరొకవైపు బీజప్రాయంగా రామదాసులోని ఆధ్యాత్మిక లక్షణం సూచింపబడింది. సంగదాసు మరణం తర్వాత అతడి ఆశయాల సాధనకై ప్రయత్నాలు కొనసాగింపబడుతుండగా, రామదాసు ఆధ్యాత్మిక జీవితం ప్రధానంగా చిత్రింపబడుతుంటుంది మొత్తంమీద ఇతివృత్త నిర్మాణాన్ని దృష్టిలో పెట్టుకొని చూసినట్లైతే ఒక రచనలో అనేక నాయకత్వానికి అస్కారమున్నదని తెలుతున్నది.

ఈ దృష్టితో పరిశీలిస్తూపోయినట్లైతే, మాలపల్లిలో నాయకులు సంగదాసు, రామదాసులు మాత్రమేనా? లేక రామానాయుడు వెంకటదాసులను కలుపుకొని నలుగురిని పేర్కొనాల్సి వస్తుందా? అనే ప్రశ్న ఉత్పన్నమవుతున్నది.

విమర్శకు లోకంలో సంగదాసు, రామదాసులిద్దరూ ప్రాధాన్యాన్ని వహిస్తున్నప్పటికీ ఇతివృత్తంలో రమానాయుడు, వెంకటదాసులు కూడా ప్రముఖంగా కన్పిస్తున్నారు. కాని, ఈ ఇరువురి పాత్ర చిత్రణా విధానాన్ని గమనించినట్లైతే వీరు సంగదాసు ఆశయ సాఫల్యానికి ప్రయత్నించినట్లు కన్పిస్తారే తప్ప, ప్రత్యేక వ్యక్తిత్వాన్ని సంతరించుకున్నట్లుగా కన్పించరు. రామానాయుడు సంగదాసు మార్గాన్ని అనుసరించగా, వెంకటదాసు భిన్న మార్గాన్ని అనుసరిస్తాడు. ఇక్కడ వెంకటదాసు నాడు సమాజంలో వ్యాపించిన తిరుగుబాటును, దాని వైఫల్యాన్ని చూపడానికి మాత్రమే చిత్రించబడినాడు. చివరికి వెంకటదాసు కూడా తనది మార్గం కాదని, హింసా ప్రవృత్తిని వీడి సన్మార్గంలో జీవించమని తన అనుచరులకు ఉద్బోధించడం ఇక్కడ పేర్కొనవచ్చు (మా. ప 525-26)

నాయకత్వ నిర్ధారణలో డా॥ అనుమాండ్ల భూమయ్యగారు తెల్పినట్లుగా-

> "ఒక కథా, నవలా, కావ్య నాయకత్వం ఎవరిదనేది దానిలో ఉద్దిష్టమైన ప్రధాన ప్రయోజనాన్ని బట్టి నిర్ణయించడం ఉచితమైన వ్యవహారం. ఆ ప్రయోజనాభి ముఖంగా కథ సాగడంలో ఆశ్రయమైన వ్యక్తికి నాయకత్వం లభిస్తుంది"[31]

మాలపల్లిలో కథ సాగడానికి ప్రధానమైన వ్యక్తులు ఇద్దరు. వారు సంగదాసు, రామదాసులు. అందువల్ల వీరిద్దరికే నాయకత్వం చెందుతుంది. ఇక్కడ గమనించవలసిన మరో అంశం రచయిత మాలపల్లికి రెండు పేర్లు పెట్టడం. ఇలా రెండు పేర్లు పెట్టడం మాలపల్లి రచనాకాలం నాటికి విరివిగా కన్పిస్తున్నప్పటికీ, మాలపల్లికి మరో పేరుగా 'సంగవిజయం' నిర్ధారించడంలో ఎంతో వైశిష్ట్యం కన్పిస్తున్నది. సంగదాసు, రామదాసులిద్దరికీ గల ప్రాధాన్యం ఈ రెండో పేరులో సూచించడం జరిగింది.

మాలపల్లికి 'పరిచయం' వ్రాస్తూ ఉన్నవ-

> "ఈ పుస్తకానికి మొదట మాలపల్లని పేరు బెట్టదలచుకొని వ్రాయడం ప్రారంభించాను. కొంతదూరం పోయిన తరువాత సంగవిజయమని పిలవడం మేలని తోచింది"[32]

అన్నారు. ఇక్కడ 'సంగవిజయం' అనడంలో డా॥ సంపత్కుమారగారు పేర్కొన్నట్లుగా- అనేకార్థాలు స్ఫురిస్తున్నాయి. అవి. ఒకటి, సంగదాసు ఆశయాల

కనుగుణంగా కథా నిర్మాణంసాగి, చివరికి విజయం సాధింపబడటం, రెండోది, సంగమనే పదం 'సంఘ' పదానికి తద్భవరూపం. ఈ తద్భవ శబ్దం ద్వారా వ్యక్తినుండి సమాజం యావత్తూ చైతన్యవంతమై విజయం సాధిస్తుందనే సూచన గావింపబడటం. కాగా, మూడోది- తద్భవంకాని సంఘ శబ్దానికి సంబంధమని కూడా అర్థం. ఒక వ్యక్తి భౌతికమైన ప్రాపంచిక సంబంధాలన్నింటిని నిష్కామ కర్మాచరణం ద్వారా తొలగించుకొంటూ, భవబంధాలనుండి విముక్తుడై వైయక్తికంగా విజయం సాధించడమనే విశిష్టార్థం కూడా ఈ పేరులో ఉంది[33] అంటే నవలను పలు అంతరువుల్లో గమనింపవలసిన అవసరాన్ని 'సంగ విజయం' అనే పేరు సూచిస్తున్నదన్నమాట రచయిత దృష్టిలో 'కొంత దూరం పోయిన తరువాత' అంటే సంగదాసు మరణం తర్వాతనే అర్థం చెప్పుకోవాలి రామ్మోహన రాయ్‌గారన్నట్లుగా-

> "ముందు వ్రాయదలచుకొన్న మాలపల్లి నవల పోను పోను ధర్మం జయించి మంచి మనిషికి ముక్తి మార్గం చూపించిన 'సంగవిజయ' మని పిలవాలనిపించింది వారికే"[34].

నవలకు రెండు పేర్లు పెట్టడాన్ని బట్టి రచయిత ఆంతర్యాన్నిట్లా చెప్పుకోవచ్చు. మానవుడు భౌతిక జీవితంలో విజయం సాధించడంతోనే తృప్తిపడి దీనినే జీవితంగా భావించరాదు. చివరికి మోక్షాన్ని ఆపేక్షించి, తత్సాధనలో కూడా విజయం సాధించి ముక్తిని పొందాలి. ఇదే జీవిత పరమార్థం ఈ రెండు పేర్లలా గమనింపవలసిన అవసరాన్ని ప్రధానీకరించేందుకే ఉన్నవ 'మాలపల్లి'ని సంగ విజయ'మని సంబోధించినాడు.

మాలపల్లి ఇతివృత్త నిర్మాణాన్ని బట్టి, మాలపల్లికి మరో పేరుగా 'సంగ విజయం' నిర్ధారించడంలో రచయిత ఆంతర్యాన్ని బట్టి, మాలపల్లిలో నాయకులిద్దరని పేర్కొనవచ్చు. వారు సంగదాసు, రామదాసులు.

## అనుకథలు :

ప్రపంచం అనేక వికారాల మనఃప్రవృత్తులకు నిలయం. ఈ మనోలక్షణాల్ని తెల్పేందుకు రచయిత ఈ నవ ఇతిహాసంలో పలు పాత్రలతో ప్రత్యేక కథల్ని ప్రవేశ పెడతాడు. ఇవి ప్రధాన కథ ననుసరిస్తూనే ప్రత్యేక వ్యక్తిత్వం కలవిగా రచింప బడతాయి 35.

'మాలపల్లి'లో అనుకథల ప్రాధాన్యాన్ని పొందినవి (1) కమలా మోహన రావుల కథ, (2) జోతీ అప్పాదాసుల కథ, (3) వెంకటదాసు కథ. ప్రత్యేక పద్ధతిలో సాగిన ఈ ఉపకథలను గమనించినట్లైతే, అవి సమకాలీన సమస్యలను ప్రతిబింబించిన విధానాన్ని, రచయిత వాటికి చూపిన పరిష్కారాన్ని గమనింప వచ్చు.

## కమలామోహనులు :

ప్రతీ సమాజము కొన్ని సాంఘిక నియమాలకు, కట్టుబాట్లకు లోబడి ఉంటుంది. ఆ నియమాలకు కట్టుబడి, వీటిని ఉల్లంఘించనంత వరకు సమాజం సుస్థిరంగా మనుగడ కొనసాగించ గలుగుతుంది తరతరాలుగా మన సమాజం వివాహ వ్యవస్థ మీద అపార విశ్వాసం కలిగి ఉండి, పరంపరాగతంగా నిర్వాహకంగా కొనసాగుతూ వస్తున్నది. ధర్మార్థ కామ మోక్షాలనే చతుర్విధ పురుషార్థాల సాధనకు వివాహం ప్రధాన వాహిక. ఇట్లాంటి వివాహవ్యవస్థను కాదని ఏర్పరచు కొన్న సమాజ వ్యతిరేకమైన అక్రమ సంబంధాన్ని హిందూసమాజం ఆమోదించ జాలదు. ఇందుకు కమలా మోహనరావుల కథను ఉదహరించుకోవచ్చు.

సమాజ సంక్షేమానికి దారితీసే స్వేచ్ఛా ప్రణయాది సిద్ధాంతాలు పాశ్చాత్య నాగరికతా ప్రభావం వల్ల మనదేశానికి వచ్చినయి. ఇవి శారీరకమైన వాంఛలను తీర్చుకొనుటకై వచ్చినవే తప్ప, నిష్కల్మష ప్రేమకు సంబంధించినవి కావు. ఇట్లాంటి సిద్ధాంతాలు సమాజాన్ని భ్రష్టు పట్టించేవే కాని, సమాజ సంక్షేమానికి ఉపయుక్తములైనవి కావు. ఇవి ప్రచారం పొందుతున్నప్పుడు వీటిని భగ్నం చేయవలసిన బాధ్యత సమాజం మీద ఎంతైనా ఉంది సభ్య సమాజంలోని రచయిత తప్పక పై భావాల్ని ఖండించాలి దీన్ని ఆచరించడంవల్ల, కలిగే ఫలితాన్ని ప్రభావ వంతంగా చిత్రించాలి. 'మాలపల్లి'లో 'కమలా, మోహను'లు ఏర్పరచు

కొన్న 'స్వేచ్ఛా పరిణయం' పై విధమైందే. దీన్ని అనుసరించడంవల్ల కలిగే దుష్ఫలితాన్ని విధిగా రచయిత వీరి కథలో చూపినాడు.

కమల మోహనరావులోని శారీరకమైన అందం చేత ఆకర్షింపబడుతుంది. చేజేతులారా 'పండంటి కాపురాన్ని' కాలదన్నుతుంది 'తల్లెంటు బాయని బిడ్డను వదలి' పెడుతుంది. తననతిగా ప్రేమించే 'శ్రీరామ చంద్రుని వంటి' భర్తను కాదని, క్షణికమైన సుఖాన్ని శాశ్వతమైందిగా భ్రమిస్తుంది. స్వేచ్ఛా పరిణయాభిలాషతో తొందరపాటు నిర్ణయానికి వచ్చి, 'తన కాపురమే బోర్ల దోసుకొని' మోహనరావుతో లేచిపోతుంది.

మోహనరావు న్యాయశాస్త్రాన్ని అభ్యసిస్తున్న యువకుడు. బంధు మార్గంగా వచ్చిన ఈతడు తన కంటికింపుగా కనబడ్డ కమలను, వావి వరుసలు మరచి, కామపు చూపులతో ఆకర్షిస్తాడు. ఇతడు 'బాహ్య సౌందర్యా'నికిచ్చిన ప్రాధాన్యం 'ఆత్మ సౌందర్యాని'కివ్వడు. కమలను ఆకర్షించేందుకు తన అందానికి పలు రకాలుగా మెరుగులు పెట్టుకుంటుంటాడు. అందుకే రచయిత-

> "దేహ సౌందర్యమే నీవెరుగుదువు కాని ఆత్మ సౌందర్యం నీవెరుగవు. - అద్దం చూచి ముఖం దిద్దుకున్నావు గాని సత్పురుషుల జీవితాలను జూచి నీ ఆత్మ వర్తనం దిద్దుకోలేదు - ఇకముందు నీ వొక పతివ్రతా తిలకాన్ని వివాహం చేసుకున్నా కల్మిష రహితమైన హృదయాలింగన మియ్య జాలవు" (మా. ప. 218).

అంటాడు. తన దుర్వర్తనం ద్వారా సంసారాలను కూలదోసే కల్మష హృదయులను రచయిత మోహనరావులో చూపినాడు.

ఇక్కడ కమల మోహనరావుతో లేచి పోవడానికి కారకులు ఇద్దరు కన్పిస్తున్నారు. ఒకరు భర్త. రెండవవారు అత్త.

భర్తగా రామానాయుడు కమలతో సాన్నిహిత్యాన్ని పెంచుకోకపోవడం ప్రధానమైంది. రామానాయుడు పంచమ, కార్మికోద్యమాలలో చురుకుగాపాల్గొంటూ ఇంట్లో ఒక్క క్షణమైన తీరికగా ఉండలేక పోతుంటాడు. చుట్టుపక్క ఊళ్లల్లో ఉపన్యాసాలు ఇస్తూ, దివారాత్రులు వారి అభివృద్ధికై పాటుపడుతుంటాడు. కమలకు

భర్తతో ఏకాంతంగా గడిపే అవకాశం లభించదు. కమల రోజులను ఒంటరిగా వెళ్లిస్తుంటుంది

గృహ యజమానురాలయిన అత్త బాధ్యత కూడా కమల లేచిపోవడానికి కొంత కారణం. అత్తగా లక్ష్మమ్మ కమలకు ఏ పనీ చెప్పదు. ఇంటి పనుల తోనే సతమతమవుతున్న ఆమెకు కమల గూర్చి పట్టించుకునే అవకాశం ఏ మాత్రం దొరకదు. కోడలిగా కమలకూడా ఇంట్లో ఏపనీ చేసేందుకు ముందుకు రాదు. మొత్తం మీద కమల జీవితం తిని, పడుకోవటంతోనే యాంత్రికంగా గడుస్తుంటుంది

ఒక వ్యక్తి స్త్రీ పురుషులలో ఎవరైనా నిర్వ్యాపారిగా ఉన్నట్లయితే ఆవ్యక్తి ఆలోచనలు తెగిన గాలిపటంలా విచ్చల విడిగా విహరిస్తుంటయి. ఇక్కడ కమల విషయంలోనూ ఇదే జరుగుతుంది. ఈ సమయంలోనే రంగ ప్రవేశం చేస్తాడు మోహన వేష ధారియైన మోహనరావు.

మోహనరావు 'షోకుపురుషుడు'. ఏ బాధ్యతలూ లేని యువకుడు. కావలసినంత డబ్బు, 'తారా శశాంక విజయం', 'బిల్హణీయం' లాంటి స్వేచ్ఛా ప్రణయాన్ని ప్రబోధించే పుస్తక పఠనమూ, దీనికి తగ్గట్టు కాముకులైన స్నేహితుల సాన్నిహిత్యం, ఇవన్నీ మోహనరావుపై 'చెడుగాలి' సోకేందుకు కారణములౌతయి. వారివలెనే, తాను కూడా శారీరక సౌఖ్యాన్ని పొందాలనే తపన అంతర్గతంగా మోహనరావులోకి ప్రవేశిస్తుంది. మోహనరావు రామానాయుడి ఇంటికి వచ్చేటప్పటికి కమలనూ ఒంటరితనం బాధిస్తున్నది. ఇద్దరి మానసిక పరిస్థితి ఒకే విధంగా ఉన్న సందర్భంలో ఒకరికంట మరొకరు పడతారు. పరస్పరం అందం చేత ఆకర్షింప బడతారు. కామ పరమైన సంభాషణ నడచి, ఏదో అనుభవించాలనే తపన ఇరువురిలోనూ బయలు దేరుతుంది. ఈ తపన కమలలో అతను లేని తన 'జీవితం దుర్భర మవుతుంది' అన్నంత స్థాయికి పెరుగుతుంది. నిద్రలో కూడా మోహనరావు మీద ఆలోచనలే పరిభ్రమిస్తుంటవి. మనసు పరి పరి విధాలుగా పోతుంటుంది.

> "కవి శిల్ప చిత్రకార నిర్మితములైన కృత్రిమ విగ్రహాల వలె సహజ రస విహీనములై అనేక రకముల దృశ్యాలు గాన్పించి అసహ్యంగా దోచినవి" (మా. ప. 219).

ఈ ఆలోచనలతో ఉన్న కమల మోహనరావు సాన్నిహిత్యం లభించనందుకు ఇలా అనుకొంటుంది.

> "యిట్టి సమయముల గదా ప్రియులు దగ్గరనుండ లోనంగి సేవింప నవసరమవుతుంది. ప్రాణ నాథుడు దగ్గరనుండ తనకట్టి భాగ్యము లభింపమికి దుస్సహమైన పారతంత్ర్య జీవనమే కదా కారణమని" (మా ప 220).

భావిస్తుంది. సమాజ ధర్మాన్ని, కుటుంబంతో తనకున్న బంధాల్ని కాదని 'అతని బాహు దండముల నల్లుకొన' నువ్విళ్లూరుతుంది ఇది సాధ్యపడనం మోహనరావు మూర్తిని కనులు మూసుకొని ఊహించుకొంటుంది. 'క్షణ భంగురమ్మైన ఆనంద కెరటాలలో' తేలిపోతుంటుంది.

మోహనరావు మీది వ్యామోహంతో మరులుగొన్న కమలకు భయం తీరుతుంది. గుండెరాయి చేసుకొంటుంది ఉచితానుచితములు విస్మరించి అతనితో లేచిపోయేందుకు నిశ్చయించుకొంటుంది ఇట్లాంటి స్త్రీల స్థిర సంకల్పం ఎవడు మరల్చగలడు? (మా.ప. 225) బిడ్డను చూచినప్పుడు ఆమెలో కలిగిన మాతృ ప్రేమ మరుక్షణంలో మటుమాయమవుతుంది. మోహనరావు పటాన్ని చూడగనే ఆమె 'హృదయరంగాన తాండవ మాడుతున్న కిషోర వేషం నిష్క్రమించి మోహనవేషం' (మా ప. 227) ప్రవేశిస్తుంది. స్వేచ్ఛా ప్రణయాన్ని అనుభవిద్దామని నిశ్చయించుకొన్న కమలకు 'సహజములైన ప్రేమానుబంధాలకు వివాహబంధాలు ప్రతిబంధకాలుగా' (మా.ప. 228) తోస్తవి. వివాహబంధాన్ని త్రోసి రాజనేందుకు సిద్ధపడుతుంది. కామాతురులు భయాన్ని. లజ్జను వదలినట్లుగానే కమల కూడా మంచి చెడులను వదలి ప్రవర్తిస్తుంది.

సమాజ దూరమైన ప్రవర్తనకు ఫలితం కమలకు తర్వాత తెలిసివస్తుంది. మోహనరావుతో గడిపిన ప్రమోదానంతరము గడిపిన దుర్భరమైన, వేదనాభరితమైన ఒంటరి జీవితం ద్వారా గ్రహిస్తుంది

తన కారణంగా వచ్చిన కమలతో శారీరకపు సౌఖ్యాల్ని పొందడం కోసం ఉవ్విళ్లూరిన మోహనరావు ఆమె మీది వ్యామోహంతో తనవారికి తెలియకుండా చదువుకు భద్రిం' పలుకుతాడు. జీవితాంతం ఆమెతో ఉండడమా? లేక మధ్యలో

కలవరపడుతూ ఏ విషయాన్ని నిర్ధారించుకోలేక సతమతమవుతుంటాడు. ఎవరికీ చెప్పుకోలేకపోతాడు. కమలను వదలి మరొకరిని వివాహం చేసుకొన్నా, క్షేత్ర దర్శనం చేసినా ఏమాత్రం మనశ్శాంతి లభించదు. చేసిన దుష్కర్మలకు ఫలితం ఈ విధంగా పొందుతుంటాడు.

కమలా, మోహనరావుల సంబంధం క్షణికోద్రేకంలో ఏర్పరచుకొన్నట్టిది తాత్కాలికమైన నిర్ణయమే. అది కామాలోచనకు పరిమితమైందే తప్ప, ప్రేమానురాగాలకు నిలయమైందీ, అతి పవిత్రమైన, ప్రజాతంత్ర నిర్వాహకమైన వివాహ వ్యవస్థకు ఒదిగిందీ కాదు. వీరిద్దరూ శారీరకమైన ఆకర్షణలో దగ్గరైన వారే. ఈ ఆకర్షణలో ఒక్కటైన వీరి కోరిక తీరేసరికి, పరస్పరం 'మొదటి రోజుల మోజు తగ్గిపోతుంది'.

వివాహ వ్యవస్థకు ఒదిగిన స్త్రీ పురుషుల కామమే సంఘంచేత ఆమోదింపబడుతుంది. వివాహ వ్యవస్థను భగ్నంచేస్తూ ఏర్పరచుకొన్న కామం అధర్మమైంది, సమాజ సంక్షోభానికి దారితీసేది. ఇట్లాంటి కామంతో అధర్మ ప్రవృత్తులయినందు వల్లనే కమలా, మోహనరావుల జీవితాలు బాధామయంగా తయారైనాయి. నూరేళ్ళు జీవించాల్సిన వీరు లేత వయస్సులోనే తనువులు చాలిస్తారు. ఇది వీరి విచ్చలవిడి కాముక ప్రవృత్తికి కలిగిన దుష్ఫలితం. రచయిత తీర్చిన తీర్పు.

## జోతీ–అప్పాదాసులు :

సహజీవనానికీ, సమష్టి జీవనానికీ భూమిక వివాహ వ్యవస్థ. ఈ వ్యవస్థను కాదన్న ఏ జంటా సమాజంలో మనుగడ సాగించడం కష్టం. ఇందుకుదాహరణ జోతీ అప్పాదాసులు. వీరు వివాహాన్ని కాదని, భావనామయమైన ప్రేమతో సమాజంచేత అంగీకరింపబడని మార్గంలో జీవింప నిశ్చయించుకొంటారు. సమాజం సవ్యంగా సాగడానికి ఉపయోగపడని వీరి ఈ సంబంధాన్ని రచయిత వీరికథ ద్వారా సూచించినాడు.

కేవలం భావనామయమైన ప్రేమనే వాంఛించిన జోతీ అప్పాదాసుల ప్రేమ, కమలా మోహనుల 'స్వేచ్ఛా ప్రణయా'నికి పూర్తిగా వ్యతిరేకమైంది. దీనివలె సమాజ విచ్ఛిన్నకరమైంది కాదు. అయినప్పటికీ, వివాహవ్యవస్థను కాదనుకొన్న

నిరుపయోగ భావుకత జోతీ అప్పాదాసులది. అందుకే, రచయిత వివాహంతో సంబంధం లేని వీరి ప్రేమయొక్క అనావశ్యకతను జోతీ అప్పాదాసుల ద్వారా వ్యక్తం చేసినాడు.

జోతీ అప్పాదాసుల ప్రేమ మానసికమైంది గోపికా కృష్ణులకు చెందింది గోపికా కృష్ణులవలె జోతీ అప్పాదాసులు విశ్వ వ్యాపకమైన ప్రేమను వ్యక్తం చేస్తారు. ఈ ప్రేమను సామాన్య మానవులు అందుకోవడం కష్టం ఇట్లాంటి ప్రేమతో సమాజంలో జీవింప బూనుకొంటే వారి జీవితాలు జోతీ అప్పాదాసుల జీవితాల వలె తయారవుతవని రచయిత వీరి కథ ద్వారా తెల్పినాడు

జోతీ అప్పాదాసులు వరుసకు బావామరదళ్లు. ఒకే ఇంటిలో కలిసిమెలసి పెరగడం వల్ల, పరస్పరం సాహిత్యం మొదలుకొని అనేక విషయాలపై చర్చలు చేస్తుండడం వల్ల వారికి చిన్నప్పటి నుండి ఒకరి యందొకరికి ఒకరకమైన ఇష్టం ఏర్పడుతుంది ఆ ఇష్టం పెరిగి పెరిగి 'ప్రేమ'గా పరిణమిస్తుంది పెళ్ళివరకు వీరి ఆలోచనలు వెళ్ళవు ఇద్దరికీ పెండ్లంటే విముఖతే పెండ్లితో సంబంధం లేని మానసికమైన ప్రేమానురాగాలూ, మమతా మమకారాలూ మాలిన్యాన్ని పొందని వీరి విశ్వాసం 'అమలిన శృంగార' భావంలో విహరిస్తుంటారు.

జోతీ అప్పాదాసులు బావ మరదళ్ళేకాదు, 'గురుశిష్య' సంబంధం కలవారు కూడా. ఒక్కొక్క సారి ఒక యింట్లో పెరిగి 'ఏమిరా' అనుకొంటూ 'ఒకే తరగతిలో చదువుకుండే పిల్లల మోస్తరుగా' ఉంటుంటారు (మా.ప. 342). జోతి అప్పాదాసు దగ్గర పంచకావ్యాలూ పూర్తిచేస్తుంది. ఆ సందర్భంలో పారం ఒప్పచెప్పేందుకు అప్పాదాసుతో ఊరగొండ మీదికి వెళుతుంది అక్కడ సాహిత్యం నుండి ప్రారంభమైన వీరి సంభాషణ ప్రేమ మీదికి మరలుతుంది. ఇక్కడ వీరి భావాలే కాకుండా మాటల తీరు కూడా 'అమలిన శృంగార' ధోరణిలో సాగుతయి జోతి 'నిర్గుణ బ్రహ్మన్ని ప్రేమించినట్టు ప్రేమిస్తా' నంటే అప్పాదాసు తనలోని ఉన్నతమైన, స్త్రీ పురుష భేదానికి అతీతమైన ప్రేమను ఇలా వ్యక్తంచేస్తాడు.

> "నీవు నా బంగారు రాధవు. నా శ్రీ కృష్ణుడవు కూడా నీవే రాధ కృష్ణున్ని ప్రేమించినట్టు నిన్ను ప్రేమిస్తాను. మోక్ష ప్రదాయినివి. నీవే నా ముక్తికాంతవు" (మా. ప. 343).

జోతి తను కోరిన భావనామయమైన ప్రేమను అప్పాదాసు నుండి పొంది, తన ఆనందాన్ని ఇలా వ్యక్తం చేస్తుంది

> "నీవు నా మోహన కృష్ణుడవు. నేను చిన్న గోపికను ఆ బాల్యం నా మనస్సు నీయందే లగ్నమయి ఉన్నది నీవా గోపికపై సహవాస కిర్తిపై నాతో ఆడుకున్నావు. రాశ్మీ నా రాత్రిపగొన్న నా పాదాలు నీ హస్త కమలాలతో వొత్తావు. నీ పాద కమలాలు నా హృదయ కమలంలో ధరిస్తూనే ఉన్నా.. నీ మీద నాకు ప్రేమ క్రొత్తగా అంకురించలేదు. నా హృదయంలో బీజ రూపంలో ఉండి యెప్పుడు మొలకెత్తి తీగెలు వేసి అల్లుకొన్నదో తెలియదు. యిప్పుడు రెండూ పెనుసుకొని బలపడ్డవి". (మా. ప. 343)

ఈవిధంగా జోతీ అప్పాదాసులు ప్రేమ ఔన్నత్యాన్ని తెలుపుతూ, ప్రేమే అన్నింటికి మూలమని ప్రేమ లేకుండా యిహమూ పరమూ లేదని భావిస్తారు.

వివాహ విషయంలో అప్పాదాసు అభిప్రాయం గాయుకాసుకంటే భిన్నమైంది- వివాహం వల్ల అన్ని లాభాల్ని పొందవచ్చు ననేది 'అర్థవాదం' అని అంటూ, ప్రేమే మోక్ష సాధనమని అందువల్ల మోక్ష సాధనమైన ప్రేమ వివాహమాడిన భార్య మీద తప్పక కలుగుతుందని చెప్పటానికి వీలు లేదంటాడు అప్పాదాసు చివరికి వివాహంతో సంబంధంలేని ప్రేమనే అప్పాదాసు కోరుకుంటాడు(మా.ప.348). వివాహం చేసుకోకుండానే ప్రేమించుకోవచ్చునని, గోపికలు శ్రీకృష్ణుని ప్రేమించిన విధం ఇట్లాంటిదేనని తెల్పుతూ, ప్రేమకు 'సంగమం' అవసరం లేదంటాడు. తన విషయాన్ని తెలుపుతూ 'నేను ప్రేమించినా బాహ్య సాక్ష్యంతో పనిలేదు. కనుక యితరులు తెలుసుకోవలసిన అవసరం' లేదంటాడు (మా. ప. 350). ఇక్కడ స్త్రీ పురుషులకు సంబంధించిన ప్రేమ వారుభయులకు మాత్రమే పరిమితమైందని, ఇది ఇతరులకు అంటే సమాజానికి తెలియాల్సిన అవసరం లేదని అప్పాదాసు అభిప్రాయం.

సమాజం ఆచరించ తగింది సీతారాముల ప్రేమ. రాధాకృష్ణుల వంటిది కాదు. రచయిత నవలలో 'భారత కృష్ణుడు- భాగవత కృష్ణుడు' అనే ఉపశీర్షికలో సీతా రాముల-రాధాకృష్ణుల ప్రేమను ప్రస్తావిస్తూ, రెంటిలో ఉన్న తారతమ్యాన్ని చూపినాడు.

మానవులకు ఆదర్శ ప్రాయమైంది సీతారాముల ప్రేమ. వీరి ప్రేమ సామాన్య మానవులకు సైతం అందుబాటులో ఉండేది. 'ఉత్తమములయిన పతి పుత్రాదిక ధర్మాలను తన జీవితంలో ప్రకటించి మనుష్యుల కాదర్శ ప్రాయుడైన అవతారమూర్తి' శ్రీరాముడు. కృష్ణుడి విషయం భిన్నమైంది. 'కృష్ణుడి ప్రేమ సామాన్య నైతిక విధులకు అతీతమైనది' (మా ప. 385). కృష్ణుడు తన ప్రేమామృతాన్ని అందరికి పంచియిచ్చాడు. అందువల్ల కృష్ణుడి ప్రేమ సామాన్యులు అందుకో వీలులేనట్టిది. కృష్ణుని 'మనం ప్రేమించినా ప్రేమించకపోయినా తన విధిగా చరాచరములైన సర్వభూత కోటులను ప్రేమిస్తాడు. ప్రేమించడమే అతని స్వభావం' (మా ప. 386). తన కొరకు వచ్చిన గోపికలను ప్రేమించి, వారిని 'ముక్తలను' చేశాడు. దీన్ని మానవులు అనుసరించడం అసాధ్యం. మానవులకు ఆదర్శవంతమైన సీతారాముల ప్రేమను కాదని గోపికా, కృష్ణుల ప్రేమనే కోరుతారు జోతీ అప్పాదాసులు.

అప్పాదాసు దృష్టిలో ప్రేమ పవిత్రమైంది, ఈ ప్రేమకు అంతరాలు ఉండవు. అన్నిటా ఒకరకమైన ప్రేమే పరివ్యాప్తమై ఉంటుంది. దేహసాంగత్యం లేకున్నా ఈ 'ప్రేమ, ఆనందము' అనుభవానికి రాగలవు. ఇక్కడ దైహిక, మానసిక విభేదానికి తావు లేదని అప్పాదాసు ప్రేమ విషయాన్ని తెల్పితే, జోతి అప్పాదాసు మీద తనకు గల ప్రేమను ఇలా వ్యక్తంచేస్తుంది.

> "దాసూ! నాకీ సిద్ధాంతాలన్నీ తెలియవు. -నిన్ను నేను ప్రేమిస్తాను. -నీవే నా మోహన కృష్ణుడవు. -యెందుకు నిన్ను ప్రేమిస్తున్నానో నాకే తెలియదు. నిన్ను ప్రేమించక నేఉండలేను. -నీవు నా మనస్సుకు గోచరించి నప్పుడల్లా నా మనస్సూ శరీరం కూడా ఆనందం అనుభవిస్తూనే ఉన్నవి. -నీవల్ల యింత కంటే కోరదగిన సుఖం మరివొకటి లేదు" (మా ప. 388)

ఇక్కడ జోతి వివాహంతో సంబంధం లేని కేవల ప్రేమ భావాన్నే వ్యక్తపరిస్తే. అది సమాజంలో అనుసరణీయమైంది కాదనే గ్రహింపు అప్పాదాసులో కన్పిస్తుంది. అందుకే, జోతితో ఎవరినైనా వివాహం చేసుకోవడం క్షేమమని బలవంతం చేస్తాడు. కాని, జోతి వివాహాన్ని తిరస్కరిస్తుంది. 'పోషణ కోసం'

వివాహం చేసుకోనంటుంది నీవెక్కడ ఉన్నా, ఎన్ని చిక్కులు వచ్చినా నాకే చింతా లేదంటూ ఇలా తెల్పుతుంది.

> “నిన్నెల్లప్పుడూ ప్రేమిస్తుంటాను. నీ రూపాన్ని మనస్సులో చిక్కబట్టుకొన్నాను. రాత్రులు నీ రూపాన్ని చీకట్లో చూస్తాను. కలగంటాను, పగలు కండ్లు మూసుకొని నీ రూపాన్ని ఊహించు కుంటాను. నీ భావనా రూపాన్ని ఎల్లప్పుడూ అనుభవిస్తుంటాను” (మా. ప. 389).

జోతియొక్క ఉన్నతమైన ప్రేమను అర్థంచేసుకొన్న అప్పాదాసు వివాహ విషయమై జోతిని ఒత్తిడి చేయడు తన మీద ఆమెకు గల భావనామయ మైన ప్రేమకు ముగ్ధుడవుతాడు ‘ఉభయులూ ఏకకేంద్ర గతు’లౌరారు. జోతి ప్రేమలో తన్మయుడైన అప్పాదాసు తనలోని విశ్వప్రేమను ఇలా ప్రకటిస్తాడు-

> “జోతీ! నిన్ను ప్రేమించాను. నా ప్రేమ సౌరభం బ్రహ్మాండ మండలమూ గుప్పించి తావులు వెదజల్లుతున్నది ఆనందగీతమై అంతటా రమిస్తున్నది. ఆ సౌరభమూ, గాన మాధుర్యమూ నా హృదయానికి గోచరిస్తున్నవి నా ప్రేమ పండు వెన్నెలలో వ్యాపించి ఉన్నది. పుష్పములలో వ్యక్తమై ప్రసరిస్తున్నది నదీ ప్రవాహముల చిరు తరగలతో గుసగుస లాడుతున్నది నా రాధవైన నీయందు విలీనమై నిలిచింది” (మా ప. 390).

ఈ విధంగా అమలిన ప్రేమ భావంలో ఉన్న జోతీ అప్పాదాసుల హృదయాలు ఏకమై ‘అంతా అనుభవించినట్టే’ అవుతుంది

భావనామయ ప్రేమకు పరస్పర దర్శన, స్పర్శలు ఆవశ్యకంకావు. కాని, జోతి చిగ్లిదంద్రుడలలో సెటిల్‌మెంటుకు వెళ్ళుతున్నప్పుడు, అప్పాదాసు ప్రేమాతిరేకంచే మతిస్థిమితం కోల్పోయిన వాడిగా మాట్లాడుతాడు జోతి మాత్రం ‘తన మనస్సులో “నిన్ను వదలి పోతానా”? మన మిద్దరం కలిసేపోతున్నాం’ (మా.ప 397) అని అనుకొంటుంది.

భావనామయంగా జోతి అప్పాదాసును ప్రేమించింది. కాని పెండ్లి మాత్రం చేసుకోలేదు. బాహ్య చిహ్నాలను అపేక్షించక పోవడం వల్ల సెటిల్‌మెంట్లో పాలు

జోతిని కన్యగా భావించి పెండ్లి చేసుకొంటానని అనగలిగాడు. జోతి ఒప్పుకోక పోవడంతో బలవంతంగానైనా అనుభవించి, వివాహానికి సుముఖురాలును చేసుకోవాలనుకుంటాడు. జోతి శారీరక సుఖానికి విముఖురాలు. సమాజంలో వివాహాన్ని కాదనుకున్న భావనామయ ప్రేమకు స్థానం లేదు. ఈ రెంటికి కుదరక జోతి దుర్మరణం. పాలవుతుంది.

జోతి మరణాన్ని అప్పాదాసు తట్టుకోలేక పోతాడు జోతికున్న మనోదార్ఢ్యం అప్పాదాసులో కన్పించదు. దూరమైనా నీవు నాలోనే ఉన్నావన్న భావన జోతికి వలె అప్పాదాసుకు లేదు అందుకే జోతి శారీరకంగా దూరమైతే దుఃఖాన్ని తద్వారా పతి స్థిమితాన్ని పొందుతాడు. మరణిస్తే మరింత పిచ్చి వాడవుతాడు. పూలతో అలంకరించిన జోతి శవాన్ని భుజంమీద వేసుకొని, కృష్ణా నదిలో సహగమనం చేస్తాడు.

జోతీ అప్పాదాసులు తాము స్వయం కృషితో నేర్చుకొన్న విద్యా, విజ్ఞానములవల్ల విజ్ఞతను కోల్పోక ప్రాణం కంటే శీలానికి అధిక ప్రాధాన్యత నిచ్చినారు. వీరిలో 'కులం' కంటే 'గుణం', 'కామం' కంటే 'శీలం' ప్రాధాన్యతను పొందినవి. అయినప్పటికీ, వీరు కల్పించుకొన్న భావనామయమైన ప్రేమ సమాజ నియమానికి ఒదిగినట్టిదికాదు. వివాహానికి ముందు ప్రేమించినా, వివాహం తర్వాత ప్రేమించినా వివాహం కావడమనేది ముఖ్యం. వివాహమే ఆచరణీయం. కాదంటే అనర్థం. ఇది వివాహ వ్యవస్థను కాదన్నందుకు రచయిత చూపిన పరిష్కారం.

## వెంకటుదాసు :

సహజంగా ఏ వ్యక్తీ జన్మతః దుర్మార్గుడు కాడు. అతడి జీవితంలో ఎదురైన పరిస్థితులను బట్టి కొందరు తమ జీవితాల్ని వాటికి అనుగుణంగా మలచుకొని జీవిస్తుంటారు. మరి కొందరు ఆ పరిస్థితులకు, ముఖ్యంగా వచ్చిన కష్టాలను, పొందిన అవమానాలను తట్టుకో లేక ఎదురు తిరుగుతారు. ఈ తిరగటంలో తమ భవిష్యత్తును గూర్చి ఆలోచించుకోరు. తమ మనస్సుపై పడిన దుస్సంఘటనల ప్రభావాన్ని తట్టుకోలేక తాత్కాలిక ఉద్రేకానికి లోనౌతారు. సమాజానికి సవాలుగా తయారవుతారు. ఇట్లా సమాజానికి సవాలుగా తయారయిన వ్యక్తి వెంకటదాసు. తన మనస్సుపై గాఢ ప్రభావం వేసిన దుస్సంఘటనలకు ప్రతిస్పందించిన

వెంకటదాసు ఒక ఉద్యమాన్ని లేవదీసి ప్రభుత్వంలోనూ, ధనిక వర్గంలోనూ పేదల స్థితి గతుల గూర్చి ఆలోచించే పరిస్థితిని కల్పించడానికి పూనుకొంటాడు. పేదలు పస్తులు తినడానికి గల కారణాలు ధనికవర్గం, ప్రభుత్వం అర్థం చేసుకొని, వారి జీవితాల మీద ప్రత్యేక శ్రద్ధను చూపేందుకు యత్నిస్తాడు. అందుకే కొంతకాలం దోపిడీలు సాగించి. ఆశించిన ఫలితం కన్పించిన వెంటనే దోపిడీలు మాన్పించివేస్తాడు.

వెంకటదాసు సహజంగా పరమసౌమ్యగుణం కలవాడు. 'చాకిరీచేసుకుంటే' కడుపు నిండునదనే సిద్ధాంతం కలవాడు. వ్యవసాయపు పనులలో ఆరితేరినవాడు. ప్రతి పనిలోనూ ముందుకు వచ్చి తండ్రికి చాలా విశ్రాంతి కలిగించినవాడు. ఇట్లాంటి వెంకటదాసు కుటుంబం మీద ఆనాటి ధనస్వామ్య వ్యవస్థ పలుమార్లు దాడిచేస్తుంది. అతని మనస్సును ప్రధానంగా తమ్ముడి దుర్మరణం కలచి వేస్తుంది. చౌదరయ్య యొక్క ధనతృష్ణకు తమ కుటుంబం మాత్రమే కాక మరెన్నో కుటుంబాలు బలికావడంతో, లోకంలో బీదల స్థితికి ధనవంతులే కారణమని భావిస్తాడు తమలాంటి బీదలపై ధనవంతులు చేస్తున్న దౌర్జన్యాలు కారణంగా న్యాయంగా జీవనం చెయ్యడం అసాధ్యమని భావిస్తాడు.

వెంకటదాసు పౌరుషవంతుడు పట్టుదల గల వ్యక్తి. తమ ఆస్తిపై చౌదరయ్య అక్రమ వ్యాజ్యం వేసినప్పుడు అతనితో రాజీకి ఒప్పుకోడు. "కొంపలు తెగనమ్మైనా, మూడు కోర్టులూ చూడవలసిందే'' (మా.ప. 242) నంటాడు. ఇట్లాంటి వెంకటదాసు మనస్సును హిరణ్యకశ్యపుని పౌరుషత్వం ఆకర్షిస్తుంది రామదాసు ఆస్తిపై కేసు నడుస్తున్న సందర్భంలో, మంగళాపురంలో ప్రహ్లాద నాటకం వేయబడుతుంది. నాటకం ముగిసిన తర్వాత అప్పాదాసు తన అభిప్రాయాన్ని తెల్పుతూ– 'హిరణ్యకశ్యపుని పూజించి రంజించుటకే నృసింహుడవతరించాడు. పశు బలానికి, సాత్త్విక బలానికి గల తారతమ్యం ప్రస్ఫుటమైంద'ంటాడు (మా. ప. 294).

అపుడు వెంకటదాసు ఈ కథ వాస్తవ దూరమైందంటూ ఇలా తెల్పుతాడు–

"ఈ సృష్టిలో పశు బలమనీ, ఆత్మ బలమని రెండు శక్తులు లేవు. ఉన్నది ఒకటే శక్తి. ధనికులు, బీదలను మోసగించడానికి పండితులకు డబ్బిచ్చి ఆత్మ శక్తిని సృష్టించారు. హిరణ్య కశ్యపుని వంటి

పౌరుష శాలిని నేనెక్కడా చూడలేదు. అతని ధర్మనిష్ఠ అనుప
మేయం. . ఇట్టి దృఢవ్రతుడు నభూతో నభవిష్యతి”
(మా. ప. 294).

హిరణ్యకశ్యపుని పౌరుషత్వంకూడా కొంత మేరకు వెంకటదాసు ‘జగ్గడు’గా మారి దోపిడీలు సాగించేందుకు భూమికగా పని చేస్తుంది. హిరణ్య కశ్యపుని వలె వెంకటదాసు కూడా మరణ సమయంలో భగవంతుడిని నిరసిస్తాడు (మా. ప 294, 597).

బీదలు కష్టాల పాలు కావడానికి ధనవంతుల లోభం ప్రధాన కారణమని వెంకటదాసు అభిప్రాయం. ధనవంతులు చేసే దౌర్జన్యాలను బీదలు సహిస్తూ, అదంతా తమ కర్మ అనే వేదాంతాన్ని వల్లిస్తున్నారని, లోకంలోని సమస్త ప్రజల్ని వీరు పీల్చి పిప్పి చేస్తున్నారనే విషయాన్ని ఎవరూ గమనించడం లేదని వెంకటదాసు బాధ. ఈతని దృష్టిలో ధనవంతులు పిశాచాలు. ఈ ‘ధనపిశాచాల’ను సంహరించేందుకు ధర్మ శాస్త్రాలను మళ్లీ వ్రాయించాలని, ధనవంతులు ఈదేవుడ్ని తమవైపు తిప్పు కొన్నారని వెంకటదాసు దేవుడి మీదనే తిరగబడతాడు. ధనవంతులపైన, వీరు లోబరచుకొన్న భగవంతుడిపైన బీదలు జరిపే పోరు “రోజులలో, నెలలలో, సంవత్సరాలలో గూడ తెమిలేది కాదు శతాబ్దాలు పట్టవచ్చు. వీడు జనాన్ని అంధకారంలో ఉంచవలెనని చూస్తున్నాడు. కాని తెల్లవారింది, జనులు ప్రబోధితులౌతున్నారు. యిక యీ నిరంకుశుని బాటు సాగదు” (మా ప. 302, 303) అంటూ, ధనవంతుల ప్రాబల్యంలో ఉన్న దేవుడు బీదల పాలిట పెన్నిధి కావాలనీ, లేకుంటే ఈ ‘ధనపిశాచాల’తో పాటు దేవుడు కూడా ఆహుతి కాగలడని, దేవుడిని అడ్డం పెట్టుకొని జనులను మోసం చేసే వారికి బుద్ధి చెప్పేందుకు వెంకటదాసు దేవుడి అస్తిత్వాన్నే ప్రశ్నిస్తాడు.

వెంకటదాసులో ‘అస్వాభావిక ద్వేషం’ కలగడానికి కారణాన్ని రచయిత ఇలా తెల్పినాడు- “తమ్ముడి యొక్క దుర్మరణం, దానికి ప్రతిక్రియ లేకపోవడం అతని మనస్సులో నాటి అస్వాభావికమైన ద్వేషమును పురికొల్పినవి (మా. ప. 312).

లోకంలోని అన్ని దుస్థితులకూ ప్రధాన కారణం ధనవంతులని వెంకటదాసు భావన. “ప్రపంచంలోని వస్తు భండార మనుభవించడానికి సమస్త జనులకూ

హక్కు కలదనీ— ఇంతకాలం నుంచి ప్రపంచ పరిస్థితులు క్రమక్రమంగా హీన స్థితికి వస్తున్నా, ధర్మ సంస్థాపనకై ఏ సంస్కర్తా పూనుకోనందుకు విచార పడ్డాడు . లోక స్థితిని చూచి వగచి ఊరకుండక యథాశక్తిగా లోక సంస్కరణమునకై పోరాడు వీర స్వభావం"తో (మా. ప. 312) వెంకటదాసు ధనవంతుల మీద తిరుగుబాటుకు సిద్ధపడి, వారిని కొల్లగొట్టి ధనం సంపాదించేందుకు పలువురిని చేరదీస్తాడు

వెంకటదాసు తను లేవ దీసిన ఉద్యమం వల్ల చాలా డబ్బు సంపాదిస్తాడు. తను ప్రారంభించిన ఉద్యమంవల్ల సమాజం స్పందించి, ధనికులూ, ప్రభుత్వమూ పేదల గూర్చి ఆలోచిస్తుందని, ముందు ముందు వీరి జీవితాలు అభివృద్ధిలోకి రాగలవనే దృఢ విశ్వాసం వెంకటదాసులో ఏర్పడుతుంది. ఇదే భావాన్ని వెంకటదాసు ఒకచోట తన అనుచరునితో—

> "యింత వరకు మనం పుట్టించిన ఆందోళన వల్ల ధనికులూ, ప్రభుత్వం వారూ ప్రస్తుత స్థితిగతులు మార్చక తప్పదని అభిప్రాయ పడుతున్నారు. ఇక మీద పాత పద్ధతి ఆపి కొత్త పద్ధతులవలంబించండి. — అయిదుకోట్లు సంపాదనంతా సమానంగా పంచుకొని న్యాయ జీవనం చెయ్యండి" (మా. ప. 525-26).

అని తెలుపుతాడు. మిగిలిన ఐదుకోట్లు ధర్మానికుపయోగించి, కార్మిక సంఘాలలో చేరి పనిచేసినట్లైతే, స్వరాజ్యం వచ్చి, విద్యావృత్తులు అభివృద్ధిపొంది, పేదల స్థితిగతులు బాగుపడుతవని నమ్మకం వ్యక్తం చేస్తాడు.

వెంకటదాసు భావించినట్లుగానే సమాజంలో చాలా మార్పు వస్తుంది. 'సాధారణ కుటుంబాల వాండ్లు విద్యావంతులు సహితం' జగ్గడి ధర్మాలను ప్రశంసిస్తుంటారు.

> "దేశంలోని పరిస్థితులు విషమావస్థను బొందినవనీ, కాస్త మిట్టలు చెక్కి పల్లాలు పూడ్చనిదే స్థితిగతులు మరింత ఘోర స్థితికి వస్తవని చాలామంది అంగీకరించారు. — కూలీలకు సరి అయిన కూలి యియ్యవలసిందనీ, వాండ్ల స్థితి బాగు చేయవలసిందనీ, యంత్ర శాలలు స్థాపించి చేతి పనులు వృద్ధిచేసి బీదలకు జీవనం కల్పించ వలసిందని అందరూ అంగీకరించారు" (మా. ప. 528)

ఇంటి పరిస్థితులు, సమాజ పరిస్థితులు ఒక వ్యక్తి యొక్క మనస్సు మీద ఎలాంటి ప్రభావం వేస్తవో తెల్పుతూ, ఆ ప్రభావం వల్ల ఆ వ్యక్తి 'అస్వాభావిక ద్వేషం'తో ఏ విధంగా ఎదురు తిరుగుతాడో చెప్పడానికి వెంకటదాసు పాత్ర ఒక ఉదాహరణ. అందుకే రచయిత వెంకటదాసు తిరుగుబాటుకు 'అస్వాభావిక ద్వేషం' కారణమనడం.

## సంఘర్షణ :

'మాలపల్లి' లో సంఘర్షణ పలు అంతరువుల్లో చిత్రితమయింది. ఈ సంఘర్షణ ముఖ్యంగా- భిన్న ప్రవృత్తుల మధ్య, భిన్న మతాల మధ్య, భిన్న దేశీయుల మధ్య చూడవచ్చు. దీంతోపాటుగా, నవలలో ఆంతరంగిక సంఘర్షణ కూడా కన్పిస్తుంది.

## భిన్న ప్రవృత్తుల మధ్య సంఘర్షణ :

మాలపల్లిలో ఈ సంఘర్షణ నవలారంభం నుండి కన్పిస్తుంది మాల, మాదిగలపై భూస్వాములు చేస్తున్న అత్యాచారాలు మితిమీరి, వారి జీవనాధార మైన 'కూలి' తగ్గించే ప్రయత్నాలు విరివిగా సాగుతుండడంతో; కూలీలలో అంతర్గతంగా రాజుకుంటున్న ద్వేషం సంఘర్షణగా రూపు దిద్దుకొంటుంది. ఈ సంఘర్షణలో రామదాసు, సంగదాసు మొదలైనవారు దివ్య ప్రవృత్తి నాలంబనం చేసుకొని ప్రవర్తిస్తే; చౌదరయ్య, పంతులు మొదలైన వారు వికృత రూపం దాల్చిన అసుర ప్రవృత్తితో ప్రవర్తిస్తారు.

సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని కాంక్షించేది దైవీ ప్రవృత్తి. ఇది ధర్మాన్ని ఆశ్రయించుకొని ఉంటుంది. కాగా, వ్యక్తిగత స్వార్థం కోసం సామాజిక జీవితానికి విఘాతం కల్గించేందుకు చేసే ప్రయత్నాల్ని అసుర ప్రవృత్తిగా చెప్ప వచ్చు. ఇది అధర్మమార్గాన్ని ఆశ్రయించుకొని ఉంటుంది. కూలీలకు న్యాయంగా రావలసిన కూలీ ఇవ్వ నిరాకరించడంతో ఈ ప్రవృత్తుల మధ్య సంఘర్షణ మొదలవుతుంది. ఈ సంఘర్షణలో ధర్మ విజయ సాధనకై ప్రధానంగా సంగదాసు, వెంకటదాసులు; అధర్మం పక్షాన చౌదరయ్య ముందు నిలుస్తారు. సంగదాసు తాను పూవిన ధర్మ విజయానికై అహింసా మార్గాన్ని ఆశ్రయించగా, ఇతవి అన్న

వెంకటదాసు ఇంతకంటె నిస్పష్టమైన మార్గంలో అధర్మం మీద 'ధర్మ యుద్ధం' ప్రకటిస్తాడు.

సంఘంలో డబ్బుకు విలువ పెరగడంతో, చౌదరయ్య పీకైనంత వరకు అధర్మ మార్గంలో డబ్బు కూడగట్టే ప్రయత్నం చేస్తుంటాడు. వాకిల క్రింద కట్టు కొని, చౌక ధరలో కొని భూములనాక్రమిస్తాడు. న్యాయవాదులను లోబరచుకొని పలువురి భూమిని తన వశం చేసుకొంటాడు. మరొకవైపు వడ్డీల ద్వారా, మరెన్నో అక్రమ మార్గాల ద్వారా లక్షలార్జిస్తాడు. అయినా, 'ధన తృష్ణ' తీరని చౌదరయ్య కూలీలకిచ్చే 'కూలి' పైసా ఎక్కువ [illegible]రిస్తాడు

ధాన్యం ధర ఇబ్బడి ముబ్బడిగా పెరిగి, వస్తువులకు గిరాకీ హెచ్చడంతో, అంతకు పూర్వం కూలీలకు కూలిగా ఇస్తున్న ధాన్యాన్ని డబ్బుగా మార్చే ప్రయత్నంలో చౌదరయ్య ఇతర భూస్వాములను కలుపుకొంటాడు. అదయినా, ఆనాటి ధరల ప్రకారం ఇచ్చేందుకు నిరాకరిస్తాడు.

కూలీల శ్రమకు తగిన ఫలితాన్ని ఇవ్వ నిరాకరించిన ధనిక రైతుల అధర్మ ప్రవృత్తిపై సంగదాసు యుద్ధానికి సిద్ధపడతాడు. కూలీల జీవితాలు బాగుచేయాలన్న సత్సంకల్పంతో ముందుకు వస్తాడు. కూలీలకు న్యాయమైన కూలి ఇప్పించేందుకు సన్మార్గాన్ని ఎన్నుకుంటాడు. భూస్వాములకు, కూలీలకు ఎవరికీ నష్టం రాకుండా ఇరువర్గాల మధ్య రాజీ కుదర్చడానికి ప్రయత్నం చేస్తుంటాడు. న్యాయ మార్గంలో కార్య సాధనకు పూనుకొనే వాడు కాబట్టే, ఒకవైపు కూలీలకు న్యాయంగా రావలసిన కూలిని ఇప్పించేందుకు పోరాడుతూనే, మరొకవైపు, భూస్వామికి అన్యాయం జరగకుండా జాగ్రత్త పడుతుంటాడు. కూలీలను సమ్మెకు సిద్ధం చేయించిన సంగదాసు, తన యజమానికి నష్టం రాకుండా కూడ చూడటం ఇక్కడ గమనించాలి (మా. ప. 96).

సంగదాసు కూలి తగ్గించే విషయంలో 'సామోపాయం' ద్వారా మునసబు మనసును మార్చి, పూర్వపు మాదిరిగా కూలి ఇచ్చేట్టు చేస్తాడు. కాని, చౌదరయ్య విషయంలో తన ప్రయత్నాలేవీ పనిచేయవు. మునసబులాంటి ఇతర భూస్వాములు సమ్మెవల్ల వ్యవసాయంలో వచ్చే నష్టం గమనించి, వ్యవసాయంలో కూలివాడి పాత్ర ప్రాధాన్యాన్ని గుర్తించి మామూలు కూలిని ఇచ్చేందుకు సిద్ధ

పడతారు. కాని, చౌదరయ్య ఆలోచన ఇలా సాగదు. ప్రతి విషయాన్ని అపసవ్యంగా ఆలోచించే గుణం కలవాడు చౌదరయ్య (మా. ప. 110). కూలీవాడి జీవితానికి భూస్వామే ఆధారమనే అహంభావంతో ప్రవర్తిస్తుంటాడు. అంతేకాద,

> “ఈ పుట్లో పద్ధాలుగు వీసాల కూలీ జనం నా పల్ల బతికే వాండ్లు ఎదురు తిరిగిన వాండ్లను నా చేలో అడుగు బెట్టనియ్యను.. చెడి పోతారు చెప్పు” (మా. ప. 110).

అని, తనులేందే కూలీలకు ఒక్కపూట కూడా గడవదనే ధోరణో, అహంకారంతో కూలీల ఎడల నిర్లక్ష్యభావాన్ని ప్రకటిస్తాడు. ఈ అహంకారాన్ని విసర్జించి, వాస్తవాన్ని గమనించి మారుతాడనే ఆశతోనే సంగదాసు చౌదరయ్య విషయంలో ఎంతో ఓపికతో ప్రవర్తిస్తాడు కూలీల వాస్తవ జీవితాల్ని పూసగుచ్చినట్లు వివరిస్తాడు ఎన్నో రకాలుగా నచ్చచెప్పే ప్రయత్నం చేస్తాడు. భూస్వాములు పొందుతున్న రెట్టింపు లాభాల్ని బేరీజువేసి చూపుతాడ. ధరలు ఒకటికి నాలుగు రెట్లు పెరిగిన విషయాన్ని గుర్తుచేస్తాడు. కూలీవాడు లేనిదే వ్యవసాయంసాగదనీ, వ్యవసాయానికి కూలీ ముఖ్యుడనీ అందువల్ల కూలీని పోషించవలసిన బాధ్యత ఆసాముల మీద ఉందని, వాస్తవ పరిస్థితుల్ని చౌదరయ్యకు ముందుంచుతాడు ఇంత చెప్పినా చౌదరయ్య అపసవ్యంగానే ఆలోచిస్తుంటాడు. ఏవిధంగా కూలి తగ్గించాలా అని తన ధోరణిలో ఆలోచిస్తుంటాడే తప్ప, సంగదాసు మాటల్లోని వాస్తవాన్ని గ్రహించడు. చౌదరయ్య అంతర్యం గమనించిన సంగదాసు, చౌదరయ్య ఎట్టి పరిస్థితుల్లోనూ కూలిని తగ్గించకుండా ఉండడని గ్రహించి ఇతర భూస్వాములు మామూలు కూలి ఇచ్చిన విషయాన్ని గుర్తుచేసి తాత్కాలికంగా ఆరోజుకు పూర్వపు కూలి ఇప్పిస్తాడు.

సంగదాసు చౌదరయ్యతో కూలీల విషయం చర్చించటానికి పూర్వమే కూలీలనందరిని సమావేశ పరచి, వారి మనోభావాల్ని తెలుసుకొంటాడు. భిన్నాభిప్రాయాల్ని వ్యక్తం చేసిన వారినందరిని సంఘటితంగా ఉండుమని ఉద్బోధిస్తాడు. అవసరమైతే సమ్మె ద్వారా ‘వీరధర్మాన్ని’ అవలంభించేందుకు సిద్ధంగా ఉండుమని హెచ్చరిస్తాడు. చౌదరయ్య తన అభ్యర్థనని త్రోసిపుచ్చి, కూలీల జీవితాల్ని పట్టించుకోకుండా, ఇతర భూస్వాములు తనను అనుసరించకున్నప్పటికీ, తన పంతం నెగ్గించుకోవాలనే పట్టుదలతో కూలిని తగ్గించేందుకు ప్రయత్నిస్తాడని

గ్రహించిన సంగదాసు కూలీల నాయకులను రహస్యంగా పిలిపిస్తాడు. చౌదరయ్య ఎట్లాగైనా కూలి తగ్గిస్తాడని, అందువల్ల వేరే చోట్లకు మామూలు కూలి ఏర్పాటు చేసుకొని వెళ్లమని చెప్పి, చౌదరయ్య మీద నమ్మె కట్టేట్టు చేస్తాడు. తను ఏమీ తెలియనట్లు రామానాయుడిని తీసుకొని బెజవాడలో జరుగు పంచమసభకు వెళ్లిపోతాడు

సంగదాసు బెజవాడ సభలో ఉన్నసమయంలో; మంగళాపురంలో కూలీలు ఒక్కరూ చౌదరయ్య పొలానికి వెళ్ళరు. గుంపులు గుంపులుగా బయలుదేరిన కూలీలు తన పొలానికే వస్తున్నారనుకొన్న చౌదరయ్యకు, కూలీలు వారిలో వారు నవ్వుకుంటూ వెళ్ళిపోవడం తల తీసేసినట్లవుతుంది.

ఈవిధంగా చౌదరయ్య యొక్క అధర్మంపైన సంగదాసు మార్గదర్శకత్వంలో కూలీలు సహాయ నిరాకరణం అవలంభిస్తారు. కూలీలవల్ల తను పొందిన అవమానాన్ని భరించలేని చౌదరయ్య ఉద్రిక్తతకులోనౌతాడు. దీనికి సంగదాసు కారకుడని తెలుసుకొని 'చంపాలెనని ఉద్దేశం లేకపోయినా చచ్చేటట్టు' కొడతాడు (మా. ప. 204). ఆ దెబ్బతో సంగదా.. మరణిస్తాడు. ఇక్కడొక విషయం గమనించాలి. సంగదాసు మరణం ధర్మానికి తగిలిన తాత్కాలిక ఆఘాతం మాత్రమే. ఎందుకంటే, 'ధర్మ విజయ మెపుడూ బలి కోరుతుంటుంది' (మా.ప. 125) అంతేకాదు,

> "ధర్మనిరోధ ప్రయత్నంలో బాధ కలుగజేసేవాండ్లకూ, బాధపడే వాండ్లకూ ప్రత్యేక వ్యక్తిత్వముండదు. ప్రత్యేక వ్యక్తులయొక్క జయాపజయాలకు ధర్మవిజయంతో సంబంధం లేదు.... మహాను భావులు పడిన బాధలు వారికపజయాలు గావు. వారు పూనిన ధర్మానికి బలియై ధర్మ సంస్థాపనకు మార్గమేర్పరచారు"
> (మా. ప. 127-28).

కాబట్టి, సంగదాసు మరణం చౌదరయ్య సాధించిన విజయం కాదు. సంగదాసు మరణం అధర్మానికీ విజయం కాదు. సంగదాసు చౌదరయ్య వద్ద జీతగాడుగా ఉంటూ, అతనికి నష్టం రాకుండా తన బాధ్యతను గుర్తించుకొని ప్రవర్తిస్తూనే మరొకవైపు ధర్మ విజయంకోసం కూలీల తరపున నిలిచి, తాను పూనిన ధర్మానికి బలియై ధర్మ విజయానికి తోడ్పడినాడు.

సంగదాసు మరణంతో కూలీలంతా ఏకమై చౌదరయ్యకు వ్యతిరేకంగా నిలుస్తారు. చౌదరయ్య పంట కోసేందుకు ఎవరూ ముందుకు రారు. దాంతో, 'ఇరవైపుట్ల జొన్నలూ మట్టిలో' కలిసే ప్రమాదం ఏర్పడుతుంది. పొరుగూరు కూలీలు మంగళాపురం చాయలకే రామంటారు. చివరికి, చౌదరయ్య కూలీలతో కాళ్ల బేరానికి రాక తప్పని పరిస్థితి ఏర్పడుతుంది 'జుల్మానాగా' అయిదురోజుల కూలి ముందుగా వసూలుచేసిన తర్వాతే, చౌదరయ్య పొలానికి కోతలకు వెళ్తారు

ఈవిధంగా చౌదరయ్య యొక్క అధర్మప్రవృత్తిపైన సంగదాసు కూలీలను సమైక్యపరచి ప్రత్యక్షంగా వారిని సంఘర్షణకు దించి, విజయం సాధిస్తాడు.

కాగా, వెంకటదాసు సంగదాసు కంటే భిన్నమైన మార్గంలో 'ధర్మ కన్నాల' ద్వారా ధనవంతులందరి మీద ప్రత్యక్షంగా సంఘర్షణకు దిగుతాడు. బీదలసుఖ విస్తున్న కడగండ్లకు, లోకంలోని దుస్థితికి ధనవంతులే కారణమని, ధనవంతు లందరిమీద 'ధర్మయుద్ధం' ప్రకటిస్తాడు. 'ధర్మకన్నాలు' వేసేందుకు పూను కొంటాడు.

ఒకసారి కుటుంబమంతా ఒకచోట కూర్చొని కుటుంబ పరిస్థితులను గూర్చి చర్చించుకొంటున్న సమయంలో వెంకటదాసు తన భవిష్యత్కార్యక్రమాన్ని ఇలా వివరిస్తాడు.

> "ధర్మానికి వ్యవస్థలేదు.... ధర్మం చాలాకాలం క్రిందటనే పెడదారి బట్టింది. నేను చేసే యుద్ధం ధర్మయుద్ధం. పౌరుషమనీ, ప్రతాప మనీ, దేశాభిమానమనీ, ధర్మ రక్షణమనీ పేర్లుపెట్టి స్వలాభ ప్రేరితులై భాగ్యవంతులు లక్షల కొలది బీదజనులను రణరంగాల్లో బలిదీస్తారు. లోభుని ప్రతినిధులైన, ధర్మవినాశకులైన భాగ్యవం తులమీదనే ధర్మయుద్ధం ప్రకటిస్తాను. రాజులు యుద్ధాలుచేసి దేశాలను నాశనం చేస్తే, నేను స్వల్ప సంఖ్యాకులైన భాగ్యవంతు లను నాశనం చేస్తాను. వాళ్లు సంఘాలను దోస్తే, నేను కుటుంబాలను దోస్తాను. వాండ్లు అధర్మ చట్టాలను ఫిరంగుల బలంతో చాలాయించు కుంటే, నా బాహు బలంతో నా ఉత్తర్వులను అమల్లో పెడతాను. భాగ్యవంతుల ధన ప్రాణ రక్షణం అతడు చేస్తే, బీదలకు

జీవనోపాధి నేను కల్పిస్తాను. దొంగలమయితే ఉభయులమూ దొంగలమే" (మా. ప 311).

ఈ భావనతోనే వెంకటదాసు తన శక్తి మేర సంస్కరణకు పోరాడే వీర స్వభావంతో, తానాశించిన కార్య సాధన ప్రధానంగా భావించి, తనదైన ఒక వర్గాన్ని తయారుచేసి, ధనిక వర్గంమీద యుద్ధానికి సిద్ధపడతాడు.

సాత్వికమైన ధర్మ మార్గంలో న్యాయ సాధనకై పోరాడిన తన తమ్ముడు సంగదాసు దుర్మరణం పాలపడంతో, వెంకటదాసు ఈ మార్గాన్ని ఎన్నుకొంటాడు. తన మార్గాన్ని 'అధర్మ మార్గ'మని జోతి నిరసించినప్పటికీ, తాను ధనవంతులవటే స్వార్థం ఆశించడంలేదని, అందువల్ల తన యుద్ధాన్ని 'ధర్మయుద్ధం'గా భావించి, దీన్ని ఆచరించేందుకై అనుచరులను కూడగట్టుకొంటాడు. అదివరకు వారిలో ఉన్న 'మద్యపానం', 'వ్యభిచారం' మొదలైన దురభ్యాసాల్ని మాన్పించి, ఇటు స్వదేశీ ధనవంతులపైనా, అటు వీరి అక్రమాలకు కొమ్ముకాస్తున్న విదేశీ ప్రభుత్వంపైనా, యుద్ధాన్ని ప్రకటించి సమాజంలో కలకలను తెస్తాడు. వెంకటదాసు తను సాగించిన ఉద్యమంవల్ల బీదల విషయంలో మూడు సత్ఫలితాల్ని సాధిస్తాడు. అవి బీదలలో ఐక్యతను కల్గించడం దురభ్యాసాల్ని మాన్పించడం. వాస్తవ పరిస్థితుల్ని, దోపిడీలకు కారణాల్ని ఇటు ప్రజలూ, అటు ప్రభుత్వమూ గ్రహించేట్టు చేయడం.

ఈ విధంగా వెంకటదాసు 'దండోపాయం' ద్వారా ప్రత్యక్ష సంఘర్షణకు దిగి, తానాశించిన మార్పు తీసుకురావటం కోసం ప్రయత్నించి, ఆ ప్రయత్నంలో 'ఆత్మబలిదానం' చేస్తాడు.

## భిన్న మతాల మధ్య సంఘర్షణ :

భారతీయులలో అనైక్యతను సృష్టించేందుకు హిందూమతంలో చీలికలు తెచ్చి, తద్వారా భారత దేశంపై తమ ఆధిపత్యాన్ని కొనసాగించేందుకు చేసిన ప్రయత్నమే హిందూమతంపై క్రైస్తవ మతం దాడి.

ఒక మతచ్ఛాయలో తమ జీవితాల్ని తాము జీవిస్తున్న వారి తాత్కాలికమైన అవసరాల్ని, వారిలోని అజ్ఞానాల్ని తమ కనుకూలంగా మలచుకొని, తమ

మతాన్ని వారిపై రుద్దే ప్రయత్నం అధర్మయుక్తమైంది. ఇట్లాంటి పరిస్థితుల్లో దక్షులైనవారు ముందుకు వచ్చి ఇతర మతాన్నుండి స్వమతాన్ని పరిరక్షించుకోవడం కోసం చేసే ప్రయత్నాన్ని మత సంఘర్షణగా చెప్పుకోవచ్చు.

మనదేశంలో తమ స్థానాన్ని పదిలపరచు కొనేందుకు ఆంగ్ల ప్రభుత్వం చేసిన అనేక ప్రయత్నాల్లో మతం మీద దాడి ఒకటి. ందుకై 1813లో మిషనరీలకు ఆంగ్ల ప్రభుత్వం అనుమతినిచ్చింది అప్పటి నుండి మిషనరీలు తమ మత ప్రచారానికి ప్రజా సమూహం ఎక్కువగా ఉండే సంత బజార్లను ఉపయోగించుకోవడం ప్రారంభించినారు. హిందూ మతాన్నీ, పూజ్యులనూ, పుణ్యక్షేత్రాలనూ నిందిస్తూ పాఠశాలల్లో పుస్తకాలు, కరపత్రాల ద్వారా హిందూమత వ్యతిరేక ప్రచారం ప్రారంభించినారు.[36] హిందువులనేకుల్ని తమ మతంలోకి ఆకర్షించుకొంటు[37] న్నారు. ముఖ్యంగా స్వదేశీయులైన అగ్రవర్ణాలవారిచేత సాంఘికంగా దూరం తరుమబడి, ఎలాంటి అభివృద్ధీ నోచుకోని మాల, మాదిగ వంటి నిమ్న జాతులకు ధనాన్ని, ఉద్యోగాల్ని, ఇతర సౌకర్యాల్ని ఎర చూపించి తద్వారా హిందువులలో చీలికలు లేవడానికి మిషనరీలు పలువిధాలుగా ప్రయత్నిస్తున్నారు. మరొకవైపు దౌర్జన్యం నెరపడానికి కూడా వీరు వెనుదీయడం లేదు.

ఈ పరిస్థితి ఇలాగే కొనసాగినట్లైతే, కొద్దికాలంలో పంచములు మొదలైన వారంతా క్రైస్తవం పుచ్చుకోవచ్చు (మా.ప. 315-16) ఇట్లాంటి పరిస్థితిలో హిందువులంతా ముక్త కంఠంతో క్రైస్తవాన్ని ప్రతిఘటించాల్సిన అవసరం ఎంతేని ఉంది. ఈ బాధ్యతను మాలపల్లిలో నిమ్నజాతికి చెందిన రామదాసు, సంగదాసులతో పాటు అగ్రవర్ణానికి చెందిన రామానాయుడు మొదలైనవారు చేపడతారు. వీరిలోని దక్షత కారణంగా మాలపల్లిలో క్రైస్తవం వ్యాప్తి పొందలేకపోతుంది. ఈ విషయాన్ని మాలపల్లిలో స్పష్టంగా దర్శించవచ్చు.

భారతదేశంలో క్రైస్తవ మత ప్రచారానికి పాదరీలు చేయని ప్రయత్నమంటూ లేదు. కలపాల సూర్యప్రకాశరావుగారన్నట్లుగా—

> "క్రిష్టియన్ మతమును ప్రవేశపెట్టి, క్రైస్తవ పాదరీల ద్వారా భారతీయ తాత్విక చింతనను అవహేళన చేయసాగారు. అనేక మంది భారతీయులను ప్రలోభపెట్టి క్రిష్టియనులుగా మార్చివేయసాగారు. ఆ మతములో చేరిన వారికి ప్రత్యేక సదుపాయాలు

> ఎరచూపించారు. ఈ ఎరకులోనై హిందూమతములో హీనముగా చూడబడే క్రింది జాతులు క్రిష్టియనులుగా మారి ప్రభుత్వానికి మద్దతు దారులుగా తయారయ్యారు. కొద్దిమంది పై తరగతులవారు కూడా స్వార్థంతో క్రిష్టియనులయ్యారు''38.

క్రైస్తవ మత ప్రచారకుల ప్రయత్నాల ఫలితంగా క్రైస్తవ మతం ఆంధ్ర దేశంలో, విశేషించి గుంటూరులో వ్యాప్తికి వస్తుంది39 ఈ విషయం మాలపల్లిలో ఇలా తెల్పబడింది.

> "గుంటూరు జిల్లాలో... పల్నాడు, సత్తెనపల్లి తాలూకాలలో కొన్ని ఊళ్ళయందు బ్రాహ్మణులూ, కోమట్లూ, పంచములూ తప్ప తక్కిన వాళ్ళంతా జ్ఞాన స్నానం చేసి కిరోలిక్కు మతాన్ని స్వీకరించారు... ప్రస్తుతం సంపూర్ణమైన క్రైస్తవ గ్రామాలు పాటిబండ, పొడపాడు, తాళ్ళచెరువు, రావిపాడు.. సాధారణంగా తోగట, రెడ్డి, గండికోటకమ్మ తెగలవారే క్రైస్తవులైనారు'' (మా ప. 315)

ఈ పరిస్థితి ఇలాగే కొనసాగినట్లైతే ముందు ముందు హిందువులలో అధిక సంఖ్యాకులు క్రైస్తవులుగా మారే ప్రమాదమున్నది. ఈ విషయాన్ని గమనించిన హిందువులు ప్రతిఘటనోద్యమాన్ని ప్రారంభించినారు.40

ఫాదరీలు హిందువులను తమ మతంలోకి మార్పించడంతో ఆగిపోలేదు. హిందూమతాన్ని పరిపరి విధాలుగా విమర్శిస్తూ, ఖండించసాగినారు. వీరి ఈ విమర్శలను, ఖండనలను ఎదుర్కొనటంతో పాటు, హిందూమతాన్ని పునర్విచారంతో, పునరుద్ధరించి దానిలోని ఉత్కృష్ట మూల్యాలను వ్యాప్తి చేయాల్సి రావడం అవశ్యకమైంది.41

ఈ విషయంలో రామదాసు కుటుంబంతో పాటు, రామానాయుడు మొదలైన పలువురు బాధ్యత వహించి ముందునిలుస్తారు. క్రైస్తవ మత దాడిని అడ్డుకొనడంతో పాటు, హిందూ మతంలోని సర్వమానవ సౌభ్రాతృత్వ లక్షణాన్ని వెల్లడి చేస్తారు. హిందువులలో అగ్రవర్ణాలకు చెందిన పలువురు జాతి భేదాన్నంగీ

కరించక పోవడంతో పాదరీలు మతవ్యాప్తికై మరొక ఎత్తువేస్తారు ఈ విషయాన్ని ఉన్నవ నవలలో ఇలా తెల్పినాడు.

> "యింత వరకు చాతుర్వర్ణ్యముల వారు ప్రాటెస్టెంటు మతములోకి చేరక పోవడానికి జాతి భేదము నంగీకరించక పోవడమే కారణ మని యెంచి యికమీద ప్రాటెస్టెంటు మతములో చేరువారు తమ జాతి కట్టుబాట్లు విడువ వలసిన పనిలేదని పై వర్గముల వారికి పంచమాదుల సంబంధం లేకుండా వేర్వేరు దేవాలయములు పెట్టించ వలసిందనీ అమెరికా పాదరీలు క్రొత్తయెత్తు యెత్తినట్టు తెలుస్తుంది" [మా. ప. 316].

పలుచోట్ల తమ మత వ్యాప్తిని చేసిన పాదరీలు మంగళాపురంలో కూడా మత వ్యాప్తికై అనేకసార్లు ప్రయత్నిస్తారు. అయితే, రామదాసు, సంగదాసులతోపాటు రామానాయుడి కారణంగా మంగళాపురంలో పంచములెవ్వరూ క్రైస్తవాన్ని ఆశ్రయించరు. రామదాసు ప్రతిఘటించి వాదించడం వల్లనూ, సంగదాసు ప్రశ్నలకు జవాబు చెప్పలేకా, చౌదరయ్య హిందూ మతాభిమానాన్ని ప్రదర్శించడం వల్లనూ క్రైస్తవ మతం మంగళాపురంలోకి ప్రవేశించ లేకపోతుంది. ఈ విధంగా క్రైస్తవ మత వ్యాప్తికై చేసిన పాదరీల మొదటి ప్రయత్నం విఫలమవుతుంది.

తమపై అగ్రవర్ణానికి చెందిన భూస్వామి చౌదరయ్య వేసిన అక్రమ దావా వల్ల ఒకవైపు రామదాసు ఆస్తి కోల్పోతాడు. మరొకవైపు, వీరి కుటుంబానికాధారమవుతాడనుకొన్న అప్పాదాసు ఉద్యోగం కూడా ఈ అగ్రవర్ణాల ప్రాబల్యం కారణంగానే పోతుంది. ఇట్లా రామదాసు కుటుంబం చితికిపోయి, అసహాయస్థితిలో ఉండగా, ఈ పరిస్థితిని తమకనుకూలంగా మలుచుకొని రామదాసును లోబరచుకొని తద్వారా, మంగళాపురంలో క్రైస్తవ మత వ్యాప్తికై పాదరీలు రెండవసారి ప్రయత్నిస్తారు.

పంచములకు గుడి కట్టిస్తామని, బడి ఏర్పాటుచేసి రామదాసు మేనల్లుడు అప్పాదాసుకు, కూతురు జోతికి ఉపాధ్యాయ పదవులిచ్చి పెద్ద జీతాలు ఏర్పాటు చేస్తామని పాదరీలు రాయబారాలు నడుపుతుంటారు (మా. ప. 317). ఇట్లా ఎన్ని

విధాలుగా ప్రలోభపెట్టినా రామదాసు ఏమాత్రం ఆశపడడు. హిందూ మతం కంటే క్రైస్తవమే గొప్పదని ఒప్పిస్తే క్రైస్తవ మతంలో కలుస్తానంటాడు. రామదాసు మొదట ఏ విధంగా బెట్టుచేసినా, చివరికి తమ మతంలోకి వస్తాడని, రామదాసుకు "మనసులో మతం స్వీకరించవలెననే ఉన్నదనీ, పొట్టే ఒప్పిస్తుందనీ ప్రచారకులు" (మా. ప. 317) పాదరీకి చెప్పి ఆ రోజు సాయంత్రం సభ ఏర్పాటుచేస్తారు. ఈ సభలో రామదాసు, రామానాయడులు హిందువుల పక్షం వహించగా, వీరితోపాటు స్వాభావికంగా హిందూ మతాభిమానియైన చౌదరయ్య-

> "ఫాదరీ తనకు మునసబు పని రాకుండా పాత మునసబు కొడుక్కిప్పించి నందువల్లనూ, మునసబు ఫాదరీ పక్షంచేరడం చేతనూ, రామదాసు కాపురం చితకడంతోటే కూలి నమ్మేలు నశిస్త వని భావించడం చేతనూ, ఫాదరీని ఊళ్లో అడుగుపెట్టనిస్తే తన ఘాటీ సాగదని యోచించుకొని ఆ సభలో హిందువుల పక్షమే వహించి కూర్చున్నాడు" (మా.ప. 317).

ఆనాటి సభలో తమ మత ప్రాబల్యాన్ని తెల్పుతూ ఫాదరీ- ఏసుక్రీస్తు ఒక్కడే దేవుడని, క్రైస్తవమత ఆధిక్యతను చాటుతాడు దీనికి సమాధానంగా రామదాసు హిందూమతం యొక్క ఔన్నత్యాన్ని తెల్పుతూ- "అన్ని మతాలూ దేవుడు ఒక్కడనే చెప్పుతవి. దేవతలు అనేకులుండవచ్చు వారిని ఇతర మతస్థులు దేవ దూతలు మొదలైన పేర్లతో బిలుస్తారు బ్రహ్మ పర్యంతం దేవతలనే హిందువుల నమ్మకం" (మా. ప. 318) అని వివరిస్తాడు. క్రైస్తవులు చెబుతున్న సూత్రాలను ఇంత కంటే పూర్వమే ఎంతో వివరంగా భారతీయ ఋషులు పేర్కొన్నారని తెల్పుతూ, భాగవతాది గ్రంథాలలోని ఉదాహరణల్ని రామదాసు ఎత్తిచూపుతాడు. రామదాసు, రామానాయుడు మొదలైన వారు వేసిన సవాళ్ళకు జవాబులు చెప్పలేక ఫాదరీలు సభ చాలించి వెళ్ళిపోతారు.

ఇక్కడ రామదాసు తన కుటుంబం విపత్కర పరిస్థితులలో ఉన్నప్పటికీ, వయసు మీద పడ్డప్పటికీ స్వార్థానికి మతాన్ని బలిపెట్టక, లేమిని కూడా లెక్క చేయక, ప్రచారకుల ప్రలోభాలకు తల ఒగ్గక, స్థిర మనస్సుతో ఉండగలుగు తాడు. కష్టించి పనిచేస్తూ, కుటుంబాన్ని పోషిస్తుంటాడు. రామదాసుకు గల గాఢ ఆత్మాభిమానం హిందూ మతంనుండి ఇతన్ని విడదీయలేకపోతుంది. ఈ విధంగా

క్రైస్తవ మత వ్యాప్తికై చేయబడిన రెండో ప్రయత్నం ప్రతిఘటింపబడుతుంది.

ఆంగ్లేయులు తమ మత వ్యాప్తికి చేసిన మూడవ ప్రయత్నం సెటిల్‌మెంట్ల ఏర్పాటు. మొదట మతంలో కలుపుకొని, తర్వాత సైన్యంలోకి వీరిని చేర్చుకోవడానికి సెటిల్‌మెంట్లు ఏర్పరచబడ్డవి. ఈ విషయాన్ని రచయిత రామదాసు చేత ఇలా అన్పిస్తాడు.

> "ఈ సెటిల్‌మెంట్ల వల్ల దేశానికి మహాపకారం జరగబోతోంది– .. సేనలోకి మనుష్యులను చేర్చుకొనడానికీ, క్రైస్తవ మతం వ్యాపింపచేయడానికీ తప్ప ఈ సెటిల్‌మెంట్ల వల్ల ఇతర ప్రయోజనం లేదు'' (మా. ప. 438–39).

ఆనాటి ప్రభుత్వం తమ ప్రలోభాలకు లొంగక, ఎదిరించిన వారి మీద అక్రమ కేసులు బనాయించి వారి నందరినీ బలవంతంగా సెటిల్‌మెంట్లలో చేర్పించి, నానా ఇబ్బందులకు గురిచేస్తుంటుంది ''. నేరపు జాతులలో చేరినవాండ్లనందరినీ సెటిల్‌మెంట్లలో నుంచి, వాటికి సమీపంలో సేనలను నిలుపవలసిందనీ, మాల మాదిగలను కూడ నేరపు జాతులలో చేర్పించమనీ ఉత్తర్వులు'' (మా ప 374) పంపుతుంది మతంలోకి చేరినవారిని వదలిపెడుతుంటుంది.

రామదాసు ఒక్కడు కారణంగా మంగళాపురంలోని వారెవ్వరూ క్రైస్తవ మతం పుచ్చుకోరు. ఈ అక్కసుతో ప్రభుత్వం రామదాసు మీద 'చోరీ' నేరం మోపుతుంది. మర్యాదగా జీవిస్తున్న రామదాసు కుటుంబం క్రైస్తవ మతంలో కలియక పోవడం మూలంగా సెటిల్‌మెంటుకు వెళ్లాల్సివస్తుంది

సెటిల్‌మెంట్లో కూడా హిందూ మతంమీద క్రైస్తవ మతం చేసేదాడిలో హిందువులు ఎవ్వరూ క్రైస్తవ మతంలోకి చేరకుండా ఉండేందుకు రామదాసు ముందుకు వచ్చి ప్రధాన పాత్ర వహిస్తాడు

రామదాసు సెటిల్‌మెంట్లో రెండు విధాల ప్రయత్నాలు కొనసాగిస్తాడు. ఒకటి. క్రైస్తవాన్ని ప్రతిఘటించడం. రెండోది. హిందువులలో సమైక్యతను కల్గించడం. సెటిల్‌మెంట్లో అక్కడి అధికారి చేసే మతబోధకు పోటీగా తాను

కూడా హింయూ మతాన్ని బోధిస్తానంటాడు. ఈ సెటిల్‌మెంట్లు ఏర్పరచింది కేవలం క్రైస్తవ మతప్రచార కారణకేనని, ఎవరూ మత బోధకు వెళ్లనట్లైతే ఇవి తీసివేస్తారని పుల్లప్ప ద్వారా ప్రచారం చేయిస్తాడు. దీంతో ఒక్కరూ క్రైస్తవ బోధకు హాజరుకారు

ఒకసారి రామదాసు మూడు బొట్లుపెట్టుకొంటే పౌలు "మీరు పంగనామాలు పెట్టడానికి వీలులేదని" అంటాడు. అపుడు రామదాసు "ఎవరేమన్నా ఇబ్బందిలేదు. నేను పెట్టే తీరుతానని'' జవాబిస్తే, ప్రక్కనే ఉన్న పుల్లప్ప "మా జనమంతా నామాలు పెట్టుకొంటారు. నామాలు దొరక్కపోతే ఏ తెల్ల మట్టయినా రాసుకొంటారు" (మా.ప. 430) అని అనటంవల్ల, రామదాసు హింయూ మతాభిమానాన్ని సెటిల్‌మెంటు వాసులలో ఎంతగాఢంగా నాటుకొనేట్లు చేసినాడో పై సంఘటన ద్వారా గమనించవచ్చు.

సెటిల్‌మెంట్లోకి అసలు దొంగలను, నేరాలు చేసినవారిని వదలిపెట్టి, మతంలో కలపని వారిని ధూములిస్తామని, వృత్తులు నేర్పుతామని ఆశచూపించి, గౌరవంగా బ్రతుకుతున్న వారిని తీసుకొని వచ్చి 42 అధికారులు అనేక దుండగాల్ని చేస్తుంటారు.

అధికారులు చేస్తున్న దుండగాల్ని బయటపెట్టటంలో పాటుగా రామదాసు నిమ్న జాతులలో అణగారి ఉన్న మత విశ్వాసాల్ని పునరుజ్జీవింప చేసి, క్రైస్తవ మత వ్యాప్తిని అరికట్టుతాడు. ఇది సహించని పౌలు సెటిల్‌మెంట్ అధికారి ప్రిన్‌సన్ సహాయంతో రామదాసు, పుల్లప్పల మీద అక్రమకేసుపెట్టి, వారిని జైలుకు పంపిస్తాడు. తను లేకున్నా మరొకరిని నాయకునిగా ఎన్నుకొని క్రైస్తవ మతాన్నిత్రిప్పి కొట్టమని ఉద్బోధించి జైలుకు వెళ్ళేందుకు రామదాసు సిద్ధపడతాడు. అంతేకాని, క్రైస్తవ మతస్వీకారానికి ఒప్పుకోడు. ఈ విధంగా క్రైస్తవ మత వ్యాప్తికై చేయబడిన పలు ప్రయత్నాలు ఘోరంగా వైఫల్యాన్ని పొందడం మాలపల్లిలో కన్పిస్తుంది.

## భిన్న దేశీయుల మధ్య సంఘర్షణ :

దేశానికి పరాయి పాలన నుండి విముక్తి కలిగించడానికి భారత జాతి ఆంగ్లేయులతో పోరాడినవిధానం మాలపల్లి నవలాంతంలో ఉంది. భారతీయులు అహింసా

మార్గంలో దేశానికి స్వాతంత్ర్యం సంపాదించడానికి ఆంగ్లేయులతో జరిపిన సంఘర్షణమే భిన్న దేశీయుల మధ్య సంఘర్షణగా చెప్పవచ్చు.

ప్రతివ్యక్తి అధర్మాన్ని ప్రతిఘటించాలి. దాస్యానికి సిద్ధపడకూడదు. జాతి మోక్షానికి చేసే పోరాటంలో స్వార్థ త్యాగానికి వెనుకాడకూడదు. అప్పుడే జాతి మోక్షాన్ని పొందుతుంది. ఇది మాలపల్లిలో ఉన్నవ వ్యక్తీకరించిన ఉదాత్త భావన. ఒకసారి నారాయణరావు పంతులు రామానాయుడితో స్వరాజ్యం కోసం పని చేస్తున్నాంగా అన్నీ తేలుతవి అంటే. అపుడు రామానాయుడు ఇలా అంటాడు.

> "అది పొరపాటు, ధర్మమెప్పుడూ అధర్మాన్ని ప్రతిఘటిస్తుండవలసిందే. అధర్మం ఒకప్పుడు గెలిచినట్టు కినబడ్డా ఆ గెలుపే ధర్మోద్యమానికి ఊపు ఇస్తుంది. ధర్మం గెలువక తప్పదు... స్వాతంత్ర్యభిలాషచచ్చి దాస్యం రుచిస్తే జాతికిగ్గాని, వ్యక్తికిగాని ఇక మోక్షంలేదు. బానిస ఎప్పుడూ తన మోక్షానికై కలహిస్తూ ఉండవలసిందే ఎవడైనా భావదాస్యానికి వశుడైన తర్వాత జాతీయ దాస్యం అసహ్యించుకొని, జాతీయ మోక్షానికి పోరాడగలడని నేనమ్మను. కాబట్టి ప్రతివాడు దాస్యానికి పనపడగూడదు. వ్యక్తి మోక్షానికి పోరాడడం జాతీయ దాస్యానికై చేసే పోరాటానికి అడ్డం వస్తే స్వార్థత్యాగం చెయ్యవచ్చు. అంతకుతప్ప దాస్యవిమోచనానికై పాటుపడకుండా ఉండడం మానవధర్మంకాదు" (మా.ప. 505-506).

ఇక్కడ రామానాయుడిచేత జాతి జాగృతికై భావ దాస్యాన్ని ఈసడిస్తూ రచయిత మాట్లాడించిన విధానం గమనింపవచ్చు.

రామానాయుడి త్యాగౌన్నత్యం, ఉన్నత వ్యక్తిత్వం కారణంగా నారాయణరావు పంతులులాంటి వారెందరో మహాత్ముని పిలుపును పురస్కరించుకొని సహాయ నిరాకరణాది ఉద్యమాలలో చురుకుగా పాల్గొంటుంటారు. స్వాతంత్ర్య సంపాదన కొరకు దేశభక్తులు, నాయకులు, కార్మిక సంఘాలు మహాత్ముని ఆదేశం మేరకు బ్రిటిషువారికి హెచ్చరిక చేస్తూ, దేశమంతా శాంతి సమరానికి సిద్ధపడుతుంది. మహాత్ముడు కొంతకాలం 'ఉపేక్ష' అనే పంచమోపాయం ద్వారా స్వాతంత్ర్య సాధనకై యత్నిస్తాడు.

> "దేశం ఘోర సంగ్రామంలోకి దిగకపూర్వమే శాంతికి భంగం కలుగకుండాజేసి భారతీయుల జన్మ స్వాతంత్ర్యముల నంగీకరించి

ఇందుకుదాహరణ కమలా, మోహనరావులు. వీరు తాము కొన్ని కట్టుబాట్లతో కూడివున్న సమాజంలో ఉన్నామని, సంఘం నిర్మించుకొన్న సాంఘిక కట్టుబాట్ల నతిక్రమించరాదనే భావన ఏమాత్రం వ్యక్తంచేయరు. వీరు కేవలం స్వసుఖాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకొని, సంఘ కట్టుబాట్లను ఛేదించేందుకు సిద్ధపడతారు. వీరిని గూర్చి డి. విద్యేశ్వరిగారి మాటల్లో ఇట్లా చెప్పవచ్చు.

> "Id ప్రభావం ఒక్కటే వారి సహజ ప్రకృతి అని చెప్పాలి. ఒక వాంచ కలుగుతుంది . ఆ వాంఛను తీర్చుకోవటం ఒక్కటే వీరి లక్ష్యం. ... ఈ పాత్రలలో Ego, Super egoలు వాటి సహజ ప్రకృతిని కోల్పోయి, Id ప్రభావానికి లోబడి, ఏరకంగానైనా Idలో ప్రేరేపించబడిన వాంఛలను పరితృప్తి పొందేటట్లు మాత్రమే చేస్తాయి అకారణంగానూ, అనాలోచితంగానూ Idలో పుట్టే కోరికలకు మూలంగాని, పర్యవసానం గాని తెలియనట్లే ఈ పాత్రలు కూడ ఒక వ్యక్తిపట్ల కలిగిన ఆకర్షణలకు కారణం ఏమిటి అని ఆలోచించవు. అవ్యక్తమైన వాంఛను ఏమాత్రం ఆలోచించకుండా తీర్చుకొన్నప్పుడు పర్యవసానం ఏమౌతుందన్న స్పృహ వీరికి ఉండదు. శారీరకమైన వాంఛాపరితృప్తి ఒక్కటే వీరి ధ్యేయం"44

కమలా, మోహనరావులుకూడా తాము కోరిన శారీరక వాంఛా పరితృప్తిని పొందినతర్వాత, తాము చేసిన తప్పిదం తెలుసుకొని, మానసిక శాంతికి దూరమై, చిత్త క్షోభననుభవిస్తూ, ఆంతరంగిక సంఘర్షణకు లోనౌతారు.

కమల యొక్క అవచేతనలో ప్రసుప్తమైన కామవాంఛకు ప్రతీక మోహనరావు. బంధుమార్గంగా వచ్చిన వాడు, వరుసకు మరిది అయిన మోహనరావులోని ప్రతి కదలికను గమనిస్తూ, అతనిపై తనకు గల వాంఛను చూపులద్వారా వ్యక్తం చేస్తుంటుంది కమల. మోహనరావు స్నానం చేస్తుంటే, అతని అందంచేత ఆకర్షింపబడిన కమల తదేక దృష్టితో అతన్నే చూస్తూ నిలుస్తుంది. కమల తనను చూస్తున్నదనే విషయం గమనించిన మోహనరావు ఆమె అక్కడ నిలబడి ఉన్నంత వరకు స్నానం చేస్తూ, కమల లోపలికి వెళ్ళగానే స్నానం ముగించి అన్నానికి వెళతాడు.

కమలా, మోహనరావులిద్దరిలోనూ 'ఇవ్' ప్రకృతి ఒకే స్థాయిలో ఉంది, తాత్కాలికంగా ఒకరిపై మరొకరికి కలిగిన ఆకర్షణను శాశ్వతమైనదిగా భావిస్తారు. ఒకరి కొకరు దగ్గర కావాలని చూస్తుంటారు. ఒక ఏకాంత సమయంలో ప్రణయ సంభాషణ నడచి మనసులోని మాటను వెల్లడించు కొంటారు. ఒకరిపై ఒకరికి కోరిక పెరుగుతుంది. మోహనరావుతో లేచి పోదామని నిశ్చయించుకొన్నప్పటినుండి కమలలోనూ, తర్వాత మోహనరావులోనూ ఆంతరంగిక సంఘర్షణ ప్రారంభ మవుతుంది

## కమల పొందిన సంఘర్షణ:

కమల రెండు దశల్లో ఈ మానసిక సంఘర్షణ పొందుతుంది. మోహనరావు మీది వ్యామోహంలో ఉన్నప్పుడు, మోహనరావు మీది వ్యామోహం తగ్గిన తర్వాత.

### మొదటి దశ:

కమల మోహనరావుతో లేచిపోదామని నిర్ణయించుకొన్న తర్వాత, సావిట్లో ఆడు కొంటున్న కొడుకును చూడగానే ఆమెలో మాతృప్రేమ పెల్లుబికి వస్తుంది. 'సాహు యొక్క నిర్మలమైన నెమ్మోము చూచేవరకు కమలమ్మ హృదయ తాపాలన్నీ శమించి మరులుగొని పట్టి కౌగిలించుకో' బోతుంది [మా. ప. 226]. కాని తల్లి పొందుతున్న ఆంతరంగిక సంఘర్షణను సాహు గమనించక తన ఆటలో తానుండి తల్లిని తప్పించుకొని పరుగెత్తుతాడు. ఇది భరించలేక-

> "కమలమ్మ నిలిచి మత్తిల్లి సాహుపంక వెఱ్ఱిదాని వలె చూచింది. కాఠిన్యం వహించిన మనస్సు వెన్నవలె కరిగి పోయింది. కళవిళ పడ్డది మరిగింది. కళపెళ్లాడింది. గగ్గోలు పడి ఘూర్ణిల్లి పోయింది. బిడ్డను తప్పిపోయిన ఆడుపులివలె ఆక్రోశిస్తూ భవంతిలోకి వచ్చి చాపమీద మొదలు నరికిన చెట్టువలె విరుచుకొని పడిపోయింది." [మా. ప. 227]

ఇక్కడ 'అమ్మ'గా కమల ఎంతో మానసిక సంఘర్షణకు గురియౌతుంది.

రెండవ దశ :

మోహనరావుతో తను కోరిన శారీరక వాంఛా పరితృప్తి కలిగిన తర్వాత కమల తన తప్పు తెలుసుకొంటుంది. తిరిగి ఆమెలో సంఘర్షణ తలెత్తుతుంది. మోహనరావు కమలను ఒంటరిగా వదలి తన అన్నతో వెళుతుంటే, కమలకు మోహనరావు 'దృష్టిపథంలో నుంచి అదృశ్యమై, 'జగత్తు మిధ్య' అవుతుంది. కమల హృదయంలోకి ఒక వైపు కుమారుడు, మరొకవైపు భర్త ప్రవేశిస్తారు. వారిద్దరిని తలచుకొని తల్లిగా సాహుకు, భార్యగా రామానాయుడికి చేసిన ద్రోహాన్ని గుర్తుకు తెచ్చుకొని దుఃఖిస్తుంటుంది. ఆమె మనస్సంతా సాహుచేత ఆక్రమింపబడుతుంది. ఈ విషయాన్ని రచయిత నవలలో ఇలా తెల్పినాడు.

> "ఓయమ్మా – అని సింహపు పిల్లను చూచిన లేడివలె తలుపులు వేసుకొని గదిలోకి పరిగెత్తింది. కాని అవి అతనిని అడ్డలేదు. తలుపులలో గుండా బండితోసహా వస్తున్నాడు. గోడల్లోనుంచి అలాడే వచ్చాడు. గదినిండా తాషాబండ్లే. మనస్సు యెన్నిమైళ్ళు పరిగెత్తినా ప్రపంచమంతా తాషాబండ్ల మయ మయింది. కాలుపెట్ట సందు లేకుండా అక్షౌహిణీల తాషాబండ్లు దిగినవి...కమలమ్మ తప్పించుకొనే ప్రయత్నం మాని వేసింది. ఒక సాహు మంచంమీది కెక్కాడు. ఒకడు పొట్టమీద పడుకొన్నాడు. ఒకడు కమలమ్మ కాళ్ళమీద వుయ్యాల లూగు తున్నాడు." [మా. ప. 265]

ఈ విధంగా కమల మనస్సునిండా సాహు వ్యాపించి, అతని మీద కమలకు గల అవ్యాజమైన పుత్రప్రేమ, ఆమె పొందిన సంఘర్షణ ద్వారా వ్యక్తమౌతుంది, మరొకవైపు, భర్తకు తాను చేసిన ద్రోహాన్ని గుర్తుకు తెచ్చుకొని కుమిలి కుమిలి ఏడుస్తుంది. "రామానాయుడుగారూః మీకెంత ద్రోహం చేశానుః – నీ పత్నీవ్రతానికి దోడు నీకొక పతివ్రత లభింపక పోయెనే యీ పాపి నీకేల తటస్థపడ్డదిః" [మా. ప. 270] అంటూ, క్షణికోద్రేకంలో శాశ్వతమైన ఆనందాన్ని కోల్పోయి నందుకు చింతిస్తుంది. చేసిన పాపం చెబితే పోతుందన్న విధంగా పురాణం చెప్పవచ్చిన రామశాస్త్రితో తన తప్పులను తెలిపి, తన పాపానికి నిష్కృతి

లభిస్తుందో లేదో అని వ్యథ చెందుతూ, రామశాస్త్రిలో రాముణ్ణి చూస్తుంది. కమల ఈ విధంగా భర్తకు, కొడుక్కు చేసిన అపచారం తలచుకొని అంతరంగిక సంఘర్షణను అనుభవిస్తుంది.

## మోహనరావు పొందిన సంఘర్షణ:

మోహనరావుకూడా కమలకు తనుచేసిన ద్రోహాన్ని తలచుకొని అంతరంగిక సంఘర్షణకు లోనౌతాడు. 'క్షణ భంగురమైన ఆనందానికై తానుచేసిన దుష్కార్యం యొక్క ఫలితం' తెలిసి వచ్చి [మా. ప. 231], దాన్ని అనుభవించేందుకు సిద్ధపడతాడు. చదువుకు స్వస్తి పలుకుతాడు. తాను అన్నతో వెళ్ళిన తర్వాత కమలకు 'ఘోటకం' పోసి శవాల బండిలో తీసుకొని వెళ్ళారని తెలుసుకొని 'ఘోరున' ఏడుస్తాడు.

'మనోవ్యాధికి మందులేదు.' కమల దుస్థితికి తనే కారణమని భావించిన మోహనరావు జీవితంలో ఒక్క క్షణం కూడా సుఖంగా ఉండలేకపోతాడు. 'పొద్దుగూకులూ తనగదిలో నిర్విణ్ణుడయి కూర్చుండేవాడు' 'అతని మనస్సే అతనిని బాధిస్తున్నది. శల్యావశిష్టుడౌతున్నది.' 'నెలలు గడచినకొద్దీ మనిషి క్షీణించడమే కాని దిగులు మాయలేదు.' [మా. ప. 360] ఎన్నివిధాలుగా తల్లి, అన్నా విషయమడిగినా ఏదవచం చెప్ప జవాబు చెప్పేవాడు కాదు ఈ మానసిక వ్యథకు లోనైన మోహనరావుకు ఒక్క నిముషం కూడా ప్రశాంతి లభించదు. ఈ అశాంతితోనే అతని జీవితం ముగుస్తుంది

పై విధంగా కమలా, మోహనరావులు 'ఇడ్' ప్రకృతిలో పడిపోయి వాంఛా పరితృప్తిని పొందిన తర్వాత మానసిక సంఘర్షణకు లోనౌతారు.

ఈ విధంగా మాలపల్లిలో పలురకాల సంఘర్షణ పలు ఘట్టాల ద్వారా చిత్రింపబడింది

## కర్మఫలానుభవం:

కర్మఫలానుభవం మనిషికి రెండు విధాలుగా[45] అనుభవంలోకి వస్తుంది. 1. ఇహజీవితంలో. 2. పరజీవితంలో. ఈ జన్మలోనే చేసిన కర్మకు ఫలితం ఇది అని తెలిసేట్టుగా ఉండేది ఇహము, మరణానంతరం మరుజన్మలో అనుభవానికి వచ్చేది

పరము 'ఇహము' వలె 'పర' జీవితం గూర్చి మనకు తెలియదు. అందు వల్ల 'ఇహ' జీవితంలో చేసిన కర్మకు ఫలితాన్ని వ్యక్తి తన జీవిత కాలంలో అనుభవించినట్లుగా చూపితే, అది వ్యక్తి మీద గాఢ ప్రభావం వేస్తుంది. ఇది సత్కార్మాచరణీయానికి ఎంతో ప్రోత్సాహకంగా ఉంటుంది. అందుకే రచయిత తన రచనలోని పాత్రలు 'ఇహ' జీవితంలోనే ఫలితాన్ని అనుభవించినట్లుగా చూపుతాడు. ఈ విధానం 'మాలపల్లి'లో కన్పిస్తుంది డా. అనుమాండ్ల భూమయ్య గారన్నట్లుగా-

> "ఒక రచయిత సత్కార్మ వైశిష్ట్యాన్ని తన ఒక రచనలో వివరింపవచ్చు, మరో రచనలో దుష్కార్మ ఫలానుభవాన్ని చిత్రింపవచ్చు. మరింకో రచనలోనయినా మరింకేదయినా విషయాన్ని చెప్పవచ్చు. కాని విస్తృతమైన ప్రాతిపదికగల మహాగ్రంథంలో, ఇతిహాసంలో, రచయిత కర్మఫలానుభవాన్ని ఉద్దేశ పూర్వకంగా చిత్రిస్తాడు."46

ఈ గురుతరమైన బాధ్యత సభ్య సమాజంలోని రచయిత మీద ఉన్నది. అందువల్ల ఒకవ్యక్తి తెలిసికాని, తెలియక కాని ఒక తప్పు చేస్తే దాని ఫలితాన్ని ఈ జీవితకాలంలోనే అనుభవిస్తాడని, అనుభవించక తప్పదనే భావన రచయిత తన రచనలో కలిగిస్తే, మానవుడు మంచి చెడులు ఆలోచించి అడుగు ముందుకు వేస్తాడు, సత్కార్మయందు ఆసక్తిని పెంపొందించుకొంటాడు. ఈ భావమే 'మాలపల్లి'లో ఒక చోట ఇలా వ్యక్తం చేయబడింది.

> "దాసూ! నాకు మనసు వికలమై పోతున్నది ఇంకో జన్మలో శిక్షిస్తాడంటావు. ఏజన్మలో శిక్షించినా యీ తప్పు జేసినందుకు యీ శిక్షని తెలిసేటట్టు శిక్షిస్తే ప్రయోజనమున్నది గాని పూకిపుమ్మడిగా సంచితమంతా వొక గాదెలోబోసి ప్రారబ్ధమని పేరు పెట్టి జన్మ బత్తెం చేటలో బోసి తినమంటే యేమిప్రయోజనం? శిక్షత్వరగా అనుభవించినా, అలస్యంగా అనుభవించినా, ఇందుకని తెలియక పోతే శిక్షించిన ప్రయోజనంగూడా లేకపోయింది.' [మా. ప. 125]

ఈ భావనతోనే ఉన్నవ 'మాలపల్లి'లో సత్కార్మఫలానుభవంతో పాటుగా, ఇంతకంటే గాఢంగా దుష్కార్మ ఫలానుభవాన్ని చిత్రించినాడు. ఈ దుష్కార్మ

పలానుభవాన్ని పొందిన పాత్రలు ప్రధానంగా చౌదరయ్య, కమల, మోహనరావు, పంతులు మొదలైన వారు.

తరతరాలుగా వస్తున్న భారతీయుల తాత్విక చింతనలో కర్మ ప్రధాన స్థానాన్ని ఆక్రమించింది. ఈ కర్మ సిద్ధాంతమే మానవులను జన్మ పరంపరలకు ప్రధాన కారణంగా భావింప చేసింది. ఈ కర్మ మూడు విధాలు. 1. ప్రారబ్ధం, 2. ఆగామి, 3. సంచితం. పూర్వ జన్మ కర్మ పలానుభవం ఈ జన్మలోనూ ఈ జన్మలోని కర్మ ఫలానుభవం భవిష్య జన్మలోనూ పొందక తప్పదని, అందువల్ల సత్కార్మ చేస్తూ పోయినట్లైతే ప్రతి జన్మలోనూ మంచి ఫలితాన్ని పొందవచ్చుననే విశ్వాసం సత్కార్మా చరణకు కారణ మౌతున్నది. పూర్వ జన్మ కర్మ ఫలానుభవం ఈ జన్మలో పొందుతూ, నిష్కామకర్మ భావనతో సత్కార్మ నాచరించినట్లైతే దాని వల్ల పరమపదాన్ని పొందవచ్చు. ఈ విషయాన్ని రచయిత ఇలా తెల్పినాడు.

> "పుణ్యకర్మలు భోగములను కామించి అనుభవించి, రోసి, వాటిని నశ్వరములని, తుచ్ఛములని, తెలుసుకొని వాటిని గోరక నిష్కామ కర్మలై ....సంచితమును నశింపచేసి.. పునరావృత్తి రహితమైన పరమ పదమును పొందుతాడు." – [మా. ప. 46]

'మాలపల్లి'లో రచయిత ప్రధానంగా రెండు విధాలయిన కర్మను అత్యంత ప్రతిభా వంతంగా చూపినాడు. 1 సత్కార్మ 2 దుష్కార్మ.

**సత్కర్మ:**

ఇందుకుదాహరణ రామదాసు. ప్రారబ్ధాన్ని అనుభవిస్తూ, సత్కర్మనాచరిస్తూ, బ్రహ్మైక్యాన్ని పొందిన విధానం రామదాసులో కన్పిస్తుంది.

**దుష్కర్మ:**

ఇందుకుదాహరణగా చౌదరయ్య, కమల, మోహనరావు, పంతులు పాత్రలను చెప్పవచ్చు.

దుష్కార్మ ప్రధానంగా రెండు తీరుల్లో జరుగుతుంది.

1. బుద్ధిపూర్వకంగా దుష్కర్మను చేయడం. ఇది చౌదరయ్యలో కన్పిస్తుంది

2. పరిస్థితుల ప్రభావం వల్ల దుష్కర్మ నాచరించడం. ఇది కమల-మోహనరావు - పంతులు పాత్రలలో కన్పిస్తుంది.

'మాలపల్లి'లో దుష్కర్మకు ఫలితం అయిదు విధాలుగా చూప బడింది.

1. తన కత్యంత ప్రాణప్రదమైన "వ్యక్తి గౌరవాన్ని" కోల్పోవడం.

2. తన కుటుంబ సభ్యులకు వచ్చిన ఆపదలు, వారి చర్యలవల్ల ఏర్పడ్డ అనివార్యమైన బాధను కుటుంబ యజమానిగా పొంది, మానసిక వేదనకు గురికావడం.

3. చేసిన తప్పుకు శిక్ష స్వయంగా అనుభవిస్తూ, చివరికి పశ్చాత్తప్త హృదయంతో బలవన్మరణాన్ని పొందడం.

4. వ్యక్తులు దేన్ని ఆధారం చేసుకొని దుష్కర్మకు పూనుకొంటారో దానికి క్షతి కలగడం.

5. చేసిన తప్పు తెలుసుకొని పశ్చాత్తాపంతో పాటు తప్పును సరిదిద్దుకొనే యత్నంలో భాగంగా శేష జీవితాన్ని గడపడం.

పైన తెల్పిన అయిదు విధానాల్లో, వరుసగా మూడు విధాలుగా దుష్కర్మ ఫలానుభవం పొందినవాడు చౌదరయ్య. మూడవ విధంతో పాటుగా నాల్గవ విధము కమల, మోహనరావుల జీవితంలో, చివరి విధానం పంతులు పాత్రలో కన్పిస్తుంది. 'మాలపల్లి'లో కర్మఫలానుభవం పొందిన విధానం పై పాత్రలను ఒక్కొక్కటిగా పరిశీలిస్తే గమనింపగలము.

## రామదాసు :

రామదాసు తన జీవితంలో పొందిన కష్టాలు, అనుభవించిన బాధలన్నింటినీ పూర్వ కర్మఫలంగా భావించు కొని అనుభవిస్తుంటాడు. రామదాసుకు వచ్చినన్ని

కష్టాలు, బాధలు 'మాలపల్లి'లో మరెవ్వరికి రావు. ఇన్ని బాధలు అనుభవించికూడా నిష్కామ భావనతో, సుఖదుఃఖాలకు అతీతుడుగా రామదాసు వ్యవహరిస్తుంటాడు.

నవలారంభంలోనే 'మనకు ప్రాప్తం యెంతో అంత' అని రామదాసు చేత చెప్పించడంలో, అటనిలోని కర్మ సిద్ధాంత ప్రవృత్తి తెలుస్తుంది. రామదాసు జీవితమంతా కష్టాలతో గడిచింది. నవలారంభం నుండి అతడు పొందిన బాధలు జీవిత పరమార్థం సాధించేందుకు ఒక్కొక్కటి మెట్లుగా ఉపయోగిస్తవే తప్ప, జీవితంలో క్రుంగి కృశించే పరిస్థితి కలిగించవు.

రామదాసు జీవితంలో పొందిన కష్ట పరంపర :

1. తన చెల్లెలు మీద ఒక మోతుబరి ఆసామి దౌర్జన్యం చేయడం, తర్వాత కొద్ది కాలానికే ఆమె దుర్మరణం పొందడం.

2. సంఘసేవ చేస్తున్న ప్రియ పుత్రుడు సంగదాసు చౌదరయ్య చేతిలో మరణించడం.

3. అక్రమ వ్యాజ్యం ద్వారా తమ ఆస్తిని చౌదరయ్య స్వాధీనం చేసుకోవడం.

4. చేతి కంది వచ్చిన పెద్దకొడుకు వెంకటదాసు వృద్ధాప్యంలో తమను వదలి పెట్టిపోవడం.

5. మేనల్లుడు అప్పాదాసు ఉద్యోగం పోవడం.

6. వృద్ధాప్యంలోనూ న్యాయ జీవనం చేస్తున్న తమను మతంలో కలవ లేదనే నెపంతో దొంగ కేసుద్వారా అప్పాదాసుతో వేరుచేసి, తమ కుటుంబాన్ని సెటిల్‌మెంటుకు పంపడం.

7. సెటిల్‌మెంటులోనూ మతంలో చేరలేదనే కారణంగా అక్కడి అధికారి బ్రౌన్‌సన్ పౌలు సహాయంతో అక్రమ కేసు ద్వారా కూతురు జ్యోతిని, కొడుకు రంగడిని తమ నుండి వేరు చేసి, తమను జైలుకు పంపడం.

8. జైల్లో భార్య ఎడబాటు.
9. ఎరుకల చేత అవమానింప బడడం.
10. జోతీ అప్పాదాసుల మరణం.
11. భార్య మరణం.
12. వెంకటదాసు మరణం.
13. పాకీపని చేయవలసి రావడం.

పై సంఘటనలన్నీ గమనిస్తే, సత్కర్మనాచరిస్తూ ఏ ఒక్కరికి అపకారం తలపెట్టని రామదాసు ఇన్ని కష్టాలు, బాధలు పడడమేమిటని అన్పిస్తుంది. ఇదంతా రామదాసు యొక్క ప్రారబ్ధం. (మా. ప. 391). 'యేది సంభవించినా మహా ప్రసాదమని స్వీకరించే బుద్ధి' కలవాడు (మా ప 39) కాబట్టే రామదాసు తన జీవితంలో ఎదురయినా సంఘటన లన్నింటిని నిశ్చల హృదయంతో అనుభవిస్తూ, జీవితాన్ని సాగిస్తుంటాడు.

ఈ విధంగా రామదాసు పూర్వజన్మ కర్మఫలాన్ని త్రికరణ శుద్ధిగా అనుభవిస్తూ, ప్రస్తుత జన్మలో చేసిన నిష్కామ కర్మవల్ల 'త్రిగుణాతీతుడూ, స్థితప్రజ్ఞుడూ వేదాంత వేది'గా పరిణామం చెంది చివరికి 'పరబ్రహ్మము'లో ఐక్యమవుతాడు.

## చౌదరయ్య :

ధనమే మూలాధారమైన ఈ జగత్తులో డబ్బుకు మనిషి దాసోహమే ఈధన సంపాదన మీది కోరిక మనిషిచేత ఎంతటి దుష్కర్మనైనా చేయిస్తుంది. ఇక్కడ ఉచితానుచితములకు, మంచి చెడులకు స్థానముండదు. ఏ విధంగా తమ అంతస్తును అస్తిద్వారా పెంచు కొందామా అనే ఒక్క ఆలోచన తప్ప న్యాయం, ధర్మం, జాలి, దయ అనేవి వీరిలో మచ్చుకైనా కనబడవు. డబ్బనేది వ్యామోహంవల్ల వీరిలో జ్ఞానం నశిస్తుంది. అహంకారం ప్రబలుతుంది. చేసిన దుర్మార్గానికి ఒకవైపు శిక్ష అనుభవిస్తున్నా వీరిలో జ్ఞానోదయం కాదు. తప్పును దిద్దుకొనే ప్రయత్నంలో ఇతరులను ఆదర్శంగా తీసుకోరు. పైగా కొత్త కొత్త ఆలోచనలతో దౌర్జన్యానికి ఉద్యుక్తులవుతుంటారు. ఇందుకుదాహరణ చౌదరయ్య

తృప్తి అనేది మానవుని జీవితాన్ని ఎంతో ప్రశాంతంగా ఉంచగలుగుతుంది. ఆ తృప్తి లేకపోతే మనిషి ఎంతటి హీన స్థితికైనా దిగజారుతాడు. ఇట్లా దిగజారిన వ్యక్తి చౌదరయ్య. ధన సంపాదనలో భాగంగానే చౌదరయ్య చౌకధరలో కానీ, బాకీల క్రింద కొట్టి వేయించుకొని, కోర్టు వేలముల ద్వారా జప్తు చేయించుకొని తండ్రి ద్వారా సంక్రమించిన ఆస్తిని (భూమిని, ధనాన్ని) ఎన్నో రెట్లు పెంచుతాడు. ధనానికి ఉన్న విలువను గమనించి కూలిని ధాన్యం నుండి డబ్బుకు మార్చుయత్నిస్తాడు. కూలీలను ఒక్కటిగా చేసి సంగదాసు తనకెదురు నిలిచాడనే కోపంతోనూ, తన కొడుకును చెడగొడుతున్నాడనే ఉద్రేకంతోనూ అతని మరణాన్ని కళ్ళ చూస్తాడు. వారి ఆస్తిని అక్రమ వ్యాజ్యం ద్వారా తన పరం చేసుకొంటాడు. వారి కుటుంబానికి ఆధారమైన అప్పాదాసు ఉద్యోగం పోయేటట్లు చేస్తాడు.

తన ఇంట్లో కూడా ఎవరినీ సహించడు. ముఖ్యంగా భార్యలోని దాన గుణాన్ని, కొడుకులోని జాలి గుణాన్ని భరించలేని 'హృదయ శూన్యుడు' చౌదరయ్య. 'కొంప గుల్లవుతున్న'దని భార్య మీద విరుచుక పడతాడు, సూటిపోటి మాటలతో భార్యను, కొడుకును నిందిస్తుంటాడు. ఒక్కపైస కూడ పోనీయకుండా ఎన్నో రకాలుగా డబ్బు మూట గడుతుంటాడు.

చౌదరయ్య వేటినైతే ప్రాణ ప్రదంగా భావించు కొన్నాడో వాటి మీద రచయిత అతని దుష్కర్మకు ఫలితంగా దెబ్బ కొట్టడం జరిగింది. 'నూరారయ్యేది నేమాట దిగను. చెడిపోతారు చెప్పు' (మా. ప. 113) అని కూలీల విషయంలో హెచ్చరించిన చౌదరయ్యకు సంగదాసు చేత జాగృతులైన కూలీలు ఎదురు తిరుగుతారు. సంగని మరణానికి కారకుడైన చౌదరయ్యతో కూలీలు 'అయిదు రోజుల కూలి యిస్తే వచ్చి' చేను కోస్తామంటారు (మా. ప. 189). చివరికి చౌదరయ్య కూలీల ఒడంబడికకు తలవంచాల్సివస్తుంది 'వ్యక్తిగౌరవం'కోల్పోతాడు.

పశ్చాత్తాప శూన్య హృదయుడైన చౌదరయ్య ఎప్పుడైతే రామదాసు ఆస్తిని అక్రమించు కొంటాడో, సరిగ్గా అప్పుడే అతని కోడలు లేచి పోతుంది. ఇది చౌదరయ్య చేసిన దుష్కర్మకు రచయిత వెంటనే చూపిన ఫలానుభవం. రామదాసు ఆస్తిని అక్రమంగా స్వాధీనం చేసు కోవడం వల్ల కలిగిన ఫలితమే అతని కోడలు లేచిపోవడమని, 'తగిన శిక్ష' జరిగిందని ఊరి జనమంతా సంతోషించినట్లుగా రచయిత తెల్పినాడు.

కుటుంబ గౌరవం కాపాడవలసిన బాధ్యత గృహయజమానిది కుటుంబంలో వచ్చే మంచి చెడులకు ముందుగా స్పందించేది కూడా కుటుంబయజమానే. చౌదరయ్య కోడలు లేచి పోవడం అతని కుటుంబానికి తగిలిన పెద్ద ఆఘాతం. ఇది చౌదరయ్య హృదయానికి తగిలిన మొదటి దెబ్బ సూటిగా ఈ ఆఘాతం తగిలింది భర్త రామానాయుడికీ, కొడుకు సాహుకీ అన్పిస్తుంది. విచారించి చూస్తే ఇది చౌదరయ్యకు తాకిన ఆఘాతమనే తెలుస్తుంది.
ఆర్.ఎస్. సుదర్శనంగారన్నట్లుగా-

> "రామానాయుడు సత్పురుషుడు. సాహు అమాయకుడూ, అర్భకుడూ. వారు చేసిన తప్పిదం ఏమీ లేదే! చౌదరయ్య దుష్కార్యకు వీరి కిటువంటి శిక్ష పడటం సహేతుకంగా కనిపించదు. కాని లోతుగా ఆలోచిస్తే సృష్టి రహస్యం యిదే; అనిపించేలా, కథా సంవిధానాన్ని పోషించారు రచయిత. తండ్రుల పాప కర్మలకు బిడ్డలు ఫలితం అనుభవించాలి. **(The sins of fathers are visited on their children)** 47

ఇక్కడ రామానాయుడు ఫలితం అనుభవించినట్లు కనబడ్డా, భర్తగా రామా నాయుడికంటే, గృహ యజమానిగా చౌదరయ్య గౌరవ భంగం కలిగినందుకు మనశ్చాంచల్యాన్ని పొందుతాడు.

రామానాయుడు తనను కాదని, తనకు వ్యతిరేకంగా 'దిగువ జాతుల' ఉద్ధర ణకు, కార్మికోద్యమానికి తన జీవితాన్ని అర్పించ బూనడం చౌదరయ్య హృద యానికి తగిలిన రెండో దెబ్బ. తను ఎవరినైతే వీలైనన్ని విధాలుగా పీడించి, దౌర్జన్యం నెరపి, నానా బీభత్సం చేసినాడో వారి కొరకే తన ఒక్కగా నొక్క కొడుకు జీవితాన్ని పణంగా పెట్టడం భరించలేని చౌదరయ్య మానసికంగా కృంగి, కృశిస్తుంటాడు. ఒక్కడే కొడుకయినందుకు పెద్ద ఉద్యోగం చేస్తాడని ఆశపడ్డ చౌదరయ్యకు ఆశాభంగం కలుగుతుంది.

మరొకవైపు ప్రేమాస్పదుడయిన తన మనుమడు సాహు మరణిస్తాడు. రెండో వివాహం చేసుకోవడానికి రామానాయుడు ఒప్పుకోడు దాంతో వంశం అంతరించి పోతుందనే బెంగ చౌదరయ్యకు పట్టు కొంటుంది. ఇవన్నీ ఒకదాని కొకటి తోడై చౌదరయ్య హృదయంపైన తగిలిన పలు ఆఘాతాలు.

చివరికి చౌదరయ్య నారాయణ స్మరణతో మరణాన్ని పొందుతాడు. చౌదరయ్య ఎంత పాపియైనా, ఉత్తముడైన రామానాయుడు అతని 'గర్భవాసాన జన్మించడం చేత' చౌదరయ్యకు చిత్రంగా 'అవసానదశలో పశ్చాత్తాపం కలిగింది'. ఇంతకూ రామానాయుడి జన్మే చౌదరయ్యకు 'తరణోపాయం' కలిగించింది (మా. ప. 378-379).

ఈ విధంగా చౌదరయ్య దుష్కర్మకు ఫలితం అతని మనస్తత్వంతో, మమకారాలతో ముడిపడి ఉండటం చూడవచ్చు.

## కమల :

రామానాయుడి భార్య కమల ఎలాంటి బాధ్యతలు లేని వ్యక్తి. ఒకసారి చుట్టపు చూపుగా ఇంటికి వచ్చిన మోహనరావును తన అందం చేత ఆకర్షిస్తుంది. తనకు తానై అతడితో ప్రణయ సంభాషణ సాగించి అతడి మీద మరులుగొంటుంది. చివరికి మోహనరావుతో లేచిపోయేందుకు తన పచ్చటి కాపురాన్ని కాలదన్ని దుస్సాహసం చేస్తుంది. ఈ తప్పుకు ఫలితం తర్వాత కమలకు తెలిసి వస్తుంది.

భర్తను, కొడుకును, కుటుంబాన్ని కాదని మోహనరావుతో లేచి పోయిన కొంత కాలానికి సమాజంలో తన పరిస్థితి ఏమిటో గ్రహిస్తుంది కమల చేసిన తప్పుకు ప్రతీ క్షణం మనో వ్యధను అనుభవిస్తుంటుంది. భర్తను, కొడుకును తలచుకొని, వారికి చేసిన ద్రోహం గుర్తుకు తెచ్చుకొని కన్నీరు మున్నీరుగా ఏడుస్తుంటుంది. "నాది దుర్గతి. నాకు నీవు తప్ప యితర ప్రపంచం లేనట్టే, నేను ప్రపంచానికి లేను...ప్రపంచం నాకంధకారమయం. నేను దీనికి మృతురాలి క్రిందనే లెక్క", (మా. ప. 260-61). ఇది కమల చేసిన దుష్కర్మకు తెలిసి వచ్చిన ఫలితారంభదశ.

కమల మోహనరావుతో 'గడియలు రోజులుగా' గడుపుతున్న సమయంలో మోహనరావు వెళ్ళి పోవడంతో కమల మరింత ఒంటరిదవుతుంది. కమల తన ఏ అందం కారణంగా మోహనరావుతో లేచి పోయిందో ఫలితంగా రచయిత ఆ అందంమీద దెబ్బకొట్టినాడు. "తనకూ పరులకూ శత్రువుగా పరిణమించిన అందంపోయి"ంది (మా.ప 271). "యెడమకంట్లో కాయ, కుడికంట్లో పువ్వు,

మోచేతికి మోరు, మీగాలు సొట్ట" [మా. ప. 278]. ఇట్లా కమల అందవిహీన అవుతుంది ఎవరూ గుర్తించలేనంతగా అమె అందం చెడిపోతుంది. యిది కమలకు కలిగిన దుష్ఫలితం.

మోహనరావువల్ల పుట్టిన బిడ్డ మరణిస్తాడు. చేసిన తప్పుకు ఈ విధంగా శిక్ష వెంటనే అనుభవానికి వచ్చినతర్వాత తనలోని పశ్చాత్తాపాగ్ని దహించివేయగా కమల తనకు తానే శిక్ష విధించుకొంటుంది తాను అంతకుపూర్వం ఎక్కడైతే కాలు క్రిందపెట్టకుండా సకల మర్యాదలను పొందిందో ఆ అత్తగారిఇంట్లోనే పని మనిషిగా కుదురుకొంటుంది. వారికి సేవచేస్తూ కాలం గడుపుతుంటుంది. కొద్ది రోజులకే కడుపున పుట్టిన బిడ్డ 'సాహు' కామెర్లవ్యాధితో మరణిస్తాడు. కొడుకు మరణించేముందు కమల సాహుతో తానే ఆతని తల్లిననిచెప్పి ఆ పిమ్మట భర్త రామానాయుడిని పిలిపించి, అతని పాదాలను తన కన్నీటితో అభిషేకించి, అతడి అనుగ్రహాన్ని తిరిగి పొందుతుంది. పోయిన స్థానాన్ని తిరిగి పొందకున్నా తృప్తితో మరణిస్తుంది ఇది పశ్చాత్తాపంవల్ల, నిజం తెల్పటంవల్ల కమలకు కలిగిన ఫలితం.

రామానాయుడు అంతచేసిన చౌదరయ్యకు పలెనే కమలకుకూడా తరణో పాయం చూపాడు. కమల దిక్కులేనిచావు చావదు ఆమెకు కర్మలన్ని సక్రమంగా జరిపించి బడినాయి.

ఈ విధంగా కమల తాను చేసిన దుష్కర్మకు ఫలితంగా అందంచెడి, కడుపున పుట్టిన బిడ్డలు మరణించగా గర్భశోకాన్నిపొంది, చివరికి అర్థాంతరంగా జీవితాన్ని ముగిస్తుంది.

## మోహనరావు :

న్యాయశాస్త్రం చదువుతున్న వ్యక్తి మోహనరావు. సెలవు రోజుల్లో చౌదరయ్య ఇంటికి చుట్టపు చూపుగా వచ్చిన ఇతడు కమలను చూచి ఆమె యొక్క అందంచేత ఆకర్షింపబడతాడు. 'మోహనరావు అయిదారు ఏండ్ల క్రిందట కమలమ్మను చూచాడు అప్పుడామె విశేష సుందరంగా కనబడలేదు'. [మా.ప.210]. ఇప్పుడామెలోని అందమే అతన్ని అప్రతిభున్ని చేస్తుంది.

మోహనరావు కమలచేత ఆకర్షింప బడేందుకు మాటి మాటికి బట్టలు కండ్లద్దాలు మార్చుకొని, తన సౌందర్యం చూసుకొంటుంటాడు. తన కసరత్తు శరీరాన్ని ప్రదర్శించేందుకు 'మామూలుకంటే ఎక్కువసేపు ఒళ్ళు తోముకుంటుంటాడు'. [మా. ప. 612]. కమల ఇదంతా చూస్తుంటుంది.

మోహనరావు తన అందంచేత ఆమెను ఆకర్షించి, తనతో లేచివచ్చేందుకు సిద్ధపడేట్టు చేస్తాడు ఆమెకొరకు చదువును వదలిపెడతాడు. ఇంటికి వెళ్ళడం మానివేస్తాడు అన్న బలవంతంమీద ఇంటికి వెళ్ళివచ్చిన మోహనరావు 'కమలనూ పిల్లవాడిని' చావుబండిలో తీసుకొని వెళ్ళినారని తెలుసుకొని విచారపడతాడు అప్పుడు మోహనరావులో పశ్చాత్తాపం కలుగుతుంది. తన ఈ దుర్మార్గపుపని కమల కిట్టిదశ ప్రాప్తించేందుకు కారణమైందని దుఃఖిస్తాడు. వారి కొరకెంత ప్రయత్నించినా ఆచూకీ ఏమాత్రం తెలియదు.

మోహనరావు తనుచేసినపనికి ఫలితంగా అన్న, తల్లి బలవంతంమీద వివాహంచేసుకొన్నా మనిషేమారిపోతాడు. ఒంటరిగా గదిలోకూర్చొని రామానాయుడికీ, సాహుకీ చేసిన ద్రోహాన్ని గుర్తుకుతెచ్చుకొని తనలో తను కుమిలి పోతుంటాడు. క్షణికోద్రేకంలో చేసిన పాపానికి ఈ విధంగా జీవితమంతా దుఃఖాన్ని అనుభస్తుటాడు. ఎవరికి చెప్పుకోలేక, ఎవరిముందుకు రాలేక సతమత మవుతుంటాడు. "కాపురానికి రాని భార్య'' మరణిస్తుంది. ప్రేమాస్పదురాలైన తల్లి చనిపోతుంది. రామానాయుడి కాపురంలో తానుపెట్టిన చిచ్చు తనను దహించివేయగా, మనశ్శాంతి కరువై తీరనిబాధకు లోనవుతాడు. ఎన్నిప్రదేశాలు తిరిగినా, ఎన్ని పుణ్యక్షేత్రాలు దర్శించినా, ఎందరు మహానుభావుల కలిసినా ఫలితం శూన్యం. మనశ్శాంతిని పొందలేకపోతాడు చివరికి సబర్మతి ఆశ్రమంలో 'మహాత్ముని సాంగత్యం గలిగిన తరువాత కొంత మనశ్శాంతి' పొందుతాడు. [మా. ప. 661]. మరికొంత కాలానికి క్షయ వ్యాధిగ్రస్తుడవుతాడు.

తనలోని ఏ అందమైతే కమల కాపురాన్ని కూల్చేందుకు కారణమైందో, ఆ అందం అంతరించిపోతుంది. మనిషి గుర్తుపట్టకుండా తయారవుతాడు.

> "నిరంతరం వ్యాకులం వల్ల అకాలవృద్ధాప్యంగూడా వచ్చింది. శరీరం పాలిపోయి సన్నంగా బకుడయినాడు. తుమ్మెద రెక్కల వంటి మీసాలూ, ముఖచంద్రుని ముద్దులాడే ముంగురులూ, పైత్య

దారుణంచేత జిగివిచెడి పలితరోగికి పడ్డట్టు తెల్లబడ్డవి. చెంపలూ, గదవలూ జారినవి. ముఖమంతా ముడతలుబడ్డది. గిచ్చొడు బడని దండలూ, రొమ్మూ, తొడలూ వొదులై అల్లల్లాడుతున్నవి. అంకపొంకాలతో వచ్చిన యౌవనపు పొంగంతా ఆరిపోయినది. సర్వాంగాలు శిధిలమై ఆ తేజస్సూ, ఆ నిగనిగలూ, ఆ చెలువూ, ఆ మోహనరూపం యొక్క సొరూ అన్ని మలిగి పోయినవి" [మా. ప. 661].

ఈ విధంగా అందం చెడి, వ్యాధిగ్రస్తుడైన మోహనరావు తన చెడునడతకు ఫలితాన్ని అనుభవిస్తూనే, రామానాయుడు ఏర్పాటుచేసిన కార్మిక కళాశాలకు తన ఆస్తినంతటినివ్రాసి, రామానాయుడిని ధర్మకర్తగా ఉండవలసిందని కోరుతాడు. ఇది మోహనరావు దుష్కర్మకు కలిగిన ఫలితం.

కమల, మోహనరావులు చేసిన ఒకే విధమైన దుశ్చర్యకు ఫలితం కూడ ఒకే విధంగా పొందినట్లు రచయిత చూపినాడు.

### పంతులు :

పంతులు - చౌదరయ్య బ్రతికి ఉన్నంత కాలం అతడికి కుడి భుజంగా ఉంటూ, అతడు చేసే అక్రమాలకు తనూ తోడు నిలుస్తాడు. మాల మాదిగలను, కూలీలను అణచి వేసేందుకు చౌదరయ్య చేసే ప్రతి పనిలోనూ సలహాలిస్తుంటాడు. తను సంపాదించిన సొమ్ముతో ఒక పిల్లవాడిని దత్తు తెచ్చుకొనవలెనని పంతులు ఆశ.

విధి విచిత్రమైంది. తానొకటి తలిస్తే దైవం మరొకటి తలుస్తుంది. చౌదరయ్య మరణం తర్వాత రామానాయుడు, వెంకటయ్యలు కార్మిక, పంచమోద్ధారకులై తమ ఆస్తి పాస్తులతో పాటు, జీవితాలను కూడ ధార పోసేందుకు సిద్ధపడతారు. వీరు తనపై తిరిగి కొత్త బాధ్యతను మోపి, వీలైనంత త్వరగా, సులభ పద్ధతిలో బాకీలు వసూలు చేయమని ఆజ్ఞాపిస్తారు. తను చూస్తుండగానే కార్మిక కళాశాల, వసతి గృహాలకు భవనాలు నిర్మింపబడతాయి.

యజమానుల త్యాగం చూసిన పంతులు "కండ్లు మిరుమిట్లు గొంటవి". [మా. ప. 665] ఒకప్పుడు పంచములను అభిమానించే "బ్రాహ్మణులను వెలివేయ

స్తానని, వేదాంతం కోటమ్మ జుట్టు కోయించి ప్రాయశ్చిత్తం చేయిస్తా"ననీ [మా.ప. 176] బెదిరించిన పంతులే చివరకు ప్రాయశ్చిత్తం చేసుకొనేందుకు ఆస్తిని, జీవితాన్ని 'దిగువ జాతుల' అభివృద్ధికొరకు ధారపోయ వలసి వస్తుంది. ఇది రచయిత పంతులు దుష్కర్మకు విధించిన శిక్ష

పంతులు మొదట్లో రాదయ్య ప్రాపకంలో ఉండి అతడి ప్రోత్సాహం, పోత్రిద్భలాలతో, డబ్బుమీది ఆశతో పరిస్థితులనుబట్టి దుష్కర్మ చేసినప్పటికి దీనికి ఫలితం పంతులు అనుభవిస్తాడు. దత్తు తెచ్చుకోవడం మానివేస్తాడు. అక్రమంగా పేదల పీడించి సంపాదించిన డబ్బంతా 'సంగ కళాశాల'కు చెందేట్లు వ్రాస్తాడు. "తాను జీవించి ఉన్నంతకాలం ఉచితంగా కళాశాలలో గుమాస్తాగా పనిచేస్తానని" [మా. ప. 665–66]. తన తప్పును సరిదిద్దుకొంటాడు.

దుష్కర్మకు తగిన ఫలితం వెంటనే అనుభవానికి వస్తుందన్న విషయాన్ని ఈ విధంగా రచయిత, ఆయా పాత్రలద్వారా ఈ నవలలో తెలియజేశాడు.

## విషాదం :

"రమ్యాణివీక్ష్య మధురాంశ్చ నిశమ్యశబ్దాన్
పర్యుత్సుకోభవతి యత్సుఖితోఽపిజంతుః"

అభిజ్ఞాన శాకుంతలమ్, పంచమాంకమ్ శ్లో॥ 2.

సుఖితుడై ఉండికూడా రమ్యములైనవాటిని చూచి, మధురములైన శబ్దాలను విని జీవుడు పర్యుత్సుకుడగుచున్నాడు పర్యుత్సుకుడు కావడమంటే వేదన పొందడమన్న మాట. అబోధ పూర్వమైనదాన్ని స్మరిస్తూ ఉంటాడు. ఇంతకు పూర్వం తెలియనిదాన్ని స్మరించటం కుదరదు. అందువల్ల ఒకానొక ఆవేదన మనసులో అది ఫలానాఅని గుర్తుపట్టనివిధంగా సాగుతూ ఉంటుంది. సుఖితుడై ఉన్నప్పుడుకూడా ఈ అంతర్వేదన సాగుతున్నదంటే పైకికనిపించే ఈ సుఖంకూడా ఆ ఆవేదనయొక్క ఒకానొక పరిణామరూపమే అనవచ్చు. భవభూతి

"ఏకోరసః, కరుణఏవ నిమిత్త భేదా
ద్భిన్నః పృథక్పృథ గివాశ్రయతే వివర్తాన్" 48

అన్నాడు- కరుణ యొక్కటే వేర్వేరు కారణాలవల్ల వివిధ రూపాలుగా పరిణామం పొందుతుందని భావం. కాళిదాసు చెప్పినదాన్ని భవభూతి మరింత స్పష్టంగా వ్యక్తీకరించినట్లు గమనింపవచ్చు. జీవుని అంటిపెట్టుకొని ఉన్నది దుఃఖం. అది సహజమైంది. అంటే, జీవుడు ఈ శరీరంలో ప్రవేశించినప్పటినుండి అది అతనితోడుగానే ఉన్నది.

> "అమ్మా! దేహమనన్ విచిత్రమగు దుఃఖారామమన్పించు దే
> హమ్మున్నంతన్ జీవి పొందనగు బాధా సహ్యతల్ చెప్పశ
> క్యమ్మా ఒక్కొక్క జీవి ఒక్కొక్కవిధంబై పొందు దుఃఖంబు" 49

ఈ మాటలు శ్రీరాముడు కౌసల్యతో అంటాడు. మానవ జీవితం అనేక దుఃఖాలకు ఆలవాలమైనట్టి ఆరామంలాంటిది. ఈ విషాదమే భిన్నభిన్న పరిస్థితుల కారణంగా, భిన్న భిన్న వ్యక్తులతో కలిమిడి కారణంగా, పొందుతున్న రకరకాల అనుభవాల కారణంగా, అనేక విధాలుగా వ్యక్తమౌతూ ఉంటుంది. ఈ జీవ సహజమైన విషాదం మానవజీవ పరమార్థాన్ని సమగ్రరూపంలో చిత్రించడానికి ఉద్దేశింపబడిన ఇతిహాసంలో అనివార్యంగా అనేక రూపాలలో అద్యంతమూ ప్రవహిస్తూనే ఉంటుంది.

డా॥ కోవెల సంపత్కుమారాచార్యగారి మాటల్లో ఇట్లా చెప్పుకోవచ్చు-

> "జీవేశ్వరుల అవియోగస్థితి సమగ్ర చైతన్యానుభవ రూపము. ఈ స్థితినుండి ప్రకృతితః వియోగముపొందిన జీవుడు సర్వదా తదనుభవమును వాంఛించుచు, అవియోగరూపమగు వేదనను అనుభవించుచుండును. జీవుడు ఉపాధిగతుడగుచునే ఈ వేదనావంతుడగుచున్నాడు. అనగా, ఈ వేదన జీవునకు 'సహజ'మగుచున్నది.... లౌకికోపాధిగత జీవచైతన్యమంతయు ఈ వేదనామయమగుచున్నది.... పరిచ్ఛిన్నోపాధిగతుడైన ఈ జీవుని వేదన దృశ్యమాన పరిచ్ఛిన్నత్వాదుల నధిగమించి విశ్వవ్యాప్తమగు ఈశ్వర చైతన్యముయొక్క సమగ్రత్వమును సాధ్యమైనంతగా, సాధ్యమైనరీతిలో అనుభవించుటకు సర్వథా ప్రయత్నించుచునే యుండును. పరిచ్ఛిన్నత్వాదుల వలన సంక్రమించు కాలుష్యమును తొలగించుకొనుచు విశ్వచైతన్యమును సాధ్యమైనంతగా ఆత్మ సాక్షాత్కరించుకొనుట ఈ ప్రయ

> త్నములోని ప్రధానాంశమే. ఇట్లు జీవనిష్ఠమై ఆంతరికమగు ఈ వేదనయొక్క ఈ విధమైన ప్రవృత్తి ఏదో ఒకదానినాధారించుకొని ఏదో ఒక హేతువుగా అనేక విధములలో, మార్గములలో బహిరభివ్యక్తమగుచున్నది. ఈ ప్రయత్నములో సర్వథా ఈ సాధనలో నుండు జీవుని వేదన సమగ్ర విశ్వచైతన్య లయానుబద్ధతకు ఎక్కడనేమాత్రము విఘాతము, ఆటంకము ఏ రూపములో జరిగినను తీవ్రముగా విచలితమగును. అప్పుడది చలితేంధనాగ్ని. అది ఉద్విగ్నమై ఉత్థితమగును. అత్యల్ప మనిపించునదిగూడ ఇదిట్లు ఉత్థితమగుటకు హేతువు కావచ్చును. హేతువు ఒకప్పుడు స్పష్ట ప్రతిపత్తితో వ్యక్త స్థాయినందుకొనవచ్చును. అందుకొనక పోవచ్చునుగూడ. వేదనయొక్క ప్రత్యగ్రతలోని తీవ్రతనుబట్టి దాని యుబుకుదల యుండును" 50

ఆధునిక ఇతిహాసమైన మాలపల్లిలో విషాదం ఆద్యంతమూ అలుముకొని కొన్నిచోట్ల అంతర్వాహినిగానూ, మరికొన్నిచోట్ల స్పష్టంగానూ వ్యక్తమౌతున్నది. ఈ నవలలో జీవుని వేదన ఆయా పాత్రలలో ఏదో ఒక అంశాన్ని ప్రాతిపదిక చేసుకొని ఏదో ఒక కారణంగా, అనేక విధాలుగా, పలుమార్గాలలో అభివ్యక్తమవటం కన్పిస్తుంది. జీవునిలో అంతర్గతమై ఉన్న ఈ వేదన బహిర్గతం కావడానికి అతనికి తెలియకుండానే లౌకికమైన అత్యల్ప హేతువులుకూడా దోహదపడడం మాలపల్లిలో చూడవచ్చు.

నవలలో ఈ విషాదం పలు పాత్రలద్వారా బహుముఖాలుగా వ్యక్తీకరింపబడ్డది. ఇందులో వ్యష్టి, సమష్టి ప్రయోజనార్థం జీవితాల్ని త్యజించినవారితోపాటు ఆ ప్రయత్నంలో విషాదంగా జీవితాల్ని ముగించినవారు, విషాదమయ జీవితాల్ని గడిపినవారు కన్పిస్తారు. వీరితోపాటుగా స్వార్థంతో స్వసుఖాన్ని, స్వప్రయోజనాన్ని మాత్రమే లక్షించి అపమార్గాన్ని అనుసరించినవారుకూడా జీవితంలో ఆకాంక్షించిన సుఖంకంటె ఎక్కువగా విషాదాన్నిపొంది పరమార్థ దిశగా పయనించటం కన్పిస్తుంది.

మాలపల్లి నవలయొక్క ఆరంభం విషాదంతో కావడం ఇక్కడ గమనించాలి. దిగువకులానికి చెందిన సుబ్బలక్ష్మి చేను గట్టుమీంచి నడచివస్తున్నంత

మాత్రానసే ఒక మోతుబరి ఆమెపై దౌర్జన్యంచేస్తాడు. దిగువ కులాలవారిని ఏ విధంగా హింసించినా తమనడిగేవారులేరనే ధీమా, ధన ప్రాబల్యంగల అగ్రివర్ణాల వారిలో కన్పిస్తుంది. రచయిత ఈ సంఘటనద్వారా నవలలో విస్తృతంగా పరచుకొన్న విషాదచ్ఛాయకు బీజావాపన చేయటం ఇక్కడ గమనార్హం.

అగ్రివర్ణాలవారు తమ మీద సాగిస్తున్న దౌర్జన్యాల్ని రూపుమాపి, దిగువ కులాల వారిలో చైతన్యాన్ని కల్గించేందుకు మొట్టమొదటిసారిగా మాల కులానికి చెందిన సంగదాసు ముందుకు వస్తాడు. తమ వారిపై జరుగుతున్న దౌర్జన్యాల్ని, అవమానాల్ని గమనిస్తూ, తమయొక్క నిస్సహాయస్థితికి లోలోపలే విషాదాన్ని పొందుతుంటాడు. సంగదాసు జీవగతమైన ఈ విషాదం దిగువ కులాల వారిని ఉద్ధరించ ప్రయత్నించడంలో బయల్పడుతుంది. రచయిత సంగదాసు పరిచయం లోనే అతనిలో మూర్తీభవించిన విషాద భావ రేఖను ఇలా తెలిపినాడు.

> "యిరవై సంవత్సరముల వయస్సుగల వొక యౌవనుడు... ముఖం గడ్డం దగ్గర సాగి కణతల వైపున విశాలమవుతుంది. కను బొమలు ముందుకు పొడుచుకొని వచ్చి అతడు మేధావంతుడని సూచిస్తున్నది. కండ్లు తేటగలిగి విశేషంగా చలింపక దీర్ఘాలోచ నమునూ, విషాదమునూ వెల్లడిస్తున్నది" (మా.ప. 39, 4౨).

వ్యక్తిగతంగా ఉన్నతుడు, కుటుంబపరంగా మంచి స్థితిలో ఉన్నవాడు సంగదాసు. అయితే అతని దీర్ఘాలోచనమూ, విషాదమూ సమాజంలో దిగువ కులాలవారు పొందుతున్న బాధలు, అగ్రవర్ణాల వారి వేధింపులను చూచి.

సంగదాసు తండ్రి రామదాసు తమవారికి జరుగుతున్న అన్యాయాల్ని కర్మఫలంగా భావించుకొంటూ, భవిష్యత్తుని భగవంతునికి వదలివేసి, మరొక మార్గాన్ని అనుసరించగా, యువకుడు, చదువుకొన్నవాడు, విశేషమైన తెలివి తేటలు గలవాడైన సంగదాసు మాత్రం అలా అనుకొని ఉండలేకపోతాడు.

సంగదాసు దిగువ కులాల వారి అభివృద్ధికై చేస్తున్న ప్రయత్నాల్ని సహించలేని అగ్రివర్ణాల వారు అతన్ని చంపి తృప్తి చెందుతారు.

సుబ్బలక్ష్మిపై మోతుబరి దౌర్జన్యం, ఆమె మరణించడంతో ఆరంభమైన

అగ్రవర్ణాలవారి దౌర్జన్యాలు సంగదాసును హత్యగావించడంతో మితిమీరతాయి. దిగువ కులాలవారిలోని విషాదం పతాకా స్థాయికి చేరుకోవడం ఇక్కడ చూడవచ్చు. సంగదాసు మరణానికి మంగళాపురంలో శోకించని హృదయమంటూ ఉండదు. అక్కడ కన్నీళ్ళు కాల్వలై ప్రవహిస్తవి. సంగదాసు తల్లి మాలక్ష్మి రోదనం అత్యంత హృదయ విదారకంగా ఉంటుంది (మా ప. 168, 69, 71)

సంగదాసు మరణం పలువురిని పలురకాలుగా జాగృతుల్ని చేస్తుంది. రామదాసు నొక రకంగా, వెంకటదాసు నింకొక రకంగా, మరొక రకంగా రామానాయుడిని.

జీవితంలో అత్యంత విషాదాన్ని పొందిన వారిలో ప్రప్రథమంగా రామదాసును పేర్కొనవలసి ఉంటుంది.

రామదాసు పూర్వీకులు మూడు తరముల నుండి అచల బోధను స్వీకరించి "సర్వసమత్వాభిప్రాయములూ, స్వతంత్ర బుద్ధీ, సంఘసేవాపేక్ష, శౌచమూ, పారమార్థిక చింతా" కలిగి ప్రవర్తిస్తుంటారు. ఇట్లాంటి కుటుంబంలో జన్మించిన రామదాసు గురువువల్ల 'కారణం' పొందినప్పటి నుండి అప్రాప్తమైన మోక్షపదాన్ని పొందటానికి ఐహిక విషయాల మీద వైముఖ్యాన్ని ప్రదర్శిస్తుంటాడు. పెద్దకొడుకు వెంకటదాసు ఇంటి బాధ్యతను స్వీకరించినప్పటి నుండి రామదాసు ఎక్కువ కాలాన్ని ఆధ్యాత్మిక చింతనలో గడుపుతుంటాడు అచల గురువైన వీరయ్య యోగివరేంద్రుని కరుణచే యోగనిద్రను పొందుతూ, యోగులు పొందే మహదానందాన్ని తరచూ అనుభవిస్తుంటాడు.

రామదాసులో లౌకిక జీవితం ఎడల నిరాసక్తి, పారమార్థిక చింతయందు ఆసక్తి ఏర్పడినప్పటికీ, సంగదాసు మరణం రామదాసును కదలించి వేస్తుంది. 'రామదాసు దుఃఖాన్ని ఆయన వేదాంతం ఆపలేకపోతుంది. పెద్దపెట్టున సంగన్నా అని కేకవేసి ఏడుస్తాడు. (మా.ప. 169)

సంగదాసు మరణం రామదాసును కదలించివేసినప్పటికీ, తత్కాలీనంగా పొందిన ఆ విషాదభావాన్ని రామదాసు వెంటనే అధిగమిస్తాడు. రామదాసులో అతని చెల్లెలు మరణంతో ఆరంభమైన విషాదమయ జీవితం క్రమోన్మీలనం పొందుతూ నవలలో చిత్రితమయింది. రామదాసుకు సంగదాసు మరణంతోటే విషాదమయ

జీవితం అంతమవదు. తర్వాత అగ్రివర్ణాలవారు అతని సంపదనంతా వశపరచు కోగా, ఆ స్థితికి తట్టుకోని నిలుపలేని వెంకటదాసు ఇల్లును, వృద్ధులైన తమను వదలిపెట్టి పోతాడు. మఠంలో కలపలేదనే కారణంగా నాటి ప్రభుత్వం అతని కుటుంబాన్ని మేనల్లుడు అప్పాదాసు నుండి విడదీసి సెటిల్మెంటుకు, అక్కడ కూతురు కొడుకుల నుండి విడదీసి జైలుకు, అక్కడ కూడా భార్యతో ఎడబాటు తోటి ఖైదీలతో జైలులో అనేక అవమాన్ని పొందడం, జైల్లో ఉండ గానే కుటుంబ సభ్యులు ఒక్కరొక్కరు మరణించడం ఈవిధంగా ఒకదాని వెంట ఒకటిగా పలు కష్టాలు వచ్చి పడుతుండగా, రామదాసు వాటినన్నింటిని పూర్వ జన్మ కర్మఫలంగా భావించుకొంటూ, జీవితంలోని పరమార్థాన్ని గ్రహించి దుఃఖంనుండి తనమతాను భగవత్ప్రాప్తివైపు మరల్చు కొంటుంటాడు. తనకొచ్చిన కష్టాలు భగవంతుడిచ్చిన వరాలుగా భావించుకొంటాడు. (మా.ప. 341)

రామదాసుకు ఇష్ట జన, వస్తు వినాశంవల్ల ఏర్పడ్డ విషాదం అతనిలోని నైతిక, ధార్మిక ప్రవృత్తితో కూడిన జీవితం వల్ల దుఃఖము యొక్క అనుభవ సాంద్రతను తగ్గించి సమభావానికి రావడానికి దోహదం చేస్తుంది. సత్వరజస్తమో గుణాల కతీతమైన అతని మనస్సు శాంతస్థితికి చేరుకుంటుంది[51]. మోక్షమునందు ఆసక్తిని కలిగిస్తుంది. తత్వజ్ఞానము, వైరాగ్యము, ఆశయశుద్ధి మొదలైన విభావాల ద్వారా శాంత ప్రవృత్తిని ఆశ్రయించిన రామదాసు సర్వ భూతదయగలిగి ఉంటాడు. సుఖదుఃఖాల కతీతమైన, మాత్సర్యంలేని జీవితాన్ని గడుపుతూ, సమ భావంతో వ్యవహరిస్తుంటాడు.[52] భగవత్సాన్నిధ్యాన్ని పొందటానికి సమయం కొరకు ఎదురుచూస్తూ దుఃఖమయ జీవితాన్ని గడుపుతుంటాడు.

> "..దుఃఖము నిత్యమైనది. అది శరీరముతోనున్నది. దుఃఖము లేనిచో శరీరములేదు. దుఃఖమంత ప్రధానమైన భావము. ఆ దుఃఖముతో పరమేశ్వరుని పొందుటయెంత తేలిక. జ్ఞానవంతుడగుట యెంత సులభము మనస్సు యొక్క లోనికి లోనికి చొచ్చుకొని పోయి విజ్ఞానమయ జీవుని స్పృశించుటకంటె నింకొక సుఖసాధన మున్నదా"[53]

అందుకే రామదాసు తన జీవితంలో సుఖంకంటే దుఃఖాన్నే ఎక్కువగా ఆహ్వానిస్తాడు. ఆ మార్గంలోనే చివరివరకూ పయనించిన రామదాసు యతీంద్రుడై

అచల గురువు బుచ్చయ్యగారివలె కాలం సమీపించిన విషయాన్ని గమనించి ఎవరికీ తెలుపకుండా కొండ గుహలలో నిరంతర ధ్యానపరుడయి ఉండి పర బ్రహ్మతో ఐక్యమవుతాడు.

రామదాసు జీవితంలోని విషాదం అతన్ని మోక్షాభిముఖున్ని చేయగా, రామానాయుడు మరో దిశలో పయనిస్తాడు. రామానాయుడు జీవితంలో పొందిన విషాదం ఏ వ్యక్తి కూడా తన జీవితంలో భరించలేనట్టిది. అయితే, సంగదాసు స్నేహమూలంగా ఏర్పడిన సంఘాభివృద్ధి చేయాలనే కాంక్ష, అచల గురువైన బుచ్చయ్యగారి వద్ద 'కారణం' పొందిన కారణంగానూ రామానాయుడిని వ్యక్తిగత విషాదం అంత ఎక్కువగా విచలితున్ని చేయలేకపోతుంది. తన మనస్సును విషాద భావంనుండి మరల్చుకొనేందుకై రామానాయుడు ఇంతకంటె తీవ్రంగా సంఘాభివృద్ధికై ప్రయత్నిస్తుంటాడు. తన ఒక్కగానొక్క కొడుకు మరణించడం తల్లిదండ్రులు మరణించడంవల్ల తీవ్రమైన విషాదాన్ని పొందినప్పటికీ అది తాత్కాలికమైంది మాత్రమే. జీవిత పరమార్థాన్ని గమనించిన రామానాయుడు అంతా భగవదిచ్ఛగా భావిస్తుంటాడు. జీవితంలో ఎదురైన ఒక్కొక్క సంఘటన కుంగదీయడానికి బదులుగా అతన్ని ఉన్నత మనస్కున్ని చేస్తుంటుంది.

జైలు జీవితం ప్రాప్తించిన రామానాయుడికి సంగదాసు హత్య, కమల యొక్క చిత్ర చర్య. సాహూ చౌదరయ్యల మరణం మొదలుకొని శ్రీకృష్ణ జన్మస్థానానికి తన యాత్రవరకు జరిగిన సంఘటనలు క్రమంగా తలంపుకువస్తాయి. తన జీవితం ఏదో సర్వజ్ఞత్వం కలవ్యక్తి మహద్దేశంతో నడుపుతున్నాడనే భావన కలుగుతుంది. ధర్మాధర్మముల సంఘర్షణలో యజ్ఞపురుషుడు తననొక ఇంధనంగా స్వీకరించినందుకు ఆనందపడతాడు. తనలోని అహంకార జన్యమైన అజ్ఞానం నశించడానికి సాధనం చూపించిన భగవంతునికి వందనం చేస్తాడు. భక్తి ప్రవాహంలో మునిగిపోయిన రామానాయుడు—

"అవిశ్రాంత హరిభావనా రూఢచిత్తుడై యుద్ధతుడైపాడు నొక్కచోట" అన్న మోస్తరుగా—

భజో మధురహరినామ నిరంతర్

భజో మధుర హరినామ్

హరిహి సుఖహై– హరిహి శాంతి– హరిహి
ప్రాణారామ్"

అనే కీర్తనను గొంతెత్తి అవ్యక్త మధుర ధ్వనితో పాడు"తుంటాడు. ఆ స్థితిలో
"...భక్తి ప్రవాహం యొక్క కెరటాలు యీడ్చి కొడుతున్నవి. కొండలు కూడా ఆగేటట్టులేదు. బండలు చెమర్చినవి. చెట్లు మోసు లెత్తినవి. గాలి మందగమనముతో తూలుతున్నది. క్రిమికీటకాదులు సొమ్మసిల్లినవి.... గానం పూర్తి అయిపోయింది. రామానాయుడు కన్నీటి కాల్వలలో దొప్పదోగుతున్నాడు. నిశ్శబ్దకుహరంలోనుండి వొక్క వాక్కు వినబడ్డది.

'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః' అని
... .... రామానాయుడికి సర్వం నారాయణమయం అయిపోతుంది. ఇండ్లూ, వాకిండ్లూ, రాళ్లూ, పోలీసులూ, ఉద్యోగులూ, ఖైదీలూ నారాయణుని యొక్క ప్రకారాంతరాలుగా కనబడ్డారు" (మా.ప. 502–503)

ఈవిధంగా రామానాయుడు ఒకవైపు జీవితంలో విషాదాన్ని అనుభవిస్తూనే ఇంతకంటే తీవ్ర ప్రకృతితో దృష్టిని ఆత్మోపలబ్ధివేపు మరల్చి, దివ్యదర్శనాన్ని పొందుతాడు. కర్మయోగాన్ని ఉత్తమ మార్గంగా ఎంచుకొంటాడు.

కాగా, రామానాయుడి తండ్రి చౌదరయ్య ఎంచుకున్నమార్గం ఇంతకంటే భిన్నమైంది. స్వార్థపూరితమైంది. స్వసుఖాన్ని మాత్రమే లక్షించింది.

చౌదరయ్యకు డబ్బు సంపాదనే లోకం. అదే జీవిత పరమార్థంగా ఎంచిన చౌదరయ్య అనేక అక్రమాలకు పాల్పడి డబ్బు కూడబెడుతుంటాడు. డబ్బువల్ల ఆనందాన్ని పొందవచ్చుననేది చౌదరయ్య భావన. డబ్బు కూడబెట్టడంలో నిమగ్నమైన చౌదరయ్యకు భార్యలోని దానగుణం, కొడుకులోని త్యాగగుణం రుచించదు. తన మార్గాన్నే తన కొడుకు రామానాయుడు అనుసరిస్తాడని ఆశించిన చౌదరయ్యకు రామానాయుడి ప్రవర్తన వేదన కలిగిస్తుంది. దాంతో చౌదరయ్య

మానసికంగా వేదనపొందుతుంటాడు. ఇట్లాంటి పరిస్థితుల్లోనే చౌదరయ్యకు కోడలు లేచిపోతుంది. ఇక్కడ చౌదరయ్యకు కోడలు లేచిపోవడంవల్లకంటే డబ్బెక్కడ ఖర్చవుతుందో అనే బాధే ఎక్కువగా మనస్సును వేధిస్తుంది. ఒకదశలో మతి స్థిమితంకోల్పోయిన వాడిలాగా కూడా ప్రవర్తిస్తాడు.

డబ్బు కూడబెట్టి తద్వారా ఆనందాన్ని పొందుదామనుకున్న చౌదరయ్యకు కుటుంబ సభ్యులు అనుకూలించక పోవడంతో సుఖంకంటే దుఃఖమే ఎక్కువగా అనుభవానికి వస్తుంది. అయితే, కొడుకువల్ల తీరని తన కోరికల్ని మనవడివల్ల తీర్చుకునేందుకై చౌదరయ్య ప్రయత్నిస్తాడు. కాని విధి బలీయమైంది. తానొకటి తలిస్తే దైవం మరొకటి తలుస్తుంది. అతడి ఆశల్ని అడియాసలుచేస్తూ మనుమడు కామెర్ల వ్యాధితో మరణిస్తాడు తర్వాత భార్య మరణిస్తుంది. దీనికితోడు వంశం అంతరించిపోతుందనే బెంగ ఇవన్నీ ఇబ్బడిముబ్బడిమై చౌదరయ్య హృదయాకాశంలో విషాద కారుమేఘాలు ________ట్టంగా అలుముకునేట్లు చేస్తాయి.

జీవితం శాశ్వతమని, ధనంవల్ల మహదానందాన్ని పొందవచ్చుననే భ్రమతో కూడబెట్టిన డబ్బు చౌదరయ్యకు ఈషణ్మాత్రమైన ఆనందాన్ని కల్గించక పోగా, విషాదమే ఎక్కువగా అనుభవానికి వస్తుంది. జీవిత చరమాంకంలో చౌదరయ్యకు విచిత్రంగా జ్ఞానోదయం కలుగుతుంది. అతనిలోని జీవుడు మేల్కొంటాడు. అంత్య దశలో అనన్య భక్తితో భగవంతున్ని స్మరించి చావును ఆహ్వానిస్తాడు.

చౌదరయ్యవలెనే కమల కూడా అశాశ్వతమైన జీవితాన్ని శాశ్వతమైందిగా భావించి, స్వసుఖానికై వెంపర్లాడుతుంది. క్షణికావేశంలో అపమార్గాన్ని తొక్కుతుంది.

తన దుశ్చర్య కారణంగా తాను ప్రపంచానికి మరణించినదానితో సమానమని భావించిన కమలను మోహనరావు కూడా ఒంటరిదాన్ని చేసి వెళ్ళిపోతాడు. ఆ ఒంటరితనంవల్ల కలిగిన దుర్భరమైన వేదన కమలకు జ్ఞానోదయంకలిగిస్తుంది. తను పొందిన విషాదంలో కమల పురాణం చెప్పవచ్చిన రామశాస్త్రిలో అహల్యకు పాపవిమోచనం, శాపవిమోచనం ప్రసాదించిన రామున్ని దర్శిస్తుంది. మోక్షాన్ని ప్రసాదించుమని వేడుకొంటుంది. కొడుకులో బాలకృష్ణున్ని దర్శిస్తుంది. భర్తలో

రాముణ్ని భావించి అతనికి చేసిన ద్రోహాన్ని స్మరణకు తెచ్చుకొని చిత్తంలో కుమిలి కుమిలి దుఃఖిస్తుంది. మనస్సు లోపలి పొరలను సహితం కదలించివేసే దుఃఖంతో పశ్చాత్తప్త హృదయంతో భగవంతుని చేరేందుకై నిరీక్షిస్తుంటుంది. అందుకే రచయిత 'మనిషి పడిపోయినా భగవానుని పాదములకడబడ్డది' (మా.ప. 271) అనటం జరిగింది.

> "కరుణాశబ్దమున్నది అది దయార్థకము, దయయనగా జాలికదా! జాలి యనగా నెవడో దుఃఖములో నుండగా వానివి జూచి యయ్యో పాపము! అనుకొని నీగుండెలో నీవు కొంత లోతునకుబోవుట చే దయాగుణము నిజమైనదో నితరులు దీనిచేత రక్షింప బడుదురు." 54

రామానాయుడుకూడా కమల విషయంలో జాలిని ప్రదర్శిస్తాడు. కమల ఎక్కడైతే కాలుకూడా క్రిందపెట్టకుండా సకల మర్యాదలను పొందిందో అక్కడే పనిమనిషిగా చేరటం పరితల హృదయాలలో ఆమె విషాద జీవితం జాలి కలిగిస్తుంది. ఇదేజాలి రామానాయుడికికూడా కలుగుతుంది. కాగా, కమల కొడుక్కు సకల సేవలుచేస్తూ, తాను కోల్పోయిన పుత్రప్రేమను తిరిగి పొంది కొడుకు మరణించడంతో తనకు సమయమాసన్నమైనదని తెలుసుకొని భర్తకు నిజంచెప్పి, అతన్ని క్షమాభిక్ష అర్థించి మరణిస్తుంది. కమలలోని పశ్చాత్తాపా నికి రామానాయుడు జాలి పొందుతాడు ఆమెకు సక్రమంగా కర్మలు చేయిస్తాడు.

పైన తెల్పబడిన వారందరికంటే భిన్నమైన ప్రవృత్తికలవాడు వెంకటదాసు. సంగదాసు వలెనే వెంకటదాసు జీవించిన కాలం అతితక్కువే అయినప్పటికీ, సంగదాసువలె వెంకటదాసుకూడా సమష్టికొరకై జీవితాన్ని పణంగాపెట్టి, జీవితాన్ని చాలిస్తాడు. అయితే వెంకటదాసుమార్గం సంగదాసుకంటే భిన్నమైంది.

తమ్ముడి మరణం, ఆస్తిపోవడం మొదలైన ధనవంతుల దౌర్జన్యాలవల్ల కలిగిన విషాదం వెంకటదాసును అపరిమితంగా కదిలించివేస్తుంది. అయితే, వెంకటదాసు తనకు కలిగిన అవేదనలో దారితప్పుతాడు. ధనవంతులపై తిరగ బడుతాడు. త్వరలోనే తనమార్గంకాదని, మాహాకమార్గంలో స్వాతంత్ర్యం

సంపాదించుకొని అభివృద్ధిని పొందమని తెల్పి హృదయ విదారకంగా జీవితాన్ని చాలిస్తాడు. వెంకటదాసు స్వదేశీ ధనవంతుల మీదనే కాకుండా, విదేశీయ ప్రభుత్వం మీద కూడా యుద్ధాన్ని ప్రకటించి ఒక కదలికను ప్రజలలో కలిగిస్తాడు. వెంకటదాసులోని వేదన ఇట్లా బహిర్గతమౌతుంది.

ఇదిలాఉండగా నవలలో మరొక అంతరువులో చిత్రితమయింది క్రైస్తవ మత దాడులవల్ల కలిగిన విషాదం. హిందూ మతంమీద క్రైస్తవ మత దాడివల్ల హిందూ సంస్కృతీ సంప్రదాయాలకు విచ్ఛిన్నత ఏర్పడుతుంది. దీనివల్ల కలిగే నష్టాల్ని గమనించిన రామదాసాదులు వ్యక్తిగత జీవితంలో ఎంతటి విషాదాన్నైనా అనుభవించేందుకు సిద్ధపడతారు. ముఖ్యంగా రామదాసు మతాన్ని ఎదిరించిన కారణంగా అక్రమ కేసు పెట్టబడి సెటిల్మెంటుకు, అక్కడినుండి జైలుకు వెళ్లాల్సి వస్తుంది. కుటుంబంతో విడిపోయిన కారణంగానే కూతురు, అల్లుడు మరణించడం చివరికి భార్య ఎడబాటు మొదలైనవన్నీ రామదాసు జీవితంలో ఒకవైపు దుఃఖ పరంపరను, మరొకవైపు ఆత్మోన్నతికి మార్గాన్ని సుగమం చేస్తుంటవి. ఈవిధంగా రామదాసు వ్యక్తిగతంగా జీవితంలో అనేక కష్టాల్ని, తద్వారా విషాదాన్ని అనుభవించేందుకు సిద్ధపడి హిందూ మతంమీద క్రైస్తవ మతం దాడిని విరోధించ గలుగుతాడు.

నవలలో చిత్రితమయిన మరొక విషాదం జాతి దాస్యానికి చెందినట్టిది. దేశమాత విదేశీయుల దాస్య శృంఖలాలచేత బంధింపబడడం. భారతీయులలో బానిసత్వ భావాల్ని కల్గిస్తూ, విదేశీయులు తమ సంస్కృతీ, సంప్రదాయాల్ని బలవంతంగా స్వదేశీయులచేత ఆచరింపచేస్తూ, దేశీయమైన సంప్రదాయాల్ని విచ్ఛిన్నం చేయ ప్రయత్నించడం కన్పిస్తుంది. భావదాస్యానికి భారతీయుల్ని గురిచేయటం సహించని రామానాయుడు నవలలో ఒకచోట—

> "స్వాతంత్ర్యాభిలాషచచ్చి దాస్యంరుచిస్తే జాతికిగాని, వ్యక్తికిగాని ఇక మోక్షంలేదు. బానిస ఎప్పుడూ తన మోక్షానికై కలహిస్తూ వుండవలసిందే.... కాబట్టి ప్రతివాడూ దాస్య విమోచనానికై పాటు పడకుండా ఉండడం మానవధర్మం కాదు". (మా.వ. 508)

అంటూ భావదాస్యాన్ని ఈసడిస్తాడు.

చివరికి జాతి యావత్తూ విదేశీ పరిపాలనవల్ల పొందిన విషాదం నుండి మేల్కాంచి చైతన్యవంతమై జాతి మోక్షానికై పోరాడి విజయం సాధిస్తుంది.

ఈవిధంగా జీవితంలో రకరకాల స్థాయిల్లో వ్యక్తమయ్యే విషాదం మాలపల్లిలో ఆద్యంతము కన్పిస్తుంది.



## సూచికలు :

1. చిలకమర్తి లక్ష్మీనరసింహం – ". నవలలు వ్రాయుటకు మాకప్పుడు వీరేశలింగంగారు వ్రాసిన 'రాజశేఖర చరిత్రము' అను నవలయే యాదర్శకము. ఆ నవలను నేనామూలాగ్రము చదివి నవలలు రచియించు పద్ధతి తెలుసుకొని 'రామచంద్రుని విజయము' వ్రాసితిని" 'స్వీయ చరిత్రి' పు. 186

2 నరహరి గోపాలకృష్ణమచెట్టి — "హిందువుల యాచారంతెలుపునటి నవీన ప్రబంధము". – 'శ్రీరంగరాజు చరిత్ర' పీఠిక.

3. కందుకూరి వీరేశలింగం — "ఇప్పటికి మన యాంధ్రభాషలో జనుల యాచార వ్యవహారములను తెలుపు రీతి బోధకములుగా నుండు వచన ప్రబంధము లేవియు లేకపోవుట. .నేనీ గ్రంథమును వ్రాసి ప్రకటించితిని." 'రాజశేఖర చరిత్ర' పీఠిక.

   ii "మనలోగల మూఢ విశ్వాసములను బోగొట్టవలెనన్న ముఖ్యోద్దేశ్యముతో నేను దీనిని వ్రాసితిని". – 'స్వీయ చరిత్ర' రెం. భా. పు. 148.

4. 'తెలుగు నవలా వికాసం' పు. 18.

5. డాॱ కోవెల సంపత్కుమారాచార్య — "స్వరూపం-పరిణామం" (వ్యా.) 'మన నవల పరిశీలన' (వ్యా. సం) పు. 21.

6. అడవి బాపిరాజు — "తుపాను" పు. 242.

7. ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం — "ఇతిహాస పరిధికంటె కావ్యపరిధి పరిమితం. ఒక పురుషార్థాన్నికాని, ఒక ప్రయోజనాన్నికాని, సాధించటానికి ఆరంభమైన ఒక కార్యం విస్తరిల్లి ఫలమంత మయ్యేంతవరకు స్వయం సమగ్రంగా చిత్రించబడే వస్తు జీవితం కావ్యం". - 'నవ్య సంప్రదాయ కవిత్వోద్యమం' (వ్యా) 'విశ్వనాథ సాహిత్య వ్యక్తిత్వం' (వ్యా. సం). పు. 6.

8 రాజశేఖరుడు — "పరిక్రియా పురాకల్ప ఇతిహాస గతిర్ద్విధా, స్యాదేక నాయకా పూర్వా ద్వితీయా బహునాయకా, తత్ర రామాయణం భారతం చోదాహరణే" - కావ్యమీమాంస. పు. 3.

9. గుంటూరు శేషేంద్రశర్మ — "ఆంధ్ర వాఙ్మయంలో EPIC అనే ఇంగ్లీషు పదానికి 'ఇతిహాసం' అనే భారతీయ భాషా శబ్దాన్ని వాడుతున్నారు". 'నాదేశం నా ప్రజలు' పు. 11.

10. డా॥ కోవెల సుప్రసన్నాచార్యుల "హృదయ చక్రము"నుండి ఎత్తి వ్రాయబడినది. చూ. పు. 194

11 R. K. Singh — "In our times the epic experimentation streches over the novel, cenema and theatre and the genre applies to them primarily for their large scope, their roots in the national soil and their distance from the oral tradition, with the evolution of literary sensibility and the rigorous analytical search of the scholars"—'The spiritual Epic Tradition and Savitri'—I (Essay) P 4. 'CALL-BEYOND'-Nov. 81.

12. డా॥ అనుమాండ్ల భూమయ్య — "ఒక జాతి చరిత్ర, సంస్కృతి విపరింపబడడం, అందుకు తగిన కథా విస్తృతి ఉండడం "ఎపిక్ స్పిరిట్". వే. అ. ఇ. పు. 5.

13. చూ. న. చ. పు. 193, 194.

14. పైదే పు. 193.

15. ఇతిహాస లక్షణముల నిర్ధారణకొరకు ఈ క్రింది గ్రంథాలను ప్రధానంగా పరిశీలించడమైంది.

i) డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి — "తిక్కన కావ్యశిల్పము" పుటలు 115 నుండి 120.

ii) డా॥ జి.వి సుబ్రహ్మణ్యం - 'ప్రథమాంధ్ర మహాపురాణము' పు 28 నుండి 36.

16 "సాహిత్యం ప్రధానంగా మానవ జీవన వస్తుకమై దుఃఖ ప్రధానంగా రూపొందక తప్పదు.... ఏ మహాగ్రంథమైనా దుఃఖచ్ఛాయా సమావృతం కాక తప్పడంలేదు. రచన అంతా అంతర్నిబద్ధమై ఏదో శోకలయ స్పందించుతూనే ఉంటుంది". స.చ పు 4.

17. చూ: తి.కా.శి. పు. 116

18. చూ: వే.అ ఇ. పు. 4

19. "సృష్టి మూలమైన కామము, సృష్టివికాసమైన మానవుని ఉత్పత్తి శక్తుల సమష్టి రూపమైన అర్థం ఈ రెండూ ఒక నియమానికి కట్టుబడి అందరికీ సమానంగా లభ్యం కావడానికి ఏర్పరుచుకొన్న నియమ సంపుటి ఈ ధర్మం. అర్థకామాలను సుష్ఠుగా తీర్చిదిద్ది సమాజ వ్యవస్థను సమష్టి క్షేమ పర్యవసాయిగా రూపొందించేది ధర్మము. ఈ ధర్మమునకు, నియమానికి విరుద్ధంగా ప్రవర్తించే శక్తి ఆసురము. దీనిని అంగీకరించి దానిని నిలబెట్టే ప్రయత్నంచేసే శక్తి దైవము. ఇతిహాసము ఈ రెంటి మధ్య కలిగే అనివార్యమైన సంఘర్షణకు రంగభూమి అవుతున్నది". స చ పు. 7.

20. మన నవల పరిశీలన పు. 23.

21. మొదలి నాగభూషణశర్మ - "అతడు (సంగదాసు) నిజంగా జీవించడం మొదలు పెట్టింది చనిపోయిన తరువాతనే". 'తెలుగు నవలా వికాసం.' పు 264.

22 చూ: మాలపల్లి. పుటలు 658, 59, 66.
23. ఈ విషయం మూడవ అధ్యాయంలోని 'ఆత్మోద్ధరణ' అనే వ్యాసంలో వివరంగా చర్చింపబడుతుంది

24 కె వి.ఎన్. రాఘవన్ – "మాలపల్లి ఐతిహాసికత" (వ్యా.) పు. 29. ఆంధ్రపత్రిక.

25. శ్రీనివాస శిరోమణి – "మాలపల్లి నిర్మాత ఉన్నవ లక్ష్మీనారాయణగారు" పు. 402 భారతి. నవంబర్, 1945.

26. పి. భాగ్యమ్మ– "అతని (సంగదాసు) ఆత్మశక్తి అతని మరణం తర్వాత నవలను నడిపిస్తూ వచ్చింది. తుదకు సంగిదాసు ఆశయాలకు రూపకల్పన జరిగింది". 'మాలపల్లి పాత్ర చిత్రణ' పు. 66.

27. డా॥ బి. వి. కుటుంబరావు — "ఆంధ్ర నవలా పరిణామము" పు. 279.

28. స్ఫూర్తిశ్రీ — "స్ఫూర్తిశ్రీ వ్యాసావళి" పు. 39.

29. ఆర్. ఎస్ సుదర్శనం. న. సా. పు. 157, 158.

30. చూ: తి. కా. శి. పు. 20.

31. వే. ఆ ఇ. పు. 42.

32. మాలపల్లి పరిచయం.

33 మన నవల పరిశీలన. పు. 22.

34. కడియాల రామ్మోహనరాయ్ — "మారుతున్నకాలం మాలపల్లి" పు. 51. భారతి నవంబర్. 1972.

35. "ధర్మోపదేశ బుద్ధితో నేదేని ప్రధాన కథా భాగమునందో కయవాంతర కథను ప్రవేశపెట్టినచో నదియుపాఖ్యానము". 'ఆంధ్ర నవలా పరిణామము' పు 29

36. చూ : i) ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారి — "భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర" మొ. భా. పు. 81, 82.

ii) ఆధునిక భారత చరిత్ర, పు. 121. తెలుగు సహవాసి.

37. గురజాడ ఆంజనేయులునాయుడు — "1911 ప్రాంతంలో దేశంలో 4000 పైగా మిషనరీలు పనిచేసేవి. రోజుకు 350మంది అంటె నెలకు 10,500 మంది హిందువులు క్రైస్తవాన్ని పుచ్చుకొనేవారు". 'మాలపల్లి ఒక పరామర్శ' పు. 98, 99.

38. కలపాల సూర్యప్రకాశరావు—"విప్లవ భారతం" పు. 48.

39. గుంటూరు జిల్లాలో క్రైస్తవ మతవ్యాప్తి: "దీనికి కారణం అప్పట్లో ఆంధ్రదేశంలో అధికసంఖ్యలో జరుగుచుండిన క్రైస్తవ మతాంతరీకరణలే అని పిస్తుంది. తరతరాలుగా అగ్రవర్గాలవారిచేత అణచివేయబడ్డ మాల మాదిగలు క్రైస్తవ మిషనరీలు కల్పించే విద్య. ఉద్యోగ వసతులకు ఆశపడి లక్షల సంఖ్యలో క్రైస్తవమతంలో కలసిపోతు న్నారు. .. ప్రత్యేకించి 'మాలపల్లి' కథాకేంద్రమైన గుంటూరు జిల్లా పలనాటి ప్రాంతంలో ఈ క్రైస్తవ మతవ్యాప్తి విశేషంగా జరిగింది". 'మాలపల్లి ఒక పరామర్శ' పు. 101.

40. నసుమాస స్వామి — "ఆనాడు కులమత భేదాలను సాకుగా తీసుకొని ప్రభుత్వం భారతీయులలో అనైక్యతను సృష్టించడమేకాక పంచములను క్రైస్తవులుగా మార్చి తమకు అండగా నిలుపుకొంది. ప్రతిగా మతాంత రీకరణ ప్రతిఘటనోద్యమం బయలుదేరింది." 'మాలపల్లి గోదాన్ తులనాత్మక పరిశీలన' పు. 38.

41. భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర—రెం. భా. పు. 62

42. మాలపల్లిలో కామానాయుడి పాత్రను ఉదాహరించుకోవచ్చు.

43. డి. విద్యేశ్వరి — "తెలుగు నవల మనోవిశ్లేషణ" పు. 24.

44. పైదే. పు. 45. 46.

45 డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి—"కర్మఫలానుభవము ఇహాపర భేదముచేత ద్విధాభూతము". తి. కా. శి. పు. 118.

46. చూ: వే. ఆ. ఇ. పు. 103.

47. స. సా. పు. 162.

48. భవభూతి — "ఉత్తర రామ చరితమ్" తృతీయాంకం. శ్లో॥ 41.

49. విశ్వనాథ సత్యనారాయణ—"రామాయణ కల్పవృక్షము" బాల. ప 118.

50. డా॥ కోవెల సంపత్కుమారాచార్య — "ఆధునిక తెలుగు సాహిత్యవిమర్శ సాంప్రదాయికరీతి". పు. 249, 250.

51. "జీవనంలో ప్రత్యక్షంకాని మోహాదులన్నీ భావనలోనివే కావడంవల్ల మృత్యు అతీత జీవనం ఇంకా మానవ భావపరిధిలోకి దిగిరాకపోవడంవల్ల ఎక్కడైనా దాని స్పర్శ ప్రధానమైనప్పుడు ప్రత్యక్షమైన శోకముయొక్క అనుభవ సాంద్రతతగ్గి సమభావం ఆవరించి శాంతము అనే భావాతీతస్థితి కలుగవచ్చును". స. చ. పు. 5.

52. పి. యస్. ఆర్. అప్పారావు.
"నయత్ర దుఃఖమ్ నసుఖం నద్వేషోనాపిమత్సరః
సమః సర్వేషు భూతేషు నశాంతః ప్రథితోపసః"॥
నాట్యశాస్త్రమ్ పు. 212.

53. విశ్వనాథ సత్యనారాయణ—"కావ్యానందము". పు. 213.

54. పైదే. పు. 206.



అధ్యాయం : మూడు

# మాలపల్లి : అచలం

## అచలం :

ఆధునిక తెలుగు సాహిత్యంలో అచలమతాన్ని గూర్చి ఉన్నవ ప్రప్రథమంగా మాలపల్లిలో ప్రవచించినాడు. ఉన్నవ ఈ విధంగా అచలమతాన్ని తన నవలలో ప్రస్తావించడానికి పలు కారణాలు కన్పిస్తున్నయి వాటిలో ప్రధానమైంది తల్లిదండ్రుల ప్రభావం. ఉన్నవ తల్లిదండ్రులు అచలయోగావలంబకులు. అచలయోగ కుండలినీయోగంలో నిత్య సాధకులు. వీరు కులమత భేదాల్ని నిరసించారు. ఈభావం ఉన్నవలోనూ చిన్నప్పుడే బలంగా నాటుకొంది. గాయత్రీ మంత్రంతోపాటు అచల సిద్ధాంతానికి సంబంధించిన "ఆకాశాత్పతితం తోయం-యథాగచ్ఛతి సాగరం" మొదలైనవి చిన్నప్పుడే ఉపదేశించినారు. అచల బోధ గ్రంథాలలో పోకల శేషాచలనాయుడి 'పరమపదమార్గము', తరిగొండ వెంగమాంబగారి'రాజయోగసారము', భాగవతులవారి 'శుద్ధ నిర్గుణతత్వ కందార్ధదరువులు' చదివించటం జరిగింది.[1] ఈ విధంగా ఉన్నవలో చిన్నప్పుడే తల్లిదండ్రుల ద్వారా అచలమతం చోటుచేసుకున్నది.

అచలమతం గురు పరంపరా ప్రాప్తమైన అనుభవ విచారానికి అత్యంత ప్రాధాన్యతనిచ్చి, తర్కానికి, శాస్త్ర చర్చలకు తక్కువ ప్రాధాన్యమిచ్చినట్లు కన్పిస్తున్నది. ఈమతం కుల భేదాల్ని పాటించదు. అందువల్ల ఉన్నత కులాల కంటె ఇతర కులాలవారిచేత ఈమతం ఎక్కువగా ఆచరింపబడుతూ వస్తున్నది. ముఖ్యంగా ఈమతం శూద్రులు, పంచములు మొదలైన దిగువ కులాలవారియందు విశేషంగా వ్యాపించి, వారిని జ్ఞానమార్గానువర్తులుగాచేసి, వారిలో భక్తిభావాన్ని కలిగించడంతోపాటు, సంఘ సంస్కరణాభిలాష, శౌచమూ, పారమార్థిక చింత కలిగించేందుకు ఉపకరిస్తున్నది. ఆత్మోద్ధరణ సాధనలో ఈమతం విశేషంగా

సహాయపడుతున్నది ఉన్నప మాలపల్లిలో తీసుకున్న వస్తువు నిమ్నజాతులకు చెందింది ఈ కారణంగానూ ఉన్నవ మాలపల్లిలో అచలమతాన్ని విశేషంగా ప్రస్తావించినాడు.

అచలమతం తెలంగాణ, ఆంధ్ర ప్రాంతములలో ప్రారంభంకావడానికి, విశేష ప్రచారం పొందడానికి ప్రామాణిక గ్రంథాలు రచించినవారు బ్రాహ్మణులే. అయితే, తర్వాతికాలాన ప్రధానంగా ఈ అచలమత ప్రచారానికై కృషిచేసిన వారిలో దిగువ కులాలవారు కన్పిస్తున్నారు. బ్రాహ్మణులతోపాటు శూద్రులు, మాలలు, ముస్లింలు మరియు స్త్రీలు కూడా అచల రచనలు చేయడమేకాకుండా, అచలమతంలో గురువులుగా వ్యవహరించడంకూడా అపారంగా వస్తున్నది.

అచలమతం నూతనంగా ఇటీవల ఏర్పడిందని భావించడంకంటె, వేద సంప్రదాయ ప్రతిపాదితమైన అద్వైతశాఖకు చెందిందనడాన్ని చాలమంది అంగీక రిస్తున్నారు. అంతేకాదు, ఈమతం పరిణామంలో బౌద్ధ సంప్రదాయం[2], సాంఖ్య, యోగశాస్త్రములు, గీతా ఉపనిషత్తులనాధారం చేసుకొని, భగవద్గీతలోని జ్ఞాన, కర్మ యోగముల ప్రభావాన్ని, నాథ సంప్రదాయ ప్రభావాన్ని, ముస్లింల సూఫీతత్వాన్ని కూడా జీర్ణించుకొని ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నట్లుగా కన్పిస్తున్నది.

చాతుర్వర్ణ్యములవారికి పీఠాధిపత్యమప్పగించి, కుల మత భేద రహితంగా ఆత్మానందానుభవమును సర్వప్రాణి సామాన్యం చేసేందుకు ప్రాదుర్భవించిన ఉత్తమ జ్ఞాన ప్రకాశకంగా ఈ మతాన్ని పేర్కొనవచ్చు. భారతీయైక్యతకు దోహదంచేసి, తత్వ దర్శనోన్ముఖులుగ ప్రాణికోటినుజ్జీవింప చేసేందుకు అచలం తనవంతు కృషిచేసింది.

## అచలమత ఆవిష్కరణ-వ్యాప్తి :

అచల మతాన్ని మొట్టమొదట ఆంధ్రదేశంలో బహుళ వ్యాప్తిలోకి తెచ్చింది శ్రీమద్రామడుగు శివరామదీక్షితులు.[3] ఇతడు నల్లగొండ జిల్లా నారాయణపురం వాస్తవ్యుడు. ఈతడు తేట తెనుగులో అచల సిద్ధాంతపరంగా 'బృహద్వాశిష్ఠ' మనే సిద్ధాంత గ్రంథాన్ని[4] అనేక భాగాలుగా వ్రాసినాడు. ఇతడి గురుపరం పరలో శ్రీధరుడు[5] ప్రధాన పురుషుడు.

శివరామదీక్షితులు సంసార బంధనాలు త్రెంచుకొని, యజ్ఞయాగాదులవల్ల తృప్తినొందనివాడై, గురువును అన్వేషిస్తూ వెళ్ళగా ఒక అవధూత (శ్రీధరుడు) దిగంబరుడై కన్నులుమూసుకొని ధ్యానమగ్నుడై కనిపించినాడు. ఈ అవధూత యే శివరామదీక్షితులకు "తారక, సాంఖ్య, అమనస్కము"లనెడి యోగముల సమన్వయమైన 'రాజయోగాన్ని' బోధించి, శిష్యులకు ఉపదేశము చేయుమని, సమాధిగతుడైనట్లు శివరామదీక్షితుల జీవిత చరిత్రద్వారా తెలుస్తున్నది 6

శివరామదీక్షితులనుండి అచలమతం క్రమ ప్రవర్ధిల్లినొందింది. ఈమత వ్యాప్తిలో భాగంగా శ్రీ భాగవతుల కృష్ణయ్యగారు కందార్ధదరువులను రచించినారు. పండిత శివానందస్వామి విరచితమైన 'పరిపూర్ణబోధ సిద్ధాంత శిరోమణి' రెండు భాగములు అచలమతమును వివరిస్తూ రచింపబడినవి. ఇంకా అనేకములైన గ్రంథాలు పలువురిచేత అచలమతవ్యాప్తికై వ్రాయబడినవి. ఈ మతానుయాయులగు పీఠాధిపతులైన స్త్రీ, శూద్రాదులు తమ జీవితములలో అచలతత్వమును అనుభవములోనికి తెచ్చుకొని పలు గ్రంథములను రచించి, ఆంధ్రదేశమునందే కాక, ఆంధ్రేతర ప్రాంతములందుకూడా ఈ మతమును వ్యాపింపచేసినారు. ఈ మతానికిచెందిన తత్వాలు తెలుగుభాషతోపాటు అన్య భాషలలోకూడా ప్రచారంలో ఉన్నవి. ఈ విషయాన్ని కపిల వెంకటరావుగారు ఇలా తెలుపుతున్నారు-

> "అచలమార్గ బోధకములగు నిటువంటి తత్వములు తెలుగులోవలెనే తమిళ, కన్నడ ప్రాంతములందును ప్రచారములోనున్నట్లు వినికిడి .. చిప్పగిరి భంభింగురు యోగీంద్రుల శిష్యులైన భంహూశ్శేన్ యోగిగారి తత్వములు బెంగుళూరులో నచ్చయినవి. వానిలోకొన్ని తెలుగు, కొన్ని కన్నడము అన్నియు నచలతత్వములే"7.

అచల అనుయాయులు, రాజయోగి సంపాదకులైన ఇలపకుర్తి వీర వెంకటరామచంద్రరావుగారు అచలం చాలా ప్రాచీనకాలంనుండి వ్యాప్తిలో ఉన్నదని అంటూ ఇలా తెలిపినారు.

> "ఈ అచలబోధ అల్లమప్రభువు, బసవేశ్వరులతో ప్రారంభమైనట్లు అగుపడుచున్నది. ఆదిలో వీరశైవ సాంప్రదాయకులైయుండి పిమ్మట అల్లమ ప్రభువులవారినాశ్రయించి అచలబోధ పొందినట్లు అగుపడుచున్నది ఈ విషయమై శ్రీభాగవతుల కృష్ణదాసుగారు

రాము రచించిన జ్ఞానాక్షర ద్వితీయ దోషరహిత పరమతత్వార్థంద
ములలో 'పసపునదగు నిది పగ్గపు బసవన్నకిపెట్టు తెలుసు,
ప్రభువుకు తెలుసు' యనమైతే ఎనమునగుణము సనిగాదా మెచ్చి
యుంత చప్పుల వినుటకై "8

కాగా, నాథ సంప్రదాయానికి చెందిన హఠయోగ ప్రదీపికలోని సిద్ధయోగుల పట్టికలో అల్లమప్రభువు పేరున్నట్లు తెలుస్తున్నది. ఈ అల్లమప్రభువు బసవేశ్వరునికి చేసినబోధకూడ నాద సంప్రదాయమేనని ఒక అభిప్రాయము9 ఇదిలా ఉండగా, కపిల వెంకటరావుగారు వీరబ్రహ్మంగారితో అచలమతం ప్రారంభమైందంటూ-

"శ్రీ వీరబ్రహ్మముగారి కాలజ్ఞానతత్వములను పేరుగల కీర్తనల
సంపుటి అచల మార్గావలంబకులలో చాలమందికిది ప్రమాణ
గ్రంథమువంటిది. దానిలోని కృతులలో కొన్ని వీరబ్రహ్మంగారు
స్వయంగా చెప్పినట్లున్నవి" 10

అని తెలిపినారు ఇంకా ఇందులో వీరబ్రహ్మంగారి మనుమరాలు ఈశ్వరమ్మ, శిష్యుడు దూదేకుల సిద్ధయ్య మొదలుకొని పలువురు శిష్యులు వ్రాసిన తత్వాలు చేర్చి 'వీరాచార్యు'లను నాతడు దీనిని కూర్చినట్లు తెలిపినారు. శ్రీ గురు పీర్ మొహియుద్దీన్ శిష్యుడు గజ్జుల నారాయణదాసు వ్రాసిన 'తారకామృతసారము'కూడా అచలమత బోధకమేనని వీరు తెలుపుతున్నారు. కాగా, అచల అనుయాయులైన రామచంద్రరావుగారు మాత్రం వీరబ్రహ్మం కాని, అతని అనుయాయులు కాని వ్రాసిన తత్వాలు అచలబోధకు సంబంధించినవి కావంటూ-

"పోతులూరి వీరబ్రహ్మముగారు, అచలబోధ సంప్రదాయకులు కానే
కారు. వారిది అద్వైత సంప్రదాయము. ఆత్మదర్శనము,
సోహంభావము ఇందుకు సాధనములుగా బోధించుచూ, ఆత్మ స్వ
రూప నిర్ణయమువరకే అద్వైత సిద్ధాంతము శిష్యులకు బోధించుచూ
హఠ యోగమునందు సాధనచేయుచు చివరకు జీవసమాధి చెందిరి.
వారి పరంపరా శిష్యులగు దూదేకుల సిద్దప్ప, జంగమ అమరలింగం,
శేషరాజు, చెంచురాజు వరకుగల శిష్య పరంపరలోని వారందరూ

> యోగమార్గమునందును, అద్వైత సిద్ధాంతమునందు మాత్రమే కృషిచేసినవారు".11

అని వివరించినారు. కాని ఇది సరికాకపోవచ్చును. అద్వైతమునందు హఠయోగమునకు ప్రాధాన్యములేదు. ఈ హఠయోగము ప్రధానంగా నాథ సంప్రదాయంలో కన్పిస్తున్నది అక్కడినుండి అచలంలోనికి ఈ హఠయోగసంప్రదాయం ప్రవేశించినట్లు తెలుస్తున్నది. యోగసిద్ధి పొందటమనేది నాథ సంప్రదాయాన్ని జీర్ణించుకొన్న అచల సిద్ధాంతమేతప్ప అద్వైతముకాదు. అందుపెల్ల రామచంద్రరావుగారన్నట్లుగా వీరబ్రహ్మంగారు కేవలాద్వైత మతానికి చెందినవారుకారు. అచల పరిపూర్ణ సంప్రదాయమునకు చెందినవారే. వీరి తత్త్వాల్లో అచల పరిభాషకు చెందిన బయలు, ఎరుక, జ్ఞానము మొదలైన ప్రధానమైన భావాలను (Basic Concepts) చూడవచ్చు12. ఇదిలా ఉండగా, మొట్టమొదటిసారిగా తెలుగులో అచల భావాన్ని వెల్లడిచేసినవారు వేమన అని రామచంద్రరావుగారి అభిప్రాయము13. వీరితోపాటుగా త్రిపురనేని వెంకటేశ్వరరావుగారుకూడా-

> "వేమన భావరాశి అచలమునుపొంది ప్రవర్తిల్లుచున్నదనుట నిజము"14.

అని పేర్కొన్నారు.

"ప్రధానంగా వేమన అచలయోగ సిద్ధుడుగా వర్ధిల్లాడు. అయన జీవితం ఆ యోగంలో పుటమయ్యింది"15 అన్నారు నీలా జంగయ్యగారు అంతేకాదు, అచల గ్రంథాలలో వేమన అచలమత ప్రచారక గురువుగాకూడా పేర్కొనబడుచున్నాడు. మాలపల్లి నిర్మాత ఉన్నవ అచలమత అనుయాయులనిలా తెలిపినారు.

> "దీనిని (అచలమును) నెలకొల్పి వ్యాపింపచేసినవారు పోతులూరి వీరబ్రహ్మంగారు, దూదేకుల సిద్ధయ్యగారు, వేమన్నగారు. సాలె కులజులు యాగంటివారు, బొందిలి వీరయ్యగారు, గుమ్మళ్ళ కాల్వ కోటయ్యగారు, బెల్లంకొండ మస్తాన్‌గారు, వున్నవ నందయ్యగారు పోకల శేషాచలనాయుడుగారు మున్నగువారు పెక్కులున్నారు16".

అచల సంప్రదాయకులు ఆంధ్రదేశంలోనేకాకుండా, కలకత్తా, ఖరగ్‌పూర్, పూనా, బాంబే, మొదలైన మహాపట్టణాల్లోకూడ ఉన్నారని వీరిలో

బ్రాహ్మణ, రెడ్డి, వెలమ, వైశ్య మొదలైన అగ్రకులాల[17]వారితోపాటు ముస్లింలు కూడా ఉన్నట్లు 'శ్రీ శివరామదీక్షితీయమ్'–'భక్తానంద బోధామృతం'–'పరిపూర్ణ బోధ సిద్ధాంతశిరోమణి' మొదలైన పలు అచలసంప్రదాయ గ్రంథాలలో ఇవ్వబడ్డ భక్తుల పట్టికలద్వారానూ, అచలమతాన్ని 30, 40 సంవత్సరాలనుండి బోధచేస్తూ వస్తున్నవారిని సంప్రదించడంవల్లనూ తెలుస్తున్నది.

అచల సంప్రదాయంలో గురువుయొక్క భూమిక విశేషమైన ప్రాధాన్యాన్ని కలిగి ఉంటుంది. సర్వశాస్త్ర పారంగతుడు, వేదాంతవిషయ పారదర్శకుడు, నిరంతర అధ్యాత్మ చింతనాలోలుడు, ధ్యాన తపోనిష్ఠా గరిష్ఠుడు అయిన గురువే[18]అచల బోధలో ప్రాధాన్యాన్ని కలిగిఉంటాడు. 'గుకారశ్చాన్ధకారశ్చ రుకారస్తన్నిరోధకః' అను శ్లోకరీత్యా అజ్ఞానాంధకారమును పోగొట్టి, అనంత జ్ఞానమును ప్రకాశింపచేయువాడు గురువు. కాబట్టి త్రిమూర్త్యాత్మకుడగు గురువే[19] ఈ సిద్ధాంతమున పరమ ప్రామాణ్యముగా స్వీకరింపబడుచున్నాడు.

ఈ మతంలో జగత్సృష్టి కర్తృత్వ భోక్తృత్వాలయ కారకుడై, జగన్నియంత అగు పరమేశ్వరునికన్న అట్టి ఈశ్వరప్రకృతి, జీవబుద్ధ్యహంకారాలు, వస్తువిషయ వివేకమును వివరించి, సంతతానంద సంధాయకమైన 'అచల' పరిపూర్ణతత్వమును శిష్యవర్గానికి వాత్సల్యపూరితంగా బోధించు గురువే మహర్షి, మహనీయుడు.

ఇట్లాంటి జ్ఞానపూర్ణుడైన గురువుద్వారా తత్వమును తెలుసుకొని హఠయోగాది సాధనలచేత మూలాధారమునుండి షట్చక్రభేదనము గావించి, అంతర్ముఖుడై, చిత్కళాస్వరూపమగు వెన్నెల బయళ్ళనుగాంచి, సచ్చిదానందమూర్తిగ ఆత్మారాముడై ఆనందానుభవమునుగాంచుట ముఖ్యమైంది. దీని నూతగాగొనియే ఈ మతమునందు పీఠాధిపత్యములు ఏర్పడి మతవ్యాప్తిని గావించినవి. సూక్ష్మములో మోక్షమును చూపించుటకు ఉపయుక్తమై, సన్యాసాది నియమనిష్ఠలు లేకుండ రాజయోగానుభవమును సాధించుట ఈ అచలబోధ పరమోద్దేశము. ఈ సంప్రదాయమువారు పరంపరాగతములైన భక్తి, కర్మలను ఆచరిస్తూనే 'నేహనానాస్తి కించన'మను జ్ఞానమార్గమున అచలాద్వైతములో గాఢావేశముకలిగి 'గురుబ్రహ్మ' అభేదమును సాధించినారు.

ఇది నిర్గుణోపాసనమగు దహరాకాశ విద్య. దీనికి ఉపనిషత్తులలో మూల మున్నది. ఇది అనుభవైక వేద్యమైన ప్రవృత్తికి సంబంధించింది. జ్ఞాన, కర్మ యోగములు, సాంఖ్య, యోగశాస్త్రములు ఈ మతమునకు పరిపుష్టిని చేకూర్చినవి. సర్వమత సంప్రదాయములకు విరోధములేకుండ, కుల వివక్షలేకుండ, స్త్రీ పురుష భేద రహితముగ దీనిని అందరు అనుభవములోనికి తెచ్చుకోవచ్చును. ఇది ఉప నిషత్ప్రతి పాదితమైన భారతీయతత్వమేకాని వేరుకాదు.

## రాజయోగము-అచలము :

అచలమత గురుపీఠాధిపతులందరూ రాజయోగి[20]శబ్దంచేత పిలువబడుట గురు శిష్య పారంపర్యంగా వస్తుండటమువల్ల ఈ అచలానికి రాజయోగంతో దగ్గరి సంబంధమున్నదని చెప్పేందుకు వీలు కలుగుతున్నది. అయితే, రాజయోగాన్ని కూడా వీరు కాదనటం ఒకవైపు విన్పిస్తున్నా, వీరు రాజయోగులుగా పిలువబడటం గమనార్హం. అంతేకాదు, అచల పరిపూర్ణబోధ సిద్ధాంత ప్రవక్తయైన శ్రీమద్రా మడుగు శివరామదీక్షితులకు వీరి గురువు శ్రీధరుడు బోధించిన యోగము తారక, సాంఖ్య, అమనస్క త్రిపుటి సంపుటిగల రాజయోగమే. దీన్నిబట్టి అచలయోగి సాధనకు రాజయోగం ఒక మార్గంగా చెప్పవచ్చు.

తారక, సాంఖ్య, అమనస్కములనుగూర్చి సిద్ధాంతపరంగా చెప్పినవారు శ్రీ పరశురామ పంతుల లింగమూర్తి గురుమూర్తి కవి. వీరు వరంగల్లు నివాసి. వీరు తమ 'సీతారామాంజనేయ సంవాద' కావ్యంలో ప్రతిపాదించిన నిర్గుణ బ్రహ్మము అచల పరిపూర్ణమే. ఈ వేదాంత గ్రంథంలోని తృతీయాశ్వాసంలో ఆంజనే యుడు చెప్పిన దండకంలో వర్ణితమైన నిర్గుణ బ్రహ్మము అచల పరిపూర్ణ పర బ్రహ్మమే.

> "....అవాచ్యం బచిత్యం బనంతం బసంగం బఖండం బబాధ్యం బబోధ్యం బసాధ్యం"21

అంటూ సాగిన ఈ దండకంలో నిర్గుణ బ్రహ్మణ్ని వర్ణిస్తూ చేయబడిన పదాలు అచలానికి చెందిన పలు గ్రంథాలలో చూడవచ్చు. ఉదాహరణకొకటి. అచల సంప్రదాయంలోని గురు పరంపరాధ్యానంలో ఈ క్రింది శ్లోకం కన్పి స్తున్నది.

"అవాచ్యం హ్యఖండం। హ్యలక్ష్యం హ్యబాధ్యం
హ్యసంగ్యం హ్యవేద్యం । హ్యచింత్యం హ్యరూపం
హ్యసాధ్యం హ్యనాద్యంహ్యతీతం హ్యనంతం
హ్యశుద్ధం హ్యబుద్ధం। హ్యనామం నమామి.22.

ఈశ్లోకంలో పై ఆంజనేయ దండకంలోని పదాలు స్పష్టంగాకన్పిస్తుండడం వల్ల సీతారామాంజనేయ సంవాదం అచల మతానికి ప్రధాన ఆధారభూతమైన గ్రంధంగా చెప్పుకోవచ్చు. అంతేకాదు, ఈ రచయిత కలిసి చర్చించిన పలురువు అచల అనుయాయులుకూడా సీతారామాంజనేయ సంవాదములోని పలు పద్యాలను అచల విషయంగా తెలిపిన కారణంగానూ, అచల అనుయాయులు పాటించే రాజయోగానికి ప్రామాణికత పరశురామ పంతుల 'సీతారామాంజనేయ సంవాదం'నుండి లభించిందని భావించడానికి వీలుకలుగుతున్నది. మాలపల్లి నిర్మాత ఉన్నవకూడా అచల గ్రంథాలలో 'సీతారామాంజనేయ సంవాదము' ను పేర్కొనడం ఇక్కడ గమనార్హం.

## అచలం-స్త్రీ :

ఈ మతంలో స్త్రీలకు ప్రవేశంతోపాటు పీఠాధిపత్య బాధ్యతలు ఇవ్వడం కూడా కన్పిస్తుంది. అచల సంప్రదాయానికి చెందిన తూడి దేవమాంబ వరంగల్ నగరంలోని శివనగర్‌లో భక్తులకు అచలబోధ చేసెడిది. అంతకుపూర్వం ఈమె గురువువద్ద బోధాధికారం పొందిన 1952వ సంవత్సరంనుండి వరంగల్ జిల్లా ములుగు తాలూకా, నరసాపురం శివారు పావయ్యపల్లి గ్రామంలో స్వగృహమందుండి భక్తులకు బోధ చేస్తుండెడిది. ఈమెతోపాటుగా నిష్కళానంద బలభద్ర పరమేశ్వరమ్మ, జడల గౌరమ్మ, పట్టెం లింగమ్మ మొదలైనవారు ఆశ్రమవాసులై నిత్యం ప్రభాత సేవ, గురుపూజ, నిత్యానుష్ఠాన కార్యక్రమములు, అతిధి ఆర్య సత్కారములు చేస్తుండేవారు23.

ప్రస్తుతము దేవమాంబ అచలైక్యము పొందినప్పటికీ, శివనగర్ ఆశ్రమంలోని ఈమె సమాధికి నిత్య ధూప దీప నైవేద్యములు జరుగుతున్నవి. ఈ విధంగా అచలంలో స్త్రీలు విశేష ప్రాధాన్యాన్ని కలిగి ఉంటున్నారు.

## అద్వైతము-అచలము :

అచలమతాన్ని అనుసరిస్తున్న పలువురిని సంప్రదించగా అచల మతము అద్వైత మతమునకు చెందినట్టిది కాదని, దానికంటె భిన్నమైనట్టిదని పేర్కొనటం జరిగింది. అచల మతానుయాయుల అభిప్రాయం త్రిపురనేని వెంకటేశ్వర రావుగారి మాటల్లో ఇలాఉంది—

> "అద్వైత బ్రహ్మము అపరిపూర్ణమని తమది పరిపూర్ణ బ్రహ్మమని చెప్పుదురు. అద్వైత బ్రహ్మభావము సాపేక్షికమైనది. కాల దేశావచ్ఛిన్న మయినదని, మానుష మనోవికల్పమేనని సవిమర్శక ముగా స్థాపించి తమది నిరపేక్షకము (Non-relative) పరమము (Absolute)నని తమ అచల పరిపూర్ణమును సర్వమైన మానవ మనోవికల్పములకు, సదసదాది సర్వద్వయములకు అతీతమైన పరిపూర్ణతత్వముగా బయలును సూచించినది. అద్వయతత్వమని పిల్చుకొన్నది. అది ఏవిధముగను వర్ణింపబడుట సమ్మతము గాదు. అనిర్వచనీయతత్వ మనిర్వాచ్యమేగాని అద్వైతులవలె దానిఆనందమనిగాని, చిత్ సత్ అనిగాని, మరింకొకటనిగాని చెప్ప రాదనును .. వీరి సిద్ధాంత శిరోమణి.
>
> అంతశ్శూన్యం బహిశ్శూన్యం సర్వశూన్యం సదాశివం శూన్యాశూన్య విరాహిత్యం తల్లింగం అచలంప్రభో॥ అన్నదని వీరి గ్రంథములు ఉదహరించుచున్నవి"24.

అయితే, అచలమత గ్రంథాలలోనూ, పలువురు విమర్శకుల విమర్శల్లోనూ అచలానికి అద్వైతానికి అభేదం చెప్పబడటం గమనించాలి.

జైన, బౌద్ధముల తర్వాత జ్ఞాన, కర్మకాండలను సామాన్యులలో వ్యాపింప చేయుటకై ఏ ప్రయత్నమూ జరుగలేదు. ఇట్లాంటి పరిస్థితులలో రామానుజులు, బసవేశ్వరులు, చైతన్యుడు, కబీరు, నానకు, వల్లభాచార్యులు, తుకారాం మొదలైన మహానుభావులు భక్తిమతాలను స్థాపించి సామాన్య జనులలో ఈ భావాల్ని కలిగించినారు. ఇదే సమయంలో ఆంధ్రదేశంలో "అచలబోధ" అనేపేరుతో అద్వైతము సామాన్య జనులలో విస్తృతంగా వ్యాపించింది25.

కోడాటి నారాయణరావుగారన్నట్లుగా-

> "ఇటీవలి కాలంలో సుమారు శతాబ్దం క్రిందట శివరామదీక్షితుల దేశికత్వంలో 'అచల మతము' అనే పేరుతో ఒక అద్వైత సిద్ధాంతం ప్రచారంలోకి వచ్చింది"26

శివరామ దీక్షితుల శిష్యవర్గంలోనివారైన భాగవతుల కృష్ణయ్యగారు రచించిన అచలసిద్ధాంత గ్రంథమైన 'శుద్ధ నిర్గుణతత్వ కందార్థదరువులు'కూడ అచలమునకు అద్వైతమునకు భేదమున్నట్లు చెప్పడంలేదు. కృష్ణయ్యగారు అచలమును మరియు బయలు (ఎరుక)ను గూర్చి ఇచ్చిన కందార్థదరువులను ఉదహరించి, దీని విషయమై చర్చిస్తూ డా॥ బి. రామరాజుగారు-

> "ఈ యెరుక పుట్టుచు గిట్టుచునుండును... ఈ యెరుకనే ఇతరులు (అద్వైతవాదులు) 'సాక్షి'యనిరి. అచల సిద్ధాంతమువారు దీనిని 'సాక్షిసహ' యనిరి. మాటల భేదముదక్క 'సాక్షి' యన్నను 'సాక్షిసహ'యన్నను ఒక్కటే"27.

అని తెలిపినారు.

"ఆత్మా సత్ జగన్మిథ్యా యథా స్వప్నవత్" ఇది అద్వైత సిద్ధాంతమునకు పరమ ప్రామాణిక వాక్యము శ్రీ శంకరాచార్యులవారు ఈ వాక్యం ఆధారంగానే బ్రహ్మసత్యత్వమును, జగన్మిథ్యాత్వమును ప్రతిపాదించినారు. ఈ బ్రహ్మ సత్తామాత్రుడని, ఏకస్వరూపుడని ఈ బ్రహ్మయందు గుణములేవీ లేవని (నిర్గుణుడని) సజాతీయ, విజాతీయ స్వగత భేద రహితుడని ఇత్యాది రూపంగా వర్ణింపబడింది. "బ్రహ్మవిదాప్నోతిపరం, తదేషాభ్యుక్తా, సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ. యోవేద నిహితం గుహాయాం పరమేవ్యోమన్"28. అని చెప్పిన ఉపనిషద్వాక్యములకు అనచ్ఛిన్నము అజ్ఞానములేక జడాతి రిక్తము, అపరిచ్ఛేదము బ్రహ్మయని వ్యావృత్తిరూపంలో చెప్పబడిన శంకరాచార్యుల భాష్యార్థము. అనగా అసత్తుకంటె వేరైనది (ప్రకృతి లేదా మాయకంటె వేరైనది) అజ్ఞానముకంటె అతిరిక్తమైనది, అంతములేనిది బ్రహ్మయని తాత్పర్యమేకాని ఆ బ్రహ్మమునందు సత్యము, జ్ఞానము, అనంతము అనుగుణములు కలవని అర్థముకాదు. అట్లు చెప్పినట్లైతే బ్రహ్మము నిర్గుణమనుట పొసగదు. కాబట్టి బ్రహ్మ నిర్గుణుడని చెప్పవలసి వచ్చింది. ఈ వాదమునే బ్రహ్మైక్యవాదమని చెపుతారు.

అచల సిద్ధాంతంలో మూడు మంత్రాలు ప్రధానమైనవి కన్పిస్తున్నాయి.[29]అవి

1. 'ఏతన్మిథ్యా శుద్ధవియత్ కించిన్నాస్తి'—ఇది ద్వాదశాక్షరి. మరికొన్ని అచల గ్రంథాలలో ద్వాదశాక్షరికి పై మంత్రానికి బదులుగా — 'అయం వ్యర్థః బాహ్యకోపీన భవతి' అనే మంత్రం కన్పిస్తున్నది.

2. 'స్వప్నే ప్రలెయ మానరూపానిచ యధాతధా'—ఇది పంచదశి.

3. 'నిర్మాల మేతదజ్ఞానాశ్శరీరం నాస్తి కేవలం'—ఇది షోడశి.

ఈ మంత్ర స్తంభత్రయము మీదనే అచల సిద్ధాంత భవనం నిర్మింపబడ్డది. ఈ త్రిమంత్రములు కొంతవరకు అద్వైత సిద్ధాంత ప్రతిపాదకముగా సాగినట్లు కన్పిస్తున్నది. ఉన్నవ పేర్కొనట్లుగా-

> "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా అనే వాదము వీరి (అచల)మతమునకు మూలకందము. అందులోనూ బ్రహ్మసత్యమను తత్వముకంటె జగన్మిథ్యా అనుతత్వమే ఎక్కువయినది"30.

అంతేకాదు, ఈ "తత్వవాదులు....బోధించింది అద్వైతమే. దీనికే అచలమతమని ప్రసిద్ధికలిగింది"31 అనటం గమనించాలి. మొత్తంమీద ఈ అచల పరిపూర్ణము అద్వైతశాఖకు చెందిన వేదాంత విజ్ఞానంగా భావించవచ్చు32.
కపిల వెంకటరావుగారి మాటల్లో—

> "దాదాపుగా మన దేశమందంతటను ఏదోఒక రూపున వ్యాపించి యున్న అద్వైత సిద్ధాంతమును సామాన్యప్రజలలో బోధించుట కెవ్వరును పూనుకొనలేదు. ఆలోటునీయచలబోధలు తీర్చివేసినవి33."

అని చెప్పుకోవచ్చు. అచలమతం అద్వైతశాఖకు చెందినదే అయినప్పటికీ ఈ మతంమీద నాథ సంప్రదాయం యొక్క ప్రభావంతోపాటు, సూఫీతత్వం యొక్క ప్రభావంకూడా స్పష్టంగా చూడవచ్చు.

## నాథ సంప్రదాయం-అచలం :

నాథ సంప్రదాయం శైవమత ప్రభేదమని సర్వసమ్మతము. వీరు గోరక్ష నాథుని శివునిగా (భైరవునిగా) భావిస్తారు. వీరి ఆలయమందు నాథులు అర్చకులుగా ఉంటారు. గోరక్షనాథుని గురువు మత్స్యేంద్రనాథుడు. నాథయోగులు సహజ స్థితిని సముపార్జించుటకు గురూపదేశమార్గమున ఊర్ధ్వరేతస్కులై, ఉచ్ఛ్వాసనిశ్వాసములు బంధించి మనస్సును స్థిరంచేసుకొంటారు. వీనినే బిందు ధారణ, పవననిశ్చాంచల్యత, చిత్తనిరోధమంటారు34.

నాథ సంప్రదాయానికి చెందిన స్త్రీ నాథిని అని పిలువబడుతుంది. ఇందులో జాతివివక్షత పాటింపబడదు. నాథ సంప్రదాయము అవధూత మార్గము. సిద్ధ, యోగమార్గములు అనికూడా ప్రసిద్ధము. నాథులు విగ్రహారాధనచేయరు. కొందరు నాథులు కపిలుని, దత్తాత్రేయుని మార్గదర్శకులుగా అంగీకరించి, పూజిస్తారు35. ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావుగారు అన్నట్లుగా-

> "తత్వ విచారణకంటె సాధనకు ప్రాధాన్యమిచ్చిన యోగమార్గం. ప్రత్యేకంగా హఠయోగమార్గం. నేటికీ హఠయోగప్రదీపిక వారికి పరమ ప్రమాణం. అష్ట సిద్ధులతోపాటు పరమ జ్ఞానసిద్ధి ధ్యేయమైనప్పుడు అది మహామార్గం కాకతప్పదు. ఇందుకే సాధకునికి ఏ మతమూ లేదు. బాధకునికే, వాదకునికే మతావేశం. కాబట్టే వీరిది ప్రత్యేక సంప్రదాయం కాలేక అన్నిటిలోనూ అల్లుకుపోయింది36".

ఈ సంప్రదాయంలో రసవాదం, కాయసిద్ధి, వయస్తంభన, ఆకర్షణవంటి అనేక విషయాలు పెనవేసుకొనిపోవడం కన్పిస్తుంది37.

నాథ సంప్రదాయానికి చెందిన పలు లక్షణాలు అచలమతంలో చోటు చేసుకొన్నవి. ముఖ్యంగా నాథ సంప్రదాయంలో హఠయోగమునకెంత ప్రాముఖ్యత ఉందో అంత ప్రాముఖ్యత అచలంలోనూ కన్పిస్తుంది38.

నాథ సంప్రదాయానికి చెందిన "ఫిలాసఫీ ఆఫ్ గోరఖ్‌నాథ్" అనే గ్రంథంలో-

అంతశ్శూన్యో బహిశ్శూన్యః శూన్యకుంభ ఇవాంబరే
అంతఃపూర్ణో బహిః పూర్ణః పూర్ణకుంభ ఇవార్ణవే ॥

అనే శ్లోకం ఉంది. రిక్తమైన కుండలోవలె లోపలా బయటా శూన్యమైంది. అల్లాగే నిండుకుండలోవలె లోపలా బయటా నిండైనది అని శ్లోకార్థము.

సమాధి అనుభవ వేళలో అనుభవింపబడే వస్తువు నేరుగా ఉండడంకాని భోక్తృ-భోగ్యానికి నడుమ అంతరంకాని ఉండదు. అంతస్సులోనూ బయటా, ముందుకాని వెనుకకాని దానినిగూర్చిన ఎఱుక ఉండదు. అందువల్ల దానిని ఆత్యంతిక అభావమని, శూన్యమని పేర్కొనవచ్చును. ఇంకొక విషయమిది. అన్ని వాంఛలకు పరిపూర్తిగ విముక్తి ప్రయత్నాలకు లక్ష్యంగానేకాక పరమార్థాన్ని, మోక్షాన్ని అందుకోవడంలో పొందవలసిన తృప్తిని, సామరస్యాన్ని; ఆనందాన్ని కల్గిస్తుంది. ఆ దశను పొందిన తర్వాత తెలుసుకోదగిందిగాని, పొందదగిందిగానీ మరేదీ ఉండదు. అందువలన అనుభవదశలో అసత్తని శూన్యమని భావించేఅంశం పూర్ణసత్ కూడా అవుతుంది39. ఇది నాథ సంప్రదాయతత్త్వము. ఆ తర్వాతనే అచలవాదులు అచల పరిపూర్ణమునకు పరంగా మలచుకొని అర్థంచెపుతున్నారు. పైన చెప్పబడిన శ్లోకానికి బ్రహ్మానందుడు సుదీర్ఘమైన వ్యాఖ్యవ్రాసినాడు40. ఈ వ్యాఖ్యానంయొక్క అర్థాన్ని యథాతథంగా గ్రహించి అచలపరంగా చెప్పడం చూడవచ్చు41.

అచల తత్త్వవేత్తలు వేమనను అచల ప్రబోధకుడిగా పేర్కొంటుండగా, కొందరు విమర్శకులు వేమనను నాథయోగిగా పేర్కొంటున్నారు. అంతేకాదు, అచల సంప్రదాయంలో ప్రధానంగా ప్రస్తావింపబడుతున్న రాజయోగమును శివయోగంగా నాథయోగ సంప్రదాయానికి చెందినట్టిదిగా, ఇదే సంప్రదాయానికి చెందిన కొలను గణపతిదేవుని శివయోగసారం తెలుపుతున్నది42.

పై అంశాల్నిబట్టి చూచినట్లైతే, నాథ సంప్రదాయంతో వేమనకు, వేమనతో అచలానికిగల పరస్పర సంబంధాల్నిబట్టి నాథ సంప్రదాయం అచలంమీద గాఢ ప్రభావం వేసిందని స్పష్టంగా చెప్పుకోవచ్చు.

నాథ సంప్రదాయంలో వలెనే అచలంలోనూ స్త్రీకి ప్రాధాన్యాన్నివ్వడం, సుతమాష్ట్ర విరసనము, కులభేద నిరాకరణము, అవధూత మార్గం అనుసరించడం కన్పిస్తున్నది.

## సూఫీమతము-అచలం :

సూఫీ అనే పేరు ఇస్లాం. మత ప్రవక్త తర్వాత వ్యాప్తిలోకి వచ్చినట్లు తెలుస్తున్నది.[43] 'సూఫ' అనే ఒక అరబ్ తెగనుబట్టి 'సూఫీ' పదము ఏర్పడిందని కొందరు భావిస్తుండగా, ప్రఖ్యాత రచయిత ఇక్బాల్ అలీషా-

> "తెల్లని వస్త్రములు ధరించి, స్వచ్ఛమైన జీవితము, హృదయము కలిగి, ఆధ్యాత్మికౌన్నత్యము కలిగి ఉన్నందున 'సూఫీ' అనుపేరు కలిగినట్లుగా"

అభిప్రాయపడినారు.

సూఫీ మతానుయాయులు పంచసిద్ధాంతాన్ని అనుసరిస్తుంటారు. అవి 1. సౌభ్రాతృత్వము 2. జ్ఞానము 3. భక్తి 4. దేవుడు 5. గురువు. ఈ పంచసిద్ధాంతాలలోని పలు అంశాలు అచలంలోనూ మనకు కన్పిస్తాయి. అంతేకాదు అచలంలో ముస్లింలు ప్రవేశించడంతోపాటుగా, గురువులుగా వ్యవహరించడాన్నిబట్టికూడా అచలానికి సూఫీమతంతో దగ్గరి సంబంధమున్నదని పేర్కొనేందుకు అవకాశం కలుగుతున్నది. అచలగురువైన వేమనమీద కూడా ఈ సూఫీల పంచసిద్ధాంత ప్రభావం చూడవచ్చు పలు మతాలనుండి అనేకాంశాల్ని గ్రహించి అచలం ప్రభావితం అయినట్లుగనే, సూఫీ మతంనుండికూడా కొన్ని అంశాల్ని గ్రహించి అచలం ప్రభావితం అయింది. సూఫీలు పేర్కొన్న పంచ సిద్ధాంతాల్లో- సౌభ్రాతృత్వము, జ్ఞానము, దేవుడు, గురువు మొదలైన అంశాలతో అచలానికి దగ్గరిసంబంధమున్నట్లు ఒక్కొక్క అంశాన్ని చూసినట్లైతే గమనింప వచ్చు.

## సౌభ్రాతృత్వము :

సూఫీ మతస్థులు పేర్కొన్న పంచసిద్ధాంతాలలో సౌభ్రాతృత్వము మొదటిది. వీరి మతానుసారము మానవులందరు సమానులు, సోదరులు. వీరిలో తెగ, జాతి, కుల, వృత్తి, స్థాయి, వర్గ, లింగమనే భేదం పాటింపబడదు. అచలంలోకూడా అందరూ సమానమనే భావన కన్పిస్తుంది. ఈ మతంలో

బ్రాహ్మణులు మొదలైన అగ్రవర్ణాలవారితోపాటుగా మిగతా అన్నికులాలవారే కాకుండా, సమాజంలో అంటరానివారుగా పరిగణింపబడుతున్న పంచమాదులుకూడా ప్రాధాన్యం వహించటం కన్పిస్తుంది. పైగా, ముస్లింలుకూడా ఈ మతాన్ని అనుసరించడంతోపాటు గురువులుగా వ్యవహరించడం ఈ మతంలోని మరోవిశేషం.

## జ్ఞానము :

సూఫీలు పేర్కొన్న మరొక సిద్ధాంతం జ్ఞానము. సూఫీతత్వవేత్తలు అపారమైన, అసాధారణమైన పాండితీగరిమ కలవారు "అల్-ఘ-జాలి" అన్నట్లుగా వీరు సాధించినవానిని పండితులుకూడా తెలుసుకొనలేరు. ఈ సూఫీలు "అక్ల్" అని చెప్పిన యథార్ధజ్ఞానము మానవుని పురోగమన మార్గంలో నడిపించి భగవంతుని సన్నిధానానికి చేర్చుతుంది. ఈ యథార్థజ్ఞానానికి అచలవాదులు పేర్కొన్న "ఎరుక"కు దగ్గరిసంబంధం కన్పిస్తున్నది. శ్రీ భాగవతుల కృష్ణయ్యగారు ఎరుకనుగూర్చి సులభమైనభాషలో ఇలా కందార్థదరువులలో తేటతెల్లం చేసినారు.

> "పుట్టుట గిట్టుట లేకను పుట్టే గిట్టేటి ఎరుక
> పొడిమెరుగకన్ । చట్టువలె కదలకుండును ।
> బట్టబయల్ యిట్టిదెరిగి భావింపదగునూ
> యెరుకలేక సేవింపదగునూ । వట్టియాశలచేత
> పట్టూబడకను యీ గుట్టూ దేశికునోట గట్టీగ దెలుసూక భావిం
> పదగునూ । యెరుకలేక సేవింపదగునూ ॥44

## దేవుడు :

సూఫీమతంలోదేవుడు అందరికీ చెందినవాడు. జాతి, మతము, కులము, తెగ వృత్తి, వర్గము, స్థాయి ఏదైనప్పటికీ ప్రజలందరిని సృష్టించి, పోషించి, కాపాడేవాడు. వీరిదృష్టిలో దేవుడుఒక్కడే. ఇతడుకూడా నిరాకారుడు, నిర్గుణుడు. సూఫీ సాహిత్యవేత్త సర్దార్ ఇక్బాల్అలి అభిప్రాయాన్నిబట్టి పరమాత్మాంశమైనట్టి దివ్యమైన విస్ఫులింగము మానవుని సాధనవలన భవ బంధములనుండి విముక్తమై పరంజ్యోతియైన పరమాత్మను చేరుతుంది. అపుడు జీవాత్మ పరమాత్మతో సమానమై రెంటికీ అభేదమేర్పడుతుంది.

అచల మతంలో కూడ దేవుడు ఆకారం లేనివాడు. నిరాకారుడు, నిర్గుణుడు. ఇట్లాంటి దేవుని పొందటానికి జాతి మతాదులు ప్రతిబంధకములు కావు. సర్వమతాల వారు కూడా ఈ మతాన్ని ఉపాసించి, అద్వైత్యమును పొందవచ్చు.

## గురువు :

సూఫీమతంలో గురువువద్ద ఉపదేశం పొందటానికి శిష్యునికి ప్రత్యేకమైన యోగ్యతలు అవసరంలేదు కేవలం జిజ్ఞాసఉంటే సరిపోతుంది. శిష్యుని ఆత్మ దేవునితో తాదాత్మ్యము పొందునట్లు సూఫీ గురువు తగిన సహాయంచేస్తాడు. తన దివ్యానుభూతిని శిష్యునితో పంచుకొంటాడు. శిష్యునికికూడ అట్టి అనుభూతిని కలిగిస్తాడు. అంతేకాదు, ఈ గురువులో ఏర్పడిన సంయోగంవల్ల శిష్యుడు యదార్థ జ్ఞానాన్ని పొందగలుగుతాడు

సూఫీమతంలోవలెనే అచలంలోకూడ గురువు ముఖ్యమైన స్థానాన్ని పొందు తాడు. అజ్ఞానాంధకారాన్ని తొలగించగలవాడు ఒక్క అచలగురువే అని వీరి ప్రగాఢనమ్మకము. ఇతదే వీరికి అన్నివేళలా పూజనీయుడు. మాలపల్లిలో ఈ అచల గురువుయొక్క ప్రాధాన్యాన్ని మనం స్పష్టంగా దర్శించవచ్చు.

అచలగురువైన బుచ్చయ్యగారు వచ్చినారని తెలుసుకొన్న రామదాసు అతన్ని దర్శించలేకపోయినందుకు చింతిస్తాడు. ఎప్పుడెప్పుడు దర్శనం చేసు కొంటానా అనే ఆతురతతో కాలాన్ని గడుపుతుంటాడు. బుచ్చయ్యగారుకూడా జిజ్ఞాసువులైన రామదాసు, సంగదాసు, రామానాయుడులు శిష్యులుగా లభించడం తన సౌభాగ్యంగా భావిస్తాడు. తానెప్పుడు శబరి ఘట్టాన్ని తలచుకొని పొందు తుండే దివ్యానుభూతిని బుచ్చయ్యగారు తన శిష్యులకు అనుభవానికి తీసుకొనివస్తాడు. బుచ్చయ్యగారు శబరి కథను రామదాసాదులకు తెలిపి, రామదాసూ, ఈ దృశ్యం భావించుకొన్నప్పుడెల్లా నాకు వీరిద్దరి అవస్థే (రాముడు, శబరి పొందినస్థితి) పడు తుంది' అని తెలుపుతాడు. దీనికి రామదాసు "అయ్యా! యిప్పుడు వింటున్న మేమూ ఆ అవస్థలోనేవున్నాం" అనడంలో గురువుయొక్క ప్రాధాన్యం ఈ మతంలో ఎంతగా చోటుచేసుకొన్నదో గమనింపవచ్చు.

సూఫీగురువు సాయుజ్యమును పొందక సాటి మానవులకు, సూఫీలకు సేవ చేసేందుకు, మార్గాన్ని చూపేందుకు పాటుపడతాడు. అచలంలోకూడా గురువు ఇలాగే ప్రవర్తిస్తాడు. అచలగురువు బుచ్చయ్యగారుకూడా తన శిష్యులైన రామదాసు, సంగదాసు, రామానాయుడులను నిష్కామ కర్మాచరణానికి పూనుకొమ్మని ఉద్బోధిస్తాడు. ఇందుకనుగుణంగానే సంగదాసు సంఘసేవచేస్తూ, తత్కార్య నిర్వహణలో ప్రాణాల్ని సహితం ధారపోయగా, రామానాయుడు తన ఆస్తిపాస్తులతోపాటు, తన సర్వస్వాన్ని సంఘాభివృద్ధికై వెచ్చిస్తాడు కాగా, రామదాసు తోటివారిని సంస్కరిస్తూ, జీవిత చరమాంకంలో బుచ్చయ్యగారి స్థానాన్ని పొంది, బుచ్చయ్యగారివలె శిష్యులకు నిష్కామ కర్మసిద్ధాంతాన్ని ప్రబోధించి, చివరికి బుచ్చయ్యగారివలెనే జీవసమాధిచేస్తాడు.

ఈ విధంగా సూఫీల సిద్ధాంతాలతో అచల సిద్ధాంతం దగ్గరి పోలికల్ని కలిగి ఉండడమే కాకుండా, సూఫీల నమ్మకంతోకూడా అచలం కొంత సామ్యాన్నిపొంది ఉండడం కన్పిస్తున్నది.

సూఫీ మతంలోవలె అచలంలోనూ చిత్తశుద్ధికి ప్రాధాన్యం కన్పిస్తుంది. సూఫీలు మాంసాహారాన్ని స్వీకరించరు ఇది మాలపల్లిలో సంగదాసు, రామదాసుల విషయంలో స్పష్టంగా దర్శించవచ్చు (మా. ప. 133 & 604) అంతేకాదు, సయ్యదులు, షేకులు మొదలైన మహమ్మదీయ సాధువులు దేశంలోని పలుచోట్ల సంచరిస్తూ, ప్రజాశ్రేయస్సుకు, రోగ నివారణకు పాటుపడుతుండేవారని, వీరు ముస్లిం, హిందూ అనే భేదాన్ని పాటించేవారుకాదని, అందువల్ల అందరి గౌరవానికి పాత్రులై ఉండేవారని, ఈ కారణంగా వీరి సమాధులు 'దరగాలు'గా ప్రఖ్యాతి చెందినవని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తెలుపుతున్నారు[45].' వీరి ఈసమాధులు అందరికి పుణ్యస్థలాలుగా మారినవి. అచలంలోకూడా గురువులకు అలాగే సమాజసేవకై జీవితాల్ని అంకితంచేసినవారిని గురువులుగా భావించి సమాధులు కట్టడం, నిత్యం ధూప, దీప, నైవేద్యాలుపెట్టడం, సమావేశాలు, భజనలు మొదలైన కార్యక్రమాల్ని ఏర్పాటుచేయడం కన్పిస్తుంది. వరంగల్లులోని శివనగర్‌లో అచల గురువు అయిన తూడి దేవమాంబగారి సమాధివద్ద నిత్యం పూజా కార్యక్రమాలు ఈనాటికీ ఆమె శిష్యులు కొనసాగిస్తున్నారు. అలాగే 'మాలపల్లి' నవలలోనూ సంఘసేవలో తన ప్రాణాల్ని ధారపోసిన సంగదాసుకు మంగళాపుర ప్రజలు అత్యంత భక్తిభావంతో, ఉత్సాహంతో సమాధి ఏర్పాటుచేసి, ఉత్సవాన్నిచేస్తారు.

ఇక్కడ సంగదాసుకూడ గురుస్థానాన్ని పొందుతాడు. సంగదాసు పెద్దదినం ఒక పెద్ద జాతరలాగా సాగుతుంది. తర్వాత అక్కడ సమావేశాలు నిర్వహిస్తూ బీదలకు ఉచితంగా విద్యగరపుతుంటారు.

ఈ విధంగా అచలంపైన సూఫీమతం తన ప్రభావాన్ని కొంతవేసింది.

## అచలము-సర్వమత సామాన్యము :

ఏ మతమైనా ఆచరింపబడాలంటే అందరికీ అందుబాటులో ఉండాలి. అది సర్వసామాన్యమైతేనే దానికి వ్యాప్తి, మనుగడ. అపుడే అది జనులచేత విశేషంగా అనుసరింపబడుతుంది. అచలమతముకూడా అందరికీ అందుబాటులో ఉన్నమతము. "ఈ సిద్ధాంతానుయాయులు జాతిభేదాన్ని తీవ్రంగా నిరసించారు. వీరు అన్ని మూలల్లోనూ ఉన్నారు."46

ఈ మతంలో స్త్రీ, శూద్ర, పంచమాదులకుకూడా పీఠాధిపత్యమును కల్పించి నారు. ఇక్కడ జ్ఞానానికే ప్రాధాన్యం ఇవ్వబడుతుంది తప్ప కుల, మత, లింగ వివక్షత చూపబడదు. కుల, మతాలను త్రోసిరాజన్నది ఈ అచలమతము. చీమకుర్తి శేషగిరిరావుగారన్నట్లుగా—

> "అచలవాద ప్రతిష్ఠాపనాచార్య అని బిరుదు వహించిన రామడుగు శివరామదీక్షితులు అనే అతడు కొన్ని తత్వాలు రచించాడు. జన్మతః బ్రాహ్మణుడైనా ఈయన బ్రాహ్మణ్యాన్ని త్యజించి సామాన్య ప్రజానీకంతో కలిసి మెలసి సంచరించి అచలవాదవ్యాప్తికి, ధర్మ బోధనకు తన కాలాన్ని వినియోగించాడు.... ఈయనకు శిష్య పరం పర విరివిగ కలదు. "పదము చెందక ముక్తి పదము కలుగదు" అనే మకుటముతో అచల వచనమని వ్యవహృతమగు ఇతని రచన లలో వర్ణ భేద నిరసన కన్పడుతున్నది."47

"గుణాః పూజాస్థానం గుణిషు నచలిఙ్గం నచావయః"48 అని భవభూతి మహాకవి పేర్కొన్నట్లుగ ఈ అచల మతంలో జ్ఞానానికే ప్రాధాన్యం.

ఇప్పటికీ ఈ అచల సంప్రదాయమువారు గురుపీఠముల ద్వారానూ, సమారాధనల ద్వారానూ అచలమతాన్ని వ్యాప్తిలోకి తెస్తున్నారు. ఈ అచలమతం అన్నిమతాలకు అతీతమైంది. ఇలపకుర్తి వీరవెంకటరామచంద్రరావుగారి మాటల్లో ఇలా చెప్పవచ్చు.

> "నచక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి నోమనః" అనీ "యతోవాచో నివర్త్యంతే అప్రాప్యమనసాసహ" అనీ వుపనిషత్తులు కేవల అచల పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చి పల్కుచున్నవి. ఈ బ్రహ్మము అవిజ్ఞేయము, అగోచరము. కనుక జ్ఞాన స్వరూపమే ఐన బ్రహ్మము శుద్ధ మనస్సుతో గుర్తించి, మతి (బుద్ధి) చేత నిర్ణయింపబడినవే మతములనదగును కాని జ్ఞానమనోబుద్ధులు కించిన్మాత్రముగేని ఈ పరిపూర్ణ పరబ్రహ్మమును జ్ఞాన మనోబుద్ధులు తెలియజాలవు. ఇట్టిది అచల పరిపూర్ణ పరబ్రహ్మము. దీనిని గురించి బోధించునది పరిపూర్ణబోధ సిద్ధాంతము. కనుక దీనిని ఒక మతముగా భావించుట తగదు. అది సర్వమతాతీత సిద్ధాంతము."49

## అచల లక్షణం :

> యస్యాంతర్నాదిమధ్యం నహికర చరణం నామగోత్రం నసూత్రం
> నోజాతిర్నైన వర్ణానభవతి పురుషో నా నపుంసం నచస్త్రీ నాకారం
> నైవకారంచ నహి జనన మరణం నాస్తిపుణ్యం నపాపంనోతత్వం
> తత్వమేకం సహజ సమరసం సద్గురుం తం నమామి॥50

పరిపూర్ణబోధ మార్గదర్శిని అచల లక్షణానికి పైశ్లోకాన్ని ఉదహరించింది. ద్వయదోష రహితమైన దానిని అచల పరిపూర్ణతత్వమని దానితో తాదాత్మ్యమును పొందిన గురువు అచల పరిపూర్ణుడని, అతనికే నమస్కారమని పైశ్లోకం తెలుపుతున్నది.

అచలమే పరిపూర్ణబోధసిద్ధాంతమంటూ ఇలపకుర్తి వీరవెంకట రామచంద్రరావుగారు అచలాన్ని గూర్చి ఇలా తెలుపుతున్నారు.

"పూర్ణము"అనగా ఒక ఆవరణమునందు పరిపూర్ణముగా ఏమీ ఖాళీ లేకుండా నిండియుండుట అనవలెను. కాని యిట్లున్నప్పుడు దేని యందు పూర్ణమై నిండియున్నదో ఆ ఆవరణ రూపమగు వస్తువు మాత్రము వేరుగానున్నదనవలెను. కాని "పరిపూర్ణము" అని అన్నప్పుడు ఆవరించిన వస్తువుకూడా కానేకాక పరిపూర్ణముగా నిండిన ఆ వస్తువుతప్ప మరి యేమీలేదన్నమాట. దానిని ఒకపేరుతో వ్యవహరించుటకు అన్యులెవరున్నూ వుండుటకు స్థానమైననూ లేదన్నమాట. కనుక దానికి పేరు వుండుటకే సావకాశములేదు. వ్యవహారార్థము దానిని అచలమని, బయలని, బట్టబయలని, పరిపూర్ణమని యీ సిద్ధాంతీయులిప్పుడు వ్యవహరించుచున్నారు[51].

అచలాన్ని నిర్వహించుటకు వీలు లేనందువల్లనే కావచ్చు వేమన—

"అచల తత్వమనగ అనుభవ గమ్యంబు
జూపి చెప్పరాదు సూక్ష్మమదియె
మదికి దోచుగాని మర్మమెన్నగరాదు"[52]

అని స్పష్టంగా పేర్కొన్నారు. వేమన చెప్పిన అచలతత్వాన్నిగూర్చి వివరిస్తూ పూడిపెద్ది సాంబశివరావుగారు—

"....అచలతత్వమనిన పుట్టుట గిట్టుటలులేనిది. రాకపోకలు లేనిది. మొదలు తుదలులేనిది. సర్వదేశములయందును, సర్వవస్తువుల యందును, సర్వకాలములయందును, నిండి నిబిడీకృతమై తనకు తానేవెల్లించక స్వతసిద్ధముగా నొకరీతిగా వ్యాపించియున్నదే యచల పరిపూర్ణ పరబ్రహ్మంబు..."[53]

అని తెలిపినారు. ఈ అచల పరిపూర్ణతత్వాన్ని భాగవతుల కృష్ణయ్యగారు తమ కందార్థదరువులలో సామాన్యజనుల పరిభాషలో—

పుట్టుట గిట్టుటలేకను పుట్టె గిట్టేటి యెరుక పోడి
మెరుగకన్ చట్టువలె కదల కుండును
బట్టబయల్ యిట్టిదెరిగి భావింపదగునూ మొరుకలేక సేవింపదగునూ॥

> వట్టి యాశలచేత పట్టూబడకను యీ గుట్టూ దేశికునోట
> గట్టిగ దెలుసూక భావింపదగునూ యెరుకలేక సేవింపదగునూ ॥

అంటూ ఈ విధంగా పదమూడు కందాలలో వివరించబడింది.54

ఆత్మను ప్రార్థించినపుడే అచలతత్వం అర్థమవుతుందని, ఆత్మకాముడై నశించే శరీరమనే ఆచ్ఛాదనాన్ని తొలగించుకొని చూసినట్లైతే ఏదికనిపిస్తుందో అదే అచలతత్వమని శివరామదీక్షితీయమనే అచలగ్రంధం తెలుపుతున్నది.55

ఈ అచల పరమాత్మనుగూర్చిన వర్ణనము కైవల్యోపనిషత్తులోనూ, ఆత్మోపనిషత్తులోనూ చూడవచ్చునని డా॥ ఎస్.ఎం. సుబానిగారు పేర్కొంటున్నారు.56 ఈ అచల సాధనలో జ్ఞాతా, జ్ఞేయము, జ్ఞానము అనే త్రిపుటి తొలగినప్పుడు అతడు నిస్తరంగ సముద్రమువలె, వాయురహిత స్థానమందుంచిన దీపమువలె అచలమై, పూర్ణమై, భావా భావరహితమైన కేవల జ్యోతివలె రూపొందుతాడని "మండల బ్రాహ్మణోపనిషత్" పేర్కొంటున్నది.57

ఇప్పటివరకు చెప్పుకొన్న విషయాల్నిబట్టి చూచినట్లైతే అచలాన్ని నిర్వచించడంకాని, అనుభవానికి తెచ్చుకొన్న విషయాన్ని వివరించడంకాని, వీలు కానట్టిదని తేలుతున్నది. అంతేకాదు, ఈ అచలతత్వం ఎంతో అధికారం ఉన్న వారికితప్ప అందరికీ సులభసాధ్యం కానట్టిదని గమనించాలి58.

## మాలపల్లిలో అచలం :

> "రామదాసు మాలదాసరి కులస్థుడు...మూడు తరములనుండీ వీరు జ్ఞానమార్గంలో ప్రవేశించి అచలబోధను స్వీకరించారు. అప్పటి నుండీ సర్వసమత్వాభిప్రాయములూ, స్వతంత్ర బుద్ధీ, సంఘసేవా పేక్ష, శౌచమూ, పారమార్థికచింతా వారి కుటుంబంలో తలెత్తినవి. రామదాసు గురువువల్ల కారణం పొందినప్పటినుంచీ ఐహిక విషయములయెడ కొంత విముఖత 'యేర్పడ్డప్పటి'నుంచీ. విశేషకాలం మత విషయములలోనే యిప్పుడు గడుపుతూ వున్నాడు." (మా. ప. 10-11-12).

అని మాలపల్లి నవలారంభంలో మొదటిసారిగా [illegible] ప్రస్తావన చేయబడింది

మాలదాసరి కులస్థుడయిన రామదాసు గురువుపెద్ది 'కారణం' పొంది నప్పటినుండి వారి కుటుంబంసంఘ సేవలు పూనుకొంటున్నాడు. రామదాసులో పారమార్థిక వృత్తి ప్రబలుతుంది. రామదాసు చదువుతుండేది-

> "వెంగమ్మగారి రాజయోగ సారమూ, శేషాచల నాయుడుగారి పరమపద మార్గమూ, సిద్ధప్పగారి తత్వాలూ, కోటయ్యగారి గురు కీర్తనలూ, శివరామ భాగవతుల వారి వేదాంతార్థాలూ, వీరయ్యగారి యేలలూ, సీతారామాంజనేయ సంవాదమూ, బుచ్చయ్యగారి సాధన చతుష్టయమూ, శ్రీరామశాస్త్రుల వారి భక్తియోగం" (మా.ప.21)

మొదలైన గ్రంథాలన్నీ అచల మతానికి చెందినట్టివే.

మాలపల్లిలో భక్తిప్రపత్తులు, జ్ఞానవిజ్ఞానములు కలిగినది రామదాసు కుటుంబం. రామదాసు పూర్వీకులు అచల మతాన్ని స్వీకరించిన కారణంగా రామదాసు కూడా అచలమతాన్నే అవలంబిస్తూ, గురువు వద్ద 'కారణం' పొంది తన్మార్గంలో జీవితాన్ని గడుపుతుంటాడు. 'విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్' అన్నట్లుగా - రామదాసు అభ్యాసం కలవాడు. యోగి లక్షణం కలవాడు. కాబట్టే, బుచ్చయ్యగారి పేరు వింటూనే మహాపవిత్రంగా స్మరిస్తాడు. ఇక్కడ రామదాసుకు అచల పరిపూర్ణ రాజయోగము మూడు తరముల నుంచి వంశాను క్రమంగా సంప్రాప్తమై, అభ్యాసవశము సార్థకమైనట్టిది. అందువల్లనే రామదాసు సర్వకాల సర్వావస్థలయందు చిత్కళానందాను భూతిని పొందుతుంటాడు. ఇందుకుదాహరణగా ఒక సంఘటనను చెప్పుకో వచ్చు. చేనుదగ్గరనుండి అలసటతో ఇంటికి వచ్చిన రామదాసు ఇలా యోగ నిద్రను పొందుతాడు.

> "రామదాసు ఉత్తరీయ [illegible] పట్టి [illegible] చేతులు పట్టె-పై [illegible] [illegible]తో [illegible]
> 9)

> నాస్వాదించుచుతూ క్షణంలో అంతర్ముఖుడు కాగా పౌత్రిళ్ళలో బాలుని ఊంకారములూ, పాలధారల జుంజుం రవములూ దహరా కాశముననూ మహదాకాశముననూ విలీనమైవున్న నాదబ్రహ్మ ముతో ననుసంధించి అన్నీ ఓంకారమున నేకీభవించినవి. నాడు వీరయ్య యోగివరేంద్రుని కరుణచే త్రివేణీ సంగమమున కవల సహస్రారకమలమున బట్టబయలైవున్న పండు వెన్నెట లభించిన ముక్తికాంతా సందర్శన సంజాత నిర్మలానంద ఝురీ నిమగ్నుడై వొడలెరుంగక యోగ నిద్రం జెంది. సప్తద్వీపాంతర వర్తులై నవరత్న ఖచిత సింహాసనారూఢులై మణిస్థగిత ధర్మకిరీట ధారులైన చక్రవర్తులకు అనుభవింపరాని మహదానందమును దేహం వొరుసుకునిపోవు నులకమంచమున నుయ్యాలలూగే మాల దాసరి చూరగొంటున్నాడు." (మా.ప 14)

అచల సంప్రదాయంలో గురువు భగవంతుడితో సమానం. అజ్ఞానాంధ కారంలో కొట్టుకొని పోతున్న శిష్యులకు తరణోపాయము కలిగించేవాడు గురువే. అందుకే తుంగతుర్తి బుచ్చయ్యగారు[60] వచ్చినారని తెలుసుకొన్న రామదాసు-

> "బుచ్చయ్యగారా! మన యింట్లో అడుగు పెట్టారా? యెంత సుదినం! అయ్యో నేనింట్లో లేకపోతినే అప్పుడు. ఆయన మహా తపశ్శాలి యెన్నాళ్ళ నుంచో దర్శనం చేయవలె ననుకొంటున్నా" (మా ప. 22)

నంటూ బుచ్చయ్యగారిని కలువనందుకు వేదన చెందుతాడు.

అచలమతంలో కులమతాల పట్టింపు లేదు, అందుకే రామదాసును అచల పరిపూర్ణుడైన బుచ్చయ్యగారు దగ్గరగా వచ్చి కూర్చోమంటాడు. అయితే రామదాసు తాను అచల మతావలంబకుడై కులమత భేదాల్ని వదిలిపెట్టినప్పటికీ, సంఘంలో తమ స్థానం ఏమిటో గుర్తించి నడుచుకుంటాడు. అందుకే లోపలికి రమ్మన్న బుచ్చయ్యగారితో-

"తమరు అచల పరిపూర్ణులు, తమకు నేమి భేదమూ లేదు మాబోటి అజ్ఞానులను లోక వ్యవహార మొకటి నాయిస్తున్నది గదా! దానిని అనుసరించి పోకపోతే వీలు లేదు'' (మా.ప. 41)

అని అనటంతో ఆ నాడు ఈ కులమౌఢ్యము ఎంత భీకరంగా సమాజంలో వ్యాపించి ఉన్నదో తెలుస్తుంది.

బుచ్చయ్యగారి దర్శనానికి రామదాసు, ఇతని కొడుకు సింగదాసుతో పాటుగా, సంఘసేవాపేక్ష కలిగిన భూస్వామి కొడుకు రామానాయుడు కూడా వస్తాడు. బుచ్చయ్యగారు రామదాసు సందేహాలకు సమాధానాలు చెబుతూ, వారిలో నిష్కామ బుద్ధిని కలిగించి, అచల పరిపూర్ణాన్ని సాకారంగానైనా, నిరాకారంగానైనా ఉపాసించవచ్చునని తెలుపుతాడు. ఆటుపిదప భక్తికి శబరి కథను ఉదహరించి, ఆమె కులాన్ని గుర్తు చేస్తాడు. ఇక్కడ మనకొక సందేహం కలుగుతుంది తన దర్శనానికి వచ్చిన రామదాసు వాకిట్లో ఉన్నప్పుడు అతని కులాన్ని ఎరిగి లోపలికి రమ్మన్న బుచ్చయ్యగారు, ఇప్పుడు శబరి విషయంలో కులప్రసక్తి తేవటానికి ఇట్లా చెప్పవచ్చు. లౌకిక దృష్ట్యాకాని, పారమార్థిక దృష్ట్యా కాని ఒక వ్యక్తి ఉన్నత స్థాయికి ఎదుగుటలో మానవులు కల్పించుకొన్న కృత్రిమమైన ఈ కులాలు అడ్డుగోడలు కావని, అతని (ఆమె) లోని గుణము ప్రధానమని, అలాగే ఈ కుల హెచ్చు తగ్గులు కేవలం దిగువ జాతులకు చెందిన రామదాసులాంటి వారిలో కాకుండా, అగ్రవర్ణాలకు చెందిన రామానాయుడు లాంటివారిలో తొలగినప్పుడే సర్వ సమానత్వం ఏర్పడుతుందని ఉద్దేశ్యం. అందుకే రచయిత బుచ్చయ్యగారి చేత శబరి కులాన్ని చెప్పించి, రామానాయుడిచేత వెంటనే ''కులమునకేమి? గుణం ప్రధానం కదా'' అనిపించడం జరిగించి. తర్వాత బుచ్చయ్యగారు ఇప్పటికే ఆలస్యమయిందని, 'కాలం సమీపించిందని తొందరపడి వచ్చాను. జీవ సమాధి చేయబోతున్నా'నని (మా.ప. 54) వారికి అందకుండా వెళ్ళిపోతాడు.

బుచ్చయ్యగారి గురించి ముగ్గురూ చర్చించుకొంటూ- "గొప్ప భక్తుడు, గొప్పయోగి" అని అనుకొంటారు. ఇక్కడ అచలసిద్ధికి సాకార, నిరాకారోపాసనే కాకుండా - భక్తి, యోగములుకూడా ఉపయుక్తములే. బుచ్చయ్యగారు ఉపదేశించిన నిష్కామకర్మ, భక్తి భావాలు 'మాంపల్లి'లో రామదాసు, సింగదాసు, రామానాయుడులలో ప్రధానంగా కన్పిస్తవి.

## మాలపల్లి - నిష్కామకర్మ :

అచల గురువు బుచ్చయ్యగారు కర్మనుగూర్చి వివరిస్తూ—

"వ్యావహారికంగా విచారిస్తే దుష్కర్మ చేయడంకంటే, సత్కర్మ చేయడం మెరుగు. పారమార్థికంగా విచారిస్తే రెండూ బంధ హేతువులే...ప్రారబ్ధం భోగంవల్ల నశిస్తుంది. సంచితము ముక్తి వచ్చినప్పుడు విడిపోతుంది. నిష్కామ కవచమువల్ల ఇప్పుడు చేసే కార్యముల ఫలం అంటదు...ఫలాపేక్షతో కూడినదైతే రెండూ సంచితమును వృద్ధిచేసి, ఆ సంచితము నశించకపోతే ప్రారబ్ధంగా మారుతూ, జనన మరణములకు హేతువవుతుంది. పుణ్యాత్ములు భోగములను కోరక నిష్కామ కర్ములై...పునరావృత్తి రహితమైన పరమ పదమును పొందుతారు" (మా. ప. 45 - 46)

అందువల్ల ప్రతివారూ ఫలాపేక్ష లేకుండా సత్కార్యములను నిష్కామ బుద్ధితో ఆచరించటం శ్రేష్ఠం. బుచ్చయ్యగారి ఉపదేశంవల్ల ప్రేరితులైన సంగదాసు గురుదక్షిణగా నా ప్రాణాన్నిసహా ఇస్తున్నానని అంటే, రామానాయుడు 'ఈ జీవితముకూడా మీకే అర్పిస్తున్నా'నని అంటాడు. ఇక్కడ గురువుకు అర్పించడమంటే, గురువు ఉపదేశించిన నిష్కామకర్మకని అర్థం.

ప్రతి వ్యక్తీ నియమితమైన కర్మను చేయాలి. కర్మ చేయకుండా ఉండటం కంటె చేయడమే శ్రేష్ఠం. కర్మ చేస్తేనే దేహయాత్ర సిద్ధిస్తుంది.[61] అందువల్ల నిస్సంగ బుద్ధితో చేయదగిన కర్మను ఎల్లప్పుడూ చక్కగా చేస్తుండాలి.[62] అని గీతలో చెప్పబడిన విషయాన్ని రచయిత బెజవాడలో జరిగిన ఆదిమాంధ్ర సభలో సోమయాజులచేత ఇలా అనిపిస్తాడు - "వేద శాస్త్రాలు, కర్మలు విసర్జించుకొంటే మనకు మిగిలిందేమున్నది? కర్మ విసర్జనం ఎవరికి సాధ్యమవుతుంది. మన మందరం కూడా కర్మలు ఆచరింపవలసిందే" (మా. ప. 149). కర్మ ఫలాన్ని త్యాగం చేయడమే నిష్కామ కర్మ ఈ నిష్కామ కర్మను రామదాసు, సంగదాసు, రామానాయుడులు ఆచరించి జీవిత పరమార్థాన్ని పొందుతారు.

రామదాసు సంసారాన్ని పోషించుకుంటూ, లౌకిక వ్యవహారాన్ని అనుసరిస్తూనే వీటివల్ల కలిగే సుఖ, దుఃఖాల కతీతుడై ఆత్మోన్నత్యాన్ని పెంపొందించుకొంటుంటాడు కర్మ చేస్తున్నప్పటికీ దానిలో తగుల్కొనక, ఆత్మను బంధించే ఎట్టి ప్రతి క్రియను స్వీకరించక, జ్ఞానాగ్నిచేత అన్ని సంశయాల్ని విచ్ఛిన్న మొనర్చుకొంటూ, సర్వ ధర్మాల్ని పరిత్యజించి, భగవంతుని ఆశ్రయించి నిష్కామ కర్మాచరణం ద్వారా ఉత్తమ గతిని పొందుతాడు.

కాగా, సంగదాసు స్థిరమైన లక్ష్యంతో 'ఉద్ధరేదాత్మన ఆత్మానం' అన్నట్లుగా దిగువ జాతులవారిని తీర్చిదిద్దటానికి ప్రయత్నిస్తూ, కర్మ నాచరిస్తూ, నిష్కామ కర్మాచరణంలో ప్రాణాలొదిలిన నిష్కామజీవి.

నిష్కామకర్మాచరణాన్ని, జీవిత పరమార్థాన్ని బుచ్చయ్యగారివల్ల తెలుసుకున్న రామానాయుడు ఈ మార్గంలోనే జీవిత పర్యంతం పయనించిన మహోదాత్తుడు. రామదాసన్నట్లుగా 'ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబక' మన్న దృష్టాంతానికి నిదర్శనంగా జీవితాన్ని గడిపిన కర్మయోగి రామానాయుడు.

## భక్తి :

కర్మ తర్వాత పేర్కొనవలసింది భక్తి. భక్తి మార్గంలో గురువు ప్రధాన స్థానాన్ని పొందుతున్నాడు. నవలారంభంలోనే ప్రవేశించిన బుచ్చయ్యగారు రామదాసు, రామానాయుడులలో స్తబ్దంగా ఉన్న భక్తి భావాన్ని శబరి ఘట్టం ద్వారా జాగృతం చేస్తారు.

బుచ్చయ్యగారి ఉపదేశంవల్ల పొందిన భక్తిని రామదాసు మొదలైనవారు తమ జీవిత కాలాల్లో అనుభవానికి తెచ్చుకొంటూ అపరిమితమైన ఆనందాన్ని అనుభవిస్తుంటారు. ఈ విషయం ఆయా పాత్రల గమనించినట్లైతే స్పష్టమవుతుంది.

## రామదాసు :

రామదాసులో ఆది నుండి శాంత భక్తి కన్పిస్తుంది. ఇతడు శత్రువులపైన మిత్రులపైన; అవమాన, సన్మానములందు; దుఖము, సుఖములందు; నిందాస్తుతు

ఎడల ఒకే విధమైన భావన కలిగి ఉంటుంటాడు. తనకు వచ్చే ఆపదలన్నీ భగవత్ప్రేరితముగా భావిస్తుంటాడు.

తనలోని భక్తి తత్వాన్ని సెటిల్‌మెంటు, జైలు మొదలుకొని తానెక్కడ ఉంటే అక్కడ అందరిలోను వ్యాపింపచేస్తుంటాడు.

తన ప్రభావంతో రామదాసు మొరటు మనుషులు మొదలుకొని ఎంతో మందిని భక్తిపరులుగా తీర్చిదిద్దుతుంటాడు. వీతరాగుడైన రామదాసు జైలునుండి విడుదలయ్యేప్పటికి 'రామదాస యతీంద్రుడు' అయినాడు (మా. ప. 646). కాశీనాధుని నాగేశ్వరరావుగారన్నట్లుగా "నిష్కామ ప్రేమ పరాయణమైన సర్వాత్మత్వ సందర్శన ఫలమైన జ్ఞాన యోగము భాగవత భక్తి పరిణామమును పొంది మానవులకు తరణోపాయము సులభసాధ్యము చేయుచున్నది. రామదాసు చేతలును, మాటలును భాగవత భక్తిని పరిస్ఫుటము చేయుచున్నవి.[63]

## రామానాయుడు :

రామానాయుడిలో భక్తి భావన మూడుసార్లు కన్పిస్తుంది. (1) అమ్మవారి గుడివద్ద (2) తండ్రి మరణ సమయంలో (3) జైలు ప్రాప్తించినపుడు.

ఒకసారి రామానాయుడు తన తల్లితో 'అమ్మవారి' గుడికి దర్శనానికి వెళుతాడు. పూజారి ద్వారా అమ్మవారి గుడిపైన తురకవాడి అఘాయిత్యాన్ని తెలుసుకొంటాడు. "కండ్ల బొటబొట నీళ్ళు గార్చి, కుడిచేతి పిడికిలి గట్టిగా బిగిసి గజగజ" లాడగా, ఉద్వేగంతో మనస్సు సంకల్పరహితంగా, దేదీప్యమానమైన నీల కాంతులతో త్రిశూలధారిని వీరస్వరూపిణి దృష్టిగోచరమై, రెప్పలు మూతబడగా అత్యంత భక్తి భావంతో దేవిని ప్రార్థిస్తాడు (మా. ప. 72). విశ్వవ్యాప్తిత్వం పొందిన దేవి యొక్క మహాద్భూపాన్ని దర్శించి ధన్యుడవుతాడు.

మరొకసారి తన తండ్రికి మరణమాసన్నమయినప్పుడు నారాయణ భక్తిని రుచి చూపించి, నారాయణ స్మరణతో ప్రాణోత్క్రమణం పొందేందుకు కారకుడవుతాడు

జైలు ప్రాప్తించిన రామానాయుడికి తన జీవిత కాలంలో జరిగిన సంఘటన లన్నీ ఒక్కొక్కటి స్ఫురణకు వస్తుంటవి. ఇదంతా జగన్నాటక సూత్రధారి ఆడిస్తున్న నాటకంగా భావించి, అందులో తననొక 'యింధనం'గా తీసుకొన్నం దుకు ఆనంద పరవశత్వం కలిగి, ఒళ్ళు జలదరించగా తన్మయుడవుతాడు, ఆ తన్మయత్వంలో హరినామకీర్తననాలాపిస్తాడు. సర్వం నారాయణమయమవు తుంది.

ఈ విధంగా రామదాసాదులు బుచ్చయ్యగారివల్ల పొందిన కర్మ, భక్తి భావాలను తమ తమ జీవితకాలాల్లో అనుభవానికి తెచ్చుకొని జీవిత సార్థక్యాన్ని పొందుతారు.

## అచలబోధ :

నవలలో 'అచలబోధ' అని ప్రత్యేకంగా చెప్పినచోట వీరబ్రహ్మంగారి కాలజ్ఞాన తత్వాలు. యాగంటి లక్ష్మప్పగారి తత్వాలతో పాటు, 'యెరుక' స్వభా వాన్ని వివరిస్తూ, ఇంద్రియ నిగ్రహమును, సద్వర్తనమును గురూపదేశమును పొందవలెనంటూ తెలిపిన నారయ్యగారి తత్వాలు పాడటంతో ముగుస్తుంది.

## అచలపీఠము :

అచల మతంలో సంఘసేవ చేస్తూ మరణించిన వారిని గురువులుగా భావించి, వారికి సమాధి కట్టించి దానిమీద పీఠము లేర్పాటు చేస్తారు. అదే అచల పీఠమని పిలువబడుతుంది. ఇక్కడ భజనలు, మతబోధ మొదలైన కార్య క్రమాలు చేస్తుంటారు. దానిని వీరు 'సమారాధన' మంటారు. సంగదాసు కూడా సంఘసేవ చేస్తూనే మరణిస్తాడు. అతని పేర మంగళాపురం ప్రజలు సంగ పీఠం ఏర్పాటుచేసి, సమారాధనకొరకు పిలుపునిస్తే పలుచోట్ల నుండి డబ్బు వస్తుంది. నాటి సభలో కొడుకు మరణానికి రామదాసు దుఃఖించక బ్రహ్మంగారి తత్వాలు పాడి ప్రజలను ఉత్సాహపూరితులను చేస్తాడు. పెద్ద దినం రోజు ఒక జాతరలాగా జరుగుతుంది. ప్రజలు తండోపతండాలుగా వస్తుంటారు. "శేషయ్య, శీలారు సాహెబూ, వీరదాసూ రెండు కాళ్ళూ దగ్గర బెట్టుటకు వ్యవధిలేకుండా సమారాధన ప్రయత్నాలు చేస్తున్నారు, పెరుగు

బాణసంచా, కూరగంపలూ వ్యవధి లేకుండా వస్తున్నవి ... దూరపుటూళ్ళ నుంచి జనులు ఆరాధన చూడడానికి వస్తున్నారు. బుర్ర కథలూ, కోలాటాలూ, కుస్తీలూ చెలరేగినవి. సత్తెనపల్లి వీరయ్యగారూ, బెల్లంకొండ మస్తాన్ గారూ శిష్యసహితంగా వచ్చినారు. బెజవాడ నుంచి రామేశ్వర రావుగారూ, హైదరాబాదు నుంచి వెంకటరెడ్డిగారూ, యింకా యితర అభిమానులూ వచ్చారు." వీరితో పాటు ఉత్సవం చూడడానికి బ్రాహ్మణులు కూడా వస్తున్నారు. 'రెండు జాములకు దినం పూర్తయి అష్టాదశ వర్ణాలవారూ[64] భోజనం చేసినారు. సంగపీఠ స్థాపన తర్వాత సభకు వీరయ్యగారు, తిరుమల శెట్టి కోటయ్యగారు, భాగిరెడ్డిగారు మొదలైన పలువురు అచల సంప్రదాయకులు సభ నలంకరించగా, అచల సంప్రదాయకురాలైన వేదాంతం కోటమ్మ బుచ్చయ్య గురువరేణ్యు డుపదేశించిన మహావాక్యాన్ని స్మరిస్తూ, జనక సభలో యాజ్ఞవల్క్య మహర్షిని టాతాలు గుణింప చేసిన గార్గి మహాదేవి ననుకరిస్తూ, 'అంజనేయ మండపం' మీద కూర్చుంటుంది. సభలో కుల నిరసనకు సంబంధించిన తత్వాలు పాడబడుతవి. సభ దిగ్విజయ మవుతుంది.

## జీవసమాధి :

అచలంలో జీవసమాధి[65] చెందట మనేది ప్రత్యేకంగా కన్పిస్తున్నది ఈ సమాధ్యవస్థను పొందటానికి తగిన యోగ్యత అవసరం. ముఖ్యంగా జిజ్ఞాసువులైన శిష్యులు లభించాలి. అచలంలో ప్రధాన పురుషుడుగా భావింపబడుతున్న శ్రీధరుడు కూడ శివరామ దీక్షితుల వంటి ఉత్తమ శిష్యుడు లభించిన పిదపనే సమాధిగతుడయినాడు. అలాగే మాలపల్లి నవలలో కూడా అచల గురువైన బుచ్చయ్యగారు సంగదాసు, రామానాయుడు లాంటి ఉత్తమ శిష్యులు లభించిన తర్వాత వారికి జ్ఞాన, కర్మ, భక్తి యోగాల్ని వివరించిన పిదపనే జీవసమాధి చేస్తారు.

నవలలో రామదాసు స్వయంకృతంతో గురుపు స్థానాన్ని పొందుతాడు. పుల్లప్ప, కామానాయుడులు రామదాసుకు శిష్యులౌతారు నవలారంభంలోని గురువైన బుచ్చయ్యగారి స్థానాన్ని నవలాంతాన రామదాసు పొందుతాడు. బుచ్చయ్యగారివలె జీవసమాధి చేయబోయే ముందు రామదాసు కూడా 'జ్ఞాన, కర్మ, భక్తి యోగాల్ని వివరిస్తాడు' (మా. ప. 384). జీవసమాధిని గూర్చి కపిల వెంకటరావుగారు ఇలా వివరిస్తున్నారు.

"బ్రహ్మజ్ఞానమే ముక్తి-ఆ ముక్తి దేహి దేహములో నున్నప్పుడే లభింపవచ్చును. ముక్తికొరకై జీవుడు దేహమును త్యజించ నక్కరలేదు. అందువలన నిది జీవన్ముక్తి యనబడును జీవన్ముక్తి చెందినవారు మరణమునకు వెరువరు. పైగా వారికిక నీ సంసారములో నుండ నక్కరలేదని తోచిన యెడల వారే యొక సమాధి కట్టించుకొని యందులో కాని, యేదేని గుహలలో కాని సజీవముగనే ప్రవేశించెదరు అది జీవసమాధి యందురు."66

తన కుటుంబ సభ్యులందరు (ఒక్క చిన్న కొడుకు తప్ప) మరణించగా ఒంటరి వాడైన రామదాసు కూడా సంసారాన్ని త్యజించి - "జీవితకాలము యొక్క సాయంకాలమున...బ్రహ్మతేజముతో వెలుగొందుతూ సిద్ధుడయి కొండ గుహలలో యెవరికీ కనబడకుండా నిరంతరధ్యానపరుడయి వుండి పరబ్రహ్మంతో ఐక్యమవుతాడు." (మా.ప.666-67)

మాలపల్లి రచనా కాలం కంటే పూర్వమే అచల మతం వ్యాప్తిలో నున్నది. ప్రధానంగా ఈ అచల మతానికి చెందినవారు కుల నిరసనను పాటించేవారు. ఉన్నవ దృష్టిలోనూ ఈ కుల నిరసన ఉన్నది. అయితే వీరు కులంకంటే గుణానికి ప్రాధాన్యమిచ్చేవారు. మానవుడు ఏ కులానికి చెందినప్పటికీ, అతడు తనలోని ఉత్తమాధికార లక్షణాల చేత ఆత్మోద్ధరణ ద్వారా మోక్షమును పొంద వచ్చు. ఇట్లా మోక్షాన్ని పొంది, భగవదనుగ్రహమును సంపాదించిన ఆళ్వారులలో శూద్ర పంచములు కూడా ఉన్నారు. సంఘ సంస్కరణతో పాటు,దిగువ జాతుల అభివృద్ధి, ఉద్ధరణ సాధింప బూనుకొన్న ఉన్నవ ఆనాడు బహుళ వ్యాప్తిలో నుండి, తమ కుటుంబంచేత కూడా అవలంబింపబడుతున్న అచల మతాన్ని రామదాసు, రామానాయుడు మొదలైనవారు అవలంభించినట్లుగా చూపెట్టినారు తనలోని ఉత్తమ గుణాలద్వారా రామదాసు ఆత్మోద్ధరణ సాధించి పూజ్య స్థానమైన గురు పీఠాన్నలంకరించి, చివరికి సమాధి చెందినట్లు చూపినాడు.

రామదాసు 'ఆత్మోద్ధరణ' సాధించుకొన్న విధానం తర్వాతి వ్యాసంలో చర్చింపబడుతుంది.

## ఆత్మోద్ధరణము :

ఒక వ్యక్తి ఏ కులానికి చెందిన వాడయినా, స్వధర్మాన్ని వదలి పెట్టక, సత్కర్మను ఆచరించినట్లైతే అతడు ఉత్తమ గతిని పొందగలుగుతాడు. పూజనీయుడవుతాడు. అతని జీవితం అనేకులకు మార్గదర్శకం అవుతుంది. ఇట్లాంటి వ్యక్తి, పూర్ణపురుషుడు రామదాసు[67]. కులానికి హరిజనుడైనా, స్వధర్మాచరణంద్వారా 'యతీంద్రుడు'గా మారి 'ఆత్మోద్ధరణ' సాధించు కొంటాడు. రామదాసు ఆత్మోద్ధరణ సాధించుకొన్న విధానాన్ని పలువురు విమర్శకులు ఈ విధంగా తెలిపినారు.

> "రామదాసనుభవించిన దుఃఖ పరంపరలు రాగద్వేషములను, మమకారాహంకారములను, మానాభిమానములను జయించి ఆత్మ విజయమునకు సాధనములయినవి. రామదాసుకు యావదాస్తి పోవుట, సంగదాసు బలవన్మరణము, జెయిలు, సెటిల్మెంటులందు నిర్బంధములు, జోతీ అప్పాదాసుల సహగమనము, భార్యా మరణము, పీతి తట్టలు, నిర్బంధ దండనములు, కర్మయోగ సాధ్యమైన ఆత్మోద్ధరణమునకు వినియోగపడినవి"[68]

అని కాశీనాథుని నాగేశ్వరరావుగారన్నారు.

మొదలి నాగభూషణ శర్మగారు - 'మాలపల్లి'ని రామదాసు జీవిత చరిత్రగా పేర్కొంటూ -

> "నవలలోని అన్ని పాత్రలకన్న రామదాసు పాత్రోన్మీలనమే ఉత్కృష్టమైన విధంగా చూపబడింది అందువల్లనే ఈ నవలను రామదాసు జీవిత చరిత్ర లేదా రామదాసు ఆత్మోద్ధరణము అనవచ్చు...భౌతికమైన సంపదల నుంచి కష్టాల మార్గంగుండా ఆధ్యాత్మికమైన సంపదను పొందడానికి ప్రతి మానవుడూ సాగించే యాత్ర రామదాసు జీవితమని చెప్పవచ్చు"[69] నన్నారు

> "రామదాసు ఆరంభంనుంచి చివరిదాకా సాగుతూ పోయే ఒక సూత్రభూతుడైన మహా మానవుడు. ఆరంభంలో భూమిని,

పొలాన్ని ఆశ్రయించి కనబడిన వ్యక్తి క్రమంగా విస్తరించడమూ, సామాజిక చైతన్యాన్ని ఆవరించడమూ తరువాత క్రమంగా తన లోనికి తాను ఉపసంహరించుకోవడమూ, చివరికి ఆత్మతత్వాన్ని గ్రహించి అహంకార, మమకారాలు త్యజించి జీవన్ముక్త దశకు చేరుకొన్న దశగా పరిణమించడం"70 కనిపిస్తుందని డా॥ కోవెల సుప్రసన్నాచార్యులుగారు పేర్కొన్నారు.

ఆర్. ఎస్. సుదర్శనం గారు—

"మానవ ధర్మ పరిణామంలో...హరిజనులు తమను తామే ఉద్ధరించుకోవలసిన అవసరం ఎంతో ఉన్నది...అందులో వారి పాత్ర ఆత్మోద్ధరణ ద్వారా...సంఘానికి దారిచూపే కర్తృత్వ పూర్ణమైన పాత్ర"71 కావాలన్నారు.

డా॥ ఎన్. గంగప్పగారు - "ఈ పాత్ర మూలంగా మానవధర్మ పరిణామాన్ని మిక్కిలి సున్నితంగా ప్రదర్శించారు ఉన్నవ వారు''72 అని తెలిపినారు.

రామదాసు జీవితంలో ఐహికం నుండి ఆముష్మిక మార్గానికి అభిముఖంగా పయనిస్తూ, ఆత్మోద్ధరణ సాధించుకొనేందుకు ప్రధానంగా ఉపకరించిన ఘట్టాలు (1) సంగదాసు మరణం (2) ఆస్తిపోవడం (3) వెంకటదాసు ఇల్లు విడిచి వెళ్ళడం (4) సెటిల్‌మెంట్ జీవితం (5) జైలు అనుభవాలు మొదలైనవి.

## సంగదాసు మరణం:

రామదాసుని కష్టపడి పనిచేసే మనస్తత్వం. కష్టపడ్డప్పటికి ఫలితం అనుభవించేందుకు ప్రాప్తం ఉండాలనే భావన కలవాడు. గురువువల్ల 'కారణం' పొందినప్పటి నుండి ఐహిక విషయాలంటే విముఖత ఏర్పడ్డది (మా. ప. 12). పెద్ద కొడుకు వెంకటదాసు అన్ని పనులు చూసుకొంటుండగా బుచ్చయ్యగారి రాక రామదాసులో నిష్కామ కర్మ భావన కలిగిస్తుంది. సుఖంగా సంసారం సాగుతున్న సమయంలో తన కత్యంత ప్రియమైన పుత్రుడు సంగదాసు చౌదరయ్య చేతిలో మరణిస్తాడు సంగదాసు మరణానికి దుఃఖించినా, రామదాసు

ఎవరిమీదా ఆగ్రహించడు, పైగా సంగపీర స్థాపనకు ఉత్సాహంగా పని చేస్తుంటాడు. సంగపీర స్థాపన రోజున వచ్చిన బ్రాహ్మణులను వెలి వేయిస్తానని కంఠంరాజు లాంటి వాళ్ళు బెదిరిస్తే, అతనికి సమాధానంగా దూదేకుల సిద్ధయ్య మొదలైన పలువురు తెలిపిన కులనిరసన తత్వాలు పాడి సమాధానం చెప్పతాడు.

## ఆస్తి పోవడం :

సంగదాసు మరణించిన కొద్ది రోజులకే చౌదరయ్య రామదాసు ఆస్తిమీద అక్రమ వ్యాజ్యం వేస్తాడు. 'రాజీపడితే మేలు...ప్రవాహం వచ్చినప్పుడు తల వంచడం మంచిది' (మా. ప. 242) అని రామదాసంటే, ఇతని పెద్ద కొడుకు వినిపించుకోడు. కోర్టుకు వెళతారు. ఊళ్ళో ప్రహ్లాద నాటక మాడిన రోజుననే కేసు విచారణకు వచ్చి, వాదము వినకుండానే ఆస్తి మొత్తాన్ని చౌదరయ్య పరం చేస్తుంది కోర్టు. 'రామదాసు వృత్తాంతమంతా విని' 'సద్గురూ'అని ఊర కుంటాడు. 'మాసొమ్మయితే మాకుండేదే. విచారించి యేమి ప్రయోజనం' అనివేదాంతం వల్లి స్తాడు. ఉపన్యాసం చెప్పేందుకు వచ్చిన నరసింహారావుగారితో 'మందిరంలో ఉప న్యాసం గదా, అక్కడికి పోదామా! వేళగావొచ్చింది. మనమెంతసేపు విచారించినా కోర్టు తీర్పు మారదు శిలాక్షరములతో వ్రాశారు' (మా. ప. 299). అంటూ నిశ్చలంగా ఉంటాడే తప్ప, ఎలాంటి ప్రతిస్పందన చెందడు. కక్ష సాధింపు చర్య లకు సిద్ధపడడు.

రామదాసు ఆస్తి అంతా అమీనావచ్చి చౌదరయ్యకు స్వాధీనం చేస్తాడు. పొరుగు వాండ్లు సామాను దాచుకోమన్నా వినడు. "సిరియెంత చంచలమైందో రామదాసుకు అనుభవ పూర్వకంగా" తెలిసి వస్తుంది.

ఈ విధంగా సంగదాసు మరణమూ, ఆస్తి పోవడమూ ఒక దాని మీద ఒకటిగా ఆపదలు వచ్చిపడుతున్నా రామదాసు మనో నిబ్బరాన్ని కోల్పోడు. ఒకసారి తన కుటుంబ సభ్యులను కూర్చోబెట్టుకొని-

> "మనకు కాని రోజులు వచ్చినవి. దైవం అనుకూలించక పోతే అన్నీ ప్రతికూలిస్తవి...జీవించి ఉన్నంత వరకు తినక తప్పదు గదా ? ఏదో చిన్న ఇల్లు చూచుకొని మట్టసంగా కాపురం గడుపు

కోవడం అవసరం ... వెంకటదాసుని కోరవలసిన విచారం. కుటుంబాన్ని యీదే భారం వాడిమీద వేసుకొంటే మనం కూటికి పేదలమైనా గుణానికి పేదలం గాకుండా ఉంటాం. భాగ్యవంతులం గావడం మన చేతుల్లో లేదు కాని నీతి మంతులం గావడం మన చేతిలో పని" (మా. ప 309-10)

అంటూ వారిలో మనోధైర్యాన్ని కలిగిస్తాడు

## వెంకటదాసు ఇల్లు విడవడం :

తన కొచ్చిన ఆపదలన్నింటినీ రామదాసు చిత్త శుద్ధితో తలవంచుకొని, ఎట్టి కష్టాలు వచ్చినా కాలు నిలదొక్కుకొని సమ దృష్టితో చూడడానికి తోడ్పడగల సంస్కార మలవరచుకొని, 'లోక దుస్థితిని చూచి వగచి ఊరకుండి' (మా. ప. 312) ఎట్లా జరిగేదుంటే అట్లా జరుగుతుందని భావిస్తుంటాడు. వెంకటదాసు ఇందుకు భిన్నమైన ఆలోచనలతో ఇల్లు విడిచి, ముసలి తల్లిదండ్రులను, పెళ్ళి కావలసిన చెల్లెలు, తమ్ముడిని వదలి వెళ్ళి పోతాడు. వెంకటదాసు ఇల్లు విడిచి వెళ్ళడం రామదాసు హృదయం పైన పడిన పెద్ద అఘాతం.

ఒకప్పుడు 'తండ్రిని ముని వేళ్ళతో పని ముట్టుకోనియ్యకుండా సుఖ పెట్టినవాడు, కుటుంబం మహదవస్థలో ఉంటే' వృద్ధాప్యంలో తమను కడతేరుస్తాడని ఆశించిన రామదాసుకు నిరాశ కలిగించి ఇల్లు విడిచి వెళ్ళిపోతాడు (మా. ప. 312).

పులి మీద పుట్రలాగా ఈ కష్ట సమయంలోనే అప్పాదాసు ఉద్యోగం నుండి తీసివేయబడతాడు సంసారాన్ని చక్కపెట్టవలసిన బాధ్యత ముసలి వయస్సులో తిరిగి రామదాసు మీద పడుతుంది. అయినా అధైర్యం చెందడు. 'కూలికి పోయేందుకు సిద్ధపడతాడు'. తన కొస్తున్న కష్టాలన్నింటికీ 'సద్గురూ' అని ఊరుకుంటాడే తప్ప, ఎలాంటి వ్యాఖ్యానమూ చేయడు.

రామదాసు కుటుంబం జీవనాధారం లేక క్లిష్ట పరిస్థితులలో ఉన్నప్పుడు మంగళాపురానికి క్రైస్తవ ప్రచారకులు మత వ్యాప్తికై వస్తారు. రామదాసు

కష్టాల్లో ఉన్నాడు కాబట్టి ఏదో విధంగా అతిన్ని తమ మతంలో కలుపుకొందా మని, 'రామదాసు మతం స్వీకరిస్తే మేనల్లుడికీ, కూతురికీ పెద్ద జీతాలిచ్చి ఉపా ధ్యాయులుగా ఏర్పాటు చేస్తానని' (మా ప 317) రామదాసును లోబరచు కునేందుకు రాయబారాలు చేస్తుంటారు.

మతం స్వీకరించేందుకు 'పొట్టే ఒప్పిస్తుందని,...కొంత చర్చ జరిగిన తర్వాత తానోడిపోయినట్లు నటించి క్రీస్తు మతమే సత్యమతమని ప్రకటించి మత స్వీకారం చేస్తాడని' (మా. ప. 317) ప్రచారకులు సభ ఏర్పాటు చేస్తారు. ఫాదరీ అనుకొన్నట్లుగా రామదాసు మతంలో చేరడు. పైగా, ప్రచారకులకు హిందూ మతం యొక్క ఔన్నత్యాన్ని వివరించి, తిరిగి వారు మత ప్రచారానికి మంగళాపురం రాకుండా చేస్తాడు

ఒక్కపూట సరిగా తిండి దొరకని పరిస్థితి తనది. ఈ పరిస్థితికి కారణం చౌదరయ్య. చౌదరయ్య హిందూ మతాభిమాని, అయినా తమ కుటుంబం మీద పగబట్టి నిలువ నీడలేకుండా చేసినాడు. తను 'ఊ' అంటే చాలు కూతురికీ, అల్లుడికీ ఉద్యోగాలు వస్తవి తిరిగి పూర్వపు ఔన్నత్యాన్ని తాను పొందగలడు. ఫాదరీ అంతతో చౌదరయ్య మీద పగ సాధించగలడు. ఇన్ని అవకాశాలు ఉన్నప్పటికీ రామదాసు స్వధర్మాన్ని కాదనుకొని, పరమత స్వీకారం చేయడు.

రామదాసు దృష్టిలో 'భగవత్సాన్నిధ్యం పొందడానికి దారిద్ర్యమే దగ్గరిత్రోవ...కష్టం వల్లనే పురుషునికి సద్గుణాల లవడతవి...కష్టములే భగ వంతుడు మెచ్చినవారికిచ్చు వరాలు. కాని వానిని త్రోసిపుచ్చక ఉపయోగించు కొనడమే మన కర్తవ్యం' (మా.ప. 341). అందుకే రామదాసు 'వృద్ధాప్యానికి ఉపవాసాలు తోడై మనిషి బొత్తిగా క్షీణించి శల్యావశిష్టంగా' (మా.ప. 338) తయారయినా వ్యథ చెందక పీలైనంత వరకు అందరూ ఒక్కచోటనే ఉంటూ, అప్పాదాసుకు ఏదైనా ఉద్యోగం దొరికేవరకు మంగళాపురంలో తలా ఒక పనికి వెళ్ళుతూ ఉండవలసిందని హెచ్చరించి, తాను ఊరూరూ తిరిగి గుడ్డలు అమ్మేం దుకు సిద్ధపడతాడు రామదాసు సాహసానికి ఆశ్చర్యపోయిన మాలక్ష్మి - 'ఏమీ! భగవంతుడి చిత్ర చర్యలు! నీవు యీ గుడ్డల మూటలు నెత్తిన వేసుకొని ఊరూరా దిరగడం, అమ్మకరావడమూనా? డెబ్భైయ్యోపడి జరుగుతున్నది.

వాతపు నొప్పులతో ఎన్ని ఊళ్ళు తిరుగుతావు?' అని అంటే జవాబుగా రామదాసు- 'యెంత పిచ్చిదానవు! పనిచేసుకుంటే తప్పేమున్నది? స్థితిగతులు మారినప్పుడు కాలాన్ని అనుసరించి పోకతప్పదు ఈ స్థితిలో గూడా చెడుదార్లు తొక్కకుండా న్యాయాన పోతుంటే గౌరవం ఎప్పటికీ చెడదు మంచి స్థితిలో ఉన్నప్పుడు మార్గచ్యుతి లేకుండా వర్తించడం కంటే దారిద్ర్యంలో ఉండి ధర్మంతో చరించడమే వాసి. ధనికుల కంటే దరిద్రులకే ధర్మాచరణం సులభ సాధ్యమని" (మా.ప. 341) నమ్మి కష్టపడేందుకు సిద్ధపడతాడు.

బట్టలు అమ్మడానికి వెళ్ళిన రామదాసును మధ్యలోనే దొంగలు అటకాయించి, బట్టల ధరకు రెట్టింపు ఇస్తామనంటే కష్టపడకుండా వస్తున్న సొమ్ముకు ఏమాత్రం ఆశపడడు. పైగా 'అన్యాయం యెందుకు? వాటి ఖరీదు రెండువందల రూపాయలిస్తేచాలు అందులో నాకు ముప్పై రూపాయలు లాభం వస్తుంది. నా లాభంకూడా తగ్గించుకొనే ఇవ్వండి' (మా ప. 352) అంటాడు. కాని వాళ్ళు తనమీద రెట్టింపు డబ్బుపడవేసి వెళ్ళిపోతారు. ఇంకా బట్టలు తెమ్మంటే, అంగీకరించడు. తన కొచ్చిన రూపాయలు సుబ్బిసెట్టికి ఇచ్చేంతవరకు నిద్రపోడు. తనకు వచ్చే ముప్పై రూపాయలుకూడా తాను తీసుకోవచ్చా? లేదా? అని అనేక విధాలుగా మనస్సులో తర్జన భర్జనలు చేయడం చూస్తే, రామదాసుకు కష్టపడకుండా వచ్చిన డబ్బుమీద ఎంతటి రోతభావమో తెలుస్తుంది. తర్వాత ధాన్యం అమ్మకం చేస్తూ జీవితాన్ని వెళ్ళబుచ్చుతుంటాడు.

## సెటిల్ మెంటు జీవితం :

న్యాయంగా జీవితాన్ని గడుపుతున్న సమయంలో రామదాసుమీద చోరీలు చేస్తున్నట్లు నేరంమోపి, అతని కుటుంబాన్ని అప్పాదాసుతో విడదీస్తుంది కోర్టు. అన్నింటికీ తలవంచిన రామదాసు అరెస్టుమూలంగా "ఊరు విడిచి వెళుతుంటే దయా సత్యశౌచాలు ఊరిని వదలిపెట్టి పోతున్నట్లే" (మా. ప. 396) ఉంటుంది.

క్రీస్తు దేవాలయాలయిన సెటిల్‌మెంట్లో రామదాసు కుటుంబం పలు కష్టాలకు గురి అవుతుంది. సెటిల్‌మెంట్లో అధికారులు చేసిన దుర్మార్గాల్ని లక్ష్యపెట్టని రామదాసు తన వద్దకు వచ్చిన రామానాయుడు, వెంకటయ్యలతో,

"ఈ నిర్బంధముల వల్ల నా దేహానికి పారతంత్ర్యం కలిగింది
గాని ఆత్మ సర్వ స్వతంత్రంగానే ఉన్నది'' (మా. ప. 439).

అని అంటాడు. ఇక్కడ రామదాసు జీవితంలో వస్తున్న మార్పులు, యోగి లక్షణాలు మనం గమనించవచ్చు. రామానాయుడు, వెంకటయ్యలు అన్నట్లుగా రామదాసుకు వచ్చిన కష్టాలు అతని ఆత్మ తేజానికి తోడ్పడుచున్నవి. వాటి కింద అయన అణగిపోవడం లేదు అన్నీ పరప్రసాదాలవుతున్నవి. సాధారణపు జనులు దుఃఖ భారం క్రింద క్రుంగిపోతారు. కాని ఆయన ఆత్మ వంగేదీ కాదు, కుంగేదీ కాదు. పైపెచ్చు ఎండిన కొద్దీ ఆయన ఆత్మకు బిగివెక్కువౌ తున్నది. మనిషి బొత్తిగా తపస్పై పోయినా ముఖంలో తేజమెక్కువయింది. తీగెతిరగ దారం గినే గడ్డకు బలమెక్కినట్లు వాంటిలో జపమంతా ఆత్మలో గడ్డకట్టింది. (మా.ప. 445).

రామదాసు సెటిల్‌మెంట్లో మతబోధకు వ్యతిరేకంగా ప్రవర్తించడం వల్లనూ, మతం స్వీకరించక పోవడం వల్లనూ మళ్ళీ అక్రమ కేసు పెట్టబడి కూతురూ, కొడుకులతో విడదీయబడతాడు. జైలుశిక్ష ప్రాప్తిస్తుంది.

## జైలు జీవితం :

సెటిల్‌మెంటునుండి కారాగారప్రాప్తి జరిగిన తర్వాత భార్యతో వేరుచేయ బడతాడు. జైలులో రామదాసు తనకు పెద్దలతో ఉన్న పరిచయాన్ని దృష్టిలో పెట్టుకొని మాట్లాడిన మాటలకు ఎరుకలచేత అవమానింపబడతాడు. ఈ అవమానం రామదాసుకు ఆగ్రహానికి బదులు అంతర్మథనాన్ని కలిగిస్తుంది. మనసు ఆత్మ పరీక్షలో నిమగ్నమౌతుంది. భగవంతుడు తనను బాగు చేయడం కోసమే ఎరుకల ద్వారా ఎరుక కలిగించినాడని ఆనందిస్తాడు. 'నాకాత్మ పారిశుద్ధ్యం రాలేదు నేను కర్మ సాపేక్షంగా చేస్తున్నాగాని సంగరహితుణ్ణిగాలేదు. నాతో జోతినీ, రంగణ్ణి దేవుడు విడదీశాడు ... ప్రపంచంలో నాకింకా యేమి సంబంధం వున్నది? ... ఈ రోజు నుంచీ వానప్రస్థుడనే. కారాగృహ వాసం వనవాసానికి బదులుగా వచ్చింది' (మా. ప. 468-69) అని తనకు కలిగిన అవమానం ఆత్మోన్నతికి మార్గంగా భావించుకొంటాడు.

వనవాసంలో భాగంగానే సన్యాసం ప్రాప్తిస్తుంది. విడుదవోయి జైలులోకి తనను తీసుకొనిపోయి గుడ్డలన్నీ విడిచి దిగంబరంగా ఉండమంటే - "సద్గురూ! ఈ అభిమానం కూడా యింతటితో వదలిపోయింది ద్రౌపదినీ, గోపికలనూ యిట్టి స్థితికి తెచ్చే రక్షించావు పుట్టినప్పటి స్థితిలోకి దెచ్చావు బాలుర కుండే నిష్కపట హృదయం కూడా దయచెయ్యి" (మా.ప 550) అని ఊరుకుంటాడు. తర్వాత కొంచం శిఖ కూడా ఉంచకుండా జుట్టంతా తీసి వేస్తే సన్యాసం పూర్త యిందని భావించుకొంటాడు. జైళ్ళో ఉప్పూ, పులుసూ, కారమూ లేని భోజనం వల్ల యింద్రియ నిగ్రహం త్వరగా అలవడుతుందని, మొత్తంమీద తమకే లాభమని తోటి ఖయిదీలయిన పుల్లప్ప మొదలయినవారితో అంటాడు.

జైల్లో రామదాసు తోటి ఖయిదీలను బాగుపరచే యత్నంలో వారికి భక్తి జ్ఞానాలు ప్రబోధిస్తాడు మానవుడి చరిత్రనే దేవుడి చరిత్రగా భావించి తోటి ఖయిదీల చరిత్రలు, వారు చేసేపనులు, జైళ్ళలోని దుర్భర పరిస్థితులు, రావలసిన మార్పులు మొదలైన విషయాలెన్నో చర్చిస్తుంటాడు. జైల్లో ఉండగానే రామదాసుకు జోతీ అప్పాదాసుల సహగమన వార్త తెలుస్తుంది. ఈ వార్త విన్న భార్య మరణిస్తుంది. తర్వాత వెంకటదాసు మరణిస్తాడు. ఈ విధంగా ఒక్కొక్క బంధమూ వదలి పోతుంటే, మిగిలిన ఒక్క కొడుకు తనకు దూరంగా మంగళాపురంలో ఉంటాడు.

జైల్లో ఓపిక ఉన్నంత వరకు పని చేస్తున్న రామదాసు 'అరిషడ్వర్గాలు జయించి' అజాత శత్రువవుతాడు ఉప్పు, కారం లేని జైలు భోజనం వల్ల శమదమాదు లేర్పడుతవి శాంత స్వరూపుడవుతాడు తరంగ ఘోషలో శయనించిన విష్ణుమూర్తివలె పాటలూ, కేకలూ, బూతులూ చెలరేగుతున్నా నిశ్చంచలమయిన మనస్సుతో (మా ప. 603) కాలం గడుపుతుంటాడు.

జైల్లో కక్కసు కుండను మోసిన రామదాసు పుల్లప్పతో ప్రపంచంలో అసహ్యమంటూ లేదని తెల్పితే, కండ్ల నీళ్ళ పర్యంతమయిన పుల్లప్ప రామదాసుకు వచ్చిన దురవస్థకు దుఃఖిస్తాడు రామదాసు మాత్రం "ఇదీ ఒకందుకు బాగానే వున్నది. అంతా రామ మయమె అసహ్యించు కోవలసిందేమీ లేదు ఈ ధర్మం

నాకు బాగా సుబోధకమయింది" (మా. ప. 625) అంటూ స్నానం చేసేందుకు కూడా సిద్ధపడడు.

రామదాసుకు జైలు జీవితం అలవాటవుతుంది "మొదట ఎబ్బెరికంగా ఉన్నా పద్ధతులన్నీ పాతగిలి సాధారణమయి పోయినవి. రేపులూ మాపులూ రాటపాకులవలె క్షణంలో తిరిగివస్తున్నవి. రామదాసు క్వారంటులో నుంచి ఆసుపత్రికి రావడం, వచ్చిన వెంటనే పిల్లల మరణవార్త వినడం, మాలక్ష్మి, వెంకటదాసు పోవడం, ఒకదాని వెంట ఒకటి తగిలిన వేలికే తగిలినట్టు సంభవించి ఇతర క్షోభ్యాలేమీ పెట్టుకో"కుండా ఉంటుంటాడు (మా. ప 638).

ఈలోగా నాయకులు అసహాయోద్యమం ద్వారా స్వాతంత్ర్య సంపాదనకై చేసిన ప్రయత్నాలు ఫలిస్తవి. అందరూ విడుదల చేయబడతారు. అన్ని ఊర్ల కంటె మంగళాపురంలో ఉత్సాహం ఎక్కువౌతుంది 'రామదాస యతీంద్రుడు' విజయపతాకం చేతబట్టుకొని వస్తుంటే రెండువేపుల రామానాయుడూ, వెంకయ్యలు పాదచారులయి వస్తుంటారు. అందరూ ఎవరివైపుకు వారు వెళుతూ రామదాసుకు కుల వివక్షత లేకుండా దండ ప్రణమాం చేసివెడుతుంటారు. ఇక్కడ రామదాసు యొక్క వ్యక్తిత్వం ఎంతటి ఉచ్ఛదశకు చేరుకున్నదో గమనింపవచ్చు. అయితే ఇక్కడ రచయిత రామదాసు క్రమక్రమంగా ఎదుగుతూ చివరికి ఆత్మతత్వాన్ని గ్రహించి అహంకారాదుల్ని వదలిపెట్టి జీవన్ముక్త దశకు చేరుకున్న దిశలో పొందిన పరిణామాన్ని చూపాలనుకున్నాడు.

రామదాసు జీవితంలో భౌతిక, ఆధ్యాత్మిక జీవితాలు రెంటికీ సమ ప్రాధాన్యం కన్పిస్తుంది. సమాజంలో వ్యక్తిగా, కుటుంబ యజమానిగా, భర్తగా, తండ్రిగా, తోటివారిని సంస్కరించేవాడిగా తనవంతు కర్తవ్యాన్ని నిర్వహిస్తూనే ఉంటాడు. వీటికితోడు జైలులోని నిర్బంధాలు, ఖైదీల కథలు, జైలు నిర్వహణలోని లోపాలు, అవి మనిషిపైవేసే ప్రభావాలు, వారు విధించే కఠినశిక్షలు, జైలులోని ఆసుపత్రుల నిర్వహణా లోపాలు, ఖైదీలు జైలులో చేసే పనులు, వీటితో పాటు రామదాసు జైలులో పొందిన అవమానాలు, అతనిచేత పారిశుద్ధ్యపుపని చేయించడం-ఈ విధంగా నవలలో విపులంగా చర్చింపబడ్డ పలు అంశాలతో రామదాసు పెట్టుకొన్న వైయక్తిక సంబంధాన్ని చూపెడుతూనే రామదాసు

ఆత్మోద్ధరణ సాధించుకొన్న విధానాన్ని రచయిత ఒక ప్రత్యేక విధానంతో తీర్చి దిద్దినాడు. చివరికి రామదాసు విజయ కళాశాలకు 'కులపతి'గా నియమింపబడ్డప్పటికీ - ''రామదాసు కళాశాలలో మగ్గము ఒక మూల పెట్టుకొని ప్రతి రోజూ కొంత సేపు నేత నేసి, వచ్చిన కూలితో తన జీవనం గడుపు''కొంటూ కొంత కాలానికి ఎవరికీ కనబడకుండా అదృశ్యమవుతాడు. ''పరబ్రహ్మములో ఐక్యమయినాడని పెద్దలు చెప్పుకుంటారు'' (మా. ప 667)

ఈ విధంగా రామదాసు జీవితం పండిన చేను నుంచి ప్రారంభమై పండిన దశవరకూ కుటుంబ సభ్యులు ఒక్కరొక్కరు వదిలి పోతుండగా, భవ బంధాల్ని త్రెంచుకొంటూ, జాలురకుండే నిష్కపట హృదయంతో తోటి వారిని ఆదర్శవంతులుగానూ, భక్తి, జ్ఞానపరులుగానూ తీర్చిదిద్దుతూ, నిరంతర జీవ యాత్రలో విరామం కాని విరోధం కాని లేని మహా ప్రస్థానాన్ని చేస్తూ, కర్మ సిద్ధాంతం యొక్క ఆంతర్యం, బుచ్చయ్యగారి శిష్యరికంలో పొందిన నిష్కామ పరాయణతను తన జీవన ప్రవృత్తిలో నిక్షిప్తం చేసుకొని, త్రిగుణాతీతుడై, స్థిత ప్రజ్ఞుడై, వేదాంత వేదియునై, యతీంద్రుడై, విజయ కళాశాలకు కులపతియై, బ్రహ్మతేజంతో వెలుగొందుతూ, చివరకి అచల గురువైన బుచ్చయ్యగారి వలె పరబ్రహ్మైక్యం పొందడంతో పూర్తయిన స్థితిని, ఐహికాన్ని ఆముష్మికానికి మెట్టులాగా ఉపయోగించుకొని ఒకవ్యక్తి స్వధర్మాచరణం ద్వారా ఆత్మోద్ధరణను సాధించుకొన్న విధానం రామదాసు జీవితం ద్వారా చూపబడింది.

నవలాంతాన రచయిత అన్నట్లుగా

"భగవత్సంబంధమునకు జన్మవృత్తాది నియమములు లేవు ...
కడజాతివారికి మేమెక్కువను అభిమానముండదు గనుక వారికి
ముక్తి సమీపము" (మా ప 667)

పిళ్ళలోకాచార్యులనే బ్రాహ్మణుడు వ్రాసిన శ్రీ వచన భూషణం[73] పంచములు నిరహంకారులగుటచేత స్వాభావికంగా చాతుర్వర్ణ్యముల వారి కంటె ఎక్కువ అర్హులని పేర్కొన్నది[74]. ఇది రామదాసుపాత్ర ద్వారా నిరూపితము.

## సూచికలు :

1. చూడుడు - గూడూరి నమశ్శివాయ గారి వ్యాసం- 'ఉన్నవ లక్ష్మీ నారాయణగారి జీవిత విశేషాలు" పు. 1, 2. సాహిత్యోపన్యాసములు -17
2. త్రిపురనేని వెంకటేశ్వరరావు- "నశూన్యం నాపి శూన్యం నచోభయమ్ మతమ్" అని నాగార్జునులు (శూన్యాశూన్యాతీత స్తవములో) చెప్పినంత దాకా అచలమతము చెప్పినది... బౌద్ధమువలె ఇందులో జ్ఞానముకూడ మాయ." వి. వి. వే. పు. 28, 30.
3. "అచలమను మతమొకటి ఆంధ్రదేశమందున్నది. ఆ మత ప్రవర్తకుడు రాముడుగు శివరామదీక్షితులు. అతడిప్పటికి రెండు, రెండున్నర వందల ఏండ్ల క్రిందటివాడు. అతడు శ్రీధరుని శిష్యుడందురు.... ఇతని మతము తెలుగునేల నలుమొగాలను విస్తరించి మరముల నెలకొల్పుకొని యున్నది. విశాఖ - శ్రీకాకుళ మండలములలోనూ, గోదావరి సీమలోనూ... తెలంగాణమందును వ్యాప్తిగన్నది." వి. వి. వే. పు. 27.
4. త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు ఇలా తెలుపుతున్నారు - "దీనికి సిద్ధాంత శిరోమణి ప్రామాణిక గ్రంథము. ఈ మత ప్రతిపాదితాంశము పరిపూర్ణ బ్రహ్మమని, బయలు (బట్టబయలు; ఉత్తబయలు) అని, అచల తత్వమని, గురు గుహ్యమని, పరమ పదమ చెప్పుదురు." వి. వి. వే. పు. 28.

—పైన పేర్కొన్న 'సిద్ధాంత శిరోమణి' శివరామ దీక్షిత కృతి కాకపో వచ్చు. శివరామ దీక్షిత కృతిని 'బృహద్వాశిష్ఠ'మని వ్యవహరించడం ప్రము ఖంగా విన్పిస్తున్నది. ఇదిలా ఉండగా, పైన పేర్కొనబడ్డ 'పరిపూర్ణ బోధ సిద్ధాంత శిరోమణి' అనే గ్రంథం పలుభాగాలుగా పండిత శివానంద స్వామివారు వ్రాసినట్లు కన్పిస్తున్నది. అయితే, ఇవి కూడా అచల సిద్ధాం తానికి ప్రామాణిక గ్రంథములుగానే పరిగణింపబడుతున్నవి.

5. శ్రీధర స్వామినం నిత్యం బోధ కారణ మవ్యయం,
భావాతీత మహం వందే సుఖ జ్ఞానైక నిర్మలం ॥

ఈ శ్లోకంలో భాగవతుల కృష్ణయ్య గారి - 'శుద్ధ నిర్గుణ తత్వ కందార్థ దరువులు-క్షరాక్షరోపాధి ద్వయ దోషరహిత పరమ తత్వ కందములు'

అను గ్రంథంతో పాటుగా. అచల మతానికి సంబంధించిన అన్ని గ్రంథాల్లోనూ గురుపరంపరాధ్యానంలో చూడవచ్చు.

6 చూడుడు : 'శ్రీ శివరామ దీక్షితుల చరిత్ర' శ్రీ బృహద్వాశిష్ఠ మను 'శివరామ దీక్షితీయమ్' ఉత్తరభాగం.

7. కపిల వెంకటరావు గారి వ్యాసం - 'అచల బోధలు' ఆం.ప. పు. 73,74.

8. ఇలపకుర్తి పీర వెంకట రామచంద్రరావు గారి వ్యాసం - 'అచల (సంప్రదాయంలో) గురుపరంపర', వే. వి. దృ. పు. 214, 215.

9. ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి, నా. మ వే. పు. 196.

10. ఆం. ప. పు. 73.

11. వే. వి. దృ. పు. 216, 217.

12. డా॥ ఎన్. గోపి. వ్యాసనవమి. పు. 55

13. "అచల భావమును తెలుగు భాషలో వెల్లడిచేసిన వారిలో, వేమనయే ప్రథముడుగా కానవచ్చు చున్నాడు." వే.వి.దృ. పు. 213,

14. వి. వి. వే. పు. 32.

15. నీలా జంగయ్య 'తెలుగులో తత్వకవులు' పు. 59.

16. ఉన్నవ లక్ష్మీనారాయణ - 'హిందూమతము' (వ్యా) ఆం. సం. పు. 52

17. "సామాన్యులలో గురుబోధ నొంది యీ మతము నాశ్రయించిన వారు లెక్కకు మీరి యున్నారు. గ్రామ గ్రామములో నున్నారు. అగ్ర జాతులలోనూ అట్టివారు సకృత్తుగ నున్నారు. ఆంగ్లేయుల విద్యా విధానము మన దేశములో నెగబ్రాకిన కొలదియు నన్ని మతములతో బాటు ఇదియు దిగజారినది. కాని యున్నంతలో నీ మతమే మరియు రూపు చెడకుండ అంతయో కొంతయో నిలిచియున్నది " ఆం.ప. పు. 77.

18. "బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగన సదృశం తత్వమస్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమలమచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి॥"
ఈ శ్లోకం అన్ని అచల గ్రంథాలలోనూ గురుపూజా విధానంలో చూడవచ్చు.

19. "అచలంలో గురువు,గురువు అంటూ గురు భక్తిని ఎక్కువగా బోధిస్తారు. వీర గురుడు అతని శిష్యపరంపర చెప్పిన తత్వాల నిండా గురుభక్తే కనిపిస్తుంది." 'వ్యాసనవమి' పు. 55.
20. యీ మతము వారికి మరొక పేరే రాజయోగులని. ముఖ్యముగా శ్రీకాకుళ మండలములో వీరికి రాజయోగులనియే వ్యవహారము. ఎక్కడ గాని యీ మఠాధిపతులకు రాజయోగులని పేరే" వి. వి. వే. పు. 31.
21. సీతారామాంజనేయ సంవాదము. పు. 559
22. శ్రీశివరామదీక్షితీయము అను బృహద్వాశిష్ఠం మొ. భాగము పు. 3.
    (11) 'భక్తానంద బోధామృతం' - తూడిదేవమాంబ. పు. 4.
23. ఈ విషయాలు 'భక్తానంద బోధామృతం' అను గ్రంథంలోని, గ్రంథ కర్త 'లముస్వీయ చరిత్ర' ద్వారా తెలుస్తున్నవి.
24. వి. వి. వే. పు. 28.
25. ఆం. స. పు. 52.
26. కోదాటి నారాయణరావు - 'ఆంధ్రప్రదేశ్‌లో అస్పృశ్యతా నివారణోద్య మము' వ్యా. "భారత స్వాతంత్ర్యోద్యమ ప్రదీప్తి సంచిక" పు. 88. ప్రదీప్తి సంచిక పు. 88.
27. డా. బి. రామరాజు - 'తెలుగు జానపద గేయ సాహిత్యము.' పు. 410.
28. ఆనందవల్లి 1 వ మంత్రము - 'తైత్తిరీయోపనిషత్ప్రశ్న త్రితయమ్.' పు 45 - 47.
29. ఈ మంత్రములు అచలమతానికిచెందిన అన్ని గ్రంథాలలోనూ చూడవచ్చు.
30. ఆం. స పు. 52.
31. వ్యాసనవమి, పు 53.
32. "అచల వేదాంతము అద్వైత వేదాంతమున నిది యొక శాఖ." 'తెలుగు జానపద గేయ సాహిత్యము'. పు. 410.
33. ఆం. ప. పు. 79.
34. నా. మ. వే. పు. 146 150
35 పైదే పు. 151, 154, 156.
36 ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు - 'నవనాధ చరిత్ర' పీఠిక.

37. పైదే.
38. ఉన్నవ లక్ష్మీనారాయణ - 'హిందూమతం - అచలబోధ' - "ఉన్నవ రచనలుకొన్ని" పు. 127.
39. Akshaya Kumar Benarji - "Philosophy of Gorakhnath" p. 40, 41.
40. నా. మ. వే. పు. 104, 105.
41. జవంగుల నాగభూషణదాసు - "శ్రీ బ్రహ్మేంద్ర స్వాములవారి బోధామృతము" పు. 128, 129.
42. నా. మ. వే. పు 173 & 120, 121.
43. సూఫీమతానికి చెందిన విషయాన్ని డా. ఎన్. ఎం. సుబానిగారి "వేమన జీవితము, సాహిత్యము - సమగ్ర పరిశీలనము" అన్న గ్రంథంనుండి స్వీకరించడం జరిగింది. చూ : పుటలు 223 నుండి 273.
44. భాగవతుల కృష్ణయ్యగారు - "శుద్ధ నిర్గుణతత్వ కందార్థ దరువులు-పరమతత్వ కందములు." పు. 8.
45. 'ఆంధ్రదేశ సంస్కృతీ తరంగిణి. పు. 35, 36.
46 'భారత స్వాతంత్ర్యోద్యమ ప్రదీప్తి సంచిక.' పు. 88.
47. చీమకుర్తి శేషగిరిరావు - 'సర్కారు జిల్లాల తత్వకవులు' (వ్యా) "తెలుగులో తొలి సమాజ కవులు" (వ్యా. సం.) పు. 166.
48 ఉత్తర రామ చరితమ్ - చతుర్థాంకం. శ్లో. 9.
49. వే. వి. దృ పు 192
50. వాదపల్లి అగయ్య - 'పరిపూర్ణ బోధ మార్గదర్శిని' పు. 14.
51 వే వి దృ పు. 195
52. 'వేమన సూక్తి రత్నాకరము' ప 21 పు 3.
53. పూడిపెద్ది సాంబశివరావు-"జీవబ్రహ్మరహస్యసారామృతము" పు. 160.
54 "శుద్ధనిర్గుణ తత్వ కందార్థ దరువులు - పరమతత్వ కందములు" పు. 8, 9, 10
55 పోకల శేషాచలాహ్వయుడు-''శ్రీశివరామదీక్షితీయంబను అచల గ్రంథము" పు. 25

56. 'వేమన జీవితము, సాహిత్యము: సమగ్రపరిశీలనము' పు. 30.

57. పై గ్రంథమునుండి ఎత్తివ్రాయబడినది. చూ: పు. 301.

58. 'వేమన సూక్తి రత్నాకరము' ప. 24. పు. 23.

59. "గురువువద్ద ఉపదేశమును పొందుటను కారణమగుటయని చెప్పుదురు. కారణము పొంది ఈ శాఖకు చెందిన స్త్రీ పురుషులు కొందరయినను లేని గ్రామము ఆంధ్రదేశములో నుండుటరుదు." అం. స. పు. 52.

60. 'మాలపల్లి' నవలలోని అచల గురువైన తుంగతుర్తి బుచ్చయ్యగారి పేరు గల ఒకాయన 18 వ శతాబ్దంలో ఉండేవాడని 'గుత్తికొండ క్షేత్రం కథ' అనే శీర్షికన శ్రీ నాగరాజుగారు 'ఇహం-పరం' గూర్చి విచారిస్తూ 1981 ఏప్రిల్ 4వ తేదీనాటి ఆంధ్రప్రభ (దిన) పత్రికలో వ్రాసిన విషయం వల్ల తెలుస్తున్నది.
చూ: పి. భాగ్యమ్మ-'మాలపల్లిలో పాత్రచిత్రణ' వ్రాతప్రతి. అనుబంధం-2. పుట. 244.

61. "నియతం కురు కర్మత్వం కర్మజ్యాయోహ్యా కర్మణః
శరీర యాత్రాపిచతేన ప్రసిద్ధ్యేదకర్మణః॥"
శ్రీభగవద్గీత-కర్మయోగం శ్లో.8.

62. "తస్మాదసక్త స్సతతం కార్యం కర్మసమాచర" పైదే శ్లో. 19.

63. చూ. కాశీనాధుని నాగేశ్వరరావు. మాలపల్లి-తొలిపలుకు.

64. 'విద్యార్థి కల్పతరువు' అను 'ఆంధ్రభాషా విషయ సర్వస్వము'లో అష్టాదశజాతులు తెలుపబడినవి. అవి. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, వ్యావహారిక, గోరక్షక, శిల్పక, పంచాణ, కుంభకార, తంతువాయ, క్షౌరక, రజక, వస్త్రచ్ఛేదక, చర్మకార, తింభూత, లుబ్ధక, చండాల, మాతంగ జాతులు. పు. 9.

రచయిత: విద్వాన్ శ్రీ ముసునూరి వెంకటశాస్త్రి.

65. "జీవాత్మ పరమాత్మతో నేకమగుటయే జ్ఞానము. అదియే సచ్చిదానందము. జీవుడు దేవునినుండి వేరుగాదు వేరుగాదని తెలుసుకొనుటకు నిశ్చల సమాధి యవసరము. అదియే అచల సమాధి. అచలమతమని ఇందుకే యీ మతమునకు పేరు వచ్చినది." అం ప. పు. 78.

66. ఆం. ప. పు. 79.

67. కే వి. ఎన్. రాఘవన్- "రామదాసు పూర్ణమానవుడు. ఒక విధంగా అమృతత్వాన్ని పొందాడని చెప్పవచ్చు. జీవితంలో పొందిన అనేకమైన అనుభవాలను సత్యాన్వేషణకు మెట్లుగ దర్శించాడు. తనకు విశ్వ చైతన్యానికి మధ్య వారధి నిర్మించుకోవటంచేత సామాన్యుల దృష్టిలో భరింపరాని దుఃఖంకూడ రామదాసుకు ఆనంద కారకంగా నిలిచింది. ఆతని జీవితం సమాజానికి మార్గదర్శకమైంది." 'వేయిపడగలు: సమకాలీనత - సార్వకాలీనత' పు. 108.

68. మాలపల్లి - తొలిపలుకు.

69. మొదలి నాగభూషణశర్మ - 'తెలుగు సాహిత్యం-గాంధీజీ ప్రభావం.' పు. 158, 159.

70. స. చ-పు. 9, 10.

71. స. సా-పు. 157.

72. డా. ఎన్. గంగప్ప- 'ఉన్నవవారి సాహిత్య జీవిత విశేషాలు' (వ్యా) సాహిత్యోపన్యాసములు -17. పు. 32.

73. ఆం. స. పు. 48.

74. ఇదే భావాన్ని శ్రీరామకృష్ణ పరమహంస ఇలా తెలిపినారు: "జాతిభేదాలు మరిచిపోవలె. జాతి భేద బుద్ధి తొలగించుకొనడానికి ఒక్కటే ఉపాయము. అదే భక్తి. భక్తులు ఏ జాతికీ చెందరు. భగవద్భక్తిలేని బ్రాహ్మణుడు బ్రాహ్మణుడుకాడు, భగవద్భక్తుడైన చండాలుడు చండాలుడుకాడు అస్పృశ్యుడు భక్తిమూలంగా శుద్ధుడు. పవిత్రుడు అవుతాడు......... ఆత్మవికాసం పొందుతూఉంటే జాతి భేదము కూడా తమంతట తామే సమసిపోతాయి." 'భారతదేశ సంస్కృతి'-ద్వి.భా. పు. 492.

అధ్యాయం : నాలుగు

# మాలపల్లి : గాంధీ ప్రభావం

నవలకు 'మాలపల్లి' అని పేరు పెట్టడంలోనే ఉన్నవకు అస్పృశ్యతా సమస్య మీద గల ఆసక్తి తెలుస్తుంది. ఉన్నవకు పంచముల అభివృద్ధి మీద ఇంతటి శ్రద్ధ కలగడానికి గాంధీజీ ప్రభావం ప్రధాన కారణం. గాంధీజీ అహ్మదాబాదు ఆశ్రమంలో అస్పృశ్యతా నివారణకై అమితమైన కృషి సల్పినాడు.[1]

> "పూర్ణ మానవత్వంతో కూడిన సమాజాన్ని నిర్మించడంలో అడ్డంకిగా హరిజన సమస్య ఒకటి నిల్చింది. దీన్ని దృష్టిలో ఉంచుకొనే గాంధీజీ తన యావచ్ఛక్తిని హరిజనులపై కేంద్రీకరించాడు మన పల్లెల్లో ప్రధానమైన వాడు వ్యవసాయ కూలీ. అతడు హరిజన వర్ణానికి చెందినవాడు కావడం సాధారణ విషయం. ఈ హరిజన వర్ణాన్ని ప్రధాన వర్ణాలతో సమానంగా చూడకపోవడమే కాక, వాళ్ళని కనీసం మనుష్యులుగానైనా చూడకపోవడం అనే ఘోర దురాచారం మన సంస్కృతి ప్రవాహాన్ని బురద గుంటగా మార్చేసింది."[2]

ఈ దురాచారాన్ని తొలగించడానికే గాంధీజీ తను ప్రారంభించిన నిర్మాణ కార్యక్రమాలలో అస్పృశ్యతా నివారణకు అత్యంత ప్రాధాన్యత కనబరచినాడు.

ఉన్నవ 'మాలపల్లి'లో గాంధీజీ ప్రబోధించిన నిర్మాణ కార్యక్రమాంశాల్లో అస్పృశ్యతా నివారణను ప్రధానంగా తీసుకొని హరిజనోద్ధరణను చూపిస్తూనే, దీంతోపాటు గాంధీజీ ప్రవచించిన మద్యనిషేధము, ఖాదీ, నవీన విద్య, స్త్రీ జనోద్ధరణము, కార్మిక సమస్య, ఆర్థిక సమత, అసహాయోద్యమము మొదలైన పలు అంశాల్ని ప్రాస్తావికంగా చెప్పడం జరిగింది ఈ అంశాల్లోనూ ఉన్నవ

ఆర్థిక సమతా సాధనకు, అసహాయోద్యమానికి అస్పృశ్యతా సమస్య తర్వాత నవలలో ప్రాధాన్యాన్ని కల్పించినాడు. ఈ అంశాల్ని ఒక్కటొక్కటిగా విశ్లేషించి చూసినట్లైతే పై విషయం స్పష్టమవుతుంది.

అస్పృశ్యత అనేది గాంధీజీ కంటె పూర్వమే సమాజంలో వ్యాపించి ఉన్నది. అయితే ఆనాటికి వృత్తుల నాశ్రయించుకొని గ్రామీణ వ్యవస్థ సక్రమంగా సాగుతుండడం కారణంగా ఎవరి వృత్తులను వారు మాత్రమే చేసుకొంటూ జీవిస్తూ ఉండడం కారణంగానూ, అస్పృశ్యులు కూడా తమ వృత్తి నాధారం చేసుకొని జీవిస్తుండడంవల్ల వీరు పెద్దగా ఆర్థిక ఇబ్బందులకు గురికాలేదు.

ఇదిలా ఉండగా, ఒక వైపు ఆంగ్ల ప్రభుత్వం భారతదేశంలో వ్యాపించడం కారణంగా వృత్తులు నశించినవి. స్వయం సంపూర్ణంగా ఉన్న గ్రామీణ వ్యవస్థ క్షీణించింది. అన్ని కులాల వారు తమ తమ వృత్తులను కాకుండా ఇష్టమైన వృత్తిని స్వీకరించడం ప్రారంభించినారు. దాంతో ముఖ్యంగా దిగువ కులాలకు చెందిన అస్పృశ్యులు జీవించడానికి ఇతర మార్గాలు లేకపోవటంమూలాన వారు ఆర్థికంగా బాగా చితికి, దుర్భరంగా జీవితాల్ని నెట్టుకొస్తున్నారు. దీనికి తోడుగా వీరు అగ్రకులాల వారిచేత హీనంగా చూడబడుతున్నారు. ఇట్లాంటి పరిస్థితులలో ఆంగ్లేయులు తమ ప్రభుత్వ వ్యాప్తికై ఫాదరీల ద్వారా క్రైస్తవ మత వ్యాప్తిని కావించడానికి పూనుకొన్నారు. దేశీయుల చేత హీనంగా చూడబడుతున్న వీరికి ఆర్థిక సహాయంతో పాటు ఇతర అభివృద్ధులకు అవకాశాలు కల్పించడమే కాకుండా, సమాన ప్రతిపత్తిని కలిగించేందుకు ముందుకు వచ్చినారు. దాంతో దేశీయమైన బ్రహ్మసమాజము, ఆర్యసమాజము మొదలైన ఉద్యమాలు క్రైస్తవ మత వ్యాప్తివల్ల, అస్పృశ్యులు మతం మార్పిడులకు లోను కావడం కారణంగా జరిగే అనర్థాన్ని గ్రహించినాయి. వీరిని అన్ని విధాలుగా అభివృద్ధి పరచేందుకు చేసే ప్రయత్నంలో హరిజనోద్ధరణ ఒక ప్రధాన అంశంగా ముందుకు వచ్చింది. అస్పృశ్యతా నివారణ ప్రధాన లక్ష్యంగా కొంత కృషి జరిగింది కూడా [3] బ్రహ్మసమాజము మొదలైన ఉద్యమాలు తీవ్రస్థాయిలో కుల వ్యవస్థను వ్యతిరేకించడం ప్రారంభించినాయి

ఆంధ్ర దేశంలో కూడా అంటరాని తనం సర్వత్రా వ్యాపించి ఉన్న తరుణంలో వీరేశలింగం పంతులుగారు దేశంలోని వివిధ ఉద్యమాల ప్రభావంతో ప్రప్రథమంగా సంఘ సంస్కరణకు నడుము బిగించినారు ఇంకా పలువురు సంఘ సంస్కర్తలు ఈ విషయమై కృషి చేయడం కన్పిస్తుంది.[4]

గాంధీజీ రాజకీయాల్లోకి ప్రవేశించే నాటికి పూర్వమే హిందువులలో ఒక రైన పంచములపై అగ్రవర్ణాల వారు దౌర్జన్యాలు నెరపుతూ పంచములను దూరంగా తరుముతున్నారు. మరొకవైపు వీరిని తమ మతంలో కలుపుకొని భారతజాతిని నిర్వీర్యం చేయాలని ఆంగ్ల ప్రభుత్వం క్రైస్తవ మత ప్రచారకుల ద్వారా ప్రయత్నిస్తున్నది. ఇల్లాంటి పరిస్థితులలో, గాంధీజీ ప్రత్యేక శ్రద్ధతో వీరి అభివృద్ధికి గట్టి కృషి చేస్తూ, వీరు కూడా స్వాతంత్ర్య సంపాదనలో ప్రధాపాత్ర వహించ వలసిన అవసరం ఉందని, వీరి సహాయ సహకారాలులేనిదే స్వాతంత్ర్యం సులభసాధ్యం కాదని భావించినాడు.[5]

గాంధీజీ దృష్టిలో—"హరిజన సేవ మత సంబంధమైన బాధ్యత. అందు మోసమునకు అవకాశములేదు. అయ్యది పూర్తిగ అహింసాయుతముగను, సత్యముతో కూడినదిగను వుండవలయును. త్యాగము చేతను పశ్చాత్తాపము చేతను దానిని నిర్వహింపవలసియున్నది."[6] అస్పృశ్యతానివారణలో భాగంగా గాంధీజీ వీరికి 'హరిజను'లని పేరు పెట్టాడు.[7] అస్పృశ్యతను పాటించడం హిందూ మతానికి పెద్ద అపవాదుగా ఈయన భావించినాడు అస్పృశ్యుల అభివృద్ధికి అగ్రవర్ణాలు కృషిచేసి, తామొనరించిన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోవలెనని గాంధీజీ ప్రబోధించినాడు.[8] అచ్చంగా ఇదే భావాన్ని నవలలో అగ్రవర్ణానికి చెందిన రామానాయుడి చేత రచయిత ఇలా అనిపిస్తాడు: "ఇదివరకు మా సంఘాలు దిగువ జాతులకు చేసిన అపకారాన్ని బట్టి చూస్తే ఇది ఉపకారమేకాదు. పాపపరిహారానికి మేము ప్రయత్నపడుతున్నాము" (మా. ప. 138.).

గాంధీజీ సిద్ధాంతాల ప్రాతిపదిక మీద 'మాలపల్లి' నిర్మాణం చేసిన ఉన్నవ అస్పృశ్యుల ఉద్ధరణ వారినుండే ప్రారంభమైనప్పటికీ, అగ్రవర్ణాల

వారు చేయూత నియ్యవలసిన బాధ్యతను పై రామానాయుడి మాటల ద్వారా స్పష్టం చేసినాడు

ఉన్నవ 'మాలపల్లి'లో అస్పృశ్యుల ఉద్ధరణ చూపడానికి ముందుగా, అస్పృశ్యులపై భూస్వాముల దౌర్జన్యాలను, సమాజంలో అస్పృశ్యుల స్థానాన్ని, అస్పృశ్యతకు కారణాన్ని, కుల హెచ్చు తగ్గుల భావనను క్రమంగా తెలిపి, వీరి అభివృద్ధికి చేయవలసిన కృషిని వివరించినాడు.

### భూస్వాముల దౌర్జన్యం :

నవలారంభంలోనే హరిజనులపై జరుగుచున్న దౌర్జన్యాలు చూపబడినవి. రామదాసు చెల్లెలైన సుబ్బలక్ష్మి రోజంతా కష్టపడి కోసిన గడ్డిని తెచ్చుకుంటూ, చేను గట్టుమీంచి నడిచివస్తున్నంత మాత్రాన భూస్వామి ఆమెను నానా మాటలూ అంటాడు. 'దుక్కాల్లో పీకావో, దిక్కులేని వాండ్ల చేలల్లో దొంగిలావో యెవరు చెప్పగలరు' అని నానా బూతులూ తిడుతూ, గడ్డి మూటను తన కొట్టంలో బలవంతంగా వేయించుకొని, చెయ్యి విరిగేట్టు కొడతాడు. ఒక హరిజన మహిళ మీద మోతుబరి జరిపిన అత్యాచారానికి ప్రతిక్రియ చేయలేని రామదాసు చేత రచయిత 'మాల మాదిగలంటే అంత చౌక?' (మా. ప. 9) అని అనిపించి ఆవేదన చెందుతాడు.

బసివిరెడ్డి కొట్టిన దెబ్బలకు సుబ్బలక్ష్మి శస్త్రము చేయ వీలులేక, ఎముక విరిగి ఆసుపత్రిలో మరణిస్తుంది. ఈ విషయమై కోర్టులో కేసు పెట్టడానికి వీలు లేకుండా, మునసబు ధనాన్ని ఎరచూపించి, డాక్టరును లోబరుచుకొని, మరణ వాఙ్మూలాన్ని మాయం చేయించి, శస్త్రము చేయగా 'వాయిగమ్మి' చనిపోయిందని వ్రాయిస్తాడు. ఇట్లా పంచముల జీవితాలు భూస్వాముల చేతుల్లో, వారి దౌర్జన్యాలకు ఎలా బలియై పోతున్నాయో తెల్పడానికి సుబ్బలక్ష్మి పాత్ర ఒక ఉదాహరణ.

చౌదరయ్య, దిగువ జాతుల అభివృద్ధికి పాటుపడుతున్న సంగదాసు తల పగులగొట్టి, అతన్ని చంపడం, వీరి ఆస్తిని అక్రమంగా స్వాధీనం చేసుకోవడం మొదలైన పంచములపై జరుగుతున్న దౌర్జన్యాలు నవలలో పతాకాస్థాయిలో చిత్రింపబడినవి.

**సమాజంలో అస్పృశ్యుల స్థానం :**

నవలలో పంచములను అగ్రవర్ణాల వారు దూరంగా తరమడంతో పాటు, క్రమక్రమంగా అగ్రవర్ణాల వారిలో వస్తున్న మార్పు కూడా బుచ్చయ్య, నారాయణరావు పంతులు మొదలైన వారి ద్వారా రచయిత చూపినాడు.

రామదాసు తన కుటుంబంతో భోజనం చేస్తూ, తన కూతురుతో దేవుడి దగ్గరకు వెళ్ళలామని చెప్పినపుడు రచయిత అమాయకురాలూ, చిన్నపిల్లా అయిన జోతిచేత - 'దేవుడు తన దగ్గరకు మిమ్మల్ని రానిస్తాడా?' 'ఇక్కడి దేవుడి గుడిలోకి మనలను రానీయరేమి?' (మా. ప. 19) అని అగ్రవర్ణాల వారు సమాధానం చెప్పలేని ప్రశ్న వేయిస్తాడు.

ఒకసారి అచల గురువైన బుచ్చయ్యగారు వస్తే, ఆయనను కలిసేందుకు రామదాసు వెళతాడు రామదాసు దూరంగా ఉండటం గమనించి బుచ్చయ్యగారు, 'దూరంగా నిల్చున్నారేమి? యిట్లా వసారాలో కూర్చోండి' అని అంటాడు. అపుడు రామదాసు - 'మాబోటి అజ్ఞానులను లోక వ్యవహార మొకటి బాధిస్తున్నదిగా! దానిని అనుసరించి పోకపోతే వీలులేదు' (మా. ప. 41) అంటాడు. వకీలు నారాయణరావు పంతులు గారింటికి వెళ్ళినపుడు కూడా రామదాసు 'మేము చెప్ప రాని వాండ్లమండీ' అని అంటాడు దానికి పంతులుగారు - 'చెప్పవచ్చిన వాండ్లే, వచ్చి యీ ప్రక్కన కూర్చోండి, యితరుల కెవరికీ యిబ్బంది వుండదు' (మా. ప 245) అని అనటంలో పై రెండు సన్నివేశాల ద్వారా ఆనాడు సమాజంలో పాతుకుపోయిన అస్పృశ్యతా భావం తెలుస్తుంది. అగ్రవర్ణాలవారిలో వస్తున్న మార్పు ఏ కొందరిలోనో కాకుండా, సంఘంలోని అందరిలోనూ రావాలని, వీరి అభివృద్ధికి అందరూ పాటుపడాలని పై బుచ్చయ్య, నారాయణరావు పంతులు మాటల ద్వారా తెలిపిన రచయిత, రామానాయుడు, వెంకటయ్యల జీవితాల్ని వీరి అభివృద్ధికి ధారపోయించినాడు.

**అస్పృశ్యతకు కారణం :**

అస్పృశ్యులు సమాజంలో హీనంగా చూడబడడానికి కారణం దరిద్రం, అజ్ఞానం. ఈ రెంటివల్ల శుచీ శుభ్రతలకు దూరమైన వీరి జీవితాలు అధ్వాన్నంగా ఉంటవి. నవలారంభంలోనే రచయిత ఈ విషయాన్ని ఇలా వివరించినాడు:

"మాల మాదిగల పల్లెల చుట్టూ పారవేయబడ్డ యెముకల నుండీ పశు కళేబరాలను కోసిన స్థలములలో విడవబడ్డ మురికి నుండీ, తోళ్ళూనడానికి నానవేసే గాబుల నుండీ, దండెముల మీద ఆరవేసిన కుళ్ళు మాంసపు వరుగులనుండీ గౌలు బయలుదేరి నలుదిక్కులా వ్యాపిస్తున్నది. ఈ గబ్బుకు చిన్నప్పటి నుండి అలవాటు బడ్డ రామదాసుకు కూడా కష్టంగా ఉన్నది...ఇంతకూ దరిద్రమే మొదటి కారణం, అజ్ఞానం రెండవది" [మా. ప 29-30].

ఈ రెంటివల్ల శుచీ, శుభ్రతలకు దూరమైన వీరి జీవితాలు దరిద్రభారంతో చాలా కష్టంగా గడుస్తుంటవి. ఇట్లాంటి వీరి జీవితాల్ని రూపు గట్టించే వాస్తవ దృశ్యాలెన్నో 'మాలపల్లి'లో మనకు కన్పిస్తవి.

**హెచ్చు తగ్గుల భావన :**

ఆనాడు అగ్రవర్ణాలలోనే కాక, అస్పృశ్యులలో కూడా హెచ్చు తగ్గుల భేదం కన్పిస్తుంది ఎవరికి వారు తమ కులం గొప్పదనే భావాన్ని వ్యక్తం చేస్తుంటారు. నవలలో ఒకచోట ఆనాటి కుల వ్యవస్థలోని వైషమ్యాన్ని రచయిత మాలక్ష్మిచేత వ్యక్తం చేయించినాడు. సంగదాసు, రామానాయుడులు కలసి భోజనం చేయటాన్ని సుబ్బలక్ష్మి తనతో ప్రస్తావించినపుడు మాలక్ష్మి ఆ విషయాన్ని గొప్పగా భావించదు 'అందాకా యెందుకు? మనలో మనకు కుదిరిందీ- అందరూ అట్లాగే అనుకోరాదా? తప్పు ఒక్క కులపువాండ్ల దగ్గర ఉన్నదన డానికి వీలులేదు తీగె లాగితే అంతా కదులుతుంది' (మా. ప 32) అని మనుషుల మనసుల్లోని తక్కువ, ఎక్కువల భావాలు తెలిపి, ఇవి పోయినప్పుడే సమానత్వం కలుగుతుందనే వాస్తవం తెలుపుతుంది.

**అస్పృశ్యుల అభివృద్ధి - కృషి :**

సమాజంలో వెలివేయబడి, తక్కువగా చూడబడుతున్న తనవారిని విజ్ఞానవంతులను చేయాలని సంగదాసు సంకల్పం. వీరిలో అజ్ఞానం తొలగేందుకు విద్య, జీవనాధారానికి వృత్తులూ నేర్పి వీరి బ్రతుకుబాటకొక మార్గం చూపాలనుకొంటాడు.

బెజవాడలో జరిగిన పంచముల సభలో సంగదాసు పధ్నాలుగు తీర్మానాల్ని ప్రవేశ పెడతాడు. ఈ ప్రతిపాదనలద్వారా మూడు భావాల్ని వ్యక్తం చేస్తాడు. 1. తాము ఆత్మగౌరవంతో వర్తిస్తూ, శుచీ శుభ్రతల్ని పాటిస్తూ, కుల వృత్తుల పునరుద్ధరణ ద్వారా ఆర్థికాభివృద్ధిని సాధించుకొని, విద్యాజ్ఞానాలు పెంపొందించుకోవాలని తెలుపుతాడు. 2. ప్రభుత్వం తమకు ఓటింగు హక్కు ఇవ్వాలని, బంజరు భూములు పట్టా లివ్వాలని, ఇండ్ల నిర్మాణానికి స్థలాన్ని, ధనాన్ని ఇవ్వాలని, ఉద్యోగాలలో రిజర్వేషన్లుంచి, విద్యాభివృద్ధికి సహకరించాలని కోరుతాడు. 3. అగ్ర కులాలవారు 'మంది సొమ్ము' ఉపయోగించి ఏర్పరచిన విద్యాలయాలు, దేవాలయాలు మొదలైన చోట్లలో ప్రవేశం కల్పించాలని, అస్పృశ్యతను రూపుమాపాలని, కూలి పెంచవలసిందని అభ్యర్థిస్తాడు (మా ప. 156-158).

'మాలపల్లి'లో సంగదాసుచేత ప్రారంభింపబడిన పంచమాభివృద్ధి ఫలితంగా, పంచముల జ్ఞానాన్ని పెంపొందించేందుకు 'విజయ కళాశాల', ఆర్థికాభివృద్ధికి 'వృత్తి విద్యాలయము', 'వసతి గృహాలు' నిర్మించబడుతవి.

## ఆర్థిక సమత :

కంపెనీ పరిపాలన వల్ల తరతరాలుగా ఎలాంటి ఒడిదుడుకులు లేని దేశ ఆర్థిక వ్యవస్థ హెచ్చు తగ్గులకు లోనైంది. భారతదేశంలోనికి బ్రిటిషు ప్రభుత్వం అడుగు పెట్టక ముందు కుల వృత్తులు అనుసరింపబడుతూ, వస్తువుకు బదులు వస్తువిచ్చి పరస్పరం తమ తమ అవసరాలను తీర్చుకొంటూ జీవనం చేస్తుండే వారు. ఆనాడు డబ్బుకు ప్రాధాన్యత ఉండేది కాదు. అందువల్ల డబ్బు సంపాదన మీద ఎవరి దృష్టి పడకపోయేది వ్యవసాయ కూలీగా ధాన్యం ఇచ్చేవారు. ఇట్లాంటి పరిస్థితులలో బ్రిటీషువారి ఆగమనంతో దేశ పరిస్థితి తారుమారైంది. ధనానికి ప్రాధాన్యత వచ్చింది. ఈ పరిస్థితి గమనించిన భూస్వాములు స్వార్థంతో కూలీలకు అన్యాయం తలపెట్టసాగినారు పూర్వంనుండి ఇస్తున్న ధాన్యం బదులు డబ్బును ఇచ్చేందుకు నిశ్చయించుకొని, అదికూడా అతి తక్కువగా ఇచ్చేందుకు సిద్ధమయినారు.

బ్రిటీషువారి రాకతో ఈ విధంగా సామాజిక జీవితంలో అలజడి ఏర్పడి, ఆర్థిక అసమానతలు క్రమక్రమంగా పెరిగి, చివరికి కూలీల బ్రతుకు దుర్భరమైంది.

వృత్తులు నశించడంతో వ్యవసాయ కూలీలుగా మారిన వారిలో అధిక సంఖ్యాకులు హరిజనులే అయినారు. పూర్వం నుంచి అగ్రవర్ణాల వారి చేత హీనంగా చూడబడుతున్న వీరు సంవత్సరంలో ఏ మూడు, నాలుగు నెలలో కడుపునిండా, అంటే జొన్నన్నం, గోంగూరతో తింటూ మిగతా కాలమంతా అర్ధాకలితో, పస్తులతో గడుపుతున్నారు. (మా ప. 81)

ఇట్లాంటి పరిస్థితులలో రష్యాలో సామాన్య ప్రజలపై ధనిక వర్గానికి చెందిన ప్రభుత్వ దమన నీతిని సహించలేక లెనిన్ ప్రభృతులు సర్వసమానత్వ భావంతో తమ ప్రతిపాదనలను విరివిగా వ్యాపింపచేస్తున్నారు. లెనిన్ తన భావాల ద్వారా సామాన్య ప్రజలలో చైతన్యం కలిగించి, తిరుగుబాటు లేవదీసి విజయం సాధించడం ప్రపంచ దేశాల్లో ఆలోచనలు రేకెత్తించినది. ఇట్లాంటి ఆలోచనలు భారతదేశంలోనూ వ్యాపించినవి.

భారతదేశంలో గాంధీజీ మొదలైన నాయకులు ఆర్థిక సమానతకు నిర్మాణ కార్యక్రమ ప్రచారం ద్వారా తెస్తున్న మార్పు, రష్యాలో బోల్షివిజం ద్వారా వచ్చిన మార్పు, మార్క్సిజం ఆలోచనలు ఇవన్నీ గమనించిన రచయిత తన రచనలో వీటికి తగినంత ప్రాధాన్యత నిచ్చినాడు. ఆంధ్రదేశంలో అన్ని విధాలుగా అణగద్రొక్కబడుతున్న హరిజనుల, కూలీల లేమిని ప్రధానంగా చూపుతూ, వీరి పరిస్థితిని మెరుగుపరచి ఆర్థిక అసమానతలను తొలగించేందుకు; ఆర్థిక వ్యవస్థను తిరిగి పునర్నిర్మాణం చేయవలసిన ఆవశ్యకతను రచయిత 'మాల పల్లి' లో వ్యక్తం చేసినాడు.[9]

ఉన్నవ, ఆర్థిక సమతాసాధనకై 'మాలపల్లి' లో ప్రధానంగా నాలుగు మార్గాల్ని చూపినాడు.[10] (1) హృదయ పరివర్తనం (2) సమ్మె లేదా సహాయ నిరాకరణం (3) ధర్మకన్నాలు (4) ధర్మకర్తృత్వం వరుసగా ఈ నాలుగు మార్గాలు మాలపల్లిలో అనుసరింపబడిన విధానం పరిశీలించినట్లైతే, మాలపల్లిలో ఉన్నవ ఆర్థిక సమతా సాధనకై ప్రయత్నించిన విధానం తెలుస్తుంది.

11)

## హృదయ పరివర్తనం:

ఉన్నవ 'మాలపల్లి'లో 'హృదయ పరివర్తన'కు ప్రముఖస్థానం ఇవ్వడంలో గాంధీజీ ప్రభావం స్పష్టంగా గోచరిస్తుంది. గాంధీజీ దృష్టిలో హృదయ పరివర్తనం ఎంతో ప్రాధాన్యతను సంతరించుకొన్నది. ఒక గొప్ప కార్యసాధనకు హృదయ పరివర్తనం ప్రధాన మార్గంగా భావించిన గాంధీజీ సత్యాహింసల ద్వారా సత్కర్మాచరణకు పూనుకోవాలని ఉద్బోధించినాడు. ఇందుకొరకు అవసరమైతే ప్రాణ త్యాగానికైనా సిద్ధపడాలని, తద్వారానే కార్యసాధన సులభతరమౌతుందని మహాత్ముడు విశ్వసించినాడు 11

'ఏ పంట కైలు చేస్తే అది యిచ్చే పద్ధతి' (మా. ప. 109) వ్యావసాయిక విషయంలో ఉండేది. కాగా సమాజంలో డబ్బుకు విలువపెరిగి, ధాన్యం ధర ఒకటికి నాలుగు రెట్లు పెరగడంతో రైతులు డబ్బు మూటగట్టే ప్రయత్నాలు ప్రారంభిస్తారు. ఈ ప్రయత్నంలో భాగంగానే పూర్వం నుండీ వస్తున్న సంప్రదాయాన్ని కాదని కూలీగా ధాన్యానికి బదులు డబ్బు ఇవ్వజూపుతారు. ఈ డబ్బయినా ప్రస్తుత ధరల ప్రకారం కాకుండా, పూర్వమిచ్చే ధాన్యానికి పావలా ధరకట్టి ఇస్తామని ఆసాములంతా కూడ బలుక్కుంటారు.12

ఇట్లాంటి పరిస్థితులలో సంగదాసు ధనికవర్గానికి చెందిన రామానాయుడి సహాయాన్ని పొందగోరుతాడు. అతడితో హృదయ పరివర్తనం కలిగించి, బీదల జీవితాలకు అండగా నిలిచేట్టు చేయ సంకల్పిస్తాడు.

రామానాయుడు ధనవంతుడు. ఆదర్శ భావాలు కల వ్యక్తి. ముఖ్యంగా సానుభూతి, దయాదాక్షిణ్యాలు కలవాడు. సహజంగా ఏ విషయమైనా చెబితే అర్థం చేసుకోగల మనస్తత్వం రామానాయుడిది యుక్తాయుక్తాలు గ్రహించగలవాడు ఇట్లాంటి రామానాయుడికి పేదల బ్రతుకుల యెడల ఒక అవగాహన కలిగించి హృదయ పరివర్తనం తేవడానికి సంగదాసు మూడు దశల్లో ప్రయత్నిస్తాడు.

సంగదాసు రామానాయుడికి కూలీల వాస్తవ జీవితాల్ని, వారు పడుతున్న కష్టాల్ని, పొందుతున్న బాధల్ని, తింటున్న అసహ్యాకరమైన తిండిని తెలిపేందుకు రామానాయుడితో తనకు గల స్నేహాన్ని సద్వినియోగం చేసు

కొంటాడు. కూలీలు అతి కష్టంగా జీవితాల్ని గడుపుతున్న పరిస్థితులలో ఆసాములు కూలిని ధాన్యం నుండి డబ్బుకు మార్చే ప్రయత్నంలో ఉంటారు. అప్పటికే రామానాయుడు సంగదాసుతో తనకు గల స్నేహం వల్ల కూలీల పరిస్థితిని అర్థంచేసుకోగలుగుతాడు. కూలిని తగ్గించే ప్రతిపాదన కార్యరూపం ధరించబోతున్నదని తెలుసుకొని సంగదాసు పడుతున్న ఆవేదనను తనుకూడా పొందుతుంటాడు (మా. ప. 78). ఇక్కడ సంగదాసు రామానాయుడిని తన ఆలోచనా మార్గంలోకి తీసుకొని వస్తాడు. వీరిద్దరూ 'పూటకూటికి లేని కూలీల' పక్షం వహించి ధర్మయుద్ధం చేసేందుకు శపథం చేస్తారు (మా. ప. 78).

ఇట్లా సంగదాసు రామానాయుడికి మొదటి దశలో కూలీల జీవితాల ఎడ ఒక అవగాహన కలిగిస్తాడు.

రెండోదశలో సంగదాసు రామానాయుడికి కూలీలు పొందుతున్న ఆకలి బాధను తెలుపుతాడు. పంచములు బ్రతుకుల్ని భారంగా నెట్టుకొస్తున్న విధానాన్ని రామానాయుడితో ఇట్లా వివరిస్తాడు :

> "అయ్యా! మీరేమనుకుంటున్నారు, అందరికీ పొద్దుట గుమ్మ పాలూ, మధ్యాహ్నం గడ్డపెరుగూ, మూడు గంటలకు రకరకాల ఫలహారాలూ, సాయంత్రం తేలికైన భోజనం, పడుకోబోయేటప్పుడు వేడిపాలూ, అప్పుడప్పుడు చిరితిండీ యీ మోస్తరుగా అమరుతుందనుకొంటున్నారా?" (మా. ప 80).

అంటూ, ఆకలంటే ఏమిటో తెలియని రామానాయుడికి, అతికష్టంగా బ్రతుకుల్ని నెట్టుకొస్తున్న అస్పృశ్యుల జీవితాల్ని కన్నులకు కట్టినట్లుగా చిత్రించి, అతడిలో హృదయపరివర్తనకు మార్గమేర్పరుస్తాడు.

ఒకవేళ కూలీలు సమ్మెకడితే వారికి ఆ రోజులలో భోజనం ఎట్లా? (మా. ప. 80) అనేది రామానాయుడికి వచ్చిన మొట్టమొదటి ఆలోచన. అప్పుడు సంగదాసు-

> "...మామూలమావిగ పల్లెలలో నాలుగు నెలలు పూర్తైన భోజన మంటే జొన్నన్నం, గోంగూరా, కారం యివి కడుపునిండా తినడం. నాలుగునెలలు, అర్ధభోజనం, మిగిలిన రోజులు కటిక వుపవాసం...... దొరికితే నాగజెముడు పండ్లు, బొద్దాకూ, చచ్చిన గొడ్లముఱికిమాంసం...అన్నం లేకపోతే ముఱికి మాంసం కాదుగదా యెముకలు గూడా కొరికితింటారు" (మా. ప. 81)

అని తెలిపితే ఇది రామానాయుడు విని భరించలేకపోతాడు.

"ఓయబ్బా యిక చాలించవోయ్ నే వినలేను. యిదివరకు అన్నంలేక బాధపడుతున్నారంటే యేమో అనుకున్నాగాని యీ సంగతులన్నీ నాకు తెలియవు. ఇక నన్ను విడిచిపెట్టు" (మా. ప 81) మంటాడు "అన్నం బొత్తిగా లేనప్పుడు పడుకుంటే బాధ యెక్కువని అన్నపుతిత్తి మడతలు పడేటట్లుగా ముడిచి పెట్టుకొని పడుకొంటా"రని తెలిపితే, రామానాయుడు ఈ స్థితిని తొల గించేందుకు ఆలోచిస్తుంటాడు (మా. ప. 82).

ధనస్వామ్య వ్యవస్థనుండి ఒక తరం ముందుకు వచ్చిన రామానాయుడు తనకు తెలియని బీదల బాధలను అత్యంత శ్రద్ధతో తెలుసుకొంటూ, పరిష్కార మార్గాల్ని అన్వేషిస్తూ, హృదయ వేదన పొందుతుంటాడు.

ఒకసారి రామానాయుడు వ్యవసాయంలో ఉండే 'కష్టనిష్ఠూరాలు' తెలుసు కొనేందుకు సంగదాసుతో కోతలకు వెళతాడు. కూలీలతో పాటు శ్రమించేందుకు ఉద్యమిస్తాడు. కొద్దిసేపు చేను కోసేవరకు రామానాయుడికి ఆకలి ప్రారంభ మవుతుంది. తెచ్చిన అన్నం నిముషంలో అయిపోతుంది. ఆకలి తీర్చుకొనేందుకు రామానాయుడు 'దోసఫలాలు', 'వూచబియ్యం' తింటాడు. ఈ విషయాన్నే సంగదాసు అడిగితే, సమాధానంగా రామానాయుడు-

> "ఆకలంటే యెక్కడ ప్రారంభిస్తుందో, యెక్కడికి యెక్కుతుందో, యెంతవరకు వ్యాపిస్తుందో, అప్పుడు శరీరమేస్థితిలో వుంటుందో నాలుగు పర్వాలక్రింద వొక భారతం వ్రాస్తా" (మా. ప. 99) నంటాడు.

ఇక్కడ తనకింతగా ఆకలి వేయడానికి కారణం తాను ఆరోజు పని చేయడమేనని తెలుసుకొంటాడు. ఒక్కరోజు శ్రమ పడినందుకే తనకింతగా ఆకలి వేస్తే, 'పొద్దు గూకులూ పనిచేసే వాండ్లకు యెంత ఆకలి వుంటుందో' (మా. ప. 99) ఊహించలేకపోతాడు.

రైతులు స్వలాభం అపేక్షించి కూలి తగ్గించడానికి యత్నిస్తున్నారు. కాని, దీనివల్ల పనివాడి కడుపు నిండక, సరియైన పని చేయలేకపోతారని, ఇది యజమానులకే ఎక్కువ నష్టమని రామానాయుడి కున్న గ్రహింపు చౌదరయ్యలో కన్పించదు. కూలీల వాస్తవ పరిస్థితుల్ని అర్థం చేసుకొన్నందువల్లనే, వీరి విషయమై సంగదాసు తన తండ్రితో జరిపిన చర్చల్లో సంగదాసు ఆహ్వానంతో పాల్గొన్న రామానాయుడు తండ్రి కంటె భిన్నమైన ఆలోచనలతో, న్యాయంగా కూలివాడికి రావలసిన కూలినిగూర్చి తెలుసుకొనేందుకు ఆతురతపడుతుంటాడు. సంగదాసు రామానాయుడితో వ్యవసాయంలో కూలివాడి ప్రాధాన్యాన్ని తెలుపుతూ, కూలీలకు సరియైన కూలి ముట్టినట్లైతే, వారు-

> "తమ విరామకాలమును యిప్పటివలె పశుప్రాయులుగా వుండకుండా తమ విజ్ఞానాభివృద్ధికీ, దేశక్షేమం నిమిత్తం పాటుపడడానికీ, సాంఘిక, మత వ్యవహారాలలో ఐక్యం కలిగించుకోవడానికీ వుపయోగపడుతుంది'' (మా. ప. 129)

అని తెలుపుతాడు. అందువల్ల మొట్టమొదలు కూలీలకు కడుపునిండా తిండిదొరికే మార్గం చూపాలి. ఇది సాధింపబడ్డప్పుడే వీరి అభివృద్ధికి మార్గం ఏర్పడుతుంది. కాబట్టి ప్రధానంగా వీరి ఆర్థిక పరిస్థితిని బాగుపరచాలనే భావాన్ని సంగదాసు రామానాయుడిలో మూడవ దశలో కలిగిస్తాడు.

సంగదాసు ద్వారా కూలీల శ్రమను, వారికి లభిస్తున్న అతి తక్కువ కూలిని, వారు పడుతున్న ఆకలి వేదనను తెలుసుకొన్న రామానాయుడు మనస్సులో వ్యథ చెందుతుంటాడు మాటలలో వారి ఎడల సానుభూతిని వ్యక్తం చేస్తుంటాడు. చేతలలో సహాయపడేందుకు ముందుకు వస్తాడు. త్రికరణశుద్ధిగా కూలీల అభివృద్ధికై కృషి చేసేందుకు పూనుకొంటాడు ఇట్లా రామానాయుడు

తాననుకున్నంతకంటె ఎక్కువగా ప్రతిస్పందించడం సంగదాసుకు ఒక దశలో ఆశ్చర్యం కలిగిస్తుంది. (మా. ప. 83).

ఈ విధంగా సంగదాసు, ధనిక వర్గానికి చెందిన రామానాయుడికి బీదల బాధల్ని వివరించి, ప్రత్యక్షంగా చూపి, అనుభవానికి తెప్పించి 'హృదయ పరివర్తనం' కలిగిస్తాడు. కార్యసాధనలో ప్రాణాల్ని పణంగా పెడతాడు. ఒకచోట రచయిత పేర్కొన్నట్లుగా - ధర్మవిజయమెపుడూ బలిగోరుతుంది. ఎంతోమంది మహానుభావులు సత్యాచరణంకోసం, సత్కార్య నిర్వహణకోసం తమప్రాణాల్ని నిష్కామ భావంతో ధారపోసినారు. సంగదాసు కూడా తాను సంకల్పించిన సమసమాజ స్థాపనమనే యజ్ఞంలో ఉత్తమ బలిపశువై, యజ్ఞపరిసమాప్తికై ఆత్మార్పణ చేస్తాడు.

సంగదాసు స్నేహభావంతోనూ, పరిస్థితులను వివరించి ఆత్మార్పణ ద్వారానూ ప్రత్యక్షంగా రామానాయుడిలో 'హృదయపరివర్తనం' తీసుకొని వస్తాడు. పరోక్షంగా తన ఆదర్శ భావాల ద్వారా వెంకటయ్య, నారాయణరావు పంతులు మొదలైనవారిలో పరివర్తనం కలిగిస్తాడు.

## సమ్మె :

డబ్బు సంపాదన బ్రతుకుదెరువుకు సంబంధించిన విషయం. బ్రతుకు దారిలో ముందుకు సాగడానికి డబ్బే ప్రధానమైనది. ఇది లేకుండా ఏ పనీ సాధ్యం కాదు. అందుకే ప్రతీవారు జీవనోపాధికి మూలమైన డబ్బు సముపార్జనకు వారికి అందుబాటులో ఉన్న మార్గంలో పయనిస్తుంటారు. మంగళాపురంలో పంచమ కూలీలు రోజంతా కష్టపడుతున్నప్పటికీ దుర్భరమైన జీవితాన్ని అనుభవిస్తుంటారు. ఇట్లా కావడానికి కారణం వీరికి తగిన కూలి గిట్టుబాటు కాకపోవడం. కూలి గిట్టుబాటు కాకపోవడంవల్ల కడుపునిండా తిండి దొరకడంలేదు. అర్థాకలితో అలమటిస్తుండడంవల్ల వీరి జీవితాలు ఇతర అభివృద్ధులకు నోచుకోవడంలేదు. వీరు ఇతర మార్గాల్లో ప్రగతిని సాధించాలంటే ప్రధానంగా డబ్బు కావాలి. అయితే, వీరికి న్యాయంగా రావలసిన కూలిని ధనిక రైతులు ఇవ్వడం లేదు. తిండికొరకు వీరికి వేరే బ్రతుకుబాట లేక భూస్వాము లిచ్చిన తక్కువ

కూలిని విధిలేక తీసుకొంటూ, నిరాశా నిస్పృహలతో జీవితాల్ని నెట్టుకొస్తున్నారు. ఎలాంటి ఉన్నతికి నోచుకోవడంలేదు. తమకు రైతులు తక్కువకూలి ఇస్తున్నారనే విషయం సంగదాసు తెల్పేవరకు కూలీలకు తెలియదు. అంతకు పూర్వం వారిచ్చిన కూలి తీసుకొని కూలీలు కష్టపడి పనిచేస్తున్నారు. ఎప్పుడైతే ఆర్థిక వ్యవస్థలో మార్పువచ్చి, వస్తువుల ధరలు ఒకటికి నాలుగు రెట్లు పెరిగి, డబ్బుకు సంఘంలో ప్రాధాన్యత హెచ్చిందో అప్పుడు రైతులు కూలిని తగ్గించడానికి సిద్ధపడతారు. అంతకు పూర్వం ఇస్తున్న కూలి తీరును మార్చి ధాన్యంబదులు డబ్బు ఇస్తామంటారు. కూలిగా పూర్వనుండి ధాన్యం తీసుకోవడమే తెలిసిన కూలీలు ఇది డబ్బుగా మారటం వింతగా భావిస్తారు. (మా. ప. 89).

ఆర్. ఎస్. సుదర్శనంగారన్నట్లుగా -

> "మంగళాపురంలో సమస్య భూస్వాములకూ, కూలీలకూ మధ్య ఏర్పడిన వివాదం దీనికి ముఖ్యకారణం వర్గవ్యవస్థలో రాని మార్పుకంటే ఆర్థికవ్యవస్థలో వచ్చిన మార్పు. డబ్బు చలామణి విస్తరించడం, ధాన్యానికి ధర పెరగడం, ప్రభుత్వం అండ చూసుకొని భూస్వాములు దురాశకులోనై మానవత్వాన్ని మరచి 'పొదుగుకోసి పాలుతాగే' మనస్తత్వంతో వ్యవహరించడం."[13]

భూస్వాముల దురాశవల్ల కూలీలకు జరగబోయే అన్యాయం గ్రహించిన సంగదాసు కూలీల తరపున ముందు నిలుస్తాడు.

అంతకు పూర్వం కూలిగా ధాన్యం ఇస్తున్నప్పుడే కూలీలు సంవత్సరంలో అధిక భాగాన్ని అర్థాకలితో గడుపుతున్నారు. (మా. ప. 81). ఇట్లాంటి పరిస్థితుల్లో కూలి ధాన్యంనుండి డబ్బుకు మార్చడంవల్ల వీరి స్థితిగతులు మరింత దుర్భరమవుతాయి. ఇది గ్రహించిన సంగదాసు కూలీలలో చైతన్యం కలిగించి, ఐకమత్యంతో పోరాడేటట్లు చేయ సంకల్పిస్తాడు. ఈ ప్రయత్నంలో భాగంగా వీరికి శ్రమశక్తి విలువను తెలుపుతాడు. శ్రమకు తగిన ప్రతిఫలం పొందమంటాడు ప్రతిఫలం లభించనపుడు సమ్మెకట్టమని ఉద్బోధిస్తాడు

మొదటగా సంగదాసు కూలీలనందరిని ఒక్కచోట సమావేశపరచి వారితో వ్యావసాయిక విషయంలో వారి ప్రాధాన్యతను ఇలా తెలుపుతాడు. "చాకిరీ కూలివాండ్ల సొమ్ము. భూమి రైతుసొమ్ము, దేనిధర దానికుండాలె. తన పదార్థానికి తాను ఎక్కువధర తెచ్చుకొంటున్నప్పుడు ఆ వరవడిన కూలి వాడి పదార్థానికి వెల హెచ్చవద్దా?" (మా. ప. 90) అని కూలీలలో క్రొత్త ఆలోచనల్ని కలిగిస్తాడు.

ఆసాములు కూలి తగ్గించిన విషయాన్ని ప్రస్తావిస్తూ సంగదాసు -

> "ఆసామికి పండే ధాన్యాన్ని పట్టి చూస్తే అడ్డెడు గింజలు చాలా తక్కువ కూలి. యిప్పుడు అది గూడ తగ్గించవలెనని చూస్తు న్నారు. వూళ్ళో అంతా యిచ్చే ప్రకారం యియ్యండని మీరడగండి" (మా.ప. 90).

అని శ్రమకు తగిన కూలి పొందమని ఉద్బోధిస్తాడు.

పని చేయించుకొని తగిన కూలి ఇవ్వనప్పుడు కోతలకు పోవద్దని కొందరు కూలీలు, రైతులను నష్టపెట్టడం ఎందుకు, వూరికే పనిచేసి వద్దామని మరి కొందరు, కడుపులో తిండి లేక ఆకలిని చంపుకొంటూ ఎంతకాలం పనిచేయ గలమని కొందరు ఇలా పలురకాలుగా కూలీలు అనిశ్చితమైన అభిప్రాయాల్ని వ్యక్తం చేస్తారు.

ఇట్లాంటి పరిస్థితిలో సంగదాసు జోక్యం చేసుకొని కూలీలలో ఐక్యతను, సమ్మె భావాన్ని కలిగించడానికి -

> "యిప్పుడు రెండు మార్గాలు చెప్పారు. రంగదాసు చెప్పింది ధర్మ మార్గం. ఆ మార్గం మనమంతా అవలంబించ గలిగితే కూలీలు ధర్మ మార్గ మవలంబించిన వాండ్లవుతారు....వీరదాసు మార్గం వీరమార్గం. దాంట్లో తప్పులేదు రైతులకు పైర్లు కోసి పెట్టవలసిన బాధ్యత మీకు లేదు. మీకు గిట్టితే కోస్తారు. లేకపోతే మానతారు యిది కూడా ధర్మమే. వీరధర్మం......ధర్మ సందేహం, సూక్ష్మ భేదమున్నది..." (మా ప. 91).

అని విషయం తెలుపక ముందే సంగదాసు అంతర్యం గ్రహించి ఒకే మార్గంలో నడవాలనే నిర్ణయానికి కూలీలు వస్తారు. మొదటగా సమ్మెను అవలంబించి కూలి ఇచ్చేవరకు కోతలకు వెళ్ళకుండా ఉండాలనే నిర్ణయానికి కూలీలందరూ వస్తారు. అంతకుముందు అనిశ్చిత భావాలతో ఉన్న కూలీలు సంగదాసు చొరవ వల్ల ఒకే నాయకత్వం క్రిందికివచ్చి, ఒకే విధానాన్ని అనుసరించేందుకు సిద్ధ పడతారు. సమ్మె కట్టడమంటే ఏమిటో తెలియని కూలీలు శ్రమకు తగిన ప్రతి ఫలం పొందేందుకు ప్రధాన ఆయుధంగా సమ్మెను ఉపయోగించుకొనేటట్టు వారికి సమ్మెయొక్క ప్రభావాన్ని విశదీకరిస్తాడు. కూలీలను రెచ్చగొట్టే ధోరణిలో కాక శాంతియుతంగా తమ హక్కులను సాధించుకొనేందుకు పోరాడే విధానం వీరిలో కలిగిస్తాడు. రామమోహనరాయ్‌గారన్నట్లుగా —

> "సంగదాసు తిరుగుబాటు అహింసాత్మకంగానూ, కూలీలను విజ్ఞాన వంతులనుచేసి వారికి న్యాయం జరిగేవిధంగా వారిని మేల్కొల్పా లనేదిగా"14 ఉంది.

సంగదాసు కలిగించిన చైతన్యం వల్ల కూలీలు ఐక్యమత్యంగా ఉండి సమ్మెకు సిద్ధపడతారు. ఈ సమ్మెను కూలీలు మొదట మునసబుమీద ప్రయో గిస్తారు. మునసబు పొలానికి కోతలకు ఎవరూ వెళ్ళరు. దీనికితోడు సంగదాసు తన వాక్చాతుర్యంతో మునసబును బెదరగొడతాడు. దాంతో మునసబు మామూలు కూలి ఇచ్చేందుకు సిద్ధపడతాడు. అవసరమయితే నాలుగురోజుల కూలి ముందుగా కూడ ఇస్తానంటాడు. (మా. ప. 93) ఈ విధంగా కూలీలు మునసబు మీద సమ్మెకట్టి విజయం సాధిస్తారు.

మునసబు మీద కూలీలచేత సమ్మె కట్టించి విజయం సాధించినప్పటికీ; సంగదాసు చౌదరయ్యమీద సమ్మెను అవలంబించటానికంటే ముందుగా, రామా నాయుడిలోవలె చౌదరయ్యలోనూ 'హృదయ పరివర్తనం' కొరకు ప్రయ త్నిస్తాడు. కూలీలకు చౌదరయ్యచేత మామూలు కూలి ఇప్పించే విషయంలో సంగ దాసు రెండుసార్లు ప్రయత్నిస్తాడు

కూలి తగ్గించే విషయంలో మునసబు చీలిపోయినా చౌదరయ్యమాత్రం మామూలు కూలి ఇచ్చేందుకు సిద్ధపడడు. సంగదాసు తన మొదటి ప్రయత్నంగా చౌదరయ్యకు వ్యవసాయంలో కూలివాడి పాత్రను పలురకాలుగా వివరిస్తాడు.

వ్యవసాయంలో వారు పడుతున్న శ్రమను విడమర్చి చెపుతాడు. ఇవేవీ చౌద రయ్య మనస్సును కదలించవు ఇతనిలోని ధనస్వామ్య అహంకారం, ధనా కాంక్ష ముందు కూలివాడి జీవితం అత్యల్పంగా తోస్తుంది. తనింతవాడు కావ డానికి కూలీలు ప్రధాన కారణమనే నిజాన్ని విస్మరిస్తాడు. కూలీలకు రావలసిన న్యాయమైన కూలిని ఇమ్మని చౌదరయ్యను సంగదాసు అర్థిస్తే, కూలి తగ్గించే విషయంలోనికి సంగదాసును ఏ విధంగానైనా సరే రాకుండా ఉంచేందుకు చౌద రయ్య ప్రయత్నిస్తుంటాడు. (మా. ప. 107).

కూలి తగ్గించే విషయంలో చౌదరయ్య కఠిన మనస్తత్వం గ్రహించి, అతని తత్వాన్ని తెలుసుకొన్న సంగదాసు చివరి ప్రయత్నంగా "మన వాండ్లది కప్పల తక్కెడ వ్యవహారం. కూడిరారు. పెద్దలంటే మాటలకు అంతా పెద్దలే. క్రియవచ్చేటప్పటికి యేవో సాకులూ, ధర్మపన్నాలూ చెప్పి తప్పించుకొంటారు" (మా. ప. 114). అని మునసబు చీలిపోయిన విషయాన్ని తెలిపి, ఆ రోజుకు చౌదరయ్య చేత మామూలు కూలి యిప్పిస్తాడు. ఈ విషయంలో సంగదాసు చౌదరయ్యను మార్చలేకపోతాడు. సంగదాసు మొదటి ప్రయత్నంలో వైఫల్యం చెందుతాడు

సంగదాసు కూలి విషయమై చౌదరయ్యతో చేసిన ప్రయత్నాలేవీ ఫలించవు. "ఈ వూళ్ళో పద్దాలుగు వీసాల కూలీజనం నా వల్ల బతికే వాండ్లు. యెదురు తిరి గిన వాండ్లను నా చేలో అడుగు బెట్టనియ్యను... చెడిపోతారు చెప్పు" (మా. ప. 110) అని తను లేనిదే కూలీలకు ఒక్క పూట కూడ గడవదనే భావంతో, ధనస్వామ్యపు తాలూకు అహంకారంతో కూలీల ఎడల నిర్లక్ష్యంగా వ్యవహ రిస్తుంటాడు దీంతో సంగదాసు తాను అవలబించిన సామోపాయంవల్ల కూలీలకు న్యాయంగా రావలసిన కూలి వచ్చేపరిస్థితి లేదని గ్రహిస్తాడు

చౌదరయ్యకు తెలిసొచ్చేందుకు అతని ఉనికినే గుర్తించనట్లుగా సంగ దాసు కూలీలచేత ప్రవర్తింప చేయించేందుకు నిశ్చయిస్తాడు. సంగదాసు మహా త్ముడు ప్రవచించిన అహింసా మార్గంలో పయనించేవాడు సత్కార్య నిర్వహ ణకు సన్మార్గాన్ని అనుసరించాలనే భావన కలవాడు. చేసేపని మంచిదయినా దుస్సాధనాలు ఉపయోగించడానికి ఇష్టపడనివాడు.

ఒక కార్యాన్ని నిర్వహించడానికి సామదానాది చతుర్విధ ఉపాయాలు సమయానుకూలంగా అనుసరింపవచ్చు. అయితే, వీటిల్లో మొదట అవలంబించ వలసిందీ, ఉత్తమమైందీ 'సామోపాయం'. ఒక్కొక్కసారి దీనివల్ల కార్యం సానుకూలం కాకపోవచ్చు. అందువల్ల 'ఉపేక్ష' అనే పంచమోపాయం ద్వారా కార్యసాధనకు పూనుకోవడం ఉచితమని సంగదాసు అభిప్రాయం(మా.ప 112). 'ఉపేక్ష' అంటే అశ్రద్ధ అని అర్థం. ఏ వ్యక్తి తనే ఆధారభూతుడిగా భావించు కొంటూ, అహంకారంతో ప్రవర్తిస్తుంటాడో ఆతడి విషయంలో అశ్రద్ధ వ్యక్తం చేయబడడం 'ఉపేక్ష'. చౌదరయ్య విషయంలో కూలీలు ఈ ఉపేక్షనే అవలం బిస్తారు.

సంగదాసు వ్యవసాయకూలీల కష్టాల్ని ఎన్ని రకాలుగా చెప్పినప్పటికీ చౌదరయ్య లోని పాషాణ హృదయం కరగదు.

> "గోవులకు రక్షణగా పెద్దపులులనుంచి వాటిలో హృదయ పరి వర్తన సాధించటం ఎంత అసాధ్యమో అలాగే పీడిత ప్రజలను దోపిడి చేస్తున్న ధనస్వామ్య వర్గంలోనూ హృదయ పరివర్తనం తేవడం కూడా అంత అసంభవం"15

అని చౌదరయ్య మాటల ద్వారా గ్రహించిన సంగదాసు మహాత్ముడు ప్రవచించిన సమ్మె లేదా సహాయ నిరాకరణమనే ఆయుధాన్ని కూలీల ద్వారా ధనిక రైతులపై ప్రయోగించేందుకు సిద్ధపడతాడు. కూలీల విషయమై చౌదరయ్య ఒక ఒప్పందానికి రాకపోవడంతో సంగదాసు కూలీలతో సమ్మెను 16 అవలం బించమని ఉద్బోధిస్తాడు.

ఇక్కడ ఇట్లా జరిగితే, బెజవాడ సభలో సంగదాసు పంచముల దుస్థితిని వర్ణిస్తూ చౌదరయ్యలాంటి ధనిక రైతులెందరో కూలిని తగ్గించేందుకు ప్రయత్ని స్తున్నారని, ఇదివరకిచ్చే కూలియే అర్ధాకలిని కూడా తీర్చడంలేదని, అందువల్ల కూలిని మరింత పెంచి బీదల పరిస్థితిని మెరుగుపరచి ఆదుకోవాలనీ, వీరి అభి వృద్ధికొరకు అనేక తీర్మానాలు ప్రతిపాదించి, సభవారిచేత ఆమోదింపచేయిస్తాడు.

సంగదాసు మంగళాపురంలో కూలీల ద్వారా చేయించిన సమ్మె, బెజవాడలో ప్రతిపాదించిన తీర్మానాలు కారణంగా కూలి తగ్గించే విషయం ఆగిపోతుంది. ఈ ప్రభావం రైతులమీద గాఢంగా పనిచేస్తుంది. ఈ విషయాన్ని చిన్నపరెడ్డి మాటల్లో గమనింపవచ్చు. 'మాలవాడు డుబికించా'డని చౌదరయ్య చిన్నపరెడ్డితో అంటే, చిన్నపరెడ్డి—

"....యింతకు ముందే బెజవాడనుంచి మనుష్యులు వచ్చారు. ఇప్పుడు మనం తగ్గించడానికి ప్రయత్నం జేస్తే అల్లరెక్కువవుతుంది. ఈ సభ అంతేమో చూచి పర్యాయితీన చూచుకుందాం. ప్రస్తుతం సంక్షేపించు" (మా.ప. 162, 163)

అని చౌదరయ్యను కూడా కూలి తగ్గించే విషయం మానుకొమ్మని సలహా ఇస్తాడు.

తనపై కూలీలు సమ్మె కట్టడానికి కారకుడైన సంగదాసును చౌదరయ్య చంపి తృప్తి చెందుతాడు. సంగదాసు మరణించినప్పటికీ కూలీలు సమ్మె పాటించి చౌదరయ్యపై విజయం సాధిస్తారు.

సంగదాసు రాజకీయ పోరాటంలో మహాత్ముడు ప్రవేశపెట్టిన సహాయ నిరాకరణాన్ని కూలీల ద్వారా ఆచరింప చేయిస్తాడు 'హృదయ పరివర్తనం' సాధ్యం కాని చౌదరయ్యపై సంగదాసు సహాయ నిరాకరణ సత్యాగ్రహానికి దిగి చౌదరయ్య అక్రమ విధానాన్ని ప్రతిఘటించడమే కాకుండా, చివరికి ఆత్మబలిదానానికి సహితం సిద్ధపడి విజయం సాధిస్తాడు [17]

## ధర్మకన్నాలు :

ఆంగ్ల ప్రభుత్వం ప్రవేశపెట్టిన నూతన ఆర్థిక వ్యవస్థవల్ల గ్రామ ప్రాంతాల్లో పెట్టుబడిదార్లు, ధనిక రైతులు సమాజంలోని బడుగు వర్గాలయిన కూలీలను దోచుకోవడం ప్రారంభించినారు

వృత్తులు నశించి, జీవనాధారమైన భూమిని కోల్పోయి ఆర్థిక పరిస్థితి తారుమారు కావడంతో పల్లెల్లో చాలమంది కూలి చేసుకొని బ్రతకాల్సిన పరిస్థితి

ఏర్పడింది. ధనిక రైతులు కూలీల బీదరికాన్ని, వారిలోని అజ్ఞానాన్ని ఆసరా చేసుకొని వారి కష్టాన్ని దోచుకొంటూ, స్వార్థపరంగా వ్యవహరిస్తున్నారు. మహాత్ముడు పేర్కొన్నట్లుగా- "ధనవంతులు తమ సంపదను, అధికారాన్ని ఇచ్చికంగా వదలుకొని దానిని ప్రజల శ్రేయస్సుకొరకు ఉపయోగించకపోతే ఎప్పుడో ఒకప్పుడు రక్తపాత దౌర్జన్య విప్లవం రాకతప్పదు."18 అయితే ఉన్నవ తన నవలలో రక్తపాత విప్లవాన్ని కాకుండా, రక్తపాత రహిత విప్లవాన్ని ప్రవేశపెట్టి, వెంకటదాసు ద్వారా 'ధర్మకన్నా' లనే క్రొత్త మార్గాన్ని ఆర్థిక అసమానతల్ని తొలగించేందుకు ప్రవేశపెట్టినాడు.

మాలపల్లి నవల రచనాకాలం నాటికిముందే, 1917 లో రష్యాలో విప్లవం వచ్చి పరిపాలన ధనవంతులనుండి మారి ప్రజల హస్తగతమైంది. ఈ విప్లవ ప్రభావం ప్రపంచ దేశాలన్నింటిలోనూ వ్యాపిస్తున్న రోజులలో మాలపల్లి ఆవిర్భావం జరిగింది. సమకాలీనమైన ఈ ఉద్యమ ప్రస్తావన మాలపల్లిలోనూ చోటుచేసుకోవడం జరిగింది. ఈ కారణంగానే ఈ నవల ఆనాటి బ్రిటిష ప్రభుత్వంచేత పలుమార్లు నిషేధానికి గురయ్యింది.

ఇదిలా ఉండగా, మాలపల్లిలో కమ్యూనిజం చిత్రితమయిందా? లేదా? అనే విషయమై విమర్శకులు భిన్నాభిప్రాయాల్ని వ్యక్తం చేస్తున్నారు.

> "కమ్యూనిష్టు పార్టీ అనేది తెలుగునాట అవతరించక ముందే మార్క్సిష్టు భావప్రేరణకు నాంది పలికిన తొలి సృజనాత్మక రచనగా మాలపల్లిని పేర్కొనవలసి వుంటుంది"19

అన్నారు బంగోరె.

కె. వి. రమణారెడ్డి గారు ఈ విషయమై చర్చిస్తూ,—

> "తాను కమ్యూనిజం అనుకున్న దాన్ని తన నవలలో ప్రముఖం గానూ, ఆకర్షణీయంగా కూడాను చిత్రించడానికి వెనుకాడలేదు సరికదా, కమ్యూనిజాన్ని ప్రచారం చెయ్యడం నేరమేమీ కాదని ధైర్యం చేసి చెప్పడానికి గూడా వెనుదీయలేదు"20

అని అన్నారు.

శ్రీమతి కాత్యాయనీ విద్మహే గారు,—

> "శ్రీ ఉన్నవ తమ 'మాలపల్లి' నవలలో ......... సామ్యవాద వ్యవస్థను గురించిన ఒక స్పష్టమైన దృక్పథము ప్రజావళిలో రూపుదిద్దుకొను విధముగా రచన చేసినారు"[21]

అని పేర్కొన్నారు

> "సోషలిస్టు సిద్ధాంతాలను కూడ మొదటిసారిగా ప్రతిబింబింప చేసిన నవల మాలపల్లే"[22]

అని ఎద్దుల విష్ణువర్థన్‌రెడ్డి గారి అభిప్రాయం.

> "సామ్యవాద సమతాధర్మ పిండాకృతిని సజీవంగా ఎక్స్‌రే తీసి చూపించిన, సామాజిక స్పృహ చైతన్యం కలిగిన మొట్టమొదటి నవల మాలపల్లి"[23]

అని పేర్కొన్నవారు డా. కేతవరపు రామకోటిశాస్త్రి గారు.

> "కారల్‌మార్క్స్ పిలుపుకి ప్రప్రథమంగా తన సాహిత్య కళాత్మక కంఠాన్ని శ్రుతి కలిపినవాడు..........తద్వారా వర్గ చైతన్యానికీ, విప్లవ కార్యక్రమానికీ ఆద్యుడైనవాడు.''

అని పేర్కొని ఇంకా,—

> "కమ్యూనిజమే ఒక పరిష్కార మార్గంగా శ్లాఘించి నేర్పుతో పాఠకులను ఒప్పించి పాత్రగతంగా చిత్రించగల ప్రప్రథమ ధైర్యశాలి, నవలా ప్రవక్త ఉన్నవవారే"[24]

అని సోమసుందర్‌గారు అభిప్రాయపడినారు

> "Worker's of the world unite అని కార్ల్‌మార్క్స్ పిలుపును మొట్టమొదటి సారిగా భారతదేశంలో, ఆంధ్రదేశంలో, "పనివాండ్లందరు ఏకమైతిరా ప్రపంచమే మీది" అనివినిపించిన వాడు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ[25]

అని నగ్నమునిగారు పేర్కొన్నారు.

"సోషలిస్టు భావాల ప్రభావం, రష్యన్ సోషలిస్టు విప్లవ ప్రభావం తెలుగు సాహిత్య, సాంస్కృతిక రంగాలపైన చాలా కనిపిస్తుంది సాహిత్యంలో వస్తువులోనూ, రూపంలోనూ విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి మొట్టమొదట రష్యన్ బోల్షివిక్ విప్లవ ప్రభావం ఉన్నవ లక్ష్మీనారాయణ 'మాలపల్లి' నవలలో కనిపిస్తుంది"[26]

అని కె కె. రంగనాధాచార్యులు భావించారు.

ఈవిధంగా కొందరు విమర్శకులు మాలపల్లిలో బోల్షివిజం ప్రభావం చోటుచేసుకున్నదని పేర్కొంటుండగా, మరికొందరు విమర్శకులు మాలపల్లి బోల్షివిజానికి అనుకూలంగా లేదని చెప్పటం ఈ సందర్భంలో గమనించాలి.

జి. వి. కృష్ణారావుగారు -

"చాలామంది అనుకుంటూ ఉన్నట్లుగా మార్క్సిస్టు దృష్టిలో మాలపల్లిలో 'సోషలిజం' చెప్పలేదు. మన సంఘం ఎలా ఉందో తూచా తప్పకుండ చిత్రించారు. సంగదాసు లేవదీసిన కార్మికోద్యమం వర్గ కలహాన్ని పురస్కరించుకొని లేవదీసిందిగాదు. వెంకటదాసు జగ్గడి పేరుతో సాగించిన ధర్మకన్నాలు ధర్మకన్నాలేకాని సోషలిస్టు విప్లవంకాదు.

'తక్కెళ్ళ జగ్గడి ధర్మబోధలు తలపున నిలపండి
ఆదికాలమున అందరు జనులు అన్నదమ్ములండి
ఐక్యమత్యమే అన్నిపనులకు ఆధారము సుండీ
శ్రేణులు కట్టి సమ్మెలు గట్టితే చెల్లును మీ మాట
కొట్టావద్దూ తిట్టావద్దూ కోర్కెలు నెరవేరున్
అసహాయ యోగము తరుణము జూచి అవలంబించండి
సమతా ధర్మం ప్రపంచమందున స్థాపింతురు గాని
కృతయుగ ధర్మం లోకమంతటా కుదుటబెట్టగలరు'

—అని జగ్గడి అనుచరులు పాడే పాటలు గాని, నాలుగో భాగములో తొమ్మిదో అధ్యాయములో వ్యక్తీకరించిన సిద్ధాంతములో గాని సోషలిస్టు సిద్ధాంతాలు లేవు దేవుడు లేడనడం, భాగ్యవంతులు పేదలను పీక్కు తింటున్నారని చెప్పటం, సమత్వం కావాలనటం అనేవే సోషలిస్టు సిద్ధాంతాలు కావు."27

అని సుదీర్ఘంగా పేర్కొన్నారు.

కె. వి. ఎన్. రాఘవన్ గారు,—

> "నిజానికి మాలపల్లిని...పరిశీలిస్తే ఎక్కడా వారు లెఫ్ట్ పంథాలో రచనను సాగించినట్లు గానీ, సామ్యవాదాన్ని సమర్థించినట్లు గానీ లేదు ఉన్నవవారు వీర హైందవ మతాభిమాని ... నవలలో వెంకటదాసు కమ్యూనిస్టు కాడు; నడిపిన ఉద్యమం సామ్యవాద ఉద్యమమూ కాదు"28

అని పేర్కొన్నారు.

ఇంతకూ, మాలపల్లిలో కమ్యూనిజం చిత్రింపబడిందా అని ప్రశ్నించు కుంటే, ఒక్క మాటలో 'చిత్రింపబడిం'దనే పేర్కొనవచ్చు. అయితే, అచ్చంగా రష్యాలోని కమ్యూనిజాన్ని మూసపోసినట్లుగా గ్రహించబడిందా? లేక మార్పులతో స్వీకరించబడిందా? రచయిత కమ్యూనిజమే పరిష్కార మార్గంగా భావించినాడా? అనేది చర్చింపవలసిన అంశం.

మాలపల్లిలో కమ్యూనిజం ఉంది అని చెప్పడానికి మనకు అనేక నిదర్శనాలు కనిపిస్తవి. నవలను ఆనాటి ఆంగ్ల ప్రభుత్వం నిషేధానికి గురిచేయటాన్ని మొదట చెప్పుకోవాలి.

పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా కార్మికుల సమీకరణను ప్రోత్సహించడానికి కమ్యూనిజాన్ని ప్రబోధించటంలో తప్పులేదంటూ- "I have to state that it is not worng to preach communism or to encourage the union of labour against capital..."29 అంటూ ఉన్నవ తన నవల విషయమై చేసిన స్పష్టమైన వాదన ఇక్కడ చెప్పుకోవచ్చు.

నవలలో ఒక సన్నివేశంలో రచయిత బోల్షివిజాన్ని గూర్చి చెప్పించడంతో పాటు, బోల్షివిజ వ్యాప్తిని నిరోధించడానికి ఆంగ్లప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాల్ని తెలపడం జరిగింది. మరొకచోట రామానాయుడు "సంతానోద్యమం బోల్షివిజానికి నామశాఖ"ని (మా ప. 479) అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తాడు.

ఈ విధంగా పై సంఘటనల్ని గమనించినట్లయితే, రచయిత బోల్షివిజం గూర్చి తనకున్న అవగాహనమేరకు నవలలో ప్రతిబింబింపచేసినాడని చెప్పుకోవచ్చు.

అయితే, నవలలో వెంకటదాసు పాత్రసృష్టికి, విప్లవధోరణికి కేవలం బోల్షివిజం మాత్రమే కారణమైందనిమాత్రం చెప్పలేము. సమకాలీనమైన ఉద్యమాలలో బోల్షివిజం ఒకటి మరొకవైపు దేశంలో స్వాతంత్ర్యంకోసం పోరాటం జరుపుతున్న బాలగంగాధరతిలక్, లాలాలజపతిరాయ్, శ్రీ అరవిందులు మొదలైన అతివాదుల తీవ్రభావాలుకూడా యువతలో చోటు చేసుకొంటున్న కాలమది. మరొకవైపు గాంధీ సోషలిజంకూడా నెమ్మదిమీద వ్యాపిస్తున్నది.

అలాగే ఇంతకంటే పూర్వమే బెంగాల్‌లో వచ్చిన సంతానుల ఉద్యమం కూడా స్వాతంత్ర్య సాధనలో యువతపై తనవంతు ప్రభావాన్ని వేసింది. ఇవన్నీ నవలలో వెంకటదాసు పాత్రసృష్టికి రూపురేఖలు దిద్దటానికి ఉపన్నవను ప్రేరణ నిచ్చివుంటాయి. అందుకే వెంకటదాసు కేవలం కమ్యూనిష్టు కాలేదు; కేవలం గాంధీయవాది కాలేదు; కేవలం సంతానుడు మాత్రమే కాలేదు. అయితే, పై అన్నింటి భావాల సమష్టి రూపానికి ప్రతీకగా వెంకటదాసు నిలిచినాడని భావించవచ్చు. అందుకే కొందరు విమర్శకులు మాలపల్లిలో కమ్యూనిజం ఉందంటూనే, దీన్ని కమ్యూనిజం కాదనడం గమనించాలి. ఇక్కడ కె.వి. రమణారెడ్డిగారి మాటల్ని ఉదాహరించుకోవచ్చు.

12)

"ఎంకటదాసు, ......... కమ్యూనిష్టేనా అని? 'కృతయుగ ధర్మం' కమ్యూనిజమేనా అని? ...... యిది మార్క్సియన్ సోషలిజం కాదు ......... 'ధర్మకన్నాలు' రాబిన్ హుడ్‌ని జ్ఞాపకం చేస్తాయి గాని కమ్యూనిష్టును కాదు. 'ఆదికాలం' నాటి సౌభ్రాత్ర, సమానత్వాలు అచ్చుకి మచ్చుగా ముంచువాళ్ళ కమ్యూనిజానికి నప్పవు "30

రమణారెడ్డిగారు పేర్కొన్నట్లుగా వెంకటదాసు కమ్యూనిష్టేనా! అని వాదించుకుంటూ కూర్చోవడంకంటే, డా. ఎస్. గంగప్పగారి మాటల్లో-

"వెంకటదాసు పాత్రద్వారా యథాతథంగా కమ్యూనిజాన్ని ప్రవేశ పెట్టారు ఉన్నవవారు అని అనడం కుదరకపోవచ్చు.కాని కమ్యూనిజానికి సంబంధించిన అవగాహన మాత్రం ఉన్నవవారికుంది.31

అని చెప్పకోవచ్చు. అందుకే శ్రీమతి కాత్యాయని విద్మహే గారు—

"బోల్షివిక్ ఉద్యమ ప్రభావముతో వచ్చిన దేశీయమైన ఉద్యమ సూత్రాలు భిన్నమార్గమును బట్టినవి......రహస్యముగా సైన్యమును చేకూర్చుకొనుట, ధనవంతులపై, భూస్వాములపై మెరుపు దాడి జరుపుట, వారిని దోచి బీదలకు పెట్టుటగా రంగులు దిద్దబడిన విప్లవ పంథాలు మనదేశంలో ప్రత్యక్షమైనవి"32

అని భావించినారు.

రష్యాలోని బోల్షివిక్ విప్లవ ప్రభావం 1920కి ముందు నుండే భారతీయ మేధావులపై కొంతకొంతగా ప్రసరిస్తున్న కాలమది.33 నెమ్మది మీద ఈ విప్లవ ప్రభావం ఆంధ్ర ప్రాంతంలో కూడా వ్యాపించటం ఆరంభించింది. సహజంగా ఉద్యమాలమీద అనక్తి ఉన్న ఉన్నవపై ఈ విప్లవ ప్రభావం ఉంది. గాంధీజీయే ఒకచోట—

"If Communism came without any Voilence, it would be welcome. For them no Property

would be held by any body except on behalf of the people and for the people A millionaire may have his millions, but he will hold them for the people The state could take change of them whenever They would need them for common cause"[34]

అని పేర్కొన్నట్లుగా, ఉన్నవ కూడా సామాన్య సంక్షేమానికై అహింసాత్మక పద్ధతిలో ధనవంతుల అక్రమార్జనను కొల్లగొట్టేందుకు సిద్ధపడ్డ వెంకటదాసు పాత్రద్వారా కమ్యూనిష్టు భావాల్ని వ్యక్తీకరింపచేసినాడు అయితే, కమ్యూనిజమే పరిష్కార మార్గంగా చూపలేదు.

కె. కె రంగనాథాచార్యులు గారన్నట్లుగా-

"సంఘ సంస్కర్తయైన ఉన్నవ స్వాతంత్రోద్యమంలో స్వయంగా పాల్గొని జైలుకు వెళ్ళాడు. రష్యాలోని సోషలిస్టు విప్లవ ప్రభావం కూడా కొంతవరకు ఆయనమీద ఉంది. ఆయన సమతా ధర్మాన్ని కోరాడు కమ్యూనిష్టు సిద్ధాంతాన్ని ప్రచారం చేయడం తప్పు కాదన్నాడు ఆచరణలో గాంధీ మార్గాన్ని అనుసరించాడు.''[35]

ఈ విధంగా ఉన్నవను ప్రభావితం చేసిన పై అన్ని ఉద్యమాల సమష్టి ప్రభావం ఫలితంగా రూపుదిద్దుకొన్న పాత్ర వెంకటదాసు. నవలలో వెంకటదాసు పాత్ర చిత్రణా విధానం కూడా ప్రత్యేక తరహాలో సాగటం గమనించాలి. వెంకటదాసు మీద కమ్యూనిజంతో పాటు ఇంతకంటె గాఢంగా గాంధియన్ సోషలిజం పనిచేసింది. ఇట్లాంటి వెంకటదాసు చేత ఉన్నవ సరికొత్త మార్గంలో సమాజంలోని ఆర్థిక అసమానతల్ని తొలగించేందుకు మొదటిసారిగా ప్రయత్నించడం కన్పిస్తుంది

వెంకటదాసు దృష్టిలో సమాజ సంపదంతా అందరూ సమానంగా అనుభవించాలి. ఇందుకై ప్రతి ఒక్కరూ యధాశక్తిగా పనిచేయాల్సిన బాధ్యత ఎంతైనా ఉంది. అందుకే, —

> "నా ధర్మం జనులవలంబిస్తే ప్రతివాళ్ళు యథాశక్తిగా పాటుపడి అవసరమైనంత తిని, గుండె నిమ్మళంగా రేపనే చింతలేకుండా, విద్యాబుద్ధు లభ్యసిస్తూ, పస్తులులేని, భోగాలులేని, రోగాలులేని, నేరాలులేని, వ్యాజ్యాలులేని, ద్వేషాలులేని స్వచ్ఛంద జీవితాలు అనుభవించడానికి అవకాశముంటుంది" (మా. ప. 600).

అని పేర్కొంటాడు గాంధీజీ ఏర్పరచిన ఆశ్రమాలలో కూడా అక్కడి జీవన విధానం ప్రత్యేకమైంది. అక్కడ నివసించేవారిలో "ఎవరి అవసరాలకు వారు తగినంత స్వీకరించి, ఎవరి శక్తికొలది వారు పనిచేయాలి" అన్న నిబంధన పాటించాల్సి ఉంటుంది. ఈ సంస్థలన్నింటిని గాంధీజీ అహింసా సిద్ధాంతం ప్రాతిపదిక మీద ఏర్పాటు చేయడం జరిగింది [36]

సోషలిస్టు సిద్ధాంతంలో కూడా వ్యక్తిలాభం కంటె సమష్టిలాభానికి ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. ఇక్కడకూడా ప్రతీవ్యక్తి సమాజాభివృద్ధికి కృషిచేయాలి తమ తమ శక్తికొలది కృషి చేసి, తమ కవసరమైంది తీసుకొంటారు. మనిషి యొక్క ఆధిపత్యం కాని, వర్గం యొక్క అధికారం కాని ఉండదు. ఆర్థిక సమానత పాటింపబడుతుంది [37]

చేసే పని మంచిదయితే దుస్సాధనాలు ఉపయోగించినా తప్పులేదనే భావం కలవాడు వెంకటదాసు. గాంధీజీ భారతరాజకీయాల్లోకి రాక పూర్వం ఈ భావం దేశమంతటా చోటుచేసుకున్నది. ఈ భావనతోనే వెంకటదాసు తను చేసే ధర్మకన్నాలను సమర్థించుకొంటూ - రాజులు యుద్ధాల ద్వారా దేశాలను దోచుకొంటుండగా, తను ధనిక వర్గాన్ని దోచి, ఈ డబ్బుతో ప్రజలకు జీవనాధారం కల్పిస్తానని తెలుపుతాడు. తనను దొంగగా అభివర్ణించితే, రాజు తనకంటే పెద్దదొంగ అని వెంకటదాసు అభిప్రాయపడతాడు. (మా. ప. 311). ఇక్కడ వెంకటదాసు ధర్మకన్నాల యొక్క అంతర్యం బీదలకు జీవనోపాధి కల్పించడమనేది సుస్పష్టం.

వెంకటదాసు దోపిడీని ఎల్లకాలం సాగించాలనే భావన కలవాడు కాదు. బీదలను మోసగించి, పలువిధాలుగా డబ్బును కూడబెట్టి ప్రజలకు ఉపయోగ పడకుండా ధనికరైతులు ప్రవర్తిస్తున్నందు వల్ల దోపిడీలు అవసరమైనవి ధన వంతులు ఎంతకాలం వరకు బీదలను మోసగించడం, దౌర్జన్యం నెరపడం మానివేయరో అంతవరకు ఈ దోపిడీ యుద్ధం అనివార్యమని, ఈ విధంగా సంపాదించిన ధనంతో బీదలకు వృత్తు లేర్పరచి, జీవనోపాధి కల్పించబడు తుందని జగ్గని అనుచరులు రామదాసుతో తెల్పటంవల్ల ఈ విషయం స్పష్టమవు తుంది.

చివరికి వెంకటదాసు తను చేయించిన దోపిడీల ద్వారా సంపాదించిన ధనాన్ని అందరూ సమానంగా పంచుకొని, న్యాయ జీవనం చెయ్యమని చెపుతాడు. ఇప్పటి వరకు కలిగించిన ఆందోళన వల్ల ప్రస్తుత పరిస్థితులు మారి, బీదల ఆర్థిక పరిస్థితి తప్పక బాగుపడుతుందని తెలుపుతాడు. అన్ని విధాల అభివృద్ధు లను సాధిస్తూ, దేశ స్వాతంత్ర్యం కొరకు పోరాడుమని ఉద్బోధిస్తాడు. స్వాతంత్ర్యం వస్తే బీదల పరిస్థితి తప్పక అభివృద్ధి చెందుతుందని నమ్ముతాడు.

వెంకటదాసు భావించినట్లుగానే బీదల పరిస్థితులను అభివృద్ధి పరచేందుకు ధనికవర్గం, ప్రభుత్వం సంసిద్ధతవ్యక్తం చేస్తాయి. (మా. ప. 528)

వెంకటదాసు దృష్టిలో దేశసంపదనంతా, అందరూ సమానంగా అను భవించాలి. సోదరభావంతో మెలగాలి. వ్యాకులమూ, తొందరా, పోటీలూ లేని స్వచ్ఛమైన జీవితాన్ని అందరూ గడపాలి. సృష్ట్యాదిన ఉన్న ఈ పరిస్థితి కాలం గడుస్తున్న కొద్ది మారి ధనిక బీద భేదాలు ఏర్పడినవు. "ఇసుక మేట వేసినట్లు ధనం ఏ కొద్ది మంది దగ్గరనో చేరింది... అశేష జనులు దరిద్రులై, యెవరో కొందరు భాగ్యవంతులయినారు భాగ్యవంతులకే భాగ్యం, దరిద్రులకే దారిద్ర్యం నిలకడయింది... కష్టపడి పంటలు పండించి, చేతి పనులు చేసి అమర్చిన పదార్థ మంతా ధనవంతులపహరించి తిని తొక్కి తొంబాడి, శ్రమపడి పని చేసేవాండ్లకు ఆహారము లేకుండా చేస్తున్నారు" (మా. ప 534) అంటూ రచయిత వెంకట దాసులోని ఆవేదనతో కూడిన సామాజిక వ్యవస్థపై అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తాడు. ఇంకా— "భాగ్యవంతులు బీదలను దోచుకుంటే దాని పేరు వ్యవ

హారం, బీదలు తమ హక్కును తీసుకొంటే చౌర్యం"గా భావిస్తున్నారు. ఇదెక్కడి న్యాయమని కోర్టును ప్రశ్నిస్తాడు వెంకటదాసు కలియుగంలో ధనికులే రాక్షసులంటూ, తాను చేయించిన చర్యలవల్ల బీదలు సుఖాలు పొందుతారని, ఇదే తాను సాధించదలచుకొన్న జీవిత పరమార్థమని తన అంతర్యాన్ని తెలుపుతాడు. (మా. ప. 532,-33,-34.)

వెంకటదాసు 'మేఘాలను నమ్మి చెరువు తెగగొట్టుకున్నట్టు' అనుమానాస్పదమైన పరలోకం కోసం ఇహ జీవితాన్ని తృణప్రాయంగా ఎంచేవాడు కాదు. తాను సాగించిన ఉద్యమానికి సాధనం దయా సత్య శౌచాలు. హత్యలు సమస్యకు పరిష్కారంగా భావించక ధనిక, ప్రభుత్వ వర్గాల్లో మార్పు తెచ్చేందుకై యత్నిస్తాడు.

గాంధీజీ కమ్యూనిజాన్ని ఆహ్వానిస్తూ — "Communism of Russian type that is Communism which is composed on the people; would be repugnant to India; I belive in non-voilent Communism......If Communism came without any voilence it would be welcome."[38] అని చెప్పిన మాటలు వెంకటదాసు పాత్ర ఆవిర్భవించడానికి ఉన్నవపై ఎంతో ప్రభావం వేసినవని చెప్పుకోవచ్చు. అయితే నవలలో వెంకటదాసు పాత్ర విజయం సాధించిందని రచయిత పేర్కొనక పోవడానికి కారణం వెంకటదాసు ఆశయాలు మంచివే అయినప్పటికీ ఆచరించిన మార్గం నైతికంగా సమర్థించదగింది కాదనే భావం కావచ్చు. అందుకే రచయిత రామదాసు చేత వెంకటదాసును 'ధర్మదేవత' అని అనిపిస్తూనే, అతని మార్గాన్ని అంతా అవలంబించి చూస్తే ఎట్లా ఉంటుందో అని అనుమానం వ్యక్తం చేయించడం గమనించాలి

ఇక్కడ గమనించాల్సిన మరో అంశం ఏమంటే,-ఉన్నవకు వెంకటదాసు ఆచరించిన విధానంపైన, అతని సిద్ధాంతాలపైన సానుభూతి కాని, సమాజాభివృద్ధి సాధింపబడుతుందనే నమ్మకంగాని లేదు. అయినప్పటికీ అతని వ్యక్తిత్వంపైన ఉన్న గౌరవ భావం కారణంగానే వెంకటదాసు పాత్రను నవలలో ఇంతటి ప్రాధాన్యం ఇవ్వడం జరిగి వుంటుంది.

ఉన్నవ ఈ కొత్త మార్గం ద్వారా ఆర్థిక సమతాసాధనకు పూనుకొంటే సమాజం ఎలా ప్రతిస్పందిస్తుందో అనే కొత్త ఆలోచనతో వెంకటదాసు పాత్రకు జీవం పోయడం జరిగింది. ఇలా చేయడంలో ఉన్నవపై సమకాలీనంగా సాగిన ఉద్యమాలన్నీ ప్రభావం వేసినవని చెప్పుకోవచ్చు.

## ధర్మకర్తృత్వం :

ఆర్థిక సమతా సాధనకై గాంధీజీ ప్రవచించిన పలు సిద్ధాంతాల్లో 'ధర్మ కర్తృత్వ సిద్ధాంతం' ఒకటి; ప్రధానమైంది కూడా. ఏ కొద్దిమంది చేతుల్లోనో ఆర్థిక సంపద, అధికారాలు కేంద్రీకరించబడకూడదు. ఆర్థిక వ్యత్యాసాలను తగ్గించ డానికి ఆర్థిక సంపద అందరి ప్రయోజనాలకై వినియోగించాలని సూచించారు గాంధీజీ. ఈ దృష్టితోనే 'ధర్మకర్తృత్వ సిద్ధాంతా'న్ని ఆయన రూపొందించటం జరిగింది. ఈ సిద్ధాంతం పెట్టుబడిదారీ వ్యవస్థను సోషలిస్టు సమాజం క్రింద మార్చివేయడానికి ఉద్దేశింపబడ్డది తమవద్ద కేంద్రీకృతమైన సంపదపైన ధర్మ కర్తలుగా వ్యవహరిస్తూ, సామాన్య ప్రజల సంక్షేమం కోసం ఆ ధనాన్ని విని యోగిస్తూ వ్యక్తిగత సుఖాల్ని త్యజించాలని గాంధీజీ ధనికవర్గాలకు ఉద్బోధించి నారు.39

గాంధీజీ దృష్టిలో మానవులు తమ కనీస అవసరాలకు తగినంత మాత్రమే సంపద కలిగిఉండాలి. ఇంతకంటే ఎక్కువగా సంపదను సమకూర్చు కొన్న ట్లయితే అవి దొంగతనంతో సమానంగా గాంధీజీ భావించేవాడు. అంతేకాదు-

> "అవసరంలేని వస్తువు మనవద్ద వున్నప్పటికీ - వాస్తవానికీ అది దొంగ వస్తువు కాకపోయినప్పటికీ - నా దృష్టిలో అది దొంగి లించిన దానితో సమానమే"40

అని భావించాడు ఈ భావనతోనే గాంధీజీ 'ధర్మకర్తృత్వ సిద్ధాంతా'న్ని రూపొం దించినాడు.

ఈ 'ధర్మకర్తృత్వ సిద్ధాంతా'న్ని ఉన్నవ మాలపల్లి నవలాంతాన ఆర్థిక సమతా సాధనకై ఒక మార్గంగా చూపినాడు ఇక్కడ నవలలో సంగ

దాసు ఆకాంక్షించిన విజయం సాధింపబడాలంటే, ధనవంతులు ప్రచ్ఛన్నంగా ముందుకువచ్చి తమ ఆస్తి పాస్తులను దిగువ జాతుల అభివృద్ధి కార్యక్రమాల కొరకు అర్పణ చేయాలి.

ఈ అర్పణ బుద్ధిని మొట్టమొదట ప్రదర్శించిన వ్యక్తి రామానాయుడు. రామానాయుడు తన సంపదనంతా సమాజపరం చేసేందుకు ముందుగు రావడంతో, ప్రబోధితుడైన వెంకటయ్యకూడా ఇందుకు సిద్ధపడతాడు.

రామానాయుడియొక్క త్యాగౌన్నత్యంవల్లనే మోహనరావుకూడా "గుంటూరు జిల్లాలో షెడ్యూలు దాఖలావుండే స్థిరాస్తి, మద్రాసు బ్యాంకులో ఉన్న రొక్కం మొత్తం షుమారు రెండు లక్షల కిమ్మత్తుగలది మంగళాపురంలోని నల్లబోతు రామానాయుడుగారు కట్టిన కళాశాలకు ఖర్చునిమిత్తం ధర్మంగా" (మా. ప, 662) ఇచ్చివేస్తాడు.

పంతులుకూడా తన ఆస్తితోపాటు, ఉచితంగా సేవ చేసేందుకు ముందుకు వస్తాడు. అట్లాగే వెంకటదాసు సంపాదించిన ధనంలో పదిలక్షల రూపాయల్ని కార్మిక, పంచమోద్యమాల ఉపయోగంకొరకు ఇచ్చివేస్తాడు.

వేదాంతం కోటమ్మ మొదటినుండి దిగువజాతులమీద అభిమానం కలిగి వుంటుంది. చివరికి "తనకున్న ఆస్తెంతా తపోవనానికి వ్రాసిఇచ్చి, దానివల్ల వచ్చే ఆదాయం తపోవనంలో నివసించి తపస్సు చేసుకొనేవాండ్లకూ, ప్రస్థాన త్రయం, భాష్యాలూ పాఠం చెప్పేవాండ్లకూ జాతి వివక్షత లేకుండా పోషణ నిమిత్తం ధర్మంగా జరుగవలసిందని ఏర్పాటు" చేస్తుంది. (మా. ప 657).

చివరికి చట్ట నిర్మాణం ద్వారా పేదల ఆర్థికాభివృద్ధికి పాటుపడుతూ, వీరిని అన్ని విధాలుగా తీర్చి దిద్దాలని 'శాసనసభ సంబంధంగా ధర్మకర్తలను నియమించి ధర్మ విద్యానిధని ఒక నిధిని ఏర్పర్చి' ధర్మవిద్యకు ప్రాధాన్యత నిచ్చేందుకు చట్టాలు చేయబడుతవి.

ఈ విధంగా ఉన్నవ మాలపల్లిలో ఆర్థిక సమతా సాధనకు రామానాయుడు లాంటి వారిలో "హృదయ పరివర్తనం" తెచ్చి, చౌదరయ్యలాంటి ఎదురుపక్షం

'రిపై 'సమ్మె' ప్రయోగించి, వెంకటదాసుతో ధర్మకన్నాలు చేయించి, చివరికి లువురిచేత వారి ఆస్తిని 'ధర్మకర్తృత్వం' పద్ధతిలో సమాజపరం చేయించి ఆర్థిక సమతా సాధనకై ప్రయత్నించిన విధానం మాలపల్లిలో స్పష్టంగా దర్శించవచ్చు.

## సహాయ నిరాకరణోద్యమం :

మొట్టమొదటిసారిగా సహాయ నిరాకరణమనే ఉద్యమాన్ని కొత్తగా రాజకీయాల్లోకి తీసుకొని వచ్చినవాడు గాంధీజీ. దీన్ని 1920 నుండి 1922 వరకు కొనసాగించినాడు. సహాయ నిరాకరణం ప్రప్రథమంగా ఖిలాఫత్ విషయంలో బ్రిటిష ప్రభుత్వంవల్ల ముస్లింలకు అన్యాయం జరిగినట్లు భావించి' ఆ విషయంలో కృషిచేయ సంకల్పించిన గాంధీజీ ప్రవేశపెట్టినాడు. తర్వాత పంజాబులో దురంతాలకు కారకులైనవారిని బ్రిటిషప్రభుత్వం సమర్థించి అక్కడి ప్రజలను సంరక్షించడంలో నిర్లక్ష్యం ప్రదర్శించినందువల్లనూ, బాధ్యులైన వారిని శిక్షించకపోవడం కారణంగానూ ఈ ఉద్యమం ఆచరించబడ్డది. తర్వాత దేశం సర్వతోముఖ వికాసం పొందాలంటే స్వరాజ్యం అవసరమని, సహాయ నిరాకరణంద్వారానే స్వరాజ్యం సాధ్యమని ఇది ఉద్దేశింపబడినది

సహాయ నిరాకరణోద్యమం మూడు రీతులలో అనుసరింపబడినది. (1) నిర్మాణ కార్యక్రమాల ప్రచారం (2) బహిష్కరణ కార్యక్రమ ప్రచారం (3) శాసనోల్లంఘనం.[41]

'మాలపల్లి'లో ఈ ఉద్యమం సంక్షిప్తంగా చిత్రింపబడ్డది కారణం సహాయ నిరాకరణోద్యమం ప్రారంభింపబడిన కొద్దికాలానికే ఈ నవలా రచన చేయబడడం. అయినప్పటికీ, మహాత్ముని ప్రబోధానుగుణంగా సహాయనిరాకరణోద్యమాన్ని నిర్మాణ కార్యక్రమ ప్రచారం, బహిష్కరణ కార్యక్రమ ప్రచారం అనే రెండు రీతులను అనుసరించడంవల్ల కలిగిన సత్ఫలితాల్ని ఉన్నవ స్పష్టంగా 'మాలపల్లి' చివరలో చిత్రించినాడు. సహాయ నిరాకరణం ద్వారానే స్వరాజ్య సాధన జరుగుతుందన్న గాంధీజీ భావాల్ని విశ్వసించి, నవలాంతాన స్వరాజ్యం సాధింపబడినట్లు చూపినాడు.

"గాంధీగారి ఉద్యమంలో నాకు బాగా నమ్మకం కుదరక అజ్ఞాయి స్తున్నా ఇంతవరకు 'ఈ తొట్టి స్నానపు చికిత్సవల్ల ఈ దీర్ఘ రోగం కుదర వచ్చిందా?' అనుకొన్నాను గాని మన తత్వానికి ఈ మందు బాగా పట్టింది" (మా.ప. 479-80).

అంటూ మొట్టమొదటిసారిగా 'మాలపల్లి'లో గాంధీ ప్రస్తావనతో పాటు, గాంధీ ప్రారంభించిన అసహాయోద్యమం ప్రస్తావనకు వస్తుంది. గాంధీ ప్రారంభించిన అసహాయోద్యమం నెమ్మది నెమ్మదిగా వ్యాప్తిలోకి వస్తున్న విషయం ఇక్కడ వ్యక్తమవుతుంది.

ఉన్నవ గాంధీ పిలుపు పురస్కరించుకొని న్యాయవాదవృత్తిని వదలిపెట్టి స్వయంగా ఉద్యమ ప్రచారానికి పాటుపడినాడు.[42] జైలు శిక్షను అనుభవించి నాడు. అందువల్ల నవలలో అసహాయోద్యమ ప్రభావంతోపాటు, జైలులోని దుర్భర జీవితాల్ని కన్నులకు కట్టినట్లు చూపడం జరిగింది.

స్వాతంత్ర్య సముపార్జనా సాధనలో తిలక్, గాంధీ మహాత్ముడు మొదలైన దేశభక్తులెందరో జైళ్లలోకి వెళ్ళుతూ, అధికారులు పెట్టే కఠిన శిక్షల్ని ఆనందంగా భరిస్తున్నారు. ఆంగ్లేయులు బయటనేగాక, జైళ్ళలోనూ తమ క్రౌర్యాన్ని ప్రదర్శిస్తున్నారు. అయినప్పటికీ ప్రతి పౌరుడూ గాంధీ మహాత్ముడు ప్రబోధించిన 'సహాయ నిరాకరణా'న్ని అవలంబిస్తూ జైళ్ళలోకి వెడుతున్నాడు.

సహాయ నిరాకరణోద్యమాన్ని తీవ్రతరం చేస్తూ బ్రిటీషు వారు అనుసరిస్తున్న కఠిన వైఖరికి వ్యతిరేకమైన భావాల్ని కలిగిస్తూ, జాతీయైక్యతను సాధిస్తున్న మహాత్మునిపై రాజద్రోహ నేరం మోపబడుతుంది. అప్పుడు గాంధీ "భారతదేశ భక్తులలో (తిలక్‌వంటి) ఉత్తమోత్తములు ఈ నేరం క్రింద శిక్షింపబడిరను సంగతి నాకు తెలుసును కాబట్టి ఈ నేరము నాపై మోపబడుట నేనొక గౌరవముగా భావింతును"[43] అంటూ సంతోషంగా జైలుకు వెళ్ళుతాడు. ఇదే తమకు మహాత్ముడిచ్చిన ఆదేశంగా భావించి ప్రజలు అత్యంత ఉత్సాహంతో సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొంటున్నారు. మంచి చెడులను విస్మరించిన పోలీసులు కొరడాలతో కొడుతూ, అనుమానమున్న వారినందరినీ అరెస్టులుచేసి,

విచారణ లేకుండానే జైళ్ళల్లోకి తోసి, అనేక బాధల్ని పెడుతున్నారు. అయినప్పటికీ ప్రజలు ఏ మాత్రం నిరుత్సాహం చెందకుండా ద్విగుణీకృత ఉత్సాహంతో రాజకీయపు చైతన్యాన్ని అలవరచుకొన్నారు. స్వరాజ్య సాధన తమ జన్మహక్కుగా భావించి, దాన్ని సంపాదించేంత వరకు విశ్రమించేది లేదని ఉద్ఘోషించినారు. పరాయి ప్రభుత్వమైన ఆంగ్లేయులపై ఆధారపడక, స్వరాజ్యాన్ని స్వశక్తితో సాధించుకోవాలని ఆత్మత్యాగానికి సిద్ధపడ్డారు. ఆంగ్ల ప్రభుత్వాన్ని, పోలీసులను, సైనికులను, అరెస్టులను, జైళ్ళను, శిక్షలను వేటినీ ఖాతరు చేయకుండా, నిర్భయంగా దేశ విముక్తికై పోరాడటం అలవరచుకొన్నారు.[44] స్వయంగా ఈ పోరాటంలో పాల్గొన్న ఉన్నవ 'మాలపల్లి'ని సహాయ నిరాకరణ మార్గంలో, స్వాతంత్ర్య సంపాదనాభిముఖంగా నడిపించినాడు.

మంగళాపురంలో తోటివారు జైలుకు వెళుతుంటే రామదాసు ఊరుకోలేక పోతాడు. 'అందరూ ఖైదుకు పోయేవాండ్లూనూ నేను మాత్రం బయటుండే వాడినా?' (మా. ప. 391) అంటూ 'నా స్వాతంత్ర్యం కంటే నా నిర్బంధమే దేశానికి ఎక్కువ శ్రేయస్కరం కాగల'దన్న తిలక్ మహాశయుని మాటలను గుర్తుకు తెస్తాడు.

సహాయ నిరాకరణంలో భాగంగానే పలువురు ప్రభుత్వ ఉద్యోగులు, లాయర్లు, డాక్టర్లు తమ ఉద్యోగాలు వదలిపెడుతున్నారు నవలలో నారాయణ రావు పంతులు కూడా గాంధీగారి ఉద్యమంపై నమ్మకం కలగడంతోటే తన న్యాయవాద వృత్తిని పరిత్యజించి, సహాయ నిరాకరణానికి మద్దతుగా తానే కేసూ పట్టనని నిశ్చయానికొస్తాడు (మా. ప. 479-80). జోతిని విడిపించే ప్రయత్నంలో రామానాయుడి మీద కేసు మోపబడి, అరెస్టు చేయబడితే కూడా పంతులు వాదించేందుకు ఇష్టపడడు.

మహాత్ముడు ప్రవచించిన అహింసా సిద్ధాంతం[45] రామదాసులో కన్పిస్తుంది 'అహింసోపరమో ధర్మః' అనే సూత్రాన్ని అనాది సిద్ధంగా ఆచరిస్తున్న భారతదేశం ఈ ధర్మాన్ని ప్రతిష్ఠించి లోకానికి మార్గం చూపవలసివుంది. స్వాతంత్ర్యం సంపాదించడ మొక్కటే మన ప్రధాన ఉద్దేశం కాదు స్వరాజ్యం స్వర్గరాజ్యం కావాలంటే హింస వర్జించాలి హింసను ప్రబోధించే ధర్మశాస్త్రాన్ని

లను పునరుద్ధరించి, శిక్షాస్మృతులను పవిత్రం చేయాలని, ఉరి శిక్షను శిక్షాస్మృతి నుండి తొలగించాలని రామదాసు వ్యక్తం చేస్తాడు. (మా ప 612-13)

మహాత్ముడు తాను ప్రారంభించిన నిర్మాణ కార్యక్రమాంశాలు విజయవంతమైన పక్షంలో స్వరాజ్యం సాధింపబడినట్లే భావించినాడు. గ్రామ పరిశ్రమలైన నూలు వడకడము, ఖద్దరు ఉత్పత్తుల ద్వారా గ్రామాల్లో నిరుద్యోగ సమస్య సమసిపోయి, జీవనోపాధి ఏర్పడి, అందరూ సుఖవంతమైన జీవితాల్ని గడుపగలరని ఆశించినాడు మద్యపాన నిర్మూలన వల్ల అల్పాదాయ వర్గాలు ఆర్థికంగా పుంజుకొని, సన్మార్గంలో జీవనం కొనసాగించగలవని నమ్మినాడు. అస్పృశ్యతా నివారణ ద్వారా భారతీయులలో ఏక కుటుంబ భావన ఏర్పడి, సంఘటితంగా ఆంగ్ల ప్రభుత్వాన్ని ఎదిరించ గలరని విశ్వసించినాడు [46]

గాంధీజీ ఊహించిన పై విధానమంతా 'మాలపల్లి' నవలలో ప్రత్యక్షంగా జరిగినట్లుగా రచయిత సూచించిన క్రింది మాటల వల్ల స్పష్టమవుతుంది.

> "మహాత్ముని అసహాయోద్యమము దేశమంతటా వ్యాపించింది. మాలపల్లెలు మగ్గాలతో నిండినవి. ...స్వదేశీ చెప్పుల యందు జనానికి అభిమానము కలగడంతోటే మాదిగె వాండ్లకు కూడా చేతి నిండా పని దొరుకుతున్నది. ఖద్దరు వృత్తి కావడంతోటే కోట్ల మందికి వడకడం. యేకడం, రంగులద్దడం పని సరిపోతున్నది....ఖద్దరువల్ల కోట్లకొలది జనానికి జీవనం కలగడంతోటే తక్కిన కూలీలకు వ్యవసాయపు పనుల వల్ల ఎడదెగకుండా కూలిదొరికి సుఖజీవనం జరుగుతున్నది ...విదేశీగుడ్డలమ్మే వర్తకులంతా స్వదేశీ గుడ్డలనే అమ్ముతున్నారు... ఇతర వృత్తులు చాలా అభివృద్ధి అవుతున్నవి... కూలీలకు పని పుష్కలంగా దొరికి డబ్బు మిగులుతుండడంతోటే కూలీ కూటాలకూ, పరపతి సంఘాలకు ప్రాముఖ్యత హెచ్చింది. ఊరూరా --- సంఘాలేర్పడుతున్నవి, జనం బొత్తిగా తాగుడు మానివేశారు" (మా. ప. 640-41).

త్రాగుడు మాన్పించే ప్రయత్నాలు కూడా విరివిగా సాగుతున్నవి. (మా. ప. 642) ఈవిధంగా జనం మేల్కాంచి, స్వరాజ్యోద్యమం వైపు దృష్టి సారించినారు. ఫలితంగా భారత దేశానికి స్వరాజ్యం ప్రాప్తించింది. రాజకీయ వాదులతో పాటుగా, సెటిల్‌మెంటుకు చెందిన వారందరూ విడుదల చేయబడ్డారు

ఆనాటికింకా కలగానే ఉన్న స్వరాజ్య సంపాదనను ఉన్నవ రెండున్నర దశాబ్దాల ముందే ఊహించి, స్వాతంత్ర్యం వచ్చి, అన్నిరకాల ప్రజలు, ముఖ్యంగా దిగువజాతులు వివిధములైన అభివృద్ధులను సాధించినట్లు, వారికొరకు చట్టాలు ఏర్పడినట్లు చూపి సంగదాసు కన్నకలల్ని ఫలింపచేసినాడు. జాతీయోద్యమ ప్రభావంతో 'మాలపల్లి' ని ఎంతో గొప్పగా తీర్చిదిద్దినారు. 'మాలపల్లి' గాంధీ మహాత్ముని పవిత్ర ఆశయములకు, రాజకీయ సిద్ధాంతములకు ప్రతీక.[47]

## వ్యవసాయ కూలీల ఉద్యమం :

వ్యవసాయ కూలీలకు చెందిన వివిధ సమస్యల్ని 'మాలపల్లి' నవలలో చిత్రించడం ద్వారా ఉన్నవ సామాన్య మానవుని సంపూర్ణ జీవన స్వరూపాన్ని సాక్షాత్కరింప చేసినాడు సామాన్య మానవులంటే ఆనాడు దేశంలో అధిక భాగంగా ఉన్న వ్యవసాయ కూలీలనే చెప్పాలి ఉన్నవ వ్యవసాయకూలీల జీవితాల్ని ఒక ప్రధాన సమస్యగా స్వీకరించి ఉద్యమ రూపంగా చిత్రించినాడు.దీంతో పాటుగా వ్యవసాయ కూలీలుగా మారటానికి కారణమైన అంశాలను ఇట్లా విశ్లేషించినాడు :

1. స్వయంపోషకంగా సాగుతున్న గ్రామ పరిపాలనా పద్ధతి విధ్వంసం కావడం.
2. భూమిపై హక్కు ఏర్పడడం.
3. న్యాయస్థానాలు ధనవంతుల యెడ పక్షపాతంతో వ్యవహరించడం.

### గ్రామ పరిపాలనా పద్ధతి :

"...ప్రతిగ్రామంలో అన్ని రకాల వృత్తులవారిని ప్రవేశపెట్టి వారాగ్రామాలు విడువక స్థిరంగా నిలిచి గ్రామ జీవితానికి తోడ్పడేలాగు యీనాము లేర్పరచి, చాకలి, మంగలి, కుమ్మరి,

వైద్యుడు, పురోహితుడు, పంతులు మొదలగు వృత్తులవారు ప్రతీ గ్రామంలోనూ వుండి, గ్రామవాసుల కవసరమైనపుడు సహాయం చేస్తూ వుండేలాగు ప్రపంచంలోకెల్లా అద్భుతమైన గ్రామ పరిపాలనా పద్ధతి స్థాపించబడ్డది ఆంగ్ల ప్రభువులు ప్రతి గ్రామమందు పూర్వ ప్రభువులచే అద్భుతంగా మలచబడ్డ గ్రామపాలనా ప్రతిష్ఠాపనం విధ్వంసం చేశారు." (మా. ప. 141 - 42).

కంపెనీ పరిపాలన కారణంగా దేశంలో ధనానికి అధిక ప్రాచుర్యం లభించింది. నిశ్చలంగా, ప్రశాంతంగా సాగుతున్న గ్రామ నౌక ఆంగ్లేయుల ధాటికి తట్టుకోలేక ఛిన్నాభిన్నమైంది. వ్యవసాయమే జీవనాధారంగా గ్రామవాసులు కాలం గడుపుతుండేవారు. వారి ప్రాథమిక అవసరాలకు అనుగుణంగా ప్రతి గ్రామమూ అనేక వృత్తిపనులకు నిలయంగా ఉండేది. గ్రామపరిశ్రమలు అన్యోన్యాధారమై ఒక విలక్షణ పద్ధతిలో కొనసాగేవి కమ్మరి, కుమ్మరి మొదలైన అనేక వృత్తుల వారంతా తమ అవసరాలను తీర్చుకొనేందుకు కావలసిన వస్తువులు తయారుచేసి పరస్పరం సహకరించుకొనేవారు గ్రామం యొక్క అవసరాలను తీర్చడానికి సమష్టిగా కృషిచేసేవారు. ధనంకంటే వస్తుమార్పిడికి[48] ప్రాధాన్యం ఉండేది ఈ రీతిగా గ్రామనివాసులు, రైతులు, వృత్తికళాకారులు తమ తమ వృత్తులను నిర్వహించుకొంటూ ప్రేమాస్పదమైన, నిష్కపటపు జీవితాల్ని గడుపుతుండేవారు ఇట్లా స్వయంపోషకంగా సాగుతున్న గ్రామపరిపాలనా పద్ధతి ఆంగ్లేయుల ప్రాబల్యంవల్ల విధ్వంసమైంది.

## భూమిపై హక్కు :

పూర్వ కాలంలో పలు వృత్తుల నాధారం చేసుకొని జీవిస్తున్న గ్రామవాసులు కూడా వ్యావసాయిక విషయంలో విశేష శ్రద్ధ కనబరచేవారు. భూమిని తమ వశం చేసుకోవాలనే ఆలోచన కాని, భూమిపై హక్కు పొందాలనే ఆసక్తి కాని ఎవరికి ఏర్పడలేదు. ఎవరి శక్తి మేరకు వారు, ఎవరికి అవసరమున్నంత వారు భూమిని స్వేచ్ఛగా వ్యవసాయానికి వినియోగించుకొనేవారు

ఇటువంటి పరిస్థితులలో 1878 లో గవర్నరు జనరలుగా భారతదేశానికి వచ్చిన కారన్‌వాలీసు భూమిపై హక్కును ప్రవేశపెట్టినాడు. దీంతో కొందరు

వ్యక్తులు భూమిని స్వంతం చేసుకొని, విస్తారంగా సమకూర్చుకోవటం ప్రారంభించినారు. వస్తు విక్రయం వలె భూమి కూడా విక్రయ స్థితిని పొందింది [49]

'మాలపల్లి' లో చౌదరయ్య కొన్ని వందల ఎకరాల భూమిని తక్కువ ధరలో కొని, బాకీల క్రింద కట్టుకొని, కోర్టుద్వారా కొట్టి వేయించుకొని తన స్వంతం చేసుకొంటాడు. (మా.ప 102)

భూమిపై ఆస్తి హక్కును ప్రవేశపెట్టిన బ్రిటిష ప్రభుత్వం రైతు చెల్లించవలసిన భూమి శిస్తును కూడా నిర్ణయించింది. దీంతో రైతు పంటలు పండినా, పండకపోయినా, అతివృష్టి అనావృష్టులకు గురియైనా శిస్తు చెల్లించాల్సి వచ్చేది పండిన పంటలో ఎక్కువభాగం శిస్తుకిందనే చెల్లిపోయేది. మిగిలిన పంట రైతు కుటుంబ పోషణకు సరిపోయెడిది కాదు. శిస్తులు కట్టని మేరకు వారి భూములను వేలం వేసేవారు. రైతు తమ కుటుంబ జీవనాధారమైన పంట భూమి కాస్తా లేకుండా పోతుందనే భయం వల్ల, అప్పులు చేసి శిస్తులు కట్టడం ప్రారంభించినారు. రైతుకు అప్పులిచ్చే ఋణదాత అతడియొక్క అజ్ఞానాన్ని, దారిద్ర్యాన్ని, అవసరాన్ని తనకు అనుకూలంగా మలచుకొన్నాడు. దీంతో రైతు యొక్క అప్పు ఎంత కాలమైనా చెల్లుబడి కాకపోయేది. ఋణదాతకు వడ్డీ, ప్రభుత్వానికి శిస్తు చెల్లించడం వల్ల ఇవన్నీ తన కొస్తున్న స్వల్పాదాయంవల్ల సాధ్యపడక పోవడంతో ఇతడెప్పుడూ ఋణదాత చేతుల్లో చిక్కి ఉండాల్సి వచ్చేది [50]. ఇట్లాంటి పరిస్థితులలో కొందరు తమకున్న భూములను ఋణదాత పరంచేసి జీవనాధారం కొరకు వలస వెళ్ళేవారు. ఈ విధానం 'మాలపల్లి'లో కనిపిస్తుంది. ఋణదాతయైన చౌదరయ్య రెండు విధాలుగా ఋణగ్రస్తుడిని బాధించేవాడు.

1. ఋణగ్రస్తుడిని నిర్దాక్షిణ్యంగా అణచివేయడం.
2. ఋణ విముక్తి కలుగకుండా చూడడం.

## నిర్దాక్షిణ్యత :

చౌదరయ్య వద్ద గుమాస్తాగా పనిచేస్తున్న సంగదాసు పత్తి గింజలకొరకు పత్తి తీయుద్దామనే ఆలోచనలతో రాట్నాలు ఎక్కడ పెట్టిద్దామా అని ఆలోచిస్తుంటాడు అప్పుడు ఆదంసాహెబు 'మొన్న వేలంలో గొన్న తొాగటింట్లో

పెట్టించండి' అని అంటాడు. సహజంగా సంగదాసు 'కొనంగానే మనకు వచ్చిందా, అయినా వచ్చి స్వాధీనం చేయవద్దా?' అని సందేహం వ్యక్తం చేస్తే, 'అదొక ఖర్చెందుకని పంతులుగారూ, చౌదరయ్యగారూ పోయి వాళ్ళను వెళ్ళ గొట్టి తాళం వేశారు', దీంతో వాళ్ళు 'గంపెడు చీకటి నెత్తిన వేసుకొని తూర్పు బతక పోయినారు' [మా. ప. 57] అని చెపుతాడు. ఈ సంఘటనద్వారా ఋణ దాత ఋణగ్రస్తుడిని నిర్దాక్షిణ్యంగా అణచివేయడం గమనింపవచ్చు.

## ఋణవిముక్తి కలగకుండా చూడడం :

ఋణదాత తన చేతిలో చిక్కిన ఋణగ్రస్తుడికి ఋణ భారం నుండి విముక్తికి అవకాశం ఇచ్చేవాడుకాదు. 'మాలపల్లి'లో చౌదరయ్యకు చేదోడు వాదోడుగా ఉన్న పంతులు కొన్ని పరిస్థితులలో చౌదరయ్యకు అప్పు పడతాడు. తనను రామదాసు మీద అక్రమవ్యాజ్యం వేయమని చౌదరయ్య కోరినప్పుడు పంతులు - 'నా అయిదు వందల తాకట్టు దస్తావేజు ఇచ్చివేసి...తాకట్టు భూమిని స్వాధీనపరచ' మంటాడు. దానికి చౌదరయ్య తెలివిగా— 'నీవు నా బాకి యిప్పుడు తీర్చకపోతే తొందరేమి వచ్చింది? మన యిద్దరి లావాదేవి జరుగు తుండనియ్యి, ఆరేండ్లలో బాకీదీరి నీ భూమి నీకెట్లాగూ రానేవస్తుంది' అని అప్పు కొనసాగేందుకు ప్రయత్నిస్తాడు దానికి పంతులు- 'నీది ముప్పై ఏండ్ల నాటి బాకి. నేను పెత్తనానికి వచ్చిన తర్వాత ఆ పొలములో నుంచి గిద్దెడు గింజలు నా యింటికి రాలేదు. రూపాయలు నా కింద బడ్డవా అంటే తేలేది కష్టం. నా బాకి అట్లాగే వుంటుంది. రామదాసు పొలంతో పాటు నాదీ వేలానికి వస్తుంది' (మా ప. 208) అని అంటాడు.

ఇక్కడ ఋణగ్రస్తుడు ఋణ భారం నుండి విముక్తి పొందాలని యత్నించడం, ఋణదాత అది పడనియ్యక పోవడం పంతులు, చౌదరయ్య పాత్రలలో కన్పిస్తుంది.

## న్యాయస్థానాలు :

ఋణగ్రస్తుడు ఋణదాత చేసే అన్యాయాన్ని ఎదుర్కొనేందుకు న్యాయ స్థానానికి వెళ్ళినా, ఆనాటి బ్రిటిష న్యాయ స్థానాలు ధనవంతుడికి అనుకూలంగా

ఉండేవే తప్ప, ఋణగ్రస్తుడికి న్యాయం చేకూర్చేవి కావు ఈ కారణంగా ఋణ దాత పలువురి ఆస్తిని తన పరం చేసుకొని రెట్టింపు చేసుకోగలిగాడు.

"చౌదరయ్య...తండ్రి చనిపోయేటప్పుడు వీరి కుటుంబానికి రెండువందల యెకరాల పల్లం, నూరు యెకరాల మెట్టా వుండేవి చౌదరయ్య సిగ యెగ్గట్టి పెత్తనానికి వచ్చినప్పటి నుండి చౌక ధరలో కొనీ, బాకీల క్రింద కట్టుకొనీ, కోర్టు వేలములో కొట్టి వేయించుకొనీ యిప్పటికి అయిదు వందల యెకరాల పల్లం, మూడు వందల యెకరాల మెట్టా సంపాదించి, మూడు లక్షల వరకూ కవిలె పెంచాడు." (మా ప. 102).

రైతులు కోర్టులలో అన్యాయానికి గురవటమే కాకుండా, దీర్ఘకాలం సాగే కోర్టు వ్యవహారాలలో మాటిమాటికి కేసు విషయమై కోర్టుకు వెళ్ళాలన్నా, అందు కయ్యే ఖర్చులు భరించాలన్నా అనేక ఇబ్బందులకు గురవుతుండేవారు. చివరికి తీర్పుచెప్పేరోజు భూస్వామి ప్రవేశ పెట్టిన తప్పుడుసాక్ష్యాల్ని నమ్మి కోర్టు భూస్వా మికి అనుకూలంగా తీర్పు చెప్పేది. అతడి పంట భూమిని, పండిన పంటను అతి తక్కువ ధరలో కొట్టి వేయించుకొనే అవకాశం కూడా భూస్వామికి ఇవ్వ బడేది.51

చౌదరయ్య రామదాసు ఆస్తి మీద పంతులు ద్వారా అప్రమేయ వ్యాజ్యం వేయిస్తాడు. రామదాసు తన పెద్ద కొడుకు వెంకటదాసు ప్రోద్బలంతో కోర్టుకు వెళతాడు. కేసు అడిషనల్ కోర్టుకు వెళుతుంది. 'అడిషనల్ మునసబు గారు చాలా బద్ధకస్తుడు. సంవత్సరంలో ప్రతిపాదంలో విచారణ ఘుమపలైన దావాల పట్టి పంపే నిమిత్తం కొన్ని కేసులు బలవంతంగా రాజీ పెట్టించీ, ప్లీడర్లు లేకుండా చూసి కొట్టివేసీ, సాక్షులు హాజరయిన దావాలు వాయిదా వేసీ, హాజరుకాని వ్యాజ్యాలు విచారణకు పెట్టించీ పని తేలిక చేసుకొంటుండేవాడు'. (మా. ప. 286) ఈ విధంగానే రామదాసు కేసును ఎవరూ లేని సమయంలో విచారణకు స్వీకరించి, నారాయణరావు పంతులు గుమస్తా వాయిదా కోరినప్పటికీ ఒప్పుకోక మునసబు - "సమనులు ఆలస్యం చేశారనీ, హాజరు సాక్షులను

తెచ్చుకోలేదనీ వాయిదా పిటిషన్ తోసిపేసి, వాయిలి తరపున యెవరూ హాజరు లేనప్పటికీ ఆ సంగతెత్తుకోకుండా రుజువు భారం ప్రతివాదుల మీద ఉండడం చేత దావా ప్రకారం దావా భూమి స్వాధీనానికీ, గత ఫల సాయం, మధ్య ఫల సాయం ఖర్చులకు సహా డిక్రీ యిచ్చాడు". (మా ప. 297).

ఇట్లా చౌదరయ్య మునసబును లోబరుచుకొని తనపక్షాన తీర్పు చెప్పించుకొని (మా. ప. 298) రామదాసు యావదాస్తినీ, భూమినీ స్వాధీనం చేసుకొంటాడు. (మా. ప 306-307).

బ్రిటీషువారి కాలంలో న్యాయ స్థానాలు అన్యాయానికి స్థానాలుగా, అవి నీతితో నిండి వుండేవి.

బ్రిటిషువారి ప్రభుత్వం మన దేశంలోని స్వయం పోషకమైన గ్రామీణ వ్యవస్థను విధ్వంసం చేయడం, భూమిపై హక్కును ప్రవేశ పెట్టడం, న్యాయస్థానాలు అన్యాయంగా వ్యవహరించడం మొదలైన పలు కారణాలవల్ల దేశంలో కూలీల సంఖ్య అధికమైంది.[52] కూలీలు తమ బ్రతుకు తెరువుకొరకు భూస్వాములను ఆశ్రయించక తప్పని పరిస్థితి ఏర్పడింది అయితే వీరి ఈ అవసరాన్ని తమ కనుకూలంగా మలుచుకొని ధనిక రైతులు కూలిని తగ్గించేందుకు సిద్ధపడతారు. ఈ విధానం మాల్లపల్లిలో చూడవచ్చు.

## మాలపల్లిలో వ్యవసాయ కూలీల పరిస్థితి :

'ఆసామికి పండే ధాన్యాన్ని పట్టిచూస్తే అడ్డెడు గింజలు చాలా తక్కువ కూలి'. (మా.ప. 90). ఇది కూలీల పరిస్థితి. తమకు లాభాలు అధికంగా వస్తున్నప్పటికీ, తమకింత లాభం చేకూరడానికి కారకులైన కూలీల జీవితాల్ని గూర్చి ఏ మాత్రం పట్టించుకోకుండా, ఈ కూలిని ఇంకా తగ్గించాలని మోతుబరులంతా దీర్ఘాలోచన చేస్తుంటారు. వ్యవసాయ కూలీలుగా జీవిస్తూ, సంఘం చేత అవమానింపబడుతూ, భూస్వాముల చేత అణగద్రొక్కబడుతున్న మాల, మాదిగల పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉంది. ఈ పరిస్థితికి కారకులు చౌదరయ్య, మునసబు లాంటి మోతుబరులు.

కూలీలు సంవత్సరంలో నాలుగు నెలలు అర్ధ భోజనంతోనూ, మిగిలిన నాలుగు నెలలు కటిక ఉపవాసంతోనూ దిన దిన గండంగా జీవితాల్ని నెట్టుకొస్తున్నారు. తిండి దొరకనపుడు అడవుల్లోదొరికే బొద్దాకుతో కాలం గడుపుతున్నారు బొద్దాకు కూడా దొరకనపుడు ఆకలి బాధ ఓర్వలేక చచ్చిన గొడ్ల మురికి మాంసం తింటున్నారు. ఇవేవీ దొరకక 'అన్నం బొత్తిగా లేనప్పుడు పడుకుంటే బాధ యెక్కువని అన్నపుత్తి మడతలు పడేట్టుగా ముడిచిపెట్టుకొని' దిన పస్తులు ఉంటుంటారు. (మా. ప. 82).

వీరి ఈ పరిస్థితి తొలగించేందుకు సంగదాసు చౌదరయ్యకు వ్యవసాయంలో భూస్వామికంటే కూలివాడి ప్రాధాన్యతను అనేక విధాలుగా వివరిస్తాడు.

## వ్యవసాయంలో కూలి - భూస్వామి :

సంగదాసు చౌదరయ్యతో కూలీలకిచ్చే కూలిని గూర్చి చర్చిస్తూ వ్యవసాయంలో కూలీల ప్రాధాన్యతను ఇలా వివరిస్తాడు :

> "మనదేశంలో భూమిలో స్వామ్యం వ్యవసాయదారులకు లేదు. అది ప్రభుత్వానికి గాని, మందికిగాని చెందియున్నది...అసామీలు మంది దగ్గర నుంచి భూములను కౌలుకు పుచ్చుకొని మందికి యేజెంటైన రాజుకు ముచ్చిలాక్కాలు వ్రాసి ఆయనవల్ల పట్టాలు పుచ్చుకొని మందికి చెల్లించవలసిన మక్తా శిస్తురూపంగా రాజుకు చెల్లిస్తారు...కాబట్టి మీకున్నది జిరాయితీ హక్కు...వ్యవసాయ విషయంలో జీతగాండ్లూ, కూలీలూ ముఖ్యులు." (మా. ప. 110-111).

కూలీలు, జీతగాండ్లతో పాటు, స్వంతంగా సాగుబడి చేసుకొనేవారు కూడా వ్యవసాయంలో, ప్రాధాన్యత వహిస్తారు. వందల ఎకరాల భూమి ఉండి, వ్యవసాయాన్ని పర్యవేక్షించే భూస్వాములు కష్టపడి పనిచేయక పోవడమేకాకుండా, వ్యవసాయం మీద వచ్చే లాభాన్ని అధికభాగం తమ హస్తగతం చేసుకొంటున్నారు. అందువల్ల వ్యవసాయానికి ఈ కూలీలే ప్రధానులని సంగదాసు చౌదరయ్యకు ఎంతో వివరంగా తెలుపుతాడు. (మా. ప. 111)

ఒకవేళ కూలీలు సమ్మె కట్టితే, అది ఉభయులకూ నష్టమే కాబట్టి రైతులు కూలివాండ్ల విషయమై విశేష శ్రద్ధ కనబరచాలి వ్యవసాయానికి ముఖ్యుడైన కూలీని కనిపెట్టవలసిన బాధ్యత భూస్వాముల మీద ఉందని వివరిస్తాడు.

కూలీవాడు తనకొచ్చే కూలితో తన కుటుంబాన్ని, ముసలి తల్లిదండ్రులను, గర్భవతియైన భార్యను, చేతికిరాని పిల్లలను పోషించుకోవాలి. పైగా ఈ కూలి కూడా సంవత్సరం మొత్తం దొరకదు. అందువల్ల వీరికి తగిన కూలి యివ్వవలసి వుంటుందని స్పష్టం చేస్తాడు.

## కూలి - కార్మికుడు :

యంత్రాలలో పనిచేసే కార్మికులకు వలె వ్యవసాయ కూలీలకు సంవత్సరం అంతా పని దొరకదు. వీరికి సంవత్సరంలో ఒకటి రెండుసార్లు నాట్లు, కోతలప్పుడు మాత్రమే పని దొరుకుతుంది. అందువల్ల 'కూలీ వాండ్లకు వచ్చే మూడవ పంతు ఆదాయము మక్తాగా కూలీలకిస్తే మామూలుకంటే యెక్కువ త్వరగా పని ముగించు'కొని యితర అభివృద్ధులు సాధించుకుంటారు అంటూ వ్యవసాయ కూలీకి కార్మికుడికీ గల భేదాన్ని తెలుపుతాడు.

## సమాజంలో కూలివాడు :

సరియైన కూలి లభిస్తున్నపుడు కూలీలు తమ విరామ కాలాన్ని సద్వినియోగం చేసుకోగలుగుతారు. విజ్ఞానాభివృద్ధిని పెంపొందించుకొనుటకు, దేశ క్షేమంకొరకు పాటుపడగలరు 'రాజకీయ, సాంఘిక, మతవ్యవహారాలలో జోక్యం కలిగించుకొని' అభివృద్ధిని సాధించగలుగుతారు. (మా. ప. 129).

కూలీలకు చదువువస్తే, వారు కూలిపని చేయరని భూస్వాముల సందేహం. కాని, 'తెల్లవాండ్లలోనూ, జపానులోనూ యెక్కువ కూలిచ్చియినా చదువుకొన్న పనివాండ్లు కావలెనంటారు.' కాబట్టి మనవద్దకూడా కూలీలు చదువుకొనేందుకు తగినంత ప్రోత్సాహం కలిగించడానికి సరియైన కూలి యిచ్చినట్లైతే వీరు ఇతర అభివృద్ధులు సాధించి, సమాజంలో ప్రముఖ పాత్ర వహిస్తారని ఉన్నవ ఆకాంక్ష

# వ్యవసాయ కూలీల ఉద్యమాన్ని ప్రస్తావించిన తొలి నవల - మాలపల్లి:

'మాలపల్లి' రచనా కాలంనాటికి ఆంధ్ర దేశంలో కూలీల సంఘాలు ఏర్పడలేదు.[53] కాని, అప్పటికే చాంపారన్‌లో నీలి మందు రైతుల సత్యాగ్రహమూ, ఖేడారైతుల పోరాటమూ, అహ్మదాబాదు మిల్లు కార్మికుల సమ్మె వీటన్నింటిలో గాంధీజీ నిర్వహించిన భూమికను గూర్చి దేశమంతటా కథలు కథలుగా చెప్పుకోవడం ప్రారంభమైంది. మహాత్ముడు పై ఉద్యమాలకు నాయకత్వం వహించి, సహాయ నిరాకరణ లేదా సమ్మె ద్వారా సత్ఫలితాల్ని సాధించాడు. ఈ ప్రేరణతో ఉన్నవ 'మాలపల్లి' లో ప్రపథమంగా వ్యవసాయ కూలీలలో ఐకమత్యం సాధించి, వారి చేత సమ్మెను చేయించి విజయం సాధింప చేస్తాడు ఇక్కడ సంగదాసు నాయకత్వం వహిస్తాడు. బెజవాడలో జరిగిన సభలో కూడా - 'కూలీలకు సక్రమమైన కూలి యియ్యక, వారి శ్రమ వలన వచ్చే ఆదాయంలో విశేషభాగం భూస్వాములే అనుభవిస్తున్నందువల్ల వేతల, కోతల కాలాలలో కూలీలు సమ్మె కట్టి సహాయ నిరాకరణ మవలంబించవలసిందని' కొత్త తీర్మానం ప్రస్తావించబడుతుంది. (మా. ప. 158).

చివరికి మాలపల్లిలో విరివిగా కూలీల సంఘాలు ఏర్పడడం కన్పిస్తుంది. (మా ప. 641) ఈవిధంగా కూలీల ఉద్యమాన్ని 'మాలపల్లి'లో చిత్రించి, కూలీ సంఘాలు ఏర్పడడానికి ఉన్నవ 'మాలపల్లి' రచన ద్వారా మార్గమేర్పరచినాడు.

## సూచికలు :

1 చూడుడు : వై సాంబశివరావు - "గాంధీజీ నిర్మాణ కార్యక్రమాంశాలు: మాలపల్లి నవలలో చిత్రింపబడిన తీరు తెన్నులు" (వ్యా) పు. 48-50. 'ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్స్.'

2. ముదిగొండ వీరభద్రయ్య - 'తాత్వికత' (వ్యా) 'మన నవల పరిశీలన' పు. 45, 46.

3 వి భా. పు. 216

4. కోదాటి నారాయణ రావుగారి "ఆంధ్రప్రదేశ్‌లో అస్పృశ్యతా నివారణోద్యమము" అనే వ్యాసం నుండి కొన్ని ఉదాహరణలు చూసినట్లైతే ఈ విషయం స్పష్టమవుతుంది.

   i బందరులో వేమూరు రాంజీరావుగారు హరిజనుల కొరకు ఒక పాఠశాలను ఏర్పాటు చేసినారు.

   ii కృష్ణాజిల్లాలో గుడివాడలో గూడూరు రాంచంద్రరావుగారు అస్పృశ్యతా నివారణకు, హరిజనోద్ధరణకు కృషి చేసినారు.

   iii నల్లపాటి హనుమంతరావు గారు గుంటూరు జిల్లా పెద్దపాలెంలో హరిజన బాలురకై ప్రత్యేకంగా శ్రీకృష్ణాశ్రమాన్ని నెలకొల్పి, వారి విద్యాభివృద్ధికి కృషి చేసినారు.

   iv ఆదిపూడి సోమనాధరావుగారు, మంగిపూడి సోదరులు అని ప్రసిద్ధి గన్న పురుషోత్తమశర్మ, వెంకటశర్మలు అస్పృశ్యతా నివారణకు చేసిన ప్రచారము గొప్పది.
   చూ. భారత స్వాతంత్ర్య ప్రదీప్తి సంచిక.

5. భా. స్వా. చ. రెం. భా. పు. 111.

6. 'గాంధీజీ నిర్మాణ కార్యక్రమాంశాలు - మాలపల్లి నవలలో చిత్రింపబడిన తీరుతెన్నులు' పు. 50.

7. M. K. Gandhi - "The other day a friend suggested to me that the word 'Harijan' (Man of God) be substituted for the word "Antyaja" (The last born). That is being used for untouchables. It was a word used by the great Saint Narasimha Mehata.........Iam delishted to adopt that word......... "యంగిండియా" (6 8-31) as quoted in "The Removal of un-touehability" P. 14.

8. ఆంధ్రప్రదేశ్‌లో అస్పృశ్యతా నివారణోద్యమము - పు 90.

9. చూ. మాలపల్లి పు 144.
10. ఇదిలా ఉండగా, సాంబశివరావు గారు 'గాంధీజీ నిర్మాణ కార్యక్రమాంశాలు - మాలపల్లి నవలలో చిత్రింపబడిన తీరు తెన్నులు' అనే వ్యాసంలో ఉన్నవ ఆర్థిక సమతా సాధనకు ఆరు మార్గాలు సూచించినట్లుగా పేర్కొన్నారు. అయితే నవలలో నాలుగు మార్గాలు ప్రముఖంగా చిత్రించినట్లు కన్పిస్తున్నది. పు. 53.
11. వి. భా. పు. 258.
12. చూ. మాలపల్లి పు. 89, 90.
13. స. సా. పు. 159
14. మారుతున్న కాలం - మాలపల్లి (వ్యా). భారతి, నవంబరు, 1972.
15. యలమంచిలి తాయారు - 'గాంధీవాదము' (వ్యా) మహతి. పు. 108, 109.
16. "యజమాని రాజీకి అంగీకరించనిచో సమ్మెలు అవసరం కావచ్చును. కానీ, న్యాయమును సాధించుటకు ఇతర మార్గములు విఫలమైనప్పుడే వానిని ప్రయోగింపవలయును". రాజన్‌బాబు (నిర్మాణ కార్యక్రమములు కొన్ని సలహాలు) - 'గాంధీజీ నిర్మాణ కార్యక్రమాంశాలు మాలపల్లి నవలలో చిత్రింపబడిన తీరు తెన్నులు' అనే వ్యాసం నుండి ఎత్తి వ్రాయబడినది. పు. 51.
17. యు. ఎన్. దేబర్ - "ఎదుటి వారిని సంప్రదింపుల ద్వారా తన మార్గం వైపు త్రిప్పుకోవడంలో విఫలమయినప్పుడు గాంధీజీ సత్యాగ్రహానికి దిగుతారు. సత్యాగ్రహం అన్నది వినూతన ప్రయోగం. అక్రమ విధానాన్ని ప్రతిఘటించడంతోపాటు స్వయంగా బాధలు అనుభవించి, చివరకు ఆత్మ బలిదానానికి అయినా సిద్ధం కావడం సత్యాగ్రహం అవుతుంది." 'సాంఘిక పునర్నిర్మాణము-గాంధీజీ' (వ్యా) గాంధీ మహాత్ముడు నూరేళ్ళు (వ్యా.సం.) పు. 121.
18 M.K. Gandhi - "A voilent and bloody revolution is certainity oneday unless there is a voluntary abdication of riches and the poor which riches give and sharing them for the common good" "Indian my dreams" p - 72

19. చూ. మా. న. ప్ర. ని. పు. 18
20. 'నా యాంగిల్ నుంచి' మా. న. ప్ర. ని. పు. XVIII.
21. మాలపల్లి: సాంఘిక, ఆర్థిక, నైతిక, రాజకీయ నవల. పు. 68, 69. విమర్శిని - 3
22. మాలపల్లి నవల - దాని విశిష్టత (వ్యా) స్రవంతి-ఆగష్టు, 1977.
23 'మాలపల్లి నవల సామాజిక స్పృహ" (వ్యా) పు. 20 'మూసీ' జనవరి, 1982.
24. మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు. ఒక అద్భుత పరిశోధనాపత్రం (వ్యా) పు 9, 13. స్రవంతి. సెప్టెంబర్, 1980.
25. సంఘ విజయం' చూ: మా న.ప్ర.ని. PXXVii.
26 సంపాదకీయ వ్యాసం. నూరేళ్ళ తెలుగునాడు. (వ్యా.సం.)
27. ఆంధ్రప్రభ 15-3-1942. 'సంఘసంస్కర్త ఉన్నవ' అన్న గ్రంథం నుండి ఎత్తివ్రాయబడినది. పు 47.
28. మాలపల్లి: ఐతిహాసికత (వ్యా) పు. 31 ఆంధ్రపత్రిక. 1981-82.
29. చూ: మా. న. ప్ర. ని. పు. 69.
30. నా యాంగిల్ నుంచి. మా న. ప్ర. ని. పు. VVIII
31 ఉన్నవవారి సాహిత్య జీవిత విశేషాలు (వ్యా) పు. 39, 40. సాహిత్యోపన్యాసములు-17
32. విమర్శిని - 3. పు. 72.
33. డా. పి. సంజీవమ్మ 'తెలుగు నవలలో సామాజిక చైతన్యం'. పు. 105
34 'విశ్వనాథ సాహిత్య వ్యక్తిత్వం (వ్యా సం ) నుండి ఎత్తి వ్రాయబడినది పు. 33.
35. సంపాదకీయ వ్యాసం. నూరేళ్ళ తెలుగునాడు : పు. LXII.
36. కమలాదేవి ఛటోపాధ్యాయ 'గాంధీజీ భారతీయ సోషలిస్టులు' (వ్యా) పు. 66,67 'గాంధీ మహాత్ముడు-నూరేళ్ళ' (వ్యా. సం.)
37. చుండి జగన్నాథం-'స్వాతంత్ర్యోద్యమం-ప్రధానాంశాలు; సామ్యవాదం' (వ్యా). పు 97.
38 'విశ్వనాథ సాహిత్య వ్యక్తిత్వం' నుండి ఎత్తి వ్రాయబడినది పు. 33.
39. మురార్జీదేశాయ్-'ఆదర్శపురుషుడు గాంధీజీ' పు. 107. గాంధీమహాత్ముడు నూరేళ్ళ

40. కమలాదేవి ఛటోపాధ్యాయ-'గాంధీజీ-భారతీయ సోషలిస్టులు' పు. 75.

41. చూ. ఆచార్యమామిడిపూడి వెంకటరంగయ్య 'భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర'. మూ.భా. 'సహాయ నిరాకరణోద్యమము'.

42. మందలపర్తి ఉపేంద్రశర్మ - "ఉన్నవ లక్ష్మీనారాయణగారిసీఉద్యమం ఆకర్షించింది ...... న్యాయస్థానానికి వెళ్ళడం మానివేశారు. తాను మానడమే కాదు, గుంటూరు న్యాయవాద సంఘంవారు నలభై ఏడుగురు న్యాయస్థానాలు బహిష్కరించడానికి ప్రచారం చేశారు కృతకృత్యులయ్యారు. నాడు లాయర్లందరూ లక్ష్మీనారాయణ గారి మార్గదర్శకత్వమంగీకరించి కోర్టులకు పోలేదు. విద్యార్థులు పాఠశాలలకు పోరాదని, విదేశీ వస్తువులను వాడరాదనీ, మద్యపానం చేయరాదనీ, విదేశీ వస్త్రాలు ఉపయోగించరాదనీ, ముతక ఖద్దరును ధరించాలనీ మూడు విధాలైన బహిష్కారాలు...మనః పూర్వకముగా ఆచరణలో ఉంచాలనీ ఉద్బోధించడానికి లక్ష్మీనారాయణ పంతులు గారుపక్రమించారు." పు. 53-54. ల. నా.

43. భా. స్వా. చ. మూ భా. పు 96.

44. భా. స్వా. చ. రెం భా. పు. 102 నుండి 104

45. డా. వి. అంకయ్య - "ముఖ్యముగా సత్యాహింసలు రెండును గాంధీజీకి రెండు కన్నుల వంటివి" పు. 80. "ఆంధ్ర కవిత్వంః గాంధీ తత్వము.''

46 చూ. భా స్వా. చ. మూ. భా పుట. 83.

47. పుల్లాబొట్ల వెంకటేశ్వర్లు ''తెలుగు నవలా సాహిత్య వికాసము". పు. 140.

48 జి వెంకట సుబ్బయ్య—

"ఆది సాంఘికంగా సంధియుగం. భూస్వామ్య వ్యవస్థ ధన స్వామ్య వ్యవస్థగా మారుతున్న రోజులు. సామాజిక వ్యవస్థలో పెద్ద మార్పు తెచ్చింది ధనం పూర్వం వస్తువులతో తప్ప ధనంతో

పెద్దగా అవసరం వుండేదికాదు అది వస్తు మార్పిడి వ్యవస్థ. కోరికలు తక్కువ. క్షుద్బాధ తీర్చుకోవటం, జీవితం గడపడం తప్ప రెండవ సంగతి తెలియదు వారికి." "సంఘ సంస్కర్త ఉన్నవ" (పు 44-45)

49. తారాచంద్ - "భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర" I-పు. 304.

50. ,, పు. 304-305.

51. ,, పు. 305.

52. గురజాడ ఆంజనేయులు నాయుడు :
"పల్లెల్లో వృత్తులు కోల్పోయిన మాలలు, సాలెలూ (నేత), మాదిగలూ (చర్మకారులు), కమ్మరి, కుమ్మరి, కంసాలి యిత్యాది కులాలవారూ, పట్టణాల్లోని కుటీర పరిశ్రమల్లోని వారూ వేరే జీవనోపాధిలేక వ్యవసాయ కూలీలుగా మారారు." మాలపల్లి ఒక పరిశీలన.

53. "1921 అసహాయోద్యమం నాటికి భారతదేశంలో కార్మికోద్యమం శైశవదశలో ఉంది. 1920 ప్రాంతంలో ఏ. ఐ టి. యు. సి. స్థాపించబడింది. బొంబాయి, అహ్మదాబాదు, పారిశ్రామిక కేంద్రాల్లో కార్మిక సంఘాలు అదివరకే యేర్పడ్డాయి." మాలపల్లి ఒక పరిశీలన పు. 193.

అధ్యాయం : ఐదు

# మాలపల్లి : భాషా - సాహిత్యోద్యమాలు

## వ్యావహారిక భాష - శైలి :

"వాడుక భాషలో పుస్తకం వ్రాయడానికి నాకిదే మొదటి ప్రయత్నం. మాదిరికి తగిన గ్రంధములు కూడా లేవు."[1] ఇవి ఉన్నవ 'మాలపల్లి'కి 'పరిచయం' వ్రాస్తూ అన్న మాటలు. ఉన్నవకు 'మాలపల్లి'ని వ్రాయటం మొదటి ప్రయత్నమే అయినప్పటికీ, వాడుక భాషలో ఒక రచన సంపూర్ణంగా ఆవిష్కరింపబడటంలో 'మాలపల్లి'కి అగ్రస్థానాన్నిస్తూ, ఉన్నవను అగ్రగణ్యులుగా[2] పేర్కొనవచ్చు.

ఉన్నవ పల్కిన పై మాటలను విచారించే ముందు పూర్వ రంగంగా వ్యావహారిక భాష ఉపయోగమును, భాషా వ్యాప్తికి పలువురు చేసిన ప్రయత్నాలను తెలుసుకొంటే, ఉన్నవ పై మాటల వెనుక ఉన్న అంతర్యం తెలుస్తుంది.

ప్రప్రథమంగా వ్యావహారిక భాషకు ప్రాశస్త్యం లభించడానికి, వ్యావహారిక భాష వైపు దృష్టి నురలడానికి అనాటి విద్యాధికారియైన యేట్సు ప్రధానకారకుడు మాట్లాడే భాషకు, వ్రాసే భాషకు గల భేదానికి ఆశ్చర్యపడ్డ యేట్సు దీని విషయమై గురజాడ అప్పారావుగారితోనూ, గిడుగు రామమూర్తి పంతులు గారితోనూ చర్చించటం ప్రారంభించినందు వల్లనే, ఈ వ్యావహారిక భాషావాదం తీవ్ర రూపం ధరించి, నెమ్మదినెమ్మదిగా వాడుక భాషలో రచనలు వెలువడుటకు కారణమైంది. అయితే, యేట్సు ఈ భాషా విషయమై ప్రస్తావించక పూర్వమే— "నడుస్తూన్నది వచన యుగమని, నాటక భాష వ్యావహారిక వచనం కాక తప్పదని, తద్వారానే ప్రజల హృదయానికెక్కి చిత్తసంస్కారం కలిగింప వీలౌతుందని అప్పారావు సిద్ధాంతం చేసుకొన్నాడు."[3] ఈ సిద్ధాంతానికి అనుగుణంగా 'కన్యాశుల్కం' నాటకాన్ని ఆవిష్కరించినాడు

ఇక్కడ మరొక విషయం గమనించాలి. గురజాడ వ్రాసిన నాటకం కేవలం ఇంట్లో చదువుకొని ఆనందించేందుకే పనికి వచ్చింది. ఇదే విషయాన్ని గురజాడ వారు తన దగ్గరకు వచ్చిన యేట్సుతో ఇలా తెలిపినారు—

> "వాడుక భాషలో ఉన్న జీవద్భాషకున్ను, పుస్తకాలలో ఉన్న కావ్య భాషకున్ను చాలా తారతమ్య మున్నది పండితులున్ను, విద్యాధికారులున్ను వ్యావహారిక భాష బడులలోను, కాలేజీలలోను చదువ రానిదన్న అభిప్రాయము గలవారు. సంఘ సంస్కర్త యైన కందుకూరి వీరేశలింగము పంతులు గారు ఆ మతము గల వారే. కాని వ్యావహారిక భాషలో జీవకళలు, భావ ప్రకటనకు గల సత్తువ ఝటితి స్ఫూర్తి మొదలయిన లక్షణములు గలవని తెలుసు కొని ప్రహసనములు రచించారు నేను 1897 లో కన్యాశుల్క నాటకము జీవద్భాషలో రచించాను. కాని అది ఇంటి వద్దను చదువుకొనుటకే కాని బడులలో చదివించుటకు ఉపయోగపడుట లేదు"4

గురజాడవారు నాటకాన్ని వాడుక భాషలో వ్రాసి కూడా ప్రకటింపలేక పోయారంటే, అప్పటి కింకా ఈ భాష వ్యాప్తిలోకి రాలేదనే విషయం తెలుస్తున్నది. అటు తరువాత యేట్సు గిడుగు వారితోనూ చర్చించిన మీదటనే, గిడుగువారిలో అంతకు పూర్వమే బీజప్రాయంగా ఉన్న ఈ ఆలోచన పెరిగి పెద్దదై, ఆయనకు వ్యావహారిక భాషోద్యమం తీవ్రతరం చేసేందుకు దోహదపడింది. 5 గిడుగువారు వ్యావహారిక భాషోద్యమం గూర్చి తీవ్రంగా ప్రయత్నం చేయటం మొదలుపెట్టి నప్పటి నుండి గురజాడ ఈ భాషావాదానికి ప్రోద్బలకంగా రచనలు చేయటం ప్రారంభించినారు. అలాగే కందుకూరి వారు ప్రహసనాలను వ్రాసినారు. ఇలా వ్రాయబడుతున్న వీరి రచనల వెనుక ప్రధాన ఆంతర్యము వ్యావహారిక భాషా వాదాన్ని సమర్థించటమే. ఇక్కడ వీరి దృష్టి ప్రధానంగా ఉద్యమాన్ని నిలబెట్ట డమే. అందుకే కె.వి. రమణా రెడ్డిగారు—

> "జీవమూ, జవమూ గలిగిన వాడుక భాష ఒక్కటే ఆధునిక-భాషగా యోగ్యత కలిగినట్టిదని నమ్మిన అప్పారావు, తొలి

> కూర్పులో కంటే ఎక్కువ సొగసు గానే గాక, వైవిధ్యం తోట సంపన్నంగా రెండవ కూర్పులో ప్రయత్న పూర్వకంగా వాడుక చేశాడు...తన నాటక పాత్రలన్నింటికీ వ్యావహారికాన్ని పెట్టాడు. ఎవరెవరి సంస్కారాన్ని బట్టి వారి భాషలో మార్పులు అనంత కోటి రూపాలతో కనిపించేలాగున, పాత్రోచిత వ్యావహారిక భాషను ప్రవేశ పెట్టాడు''[6]

అన్నారు. అయితే, కన్యాశుల్కం తర్వాత దాదాపు మూడు దశాబ్దాల వరకు ఈ మధ్య కాలంలో వ్యావహారిక భాషలో సాహిత్యపు విలువలతో ఒక్క రచనకూడా వెలువడినట్లు కనబడదు కేవలం భాషోద్యమం సఫలమయ్యేందుకు ఉద్యమం సాగుతుండగా, దీనికి సమర్థింపుగా గిడుగు వారి సంపాదకత్వమున 'తెలుగు' పత్రిక ఒక సంవత్సర కాలం వెలువడింది. మరొకవేపు 'సాహితి'[7] అనే మరొక పత్రిక, గుంటూరు నుండి 'సంటూరు' పత్రిక, రాజమహేంద్రవరములో భమిడిపాటి సత్యనారాయణగారి సంపాదకత్వాన 'స్వతంత్ర' పత్రికా వ్యావహారిక భాషను ఆదరించాయి."[8] ఇటువంటి పరిస్థితులలో ఉన్నవ మాలపల్లిని వ్యావ హారిక భాషలో వ్రాసేందుకు ఉద్యుక్తుడయినాడు. ఈ సమయంలో సాహితీ పరంగా వ్యావహారిక భాషలో ఆయనకు రచనలేవీ (ఒక్క కన్యాశుల్కం మినహా) కనబడలేదు. అందువల్లనే మాదిరికి తగిన గ్రంథాలు లేవనటం. ఇంతెందుకు ఉన్నవ కూడా తాము పూర్వం 'మాలపల్లి'కి ముందు వ్రాసిన రచనలలోనూ వ్యావహారికాన్ని ఉపయోగించినట్లు కన్పించదు. అందువల్ల 'మాలపల్లి' తోనే వ్యావహారిక భాషలో రచనలు చేయుటం అరంభమైందని చెప్పుకోవచ్చు, అయి నప్పటికీ, డా ఎస్. గంగప్పగారన్నట్లుగా - -

> "వాడుక భాషా బలాన్ని చవిచూపిస్తూ, చక్కటి సామాజిక స్పృహతో అనుభవాన్ని జోడించి చేసిన అత్యద్భుతమైన రచన ఉన్నవ వారి 'మాలపల్లి.'"[9]

గురజాడ వారి కన్యాశుల్కం రచన తర్వాత దాదాపుగా మూడు దశాబ్దాల కాలం వ్యావహారిక భాషలో రచనలు చేయబడక ఒక విధమైన స్తబ్ధత ఏర్పడింది. ఒక నాటకంకాని, ఒక నవల (వచన ప్రబంధం) కాని వ్యావహారి

కంలో రచింపబడలేదు. కాని, వ్యావహారిక భాషోద్యమం చాలా తీవ్రమైన చర్చల తోనూ, వాదోపవాదాలతోనూ దూషణ, సమర్థనలతోనూ నడుస్తున్న కాలంలో ఉన్నవ వ్యావహారిక రచనా విషయంలోని స్తబ్ధతను తొలిగించి, చైతన్యం కలిగించేందుకు, రచనా విషయంలో భాషమీదున్న అపోహలు తొలగింప చేసేందుకు ఆత్మ స్థైర్యంతో ముందుకువచ్చి 'మాలపల్లి' వంటి పెద్ద నవలా[10] నిర్మాణంచేసి, వ్యావహారిక భాషోపయోగానికి మార్గాన్ని సుగమం చేసినాడు 'మాలపల్లి'కి 'కన్యాశుల్కా-నికి' దాదాపుగా రెండున్నర దశబ్దాల అంతరం ఉన్నందుననే మాదిరికి తగిన గ్రంథాలు లేవని అనటం జరిగివుంటుంది. ఇంత వ్యత్యాసం ఉన్నప్పటికీ, ఉన్నవ 'కన్యాశుల్కా'న్ని దృష్టిలో ఉంచుకొని 'మాలపల్లి'లో పాత్రోచితంగా అనువైన వేరువేరు భాషల్ని ఉపయోగించినాడు. ఈ ఉపయోగించటంలో అసహజత్వం లేకుండా జాగ్రత్తపడటం జరిగింది. ఒకవేళ సందర్భానుసారంగా, సన్నివేశానికి అనుకూలంగా అన్యదేశ్యాలను ఉపయోగించాల్సి వచ్చినచోట వానిని తెనిగీకరించి ఉపయోగించటం కన్పిస్తుంది. అంతేకాదు, ఉన్నవ ఉపయోగించిన ఆంగ్లపదాల్లో సామాన్యజనవ్యవహారంలో నిత్యమూ ఉపయోగింపబడేవే కన్పిస్తవి. అంతేకాని, ప్రత్యేకంగా ఆంగ్ల పదాలను ఉపయోగించినట్లు కన్పించదు. ఇలా సందర్భానుగుణంగా ఉపయోగించిన ఆంగ్ల పదాలు కూడా అచ్చంగా ఇంగ్లీషు రూపాలకు బదులుగా తెనిగీకరించినవే కన్పిస్తవి. ఆయాపాత్రలనుబట్టికూడా ఈ ఆంగ్లపదాల ఉపయోగం నవలలో చూడవచ్చు.

మాలపల్లికి పూర్వం వచ్చిన రచనలు కేవలం అనువాదాలూ, అనుకరణలూ, చాలావరకివి గ్రాంథికభాషలోనే రచింపబడినవి మరి తానేమో నూతనంగా వ్యావహారిక భాషలో రచనకు ఉపక్రమిస్తున్నాడు. అలాంటప్పుడు వ్యావహారికంలో రచనలు చేయాలంటే రచయితకు అంతకు పూర్వమున్న "సంస్కృత భాషా పాండిత్యంగాని, తెలుగు ప్రబంధముల పరిచయం గాని వాడుక భాషలో గ్రంథములు వ్రాయడానికి విశేషం తోడ్పడవు."[11] అందువల్ల- "శుద్ధమైన తెలుగు భాష రావడానికి సంస్కృత భాషతో సంబంధంలేని పల్లెటూరి వారితో పరిచయముండాలె" [12] అని చెపుతూనే ఉన్నవ 'మాలపల్లి'ని అచ్చమైన పల్లెటూర్రి భాషలో, ఉత్కృష్టమైన శైలిలో తీర్చిదిద్దినారు.

అంతకు పూర్వం నుంచీ, తన నాటివరకూ రచయితలు తమ రచనల్లో, స్వభాషలో చక్కని అర్థవంతమైన పదాలు ఉన్నప్పటికీ, సంస్కృత పదాలనో, ఆంగ్ల పదాలనో లేదా మరే ఇతర భాషా పదాలనో యథేచ్ఛగా గ్రహించి రచనలు చేయటం, భాషలో సాంకర్యం తేవటం ఉన్నవకు బాధను కలిగించింది. అందుకే,

> "మొదట సంస్కృత పండితులూ, ఇప్పుడాంగ్ల భాషా పండితులూ, తెలుగు భాష యొక్క స్వభావాన్ని మార్చారు. అనేక భావాలను తెలియజేసే అచ్చ తెలుగు మాటలున్నా సంస్కృతము నుంచో, యింగ్లీషు నుంచో మాటలరువు దీసుకోవడం మామూలయింది. అందువల్ల చక్కని తెలుగు మాటలన్నీ మూలబడి భాషలో సాంకర్య మెక్కువయింది." 13

అని అన్నాడు. దీన్ని దృష్టిలో పెట్టుకొన్న ఉన్నవ భాషనుండి దూరం చేయబడి మూలబడ్డ, లుప్తమవుతున్న ఎన్నో చక్కని తెనుగు పదాలను, పలుకుబడులను, 'మాలపల్లి'లో విస్తృతంగా ఉపయోగించి, రచనకొక క్రొత్తదనాన్ని తీసుకొనివచ్చే ప్రయత్నం చేసినాడు. విస్మృతమవుతున్న మాండలికాలను సహితం గ్రహించి అచ్చ తెలుగులో, అందులోనూ వాడుక భాషలో గ్రంథమంతా వ్రాయబడటం వల్ల మనకు కొన్ని చోట్ల ఆగి చదవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. అంతేకాదు, వాడుకలో లేని పదాలు ఉపయోగించడంవల్ల కూడా శైలి కొంత దెబ్బతింటుంది. దాంతో పాఠకుడు తనకు పరిచయం లేని ఆ పదాల వల్ల విషయ గ్రహణంలో చాలా శ్రమపడవలసి వస్తుంది. ఇట్లాంటి పదాలు నవలలో మనం చూడవచ్చు. అందుకే శ్రీనివాస శిరోమణిగారు-

> "గ్రంథము చదువుతూ ఉన్నప్పుడు అతి హాయిగా, అతి ధారాళముగా మెయిలు బండి వేగముతో సాగిపోతూ పోతూ చటుక్కున ఆగిపోవలసి వస్తుంది. కొమ్ములు తిరిగిన విద్వాంసులకున్నూ ఒక పట్టాన మింగుడుపడని సంస్కృత సమాస పద భూయిష్ఠమయిన భాషయున్నూ, శతాబ్దాలనాటి మారుమూల తెనుగు పదాలకు యీనాటి వ్యావహారిక ప్రత్యయాలను తొలగించి

తయారు చేసిన భాషయున్నూ వెక్కిరించినట్టుగా కండ్ల ఎదుట నిలుచుంటుంది. ఆ ఘట్టము దాటేవరకున్నూ అతి వేగముతో పరుగులు తీస్తున్న రైలుబండి కొండ లెక్కుతున్నట్టుగా ఉంటుంది ... ఆ ఘట్టము దాటితే మళ్ళీ మామూలు మాటలతో అతి సొగసుగా, తెలియకుండా, పుస్తకము చదువుతున్నామనే జ్ఞానము లేకుండా గ్రంథము చదువరిని లాక్కొనిపోతుంది."14

అని అనటం జరిగింది ఇక్కడ మనమింకా ఇలా చెప్పుకోవచ్చు. ఉన్నవ వాడుక భాషలోనే నవలంతా వ్రాసినప్పటికీ, సన్నివేశాన్నిబట్టి, సందర్భాన్నిబట్టి వర్ణనలు చేయాల్సినచోట రచనాశైలి, శబ్దాల కూర్పు మారిన విధానం ఒక కారణం. ఇంకా ఉన్నవ ఉపయోగించిన భాషకు పూర్వం ఎవరూ పెట్టిన వరవడి ఎదుటలేకపోవడమే కాక, శబ్దాల కూర్పుకు లోకమే ప్రమాణంగా ఎంచుకొని, తన సందేహ నివృత్తికి ఆత్మ ప్రమాణాన్ని ఆధారం చేసుకొని వాడుక భాషలో వ్రాయటం కూడా ఆగిఆగి చదవాల్సి రావటానికి కారణమైవుంటుంది. ఇంకొక విషయమేమిటంటే, ఉన్నవ రచనావస్తువునుబట్టి భాషను ఎన్నుకోవటం జరిగింది. తన రచనకు వస్తువుగా ఆనాటి ప్రధాన సమస్యలలో ఒకటైన హరిజన సమస్యను తీసుకొన్నారు వీరు గుంటూరుకు చెందినవారు తన రచన సామాన్యుడి వరకు వెళ్ళాలంటే వాడుక భాషే ప్రధాన సాధనం అందులోనూ గుంటూరు భాషలో రచన చేసినట్లయితే తన రచనకొక కొత్తదనము, ఔచిత్యము వస్తుంది. అందువల్ల గుంటూరు మాండలికాలు రచనలో చోటుచేసుకొన్నవి. అంతేకాదు, నవల రచనా కాలం 1921-22 ప్రాంతం. ఆనాటి వ్యావహారికం ఈనాటిది కాదు భాష అనేక మార్పులకు లోనౌతూ వస్తున్నది. ఇట్లాంటి పరిస్థితులలో అప్పటి మాండలికాలు ఈనాడు ఉపయోగంలో కన్పించకపోవడం విడ్డూరమేమీ కాదు. నవల చదువుతూన్న మనకు అప్పటి మాండలికాలతో పరిచయం లేకపోవడంవల్ల కూడా, 'మాలపల్లి' మనకు అర్థం కావడానికి ఆగి ఆగి చదవాల్సిన పరిస్థితి ఏర్పడుతున్నది.

ఈ కారణంగా తన రచనను చదవటానికి జంపుతారేమోనని ముందుగానే ఊహించిన ఉన్నవ హెచ్చరికగా-

"విభక్తులూ, సంధులూ, క్రియా రూపములూ మనం మాట్లాడే భాషలోనూ, వ్రాసే భాషలోనూ ఒకే మోస్తరుగా లేవు ఒక విధంగా మాట్లాడడం మఱివొక విధంగా వ్రాయడం అలవా టయింది కృత్రిమ రూపాలను కల్పించుకొని వ్రాయడం, చదవడం అలవాటు కావడం చేత కృత్రిమ రూపాల కలవాటు పడ్డ నోటితో వాడుకభాష చదువబోతే కొందరి కెబ్బెట్టుగా కనబడడం నేనెరుగుదును. వ్రాత భాషను నోటినొక విధంగా మార్చి చదవడానికలవాటు పడడంచేత మామూలుగా మాట్లాడే వాడుక భాష చదువబోతే కొత్తగా కొందరికి కనబడుతుంది. మాట్లాడే మోస్తరుగానే చదవడం ప్రారంభిస్తే వాడుక భాషలో రుచి కనబడుతుందిగాని లేకపోతే తెలియదు"15

అంటూనే ఈ రచన ఆదరింపబడినట్లైతే ఇంకా కొన్ని గ్రంథాలు వ్రాయాలనే ఆకాంక్షను, ఆశాభావాన్ని అభివ్యక్తీకరించడం వల్ల వ్యావహారిక భాషపై ఉన్నవకు గల అభిరుచి తెలుస్తుంది.

రచనలో తాను ఎదుర్కొన్న కష్టనష్టాలను, ఎదురైన సమస్యలను అవగతం చేసుకొన్న ఉన్నవ "భాషయొక్క ప్రస్తుత స్థితిలో వాడుక భాషలో వ్రాయడం కంటే గ్రాంధిక భాషలోనే వ్రాయడము సులభముగా కనబడ్డది"16 అని అన్నాడు. దీనికి కారణం గ్రాంథిక భాషతో పూర్వపు సన్నిహిత పరిచయమే. అయితే దీనిని మాన్పించి, వ్యావహారిక భాషా రచనకు పూనుకోవాలంటే... "జాతీయ తెలుగు భాషలో పూర్ణమైన పరిచయం"17 కావాలంటూ తన కంటే "పల్లెటూరిలో నివసించడమెక్కువ అలవాటు గలిగి తెలుగు భాషయొక్క నిజస్వభావం బాగా గుర్తెరిగిన తెలుగు భాషా పండితులు వాడుక భాషలో వ్రాయడాని కర్హులు"18 అంటూనే తనకున్న పూర్వానుభవ జ్ఞానంతోనే, ఎంతో చక్కటి తెలుగును ఉపయోగించి, వాడుక భాషా రచనలకు ప్రేరకంగా ఒక దారిని ఏర్పాటు చేసినాడు ఉన్నవ. శ్రీనివాస శిరోమణిగారన్నట్లుగా..."నవల అనేది అంత పెద్ద గ్రంథముగా రావడానికిన్నీ, అందులో గ్రంథమంతా వ్యావ

హారిక భాషలో రావడానికిన్నీ తెలుగులో అదే మొదటి పర్యాయము "[19]
అంతేకాదు-

రామమోహనరాయ్‌గారన్నట్లుగా...

> "బండ తెలుగు గ్రాంథికాన్ని నవనాగరక మొనర్చే భాషా సంస్కరణకూ, సృజనాత్మకమైన కళా సంపదను వెలార్చడానికి గురజాడ తన జీవితాన్ని ఒడ్డితే, ఉన్నవ ఆ భాషకు ఒక చక్కటి నిర్దిష్టమైన రూపాన్నిచ్చి తెలుగు భాషలోని తేట తెలుగు మాటలతో, జాతీయాలతో, నుడికారపు సొంపులతో పల్లీయుల మాటలను సహజంగా రచించటమూ, నిఘంటువులలో సామాన్యంగా కానరానివీ, దేశీయుల సొత్తైనవీ, వ్యవసాయదారుల నోళ్ళలో నిత్యమూ నలిగేవీ వీరి కలంలో జీవం పోసుకొని నవలలో నాట్యం చేశాయి."[20]

ఆంధ్రదేశమందంతటా ఉపయోగింపబడే భాష మౌలికంగా చూస్తే తెలుగే అయినప్పటికీ, ఈ భాషలో ఆయా ప్రాంతాలను బట్టి రకరకాల శైలులూ, రకరకాల మాండలికాలూ అంతర్భాగాలై, కొన్ని ప్రాంతాలలో ఒక అర్థంతో ఉపయోగింపబడుతున్న పదాలు, మరికొన్ని ప్రాంతాలలో మరొక అర్థంలోనూ, అసలే ఉపయోగంలో లేకపోవటమూ కన్పిస్తున్నది. దీనికి కారణము సరిహద్దు ప్రాంతాలలోని ఇతర భాషల ప్రభావమూ కావచ్చు, మరింకేదైనా కావచ్చు. మొత్తం మీద పోరంకి దక్షిణామూర్తి గారు తెలిపినట్లుగా,—

> "ఒకే భాషలో రకరకాల శైలులూ, రకరకాల మాండలికాలూ ఉంటుంటాయి. ఒకే మాండలికంలో అనేక శైలీ భేదాలు కనబడతాయి. అలాగే ప్రతిశైలీ ఏదో ఒక మాండలికాన్ని ఆశ్రయించుకొని వుంటుంది. ప్రతీ భాషలోనూ మాండలికాలు ఉండక తప్పదు మొత్తం మీద విస్తృతమైన భాషా వ్యవస్థలో శైలి, మాండలికత అంతర్భాగాలు."[21]

మాలపల్లికూడా ఉన్నవ చేత గుంటూరు జిల్లా మాండలికంలో[22] వ్రాయబడినప్పటికీ ఇందులో రాయలసీమ మాండలిక పదాలు[23] కూడా ఉండటం గమనించాలి. మొత్తంమీద అక్కిరాజు రమాపతి రావుగారన్నట్లుగా— "భాషా విషయంలో గొప్ప నవ్యతను తెచ్చారు ఉన్నవ. అంతకు పూర్వం పాత్రోచితమంటూనూ, సన్నివేశ చిత్రణ మంటూనూ, పాత్రల సంభాషణలలో స్వభావ సిద్ధమైన నుడికారాన్నే ప్రవేశపెట్టే ప్రయత్నాలు కొన్ని జరిగినా ఆసాంతం నిత్య జీవన వ్యవహారోచితమైన భాషలో నవల రాయడమంటూ జరుగలేదు. ఆ కీర్తి ఉన్నవవారికే దక్కింది."[24] అందుకే కాశీనాథుని వారు "వాడుక భాషయందు నవరస భరితమైన కావ్యమును రచించిన లక్ష్మీనారాయణ గారు ధన్యులు"[25] అనటం జరిగింది.

## శైలి :

'శైలి' అన్న పదాన్ని పలువురు విమర్శకులు ప్రతీ కావ్య విమర్శలోనూ ఉపయోగిస్తున్నప్పటికీ, దీనికి సరియైన నిర్వచనం ఇంతవరకూ ఇవ్వబడలేదు. బహుశా దీనికి కారణము ఆయా రచయితల యొక్క రచనా కౌశలము రచనకు ఆంతరంగిక గుణమై ఒప్పుతూ, ఒకరి రచనతో మరొకరి రచనకు పోలికలు లేకుండా ఉండటం కావచ్చు. దీనివల్ల 'శైలి' ని ఒక ప్రత్యేక నిర్వచనంతో నిర్ధారించడం జరగలేదు. 'శబ్దార్థ చంద్రిక' శైలిని గూర్చి ఇలా తెలుపుతున్నది - "రచనా కౌశలము గల భాషా సౌష్ఠవము, భాషా సరణి, లేఖన పద్ధతి, విధము, ధోరణి."[26] విశ్వనాథ సత్యనారాయణగారు "నేను-నా రచన" అన్న వ్యాసంలో - "శైలి యనగా కవియొక్క జీవ లక్షణము. దాని నెవడును మార్చలేడు. ఆకవియే మార్చుకొనలేడు. అందుకనియే అందరు మహాకవులలోనూ వారి వారి ముద్ర యుండును. ఆ ముద్ర యెట్టిది? కొన్ని పలుకుబడులు, కొన్ని శబ్దములు, ఒక విధమైన రచన"[27] అని తెలిపినారు. సార్వత్రిక విశ్వవిద్యాలయం వారి 'తెలుగు మౌలిక అంశాలు' అన్న గ్రంథంలో—

> "ఒక రచనలో భాషను వాడుకునే శక్తినీ, నేర్పునూ, ప్రత్యేకతనూ శైలి అనవచ్చు. భాషా ప్రయోగ నైపుణ్యం, రచనా విధానం అనే మాటలతో కూడా శైలిని సూచిస్తారు."[28]

అని శైలిని గూర్చి పేర్కొన్నవారు కేతు విశ్వనాధ రెడ్డిగారు.

శైలిని - ముఖ్యంగా వచన శైలిని గుర్తించడానికి భాషా స్వచ్ఛత, శబ్దాల సంయోజనము, వాక్య రచనా విధానము, నుడికారము (జాతీయాలు, సామెతలు మొ॥నవాటి ప్రయోగాలు) అనే నాలుగంశాలు ప్రధానంగా ఉపకరిస్తా యంటున్నారు ముదిగొండ వీరభద్రయ్యగారు.[29]

'మాలపల్లి'లోని శైలిని తెలుసుకొనే ముందు, దానికి 'తొలిపలుకు' వ్రాస్తూ కాశీనాథుని వారు 'మాలపల్లి'లోని శైలిని గూర్చి తెలిపిన వాక్యాలు ఇక్కడ ఎంతైనా ఉపయుక్తములౌతవి.

> "తెనుగు మాటలు, తెనుగు దేశము, తెనుగు సాహిత్యము, తెనుగు హృదయము, తెనుగు సంకల్పము మాలపల్లి కనిర్వచ నీయమైన ప్రతిభను సమకూర్చినవి. ......తెనుగు మాటల యింపు సొంపులు, అందచందములు గ్రంధము నందంతటను గోచరములగుచున్నవి. తెనుగుమాటల సరళప్రవాహ మానంద మును గలుగజేయుచున్నది. గ్రంథము నందుపయోగించిన భాష వాడుక భాషయైనను గ్రాంథిక భాషా సంస్కారమును బడసి నది. విభక్తులు, ప్రత్యయములు, సంధులు, పొందికలు నవీనముగ గనుపడినను సులభముగ బోధ్యమగుచున్నది లక్ష్మీనారాయణ గారుపయోగించిన లోకోక్తులు, జాతీయములు, వర్ణనాది విశేష ములు గ్రంథమునకు వ్యక్తిత్వమును గలుగజేసినవి సంద ర్భానుసారముగా నుదాహృతములైన వాక్యములు గంభీర సరళ మధుర శైలికి నిదర్శనములు."[30]

పైన తెలిపినట్లుగా ఉన్నవ వాడిన భాష గ్రాంథిక భాషా సంస్కారమును పొంది ఉండటమే కాకుండా, గ్రాంథిక వాక్యాలు కూడా మనం నవలలో చూడ గలం. దీనికి కారణం రచయితకు ఆనాటి గ్రాంధిక భాషతోటి పరిచయమెక్కు వగను, వ్యావహారికంతోటి తక్కువగను ఉండటం కారణంగా చెప్పుకోవచ్చు. ఇంకా ఉన్నవ 'మాలపల్లి' రచనకు పూర్వం 'అభ్యాసం' కొరకు కూడా వ్యావ హారికంలో రచనలు చేసినట్లు కనబడదు. ఇందువల్ల కూడా 'మాలపల్లి'లో

అక్కడక్కడా గ్రాంథిక వాక్యాలు, భాషా ప్రభావం అనుకోకుండా వచ్చిపడి ఉంటుంది. అంతేకాదు-"వ్యావహారికం పేరుతో కొన్ని శైలులు గ్రాంథికాత్మతో వుంటాయి. గ్రాంథిక రూపంతో కొన్ని శైలులు వావహారిక భాషాత్మను కల్గి యుంటాయి."[31] ఉన్నవ శైలి మొదటి రీతికి చెందినట్టిది.

ఉన్నవ 'మాలపల్లి'లో ఆయా పాత్రలను దృష్టిలో ఉంచుకొని సంభాషణ లొక్కొక్కచోట ఒక్కొక్క విధంగానూ, వర్ణనల నొక విధంగానూ చేసినారు. ప్రధానంగా వర్ణనల చోట గ్రాంథిక భాషా ప్రభావం స్పష్టంగా కన్పిస్తుంది. ఉదాహరణకు ఒకటి రెండు వాక్యాలు—

"—చూడ్కులు గొడుగు బల్లపై ప్రసరించినవి. తలపై నెమలి పురిం జేవురుకొని కన్దామరలు అరమోడ్పుజెంద, వెడదలై కడుంగడు నిడుదలై లావణ్య ముఖ సరోవరమున తేలియాడ—"

"—కాటుమబ్బుపై హత్తికొను క్రొక్కారు మెరుంగులంబోలు గోపకన్యా సహస్రములతో కేలంగేలు గీలించి—"

ఉన్నవ తన రచనాశైలికి ఒక వైశిష్ట్యాన్ని సంతరింప చేసేందుకు విరివిగా సామెతలు, జాతీయాలను వాడినాడు. సామెతలు, జాతీయాలు కలిపి దాదాపుగా వందకు పైబడి ఉపయోగించినాడు ఉన్నవ వాడిన సామెతల్లో కొన్నింటికి ఈనాడు అర్థం తెలుసుకోవడం కష్టమే. అయితే వీటిని రచనలో ప్రయోగించబడిన సందర్భాన్ని బట్టి గమనింపవచ్చు.

మచ్చుకు కొన్ని—

"కట్టె వంకరలు పోయి తీరుస్తుంది" (మా ప. 44.)
"గరకచేలో గుంటక తోలినట్టు" (మా. ప. 147.)
"జడ్డిగంలోనే మిడత పొడిచింది" (మా. ప. 351 )
"బీద కూటికి దిక్కుదేవుడు" (మా. ప 415.)
"కనకుండా కట్టెకు పత్తిస్తే వినకుండా పీరంగ మెట్టాగని" (మా. ప. 626 )

ఉన్నవ కేవలం తెలుగు సామెతలతో మాత్రమే తృప్తిపొందలేదు. సందర్భానుగుణంగా సంస్కృత 'న్యాయములను కూడా ఉపయోగించినాడు చూడుడు-

"శరీరమాద్యంఖలు ధర్మ సాధనం" (మా. ప 48)

"సర్వేగుణాః కాంచన మాశ్రయంతే" (మా. ప. 129-238-339)

"యత్నే కృతే యదినసిద్ధ్యతి కో౽త్రదోషః" (మా. ప. 243)

కొన్ని చోట్ల వీటిని ఒకటికి రెండుసార్లు ఉపయోగించటం కూడా కన్పిస్తుంది. అలాగే జాతీయాలు ప్రయోగించడంలోనూ ఉన్నవ ఎంతో అభిరుచిని, సమయజ్ఞతను కనబరచినాడు.

ఉదా : "గంపెడు చీకటి నెత్తిన వేసుకొని" (మా. ప. 59)

'కాలికి బలపం కట్టుకొని' (మా. ప. 161)

'కాలుగాలిన పిల్లివలె' (మా. ప. 161 & 233)

'శల్య సారధ్యం' (మా. ప. 244)

ఈ విధంగా ఉన్నవ అడుగడుగునా సామెతలు, న్యాయములు, జాతీయాలను శతాధికంగా ఉపయోగించి, తనదైన ప్రత్యేక శైలిని నిర్మించుకొన్నాడు. (చూ. అనుబంధం - ఒకటి.)

పద ప్రయోగ విషయంలో ఉన్నవ ఒకే విధమైన పదాల్ని ఒకచోట ఒక విధంగానూ, మరొకచోట మరొక విధంగానూ ఉపయోగించటం కన్పిస్తుంది. ఈనాటికీ కొందరు రచయితలు ఇలాంటి ప్రయోగాలు తమ రచనల్లో చేయడం చూడవచ్చు. ఉన్నవ ఇలా చేయడానికి కారణం బహుశా కొత్త పాతల మేళవించి ప్రప్రథమంగా వాడుకభాషలో ఎవరూ చేయని సాహసం చేసి, కొత్త మార్గాన్ని అనుసరించడమో లేక పదాల ఉపయోగంలో ఎటూ తేల్చుకోలేకపోవడమో కారణమై వుంటుంది. ఉదాహరణకు కొన్ని-

1. **కొన్నిచోట్ల 'ళ్ళ' మరికొన్ని చోట్ల 'ండ్ల' ఉపయోగించడం-**

పెండ్లి (మా.ప. 346)/పెళ్ళి (మా.ప 348)/పీండ్లంతా (మా ప. 446)/ పీళ్ళు (మా ప. 604).

2. **పదారంభంలో కొన్నిచోట్ల 'యి' - 'వు'లు మరికొన్ని చోట్ల 'ఇ' - 'ఎ'లు ఉపయోగించడం-**

యెదురుబడి (మా ప. 16)/యెవరికయినా (మా. ప. 35) ఇటదే యిటదే (మా. ప. 21) / ఎప్పుడు (మా. ప. 19)/యెప్పుడు (మా. ప. 30)/ యీదడానికి (మా. ప. 37) / ఈదడానికి (మా. ప. 39)/ఈగలు (మా. ప 609) / యీగలు (మా. ప. 609).

3. **కొన్నిచోట్ల 'వలెను', మరి కొన్నిచోట్ల 'ఆలె' ప్రయోగించడం-**

1. రాళ్ళు దేవుళ్ళు మటుకు కావాలె (మా. ప. 50)
2. రేపు తప్పకుండా రావాలె (మా. ప 56)
3. చేయవలెనని (మా. ప. 447), చేసుకోవలెనని (మా. ప. 459)

ఇక వర్ణనల విషయంలో, ప్రధానంగా ప్రకృతి వర్ణనల విషయంలో దీర్ఘమైన సమాసాలు ఉపయోగించడం కన్పిస్తుంది. ఉదాహరణకు-

"శరత్కాల చంద్రుడు షోడశ కళాపరిపూర్ణుడై నిజకరంబుల రోహిణీ కరంబులం గీలించి" (మా.ప. 387)

మరొకచోట అచ్ఛమైన తెలుగుపదాలతో వర్ణన చేయబడటం కన్పిస్తుంది.

"...రాత్రి పిండారబోసినట్లు వెన్నెల గాసింది. సూదిబోటికి శిఖరమెత్తిన రీతిగా అరుణ కిరణుడు పొడుపు గొండపై నెక్కి ప్రకాశిస్తున్నాడు. వెదులమ్మా, పుట్టలమ్మా రాత్రంతా తమ చెరువులు దురస్తు చేసి తూర్పు తెల్లబారంగనే చాలించి విశ్రమిస్తున్నారు బొల్లుమోరయ్య పులికాపు చేసుకొని చెల్లెలైన కృష్ణవేణిని చూస్తూ కూర్చున్నాడు.'' (మా.ప. 195)

అట్లాగే సునిశితమైన హాస్యంకూడా 'మాలపల్లి'లో మనం దర్శించగలం. రామానాయుడు బెజవాడలో జరుగు పంచముల సభకు హాజరయ్యేందుకు రైల్వే స్టేషనుకు వెళ్ళుతాడు. ఇంతలోకి రైలు వస్తుంది. రైలు ఆగటంతో దిగే ప్రయాణీకులూ, ఎక్కే ప్రయాణీకులూ ఒకరికొకరు ఎదురుపడి త్రోసుకొంటూ చేసే

ఆర్భాటాల్ని, పడే ఇబ్బందుల్ని కండ్లకు కట్టినట్లు చిత్రించటం జరిగింది. ఒకటి, రెండు వాక్యాలు చూసినట్లైతే ఈ విషయం స్పష్టమవుతుంది.

> "లోపలివాండ్లు ఆయుధ ప్రాణులై మోహరించి నిలువబడ్డారు. శకట వ్యూహంలో ప్రతి ద్వారం దగ్గర పోరు ఘోరమైంది. ద్వంద్వ యుద్ధం సాగింది. ట్రంకులకు ట్రంకులు మోటించారు. బాహాబాహి, ముష్టాముష్టి, ట్రంకాట్రంకిగా కొంతవరకు యుద్ధం నడిచి తుముల సంగరంలోకి దిగింది. నలిగిన కాళ్ళూ, విరిగిన వేళ్ళూ, గీసుకున్న గోళ్ళూ, చిరిగిన రుమాళ్ళూ రణరంగమును బీభత్సము గావించినవి..."(మా. ప. 132)

వ్యావహారిక భాషలోనూ ఉన్నవ వారు కాకువును ఎంతో సమర్థంగా ఉపయోగించినారు. ఒకసారి ఒక ముతరాచు ముసలిది తిండిలేక శోషవచ్చి చౌదరయ్య ఇంటి ముందు పడిపోతుంది. అప్పుడు చౌదరయ్య భార్య లక్ష్మమ్మ, కొడుకు రామానాయుడు ఆమెకు సేవ చేస్తూంటారు. ముసలిది స్వస్థ పడినపుడు రామానాయుడు చౌదరయ్యతో "నాయనా! ముసలిది బ్రతికింది" అని అంటే చౌదరయ్య "పోసీ, పుద్ధరించింది, యిక భూములు యేల్తుంది గావాలె" అని, యీ విధంగా వారు చేస్తున్న పనులను వెక్కిరిస్తుంటాడు. (మా. ప. 119-122) వ్యంగ్యాన్ని కూడా మనం అటనట చూడవచ్చు. ఒకచోట ఆంగ్ల విద్యను వెక్కిరిస్తూ "కళాశాల గోపురం ఆంగ్ల విద్యం జదువు బాలుర ఆరోగ్యం వలె పైకి బోయిన కొలదీ సన్నగిల్లుతున్నది" (మా. ప. 133) అనటం గమనించాలి.

'మాలపల్లి'లోని మాండలిక పద ప్రయోగం, రచనాశైలి ఆయా పాత్రల మనోగత భావాలను ప్రస్ఫుటంగా వ్యక్తీకరిస్తూ, పరితల హృదయాల్ని ఆకట్టుకొంటాయి. అందుకే ఉన్నవ ఆధునిక స్పృహతో సజీవమైన వ్యావహారిక భాషకు ప్రాణప్రతిష్ఠ జరిపిన విశిష్ట వ్యక్తిగా విమర్శకులచేత ప్రశంసింపబడినాడు.[32]

ఈ విధంగా ఉన్నవ 'మాలపల్లి' రచన ద్వారా వ్యావహారిక భాషా ప్రయోగంతో సాహిత్యంలో ఒక విశిష్టమైన మార్గానికి ప్రాణ ప్రతిష్ఠ గావించినాడు. ఈ వ్యావహారిక భాషా ప్రయోగం ద్వారా ఉన్నవ మాలపల్లి నవలలోని

ప్రధాన లక్ష్యాన్ని సామాన్య ప్రజలవరకు తీసుకొని వెళ్ళడం జరిగింది అందు వల్ల ఈ నవలలోని వ్యావహారిక భాషా ప్రయోగ నైపుణ్యాన్ని సునిశితంగా పరిశీలించిన వింజమూరి రంగాచార్యులగారి ఈ క్రింది అభిప్రాయాన్ని ప్రామాణికమైందిగా గుర్తించటం సమంజసంగా ఉంటుంది

"నాకు తెలిసినంతవరకూ నాటక రూపమైన 'కన్యాశుల్కం' మినహాయించగా వాఙ్మయంలో శాశ్వతంగా నిలవడానికి ఆశించే గ్రంథం పూర్తిగా వాడుక భాషలో వ్రాయబడడము ఇదే మొదటి పర్యాయం అని తలుస్తాను. ఈ విషయంలో లక్ష్మీనారాయణగారు నిర్భయంగా కొత్త దారి తీశారు."[33]

# కాల్పనికోద్యమ ప్రభావం :

"వివాహం వల్ల సమస్త లాభాలు సాధించవచ్చు ననేది కేవలం అర్థవాదం. ప్రేమ మోక్షసాధనం గనుక మోక్షం సంపాదించిన వానికి అన్నీ ఉన్నట్టే లెక్క. మోక్షసాధనమైన ప్రేమ భార్య మీద తప్పక కుదురుతుందనడానికి సాధ్యంకాదు. ఒక స్త్రీ యందట్టి ప్రేమ కుదిరినా ఆమెతో వివాహం అవసరమని నాకు తోచదు... యీ ప్రేమకు కామోప భోగాదులతో అవసరంలేదు" (మా. ప. 348, 350) అని అంటాడు అప్పాదాసు.

సహజములైన ప్రేమానుబంధాలకు వివాహబంధాలు ప్రతిబంధ కాలుగా దోచినవి" (మా. ప 229) అని అంటుంది కమల.

ఇలా నవలలో వ్యక్తం చేయబడిన పై రెండు ధోరణులు అమలిన స్వేచ్ఛా ప్రణయప్రవృత్తి ప్రధానమైన కాల్పనికోద్యమ లక్షణాల్ని స్ఫురింప చేస్తున్నవి. ఈ నవలలో జోతీ అప్పాదాసులు; కమలామోహనులు అనే రెండు ప్రేమజంటలు రెండు ప్రధానమైన, పరస్పర విరుద్ధమైన ప్రేమధోరణు లకు ప్రతీకలుగా చిత్రీకరించబడ్డాయి అవి 1 అమలిన శృంగారభావన, 2. స్వేచ్ఛాప్రణయం. ఈ రెండు మాలపల్లి రచనాకాలం నాటికి సాహితీ లోకంలో

కాల్పనికోద్యమ లక్షణాలుగా విస్తృతమైన వ్యాప్తిని పొందినవి. ఇట్లాంటి పరిస్థితులలో వెలువడిన మాలపల్లిలో పై రెండు ధోరణులు చోటుచేసుకున్నవి.

ఈ శతాబ్దపు తొలినాళ్ళలో పాశ్చాత్య సాహిత్య ప్రభావంతో తెలుగులో కాల్పనిక కవిత్వం ఆవిర్భవించింది.[34] సమాజంలో వివాహ వ్యవస్థను గూర్చిన ఆలోచనలు ప్రారంభమైనవి. కవులు, రచయితలయినవారు ప్రధానంగా వివాహ వ్యవస్థకు సంబంధించిన ప్రేమ, ప్రణయం మొదలయిన అంశాల్ని పాశ్చాత్య దృక్పథంతో ఆలోచించడం ప్రారంభించినారు. పాశ్చాత్య దేశాల్లోవలె స్త్రీకి స్వేచ్ఛ నివ్వాలనే వర్గం బయలుదేరింది.

డా. అక్కిరాజు రమాపతిరావుగారన్నట్లుగా -

> "పాశ్చాత్య సాహిత్య సంస్కృతుల ప్రభావము భారతీయుల రాజకీయార్థిక నైతిక జీవితములందు గొప్ప మార్పు తెచ్చెను. భారతీయుల వేషభాషలు, విద్యావిధానము, ఆచారవ్యవహారములు, మతము, విశ్వాసములు ఒకటననేల సర్వసంస్కృతియందును గొప్ప విప్లవము సంభవించెను."[35]

యువతీ యువకులకు సమానమైన విద్యావకాశాలు రావడంవల్ల వీరు ఒకరినొకరు దర్శించుకొనేందుకు, పలుకరించుకొనేందుకు, కలిసి తిరిగేందుకు అవకాశం కలిగింది. ఈ పరిచయంలో ఒక విధమైన ఆకర్షణ ఏర్పడింది. ఈ ఆకర్షణను 'ప్రేమ'గా భావించిన యువత సామాజిక జీవితంలోని కట్టుబాట్లను, నియమాలనే సంకెళ్ళని ఛేదించుకొని, స్వేచ్ఛగా జీవించడానికి ఆతురత పడసాగింది. ఈ ప్రయత్నంలో సమాజంలో రెండు విభిన్న ధోరణులు ప్రముఖంగా చోటు చేసుకున్నవి. అవి ఒకటి అమలిన శృంగార భావధోరణి. రెండోది స్వేచ్ఛాప్రణయ ధోరణి మొదటిదానికి ప్రవక్త రాయప్రోలు. కాగా, చలం మొదలైనవారు రెండోదాన్ని అతిగా వ్యాప్తికి తేవడానికి కృషి చేసినారు.

రొమాంటిక్ ఉద్యమ ప్రభావంతో యువతలో ప్రబలిన విచ్చలవిడి తిరుగుళ్ల సమాజంలో దుష్పరిణామానికి దారితీయకముందే అరికట్టవలెననే ఉద్దేశంతో[36] రాయప్రోలు సుబ్బారావుగారు ముందుకు వచ్చినారు. అంతకు పూర్వం జుగుప్సా

కరంగా స్త్రీని వర్ణించిన దక్షిణాంధ్ర సాహిత్యాన్ని నిరసిస్తూ రాయప్రోలు "స్త్రీని భోగ్యవస్తువుగా చేసికొన్న ప్రాచీన వ్యవస్థను, కట్టు త్రెంచుకొనిపోవు యువతీ యువకుల నవీన ప్రేమావస్థను అదుపులో పెట్టుటకు[37] 'మొట్ట మొదటి సారిగా' అమలిన శృంగార[38] మనే కొత్త సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టినారు.[39]

వీరు "సమాజంలో, సమాజాన్ని అనుసరించి సాహిత్యంలోనూ జీవితం అల్లకల్లోలం కావటానికి ప్రేమరాహిత్యమే మౌళిక అంశంగా భావించినారు."[40] ఈ విషయాన్ని రూపనవనీతమ్‌లో ఇలా పేర్కొన్నారు:

> "మానవ గాత్రమునకు మాన్పరాని గాయములు తగిలినవి. చైతన్యమంతా అనిష్ట ముష్టిఘాతాలతో కాయలు కాసినవి. ప్రేమ ప్రవహింపక గడ్డలు కట్టింది. హృదయ హ్రదము ఎండి పగిలి పోతున్నది. స్నేహభావం చేత వాక్కు చిక్కణము కాక తుప్పెక్కుతున్నది...... నైతిక చక్రము సవ్యాప సవ్యములు తెలియకుండా త్రిప్పినందువల్ల ఒడుదుడుకులతో, మిట్టపల్లాలతో కుంటుతుంది. గమ్యం కానరాకుండా చాటయింది."[41]

రాయప్రోలువారు తన సాహిత్యంలో స్త్రీకి ఉన్నత స్థానాన్నిచ్చినారు. తల్లిగా, చెల్లిగా, ప్రేమైకవల్లిగా, సహచరిగా ఆమె యొక్క ఔన్నత్యాన్ని పలు విధాలుగా తన కావ్యాల ద్వారా చాటినారు. ఆరాధ్య దేవతగా ఆమెను స్వీకరించి, వియోగ శృంగారాన్ని మాత్రమే అభిమానించినారు. రాయప్రోలువారి రచనలలో కాయిక స్పర్శమీది దృష్టికంటే స్నేహదృష్టికే అధిక ప్రాధాన్యం కన్పించగా, చలం ఇంతకంటే భిన్నమైన రీతిలో రచనలు చేయనారంభించినాడు.[42] చలం రచనల్లోని ప్రధాన వస్తువును గూర్చి ఆర్. ఎస్. సుదర్శనం గారి మాటల్లో ఇట్లా చెప్పుకోవచ్చు:

> "ఆయన (చలం) దృష్టిలో వ్యక్తి సంకల్పం ముందు సమాజమూ దాని కట్టుబాట్లూ, శక్తియుక్తులూ అన్నీ గడ్డిపోచకింద లెక్కే. ......సెక్స్‌వాంఛ, సెక్స్ పరితృప్తి ప్రధానమైన విలువలు."[43]

ఈ విధంగా సమాజగతమైన కుటుంబ వ్యవస్థలో తీవ్రమైన అలజడిని సృష్టిస్తూ, స్త్రీ తన కిష్టమైన వ్యక్తితో లేచిపోవటాన్ని ప్రోత్సహిస్తూ, సమర్థిస్తూ రచనలు చేస్తుండగా, మరికొందరు ఊహాలోకపు సుందరిని సృష్టించుకొని స్వేచ్ఛా ప్రణయాన్ని[44] గానం చేస్తున్నారు.

ఈ పై రెండు ధోరణులు కూడా సమాజంలోని వివాహ వ్యవస్థకు సంబంధం లేనివి. ఇవి విశేష ప్రచారాన్ని పొందిఉన్న కాలంలోనే ఉన్నవ 'మాలపల్లి' వెలువడింది. అయితే, రాయప్రోలు, చలంలవలే ఉన్నవ ఏదో ఒక భావాన్ని అంటిపెట్టుకొని వాటిని ప్రచారం చేసే ధోరణిలోకి వెళ్ళకుండా వాటి అనుసరణీయంవల్ల సమాజంలో సంభవించే సంక్షుభితను గమనించి ఈ రెండు ధోరణులు సమాజానికి అనుకూలము కానివనే[45] విషయాన్ని జోతీ అప్పా దాసులు; కమలా మోహనులనే రెండు జంటల పాత్రల ద్వారా నిరూపించినాడు. ఈ విషయాలు వరుసగా చర్చింపబడతాయి.

## అమలిన శృంగార భావం - వైఫల్యము :

భారతీయ సమాజ సుస్థిరతకు మూలమైంది కుటుంబ వ్యవస్థ. కుటుంబ వ్యవస్థకు ఆధారం వివాహం. వివాహం దాంపత్యానికి చిహ్నం. దాంపత్యం దంపతీ నిష్ఠమైంది. ఇది ప్రజాతంతువుకు మూలం ఇట్లాంటి దాంపత్యప్రేమకు విముఖులు, భావనామయప్రేమకు సుముఖులు జోతీ అప్పాదాసులు. ఈ ప్రేమ సమాజానికి అరిష్టం కాకపోయినా, అనిష్టమైంది. ఇది సమాజ జీవన విధానాన్ని నిరసించేది. సమాజ ధర్మాన్ని కాదని ఏర్పాటు చేసుకొన్న ఏ భావమూ నిలవదు. ఇది జోతీ అప్పాదాసుల ద్వారా నిరూపించబడింది

చిన్నప్పటి నుండీ ఒకే ఇంట్లో పెరిగిన జోతీ అప్పాదాసుల స్నేహం, దిన దినాభివృద్ధిచెంది ప్రేమగా పరిణతిచెందుతుంది. ఈ ప్రేమ భావనతో వీరు అమలి నానందాన్ని పొందుతుంటారు. పెండ్లి చేసుకోవాలనే ఆతురతకాని, దాంపత్య సుఖం పొందాలనే కోరిక కాని వీరిలో కన్పించదు 'ప్రేమకు పర్యవసానం వీరి దృష్టిలో పెండ్లికాదు. ప్రేమే మోక్షసాధనం. బాహ్య సాఖ్యాలకు చిహ్నమైన వివాహతంతును వీరు తిరస్కరిస్తారు.'[46]

సామాన్య మానవులకు సహితం అందుబాటులో ఉన్న సీతారాముల ఆదర్శదాంపత్యం బదులుగా, రాధాకృష్ణుల అలౌకికానందం జోతీ అప్పాదాసుల నెక్కువగా ఆకర్షిస్తుంది వీరు కోరుకొన్నది కూడా ఇదే.(మా.ప 334 నుండి 389) వీరి దృష్టిలో ముక్తిదాయకమైంది ప్రేమ జోతీ అప్పాదాసుల చర్చద్వారా— "కామానికీ, ప్రేమకూ, భక్తికీ ఈ విధంగా సమన్వయాన్ని శ్రీ ఉన్నవ వారు జోతీ అప్పాదాసుల మాటల్లో ప్రదర్శించినారు."47

భావనామయ ప్రేమకు సాన్నిహిత్యం అవసరం లేదు. కాని జోతి తల్లి దండ్రులతో సెటిల్‌మెంటుకు వెళ్ళుతున్నప్పుడు అప్పాదాసు ఆమె దూరమవటం భరించలేకపోతాడు ఒక దశలో ప్రేమాతిరేకత చేత మనస్సు చలించి మాట్లాడుతుంటాడు

భావనాత్మక ప్రేమలో మనశ్చాంచల్యం ఏర్పడే అవకాశం కూడా లేదు. ఇది కేవలం మనిషిలో శారీరక సౌఖ్యాన్ని పొందాలనే భావన అంతర్గతంగా ఉన్నప్పుడే సంభవిస్తుంది ఈ కోరిక కేవలం అప్పాదాసులోనే మనకు ఒకటి రెండు చోట్ల కన్పిస్తుంది.

ఒకసారి జోతి అప్పాదాసుతో పాఠం ఒప్ప చెప్పేందుకు ఊరగొండ మీదికి వెళుతుంది. అప్పాదాసు గురుదక్షిణ అడుగుతాడు. జోతి కోరింది ఇస్తా నంటుంది. అప్పాదాసు 'నీ హృదయం' అని మెల్లగా జారవిడిచి తలవంచు కొంటాడు. జోతి 'ప్రకంపితురాలై - అంతకంటె యెక్కువ అడుగవు గదా?' అని అప్పాదాసు కోరికకు హద్దు పెడుతుంది. అప్పాదాసు 'నీ హృదయం' అని తలవంచుకోవటంలో ఆంతర్యం, ఆమెను శారీరకంగా కూడా తనదాన్ని చేసుకో వాలనే భావం అంతర్గతంగా ఉండడం. అప్పాదాసులోని భావాన్ని పసిగట్టినందు వల్లనే 'అంతకంటే యెక్కువ అడుగవు గదా' అని ప్రకంపితురాలౌతుంది. జోతి మనస్సును గ్రహించి అప్పాదాసు అంతటితో తృప్తిపడుతాడు.

మరొకసారి 'భారత భాగవత' కృష్ణుల గూర్చి చర్చ చేస్తున్న సందర్భంలో 'అప్పాదాసు హస్తం ప్రకంపించి జోతి హస్తమును గ్రహించ బోతుంది. 'అతని పెదవులు సంచలిస్తవి'. కాని జోతి తనదైన భావనా

ప్రపంచంలోవున్న కారణంగా అప్పాదాసులోని మార్పులు గమనించలేకపోతుంది. జోతి పరిస్థితి తనకంటే భిన్నంగా ఉండటంతో మానసికంగా అంతా అనుభవించిన అనుభూతిని పొంది తృప్తిచెందుతాడు.

తాను అతిగా ప్రేమిస్తున్న జోతి తననుండి దూరమైతే భరించలేని అప్పాదాసు పిచ్చివాడవుతాడు. ఈ సంఘటననుబట్టి కూడా అప్పాదాసుకు జోతి యొక్క సాంగత్యం మీద అభిలాష ఉన్నట్లు తెలుస్తున్నది. జోతికి మాత్రం ఈ పరిస్థితి ఎదురవదు. అప్పాదాసు రూపాన్ని మనస్సులో నిలుపుకొంటుంది. అందుకే రచయిత—

'అప్పాదాసు ఆకారమంతా తన మనో ఫలకంమీదికి రూపెత్తింది. పదిలంగా దాచిపెట్టుకున్నది. రూపురేఖలన్నీ ఆమె మనస్సుకు అంటుకొనిపోయినవి. ... సుందర విగ్రహమేర్పడి హృదయ రంగాన్ని ఆక్రమించుకొన్నది ... బ్రహ్మాండ మంతటా అంతర్యామియై ప్రవహించే ప్రేమ ప్రవాహం యొక్క కెరటాలు ఆమె హృదయానికి విసిరికొడుతున్నవి! ఆ తరంగాల మీద కలహంసవలె ఆనందంగా ఆమె హృదయ కమలం ఉయ్యాల లూగుతున్నది. ఆ కమలం మీద నిశ్చంచలమైన ఒక భావనా రూపం చిరునవ్వుతో కూర్చున్నది' (మా. ప. 396).

అని తెలిపినాడు. జోతి దూరమవుతున్నందుకు అప్పాదాసు బాధపడితే, జోతి మాత్రం - 'నిన్ను వదలి పోతానా? మనమిద్దరం కలిసే పోతున్నాం' అని మనసులో అనుకొంటుంది

సెటిల్‌మెంటులో జోతి అందం చేత ఆకర్షింపబడిన పౌలు వివాహానికి యత్నించి విఫలుడౌతాడు. చివరికి బలాత్కారమే మార్గంగా ఎన్నుకొంటాడు. శీల రక్షణలో జోతి కృష్ణానదిలోకి వెళ్ళి ప్రాణాలు కోల్పోతుంది. అదివరకే పిచ్చివాడయిన అప్పాదాసు జోతి మరణం భరించలేక ఆమెతో సహగమనం చేస్తాడు.

ఇక్కడ జోతీ అప్పాదాసుల మరణం సమర్థనీయమే. ఎక్కడ నాయికా నాయక భావన ఉంటుందో అక్కడ శారీరక సంబంధం వాంఛనీయము జోతీ అప్పాదాసులు మొదటినుండి బావా మరదల్లుగా ప్రవర్తిస్తారు తప్ప, ఒకే చోట పెరిగినందువల్ల వారిలో సోదరీ సోదర భావం కనిపించదు. ఒకవేళ వీరిలో ఈ భావం ఉండి ఉంటే వీరి మరణం జరిగి ఉండక పోయేది. ఇక వీరి సంబంధాన్ని గోపికా సంబంధంతోనూ పోల్చలేము. గోపికల ప్రేమ కేవలం మానసికమైంది తప్ప కామపరమైంది కాదు. వారిది భావనాత్మకమైన ప్రేమ. అది మానవాతీతమైంది. మానవులకు ఆ ప్రేమ అందుబాటులో లేనిది. కాని జోతీ అప్పాదాసులు ఆ సంబంధాన్నే కోరుతారు. సమాజానికి ఆ సంబంధం అంగీకారం కానిది. అందువల్ల వీరికి మరణం తప్పలేదు.

మానవులు ప్రకృతిగత జీవులు. ప్రాకృతికమైన మార్పులు పొందక తప్పదు. వయసుతో పాటు కోరికలు కలగడం సహజం. ఇది ప్రకృతి ధర్మం. యౌవనంలోకి అడుగుపెట్టిన స్త్రీ పురుషులిరువురూ సంగమించా లనుకోవడం సహజం. జోతీ అప్పాదాసులు ఈ ప్రకృతి ధర్మాన్ని కాదని, కోరికలను అణచుకొంటూ, భావనాత్మకంగా ప్రేమించుకొంటున్నారు ప్రకృతి విరుద్ధమైన ఈ విధానం వల్ల ప్రకృతికి. వ్యక్తి స్వేచ్ఛకూ సంఘర్షణ ప్రారంభమైంది. ఈ సంఘర్షణలో ప్రకృతిదే పై చేయి అయింది అంటే వీరి మరణం ఒక విధంగా నిశ్చయమైనట్లే దీనికొక కారణం చూపాలి కాబట్టి రచయిత పోలును ప్రవేశపెట్టి, అతడు బలవంతం చేయబోగా ఆమె మరణించినట్లు చూపినాడు. ఇక అప్పాదాసు జోతి మరణంతో మరింత షాక్ తింటాడు ఆమె శవాన్ని బుజంమీద వేసుకొని, సహగమనం చేస్తాడు.

విగత జీవులైన జోతీ అప్పాదాసుల శవాలు ఆలింగనంతో కొట్టుకొని పోతుంటాయి. అప్పాదాసులో జోతిపై ఉన్న కాంక్ష మరణానంతరం తీరుతుంది. అందుకే రచయిత వారి 'కౌగిలి'ని చెప్పినాడు.

ఇక్కడ జోతీ అప్పాదాసులు ఏర్పరచుకొన్న ప్రేమ ప్రకృతి ధర్మాన్ని కాదన్నది. సంఘంచేత ఆమోదింపబడనిది. అనుసరించుటకు కూడా వీలు లేనిది. ఒక విధంగా చెప్పాలంటే- "జోతి అప్పాదాసుల ప్రణయం భూమి నంటిపెట్టుకున్నది కాదు గాలిలో కట్టిన మేడ."[16]

సమాజాన్ని ఎదిరించి, సంఘ ధర్మాన్ని కాదని, వ్యక్తి ధర్మానికి పట్టం కట్టబోతే అది నిష్ఫలమవుతుంది. ఇందు కుదాహరణ జోతీ అప్పాదాసులు.

## స్వేచ్ఛా కామప్రవృత్తి - వైఫల్యము :

కమల రామానాయుడి భార్య. అటు తల్లిగారూ, యిటు అత్తగారూ బాగా ఉన్నవారు కూతురని తల్లిగారింట్లో పని చేయనీయరు. ఇటు అత్తగారింట్లోనూ ఏ పనీ చెప్పరు. 'అటూ ఇటూ లక్షాధికార్లయితే నే చాకిరెందుకు చెయ్యాలె' (మా. ప. 180) అనే ధనస్వామ్య వ్యవస్థ తాలూకు స్వభావం కలది కమల తల్లిగా బాధ్యతను మీద వేసుకొని కొడుకు పరిస్థితి పట్టించుకోదు (మా ప. 222), గృహిణిగా భర్తకు ఏ సేవలూ చేయదు (మా. ప. 178-179). భర్తతో వేరు సంసారం పెట్టించి, పట్టణ జీవితం గడుపుదామనుకొన్న ఆమె ఆశ నిరాశ అవుతుంది. రామానాయుడు లోకసేవతో కాలం గడుపుతుంటాడు. భర్త సామీప్యం లభించని కమల ఒంటరిగా కాలం గడుపుతుంటుంది.

ఇలాంటి పరిస్థితులలో మోహనరావు ఆ ఇంటికి బంధుమార్గంగా వస్తాడు. మోహనరావు ఆంగ్ల విద్యాభ్యాసం చేస్తున్నవాడు. దీనికితోడు విచ్చలవిడిగా విహరించే స్నేహితుల సహవాసమూ, కామ ప్రేరకమైన పుస్తక పఠనమూ తోడై, ఏదో సుఖం పొందాలనే భావన అతనిలో నివురు గప్పిన నిప్పులాగా వుంటుంది.

వరుసకు వదినయైన కమలలో మోహనరావుకు సౌందర్యం కన్పిస్తుంది. మోహనరావు మోహన వేషమూ కమల నాకర్షిస్తుంది. ఇరువురిలోనూ మాటలు కలిసిన వెనువెంటనే ఒక వ్యామోహం జనిస్తుంది దాన్ని 'ప్రేమ'గా భావించుకొని, సాన్నిహిత్యానికై ఆతురతపడుతుంటారు.

మోహనరావును చూడకముందు కమలలో ఎలాంటి కల్మషమూ కనిపించనప్పటికీ, రచయిత చూచాయగా ఆమె భవిష్యత్తును సూచించటం గమనించాలి - "కనుబొమ్మలు వొంపులై వాలి వొండొంటిం బెరసి గిరిదిరిగి సాముద్రికులకు కొంచెమనుమానమూ, రసికుల కానందమూ కలిగిస్తున్నవి." (మా.ప. 178).

'రసికుడై'న మోహనరావులోని సౌందర్యం పమం నాకర్షిస్తుంది.

> "స్నానం చేస్తూ చేయిపైకెత్తినపుడల్లా ప్రక్కటెముకల మీ మాంస కండరములు ఇసుకతరంగములవలె హృదయంగమముగా కనబడుతున్నవి. బంగారు ఛాయగల విశాల వక్షస్థలం మీద కొదమ తుమ్మెద రెక్కలవలె రోమాంచం చెలువారుతున్నది. నీళ్లతోడేటప్పుడు కండెలుగట్టిన పిక్కలూ, పెడదిరిగిన రెక్కలూ, దుక్కలవలెనున్న తొడలూ, పొక్కియున్న పొక్కిలి, అక్కళించిన నాభి, విల్లుంధిక్కరించు పక్కలూ, చక్కదనాల దిక్కులై కెంపెక్కి యున్నవి' (మా ప. 212)

ఈ విధంగా కమలకు మోహనరావులో అణువణువూ సౌందర్య పూరితంగా గోచరిస్తుంది. రచయిత నవలలో తెలిపినట్లుగా 'భావ ప్రపంచంలో నుంచి భౌతిక ప్రపంచంలోకి మారేటప్పటి సంధికాలమే మనుష్య జీవితంలో మిక్కిలి రసవత్తరమైన భాగం. సర్వజంతు సామాన్యమైన యీ మార్పు మానవుని తన మానవత్వం నుండి దేవత్వం వంక ఒక మెట్టెక్కిస్తుంది'. (మా.ప. 218) కాని, ఆంగ్ల విద్యాభ్యాసం చేస్తూ, పాశ్చాత్యపు పోకడలను జీర్ణించుకొన్న మోహనరావును వివాహితయైన కమలపై ఏర్పరుచుకొన్న వ్యామోహం మానవత్వంనుండి పశుత్వం వేపుగా ఒక మెట్టు క్రిందికి తోసివేస్తుంది. ఎటువంటి బలమైన కారణం లేకుండానే, కేవల పరస్పర శారీరక అందంచేత ఆకర్షితులైన కమలా మోహనులది ప్రేమకాదు, వ్యామోహం. ఈ వ్యామోహమే వీరిని లేచిపోయేట్టు చేస్తుంది. ఈ వ్యామోహం వల్లనే కమల 'అమ్మ'గా పొందిన వేదనను కూడా విస్మరించి, మోహనరావు రూపాన్ని మనస్సులో భావించుకొని పరవశత్వాన్ని పొందుతుంటుంది. 'సహజ రస విహీనములైన దృశ్యాలు కనిపించి 'అసహ్యం'గా తోస్తవి. ప్రాణనాధుని సామీప్యం లభించనందుకు బాధపడుతుంది.

ఇక్కడ కమలకు 'ప్రాణనాధుడు' మోహనరావే. తాను పరకీయ కాబట్టి సమాజపు కట్టుబాట్లు తనను 'పారతంత్ర్య జీవనా'నికి కట్టివేసి, ప్రియుడైన మోహనరావు కౌగిలిలోకి వెళ్ళకుండా చేసినవని ఆమె బాధ. ఈ బాధపడ్డనె

మోహనరావు వెళుతుంటే, క్షణ కాలం కూడా వదలటం ఇష్టంలేని కమల 'వెక్కి వెక్కి ఏడుస్తుంది' (మా. ప 220).

మోహనరావు మీది కోరికముందు భర్తకు వచ్చే అపఖ్యాతి, బిడ్డకు వచ్చే అపకీర్తి ఇవేవీ స్మరణకు రావు. తను కోరిన సుఖాన్ని పొందిన తర్వాత కమలకు ఇవన్నీ ఒక్కొక్కటిగా స్ఫురిస్తుంటవి. సమాజంలో ఆమె స్థానం తెలిసి వస్తుంది. మానసిక సంఘర్షణ ననుభవిస్తుంటుంది.

'కనువేమరుచేత శలభాలవలె ఉభయులూ దూకారు. మాడి నశించడమా? బైటపడడమా?' (మా.ప. 261). ఇక్కడ కమలకు బైటపడడం సాధ్యమయ్యే పనేనా? కాదు. అయితే ఆమెకు ఒక్కటే మార్గమున్నది. మోహనరావు లాంటి వాళ్ళ[49] దయ ఉన్నంతకాలం లోకానికి తెలియకుండా, రహస్యంగా, జీవచ్ఛవం లాగా ముద్దూ ముచ్చటలకు దూరమై బందీ జీవితాన్ని గడిపి, చివరికి మాడి నశించడమే. ఇక్కడ బైటపడే అవకాశం మగవాడైన ఒక్క మోహనరావుకే ఉన్నది.

సమాజ ధర్మమైన వివాహ వ్యవస్థను కాలదన్ని, స్వేచ్ఛా విహంగం లాగా విహరించి వద్దామంటే పురుషుడికి ఉన్న అవకాశం స్త్రీకి లేదనే చెప్పాలి. అందుకే రచయిత 'కమలమ్మకు నేల కాలికి తగలడం లేదు. మోహనరావుకు మాత్రం గట్టు అందికలోనే వున్నది' (మా. ప 261.) అని చెప్పడం. రచయిత కమలతో అనిపించినట్లుగా— 'యిది సంఘం యొక్క దురంతం. అవివేకుల దుర్నీతి. మగవాండ్లకొక ధర్మం. ఆడవాండ్లకొక ధర్మం. సంఘం యొక్క యీ క్రూర ధర్మానికి' కమల బలిఅవుతుంది. ఇక్కడొక విషయం చెప్పుకోవాలి. వివాహం స్త్రీ పురుషు లిరువురికి సంబంధించింది. మాతృత్వం పొందటమనేది స్త్రీకి భగవంతుడిచ్చిన గొప్పవరం స్త్రీ తన భర్తతో కాపురం చేయడం వల్ల గర్భం ధరించాల్సి వస్తున్నది. పురుషుడి విషయంలో ఇట్లాకాదు. అతడు తన కాముకతను తీర్చుకొనేందుకు ఎన్ని తిరుగుళ్ళు తిరిగినా అతనిలో శారీరకంగా ఎలాంటి మార్పు కన్పించదు. స్త్రీకి సమాజంలో రక్షణ కల్పించేందుకు పూర్వులు వివాహ వ్యవస్థను ఏర్పాటు చేసి, భర్త, కుటుంబము అనే పరిధికి లోబడి ఆమె ఉండేటట్లుగా కొన్ని కట్టుదిట్టాలు చేసినారు. ఇదిలా ఉండగా,

పాశ్చాత్య దేశాల్లోని 'ఫ్రీలౌ' అనే భావన మన దేశంలోకి వ్యాపించి, దీని ప్రభావం చేత ప్రేరితులైన స్త్రీ పురుషు లిరువురూ దీన్ని అనుసరించబోయి విఫలమవు తున్నారు. మరొకవైపు 'స్వాతంత్ర్యం, సమభావం, సౌభ్రాత్రం' అనే భావాల చేత విద్యావంతులైన యువతీయువకులు పరస్పరం ఆకర్షితులౌతున్నారు. సంఘ కట్టుబాట్లకులోనైన కుటుంబ సంప్రదాయానికీ, వ్యక్తికీ మధ్య సంఘర్షణ మొదలైంది ఈ సంఘర్షణ వివాహ విషయంలో ప్రాధాన్యాన్ని పొందింది. పరస్పరం యువతీయువకులు, అందం చేత ఆకర్షింపబడి, దానినే స్వచ్ఛంద ప్రేమగా భావించి సంప్రదాయాల్ని త్రోసి ప్రవర్తిస్తున్నారు. ఇట్లా ప్రవర్తించిన వారు కమలా మోహనులు.

ఒకరోజు మోహనరావు కమలను వదలి అన్నతో వెళ్ళిపోతాడు. కమల ఒంటరి దవుతుంది. సమాజంలో ఒంటరిగా స్త్రీ జీవించడం కష్టం. అందులోనూ కమలకు 'ఉన్న బంధం చాలక కొత్త బంధం కూడా తయారవుతున్నది' (మా. ప. 262). ఇట్లాంటి పరిస్థితులలో సంతానం పొందిన స్త్రీ సమాజంలో ఎన్నో ఆటుపోట్లకు గురికావలసి వస్తున్నది. అందుకే రచయిత కమలకు పిల్లవాడు పుట్టిన వెంటనే, పోటకం వ్యాపించి, మరణించినట్లు చూపినాడు. కమల ఎవరూ గుర్తు పట్టనంతగా మారిపోతుంది. కమలకు అందం చెడడం రచయిత ప్రసా దించిన అమూల్య వరం. తన అత్తగారింట్లోనే పనిమనిషిగా కుదురుకొన్నా ఆమెనెవ్వరూ గుర్తు పట్టరు. కమల సాహుకు సేవ చేస్తూ, తను పోగొట్టుకున్న మాతృత్వాన్ని తిరిగి పొంది 'తల్లి'గా సాహుకు సపర్యలు చేస్తుంది సాహు మరణంతో కమల తనకు కూడా మరణ మాసన్నమయిందని తెలుసుకొని, భర్తను క్షమాభిక్ష వేడుకొని జీవితం చాలిస్తుంది.

రామానాయుడు కమలకు యధావిధిగా కర్మలు జరిపిస్తాడు. కమల మీది ప్రేమే రామానాయుడి చేత ఇట్లా చేయిస్తుంది. ఒక ఉద్వేగంలో కమల మోహనరావుతో లేచిపోయినప్పటికీ, ఆమె వల్ల పూర్వం తను పొందిన ప్రేమను మరచిపోలేకపోతాడు. ఇది సాధ్యమేనని రచయిత భావన. ఈ భావన ఒకసారి రామానాయుడు, నారాయణరావుల చర్చల్లో స్పష్టం చేయబడింది.

రా. నా. : భార్యాభర్తలన్యోన్యం ప్రేమించారు. కొన్ని కారణాలచేత భార్య ప్రేమ సంచలిస్తుంది. కాని అత్యంతంగా పశ్చాత్తప్తురాలవుతుంది. వారిద్దరికీ భావనా రూపకంగా ప్రేమ సాధ్యమవుతుందా?

నారా : అసాధ్యమేమీ లేదు. (మా ప. 481)

'కమల యొక్క ఆర్తనాదం ప్రబోధం కలిగించ'గా మోహనరావు మామూలు పురుషుడిలాగా తనదారి తను చూసుకోలేకపోతాడు. తన భావిస్థితిని గూర్చి ఆలోచిస్తూన్న మోహనరావు కమలను విడిచిపెట్టడమా? లేక శాశ్వతంగా ఆమెను అంటిపెట్టుకొని ఉండడమా? తేల్చుకోలేకపోతాడు

ఈ మానసిక సంవేదనలో అమ్మా, అన్నల బలవంతంమీద వివాహం చేసుకొన్నా తన దుర్మార్గం పట్టి పీడిస్తుంది. ఫలితంగా కొద్ది రోజులకే కాపురానికి రాని భార్యా, తల్లి మరణిస్తారు (మా ప. 660). మనస్సు స్థిమితాన్ని కోల్పోయి, అశాంతితో ఆవేదనకు గురియౌతాడు దేశ సంచారం చేసి, మహాత్ముల సాంగత్యాన్ని పొంది చివరికి 'క్షయ'తో మరణిస్తాడు

పురుషుడు తన కిష్టమైన స్త్రీని కామిస్తూ వెళ్ళినట్లైతే, సమాజం సంఘర్షణకు లోనౌతుంది. సంఘం సంఘర్షణలో పడకుండా ఉండేందుకే స్త్రీ పురుషులకు వివాహ వ్యవస్థ ఏర్పాటు చేయబడ్డది వీరుభయులూ సమాజ ధర్మానికి లోబడి ధర్మబద్ధమైన[50] దాంపత్య జీవితంలో తమ కోర్కెలను తీర్చుకోవాలి. ఇది సంఘ ధర్మం. పురుషుడు దీన్ని కావని సంఘం గీచిన గీటు దాటడంతో స్త్రీల పరిస్థితి తారుమారైంది. పాశ్చాత్యపు భావాలచే ఆకర్షితురాలైన స్త్రీ కూడ పురుషుడి వలె స్వేచ్ఛా జీవితాన్ని కోరడం ప్రారంభించింది. ఇట్లా స్త్రీ పురుషులు ఇరువురూ సమాజ ధర్మాన్ని కాదన్నందుకు రచయిత వీరిద్దరినీ శిక్షార్హులుగానే భావించినాడు. అందుకే తాత్కాలిక ఆనందంతోపాటు, తర్వాతి దుష్ఫలితాన్ని అనుభవించడం లోనూ ఇద్దరినీ భాగ స్వాములను చేసినాడు.

ధర్మ విహీనమైన[51] పైశాచిక వ్యామోహానికి లోనై అదే ప్రేమగా భావించి, సంఘ వినాశనానికి కారణభూతమైన కమలా మోహనరావుల జీవితాలు విచిత్ర

మరణానికి దారి తీసినాయి. విశృంఖల స్వేచ్ఛా ప్రణయం సమాజానికి అరిష్ట దాయకమని రచయిత భావన.

ఈ విధంగా ఉన్నవ సమాజంలో వ్యాపించి ఉన్న అమలిన /స్వేచ్ఛా ప్రణయం యొక్క వైఫల్యాన్ని, వాటిని అనుసరిస్తే కలిగే దుష్ఫలితాన్ని పై జంట పాత్రల ద్వారా నిరూపించినాడు.

## సూచికలు :

1. ఉన్నవ లక్ష్మీనారాయణ-మాలపల్లి-'పరిచయం.'
2. శ్రీనివాస శిరోమణి-"అగ్రగణ్యులు అంటే పంతులుగారే మొట్టమొదటి రచయిత అని అనడానికి వీలులేదు. వారికన్నా ముందుగా వ్యావహారికాంధ్రములో గ్రంథము చేసినవారు ఉన్నారు. నన్నయభట్టు ఆదికవి అన్నప్పుడు పద్యకవిత్వము నన్నయకు పూర్వము లేదని అనడానికి వీలులేదు. ఇంగ్లీషు భాషలో చాసరుకు పూర్వము గ్రంథ రచన చేసిన వారు లేరని అనడానికి వీలులేదు అయితే ఆయా రచయితలు తరతరాల వారికిన్నీ మార్గదర్శకులయినారు. అదేవిధముగా ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు వ్యావహారికాంధ్ర వచన రచనకు యుగపురుషులు." 'మాలపల్లి నిర్మాత ఉన్నవ లక్ష్మీనారాయణగారు' పు. 397.
3. కె. వి. రమణారెడ్డి-"మహోదయం" పు. 897.
4. డా. గిడుగు సీతాపతి-"కళాప్రపూర్ణ గిడుగు వెంకటరామమూర్తి పంతులు (జీవిత చరిత్ర-వారు రచించిన గ్రంధములు) సాహిత్య ఉపన్యాసములు-4. పు. 15
5. డా॥ బూదరాజు రాధాకృష్ణ-"గిడుగు వెంకటరామమూర్తి గారి ప్రవేశంతోనే వ్యావహారిక భాషావాదం ఉద్యమరూపం ధరించింది ఇది 1910లో ఆరంభమయింది. ఆయేడే గురజాడ అప్పారావుగారి 'ముత్యాల సరాలు' 'నీలగిరి పాటలు' వ్యావహారికంలో ప్రకటితమైనాయి అటూ యేస్పర్సన్ (otto jes person) అనే భాషా శాస్త్రజ్ఞుడు ఇంగ్లీషులో రాసిన Ashorter English Grammer ను గిడుగువారు వ్యావహారికంలోకి అనువదించినారు" 'వ్యావహారికభాషా వికాసం' పు. 86.

6. మహోదయం. పు. 400.
7. తెలికిచెర్ల వెంకటరత్నం - "శ్రీ శివశంకరశాస్త్రి, శ్రీ నోరి నరసింహ శాస్త్రి మున్నగువారు రామమూర్తి పంతులుగారితో పరిచయముండి వారి భాషావాదములో సానుభూతి కలిగినవారే. సమితి ప్రకటించే "సాహితి" అనే పత్రికలో కథలు వ్యాసాలు వ్యావహారిక రచనలు పలుభంగులవి చక్కని వాడుక భాషలో వెలువడినవి." "అధునికాంధ్ర సాహిత్యముపై గిడుగు రామమూర్తి పంతులుగారి ప్రభావము" పు. 51.
8. పైదే.పు. 51, 52.
9. డా. ఎన్. గంగప్ప- "ఉన్నవవారి సాహిత్య జీవిత విశేషాలు" (వ్యా) 'సాహిత్యోపన్యాసములు - 17.' పుట. 26.
10. వింజమూరి రంగాచార్యులు "మొత్తము మీద నవల అని పెద్ద అక్షరములతో వ్రాయదగిన గొప్పగ్రంథం తెలుగులో బయలుదేరినందుకు ఆంధ్రులు గర్వించవలసి వున్నది." మా.న.ప్ర.ని.పు. 5.
11. మాలపల్లి - పరిచయం.
12. పైదే.
13. పైదే.
14. "మాలపల్లి నిర్మాత : ఉన్నవలక్ష్మీనారాయణగారు" -పు. 401.
15. పరిచయం.
16. "మాలపల్లి నిర్మాత : ఉన్నవ లక్ష్మీనారాయణగారు" -పు. 401.
17. పరిచయం.
18. పైదే.
19. పైదే.
20. రామమోహనరాయ్ - "మారుతున్న కాలం - మాలపల్లి" (వ్యా) భారతి, నవంబర్, 1972.
21. "భాష, శైలి-మాండలికత" (వ్యా). "తెలుగు నవల - నూరు సంవత్సరాలు" -పు. 89.
22. శ్రీనివాస శిరోమణి - "గుంటూరు జిల్లా మెట్ట తాలూకా గ్రామాలవారు నిత్యజీవనములో వ్యవహరిస్తూ ఉన్న భాషలోనే పంతులుగారు గ్రంథమంతా వ్రాసినారు. ఒక విధముగా మాలపల్లి భాష మాండలికము అన

వచ్చును. మాండలీకశబ్దాలు అపారముగానే ఉన్నవి. అయితే వాక్యాలు సజీవములూ, సజాతీయములూ అయినందువల్ల ఈ శబ్దానికి అర్థము ఏమిటి అనే చిక్కురాదు. పంక్తిని బట్టిగానీ, ఘట్టాన్ని బట్టిగానీ ప్రతి శబ్దమూ యిట్టే బోధ పడుతుంది తెలుగు అక్షరాలు వచ్చిన ఏ తెలుగు ప్రాంతీయుడయినా చదివి విషయము యిట్టే తెలుసుకోగలిగిన భాషలో ఆ గ్రంథము తయారయింది."

'మాలపల్లి నిర్మాత : ఉన్నవ లక్ష్మీనారాయణగారు' - పు. 401

23. డా॥ ఎన్. గంగప్ప - "ఆనాటి ప్రయోగాలలో రాయలసీమ మాండలికాలు కన్పించడం విశేషం. అవి ఈనాడూ రాయలసీమలో వాడుకలో ఉండడం గమనించగలం." - 'భాషావ్యాసాలు' (వ్యా. సం ) పు. 109.

24. 'శైలి - కథాసంవిధానం' - 'మన నవల - పరిశీలన' (వ్యా. సం.) పు. 106.

25. తొలిపలుకు.

26. ముదిగొండ వీరభద్రయ్యగారి 'వేయి పడగలు - ఒక పరిశీలన' అన్న గ్రంథం నుండి ఎత్తి వ్రాయబడినది. పు. 25.

27. విమర్శిని - 'విశ్వనాథ వాఙ్మయ జీవిత విశేష సంచిక' - జనవరి 1977.

28. తెలుగు మౌలిక అంశాలు. పు 174.

29. "వేయి పడగలు - ఒక పరిశీలన" పు 26

30 తొలిపలుకు

31. "వేయి పడగలు - ఒక పరిశీలన" పు 31-32

32 సోమసుందర్ - "మాలపల్లపై ప్రభుత్వ నిషేధాలు - ఒక అద్భుత పరిశోధనా పత్రం" (వ్యా.) భారతి నవంబర్, 197[illegible].

33. మా న. ప్ర ని - పు 52

34. ఆవంత్స సోమసుందర్ - "పశ్చిమ దేశాలలో వీచిన రొమాంటిక్ ప్రభంజనాల ప్రభావం భారత దేశంలో పరచుకొంటున్న రోజులవి రొమాంటిజమ్‌కు తెలుగులో కాల్పనిక వాదమనే అనువాదం స్థిరపడింది. ఈ

రొమాంటిక్ ఉద్యమ అంతస్సారాన్ని నిర్బంధించుకొని తెలుగులో రొమాంటిక్ కవిత్వం పుట్టింది." - "కృష్ణశాస్త్రి కవితాత్మ" పు. 70.

35. డా॥ అక్కిరాజు రమాపతిరావు - "వీరేశలింగం సమగ్ర - పరిశీలన" పు. 180.

36. ముదిగొండ వీరభద్రయ్య - "సమాజంలో తీవ్ర పరిణామాలు ఏర్పడుతాయేమోనన్న భయంతో, దానిని అపుటకు రాయప్రోలు వారు తమ రచనల ద్వారా అమలిన శృంగార సిద్ధాంతాన్ని ప్రారంభించటం మొదలుపెట్టినారు." - 'తెలుగు కవిత : సాంఘిక సిద్ధాంతాలు' పు. 5.

37. డా॥ సి. నారాయణరెడ్డి - "ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు : ప్రయోగములు" పు. 297.

38. రాయప్రోలు సుబ్బారావు - "శృంగారం మలినమని, అమలిన మని రెండు శృంగారములున్నవా ? అని విమర్శ. మలిన మగుటకు అవకాశం లేని శృంగారం అమలిన శృంగారమన్నాను " 'సాధన' ఆగస్టు, 1981.

39. దేవులపల్లి రామానుజరావు - "అమలిన శృంగార సిద్ధాంతమును ప్రతిపాదించి అందుకు అనుగుణంగా ఒక ఖండ కావ్యమును, ఒక లక్షణ గ్రంథమును, ఒక రూపకమును సుబ్బారావు గారు రచించినారు."— 'సారస్వత నవనీతం' (వ్యా సం.) పు. 88.

40. కె. యాదగిరి - "రాయప్రోలు సౌందర్య దర్శనం" పు 222.

41. రాయప్రోలు సుబ్బారావు - 'రూప నవనీతమ్' పు. 125.

42. డా. కేతవరపు రామకోటిశాస్త్రి - 'సంపాదకీయ వ్యాసం' విమర్శిని-4

43. స. సా. పు. 36.

44. డా. ఎస్. నిర్మలాదేవి - "సమాజపు కట్టుడులూ, నిష్ఠానియమాలూ అతని స్వేచ్ఛా ప్రయత్నానికీ, ప్రేమ మయైక జీవితానికీ ఆటంకాల్ని కలిగిస్తాయి. దానితో "పక్షినని, పాడగలనని, ప్రణయ వీధి నిత్యలీలా విహారముల్ సలుపుదునని పాడుతుంటాడు"— 'దేవులపల్లి కృష్ణశాస్త్రి - సాహితీ సౌరభం' పు 38.

45. ఈ సందర్భంలో శ్రీమతి కాత్యాయనీ విద్మహే అన్న క్రింది మాటలు గమనింపతగినవి:

"భావనాయోగం ఎంత అమోఘమైనదైనా మానవ సమాజానికి, వ్యావహారిక జగత్తుకు ప్రయోజనవంతంగా ఆచరింపదగిందిగా లేదు. దైహికానుభవమే ప్రేమకు పరమావధిగా బయలుదేరితే క్షణక్షణ జీర్ణదశా పరిణామ లక్షణంగల శరీరాలు శాశ్వతంగా ఆ ప్రేమ భావానికి ఆలంబనాలు కాజాలక దాన్ని చివరకు నిరాధారం చేసి గాలికి వదలివేస్తవి. అందువల్ల ఆలోచించటానికి గాని, ఆచరించటానికి గాని ఈ రెండు భావాలూ సామాజిక దృష్టికి అనుకూలంగా లేవన్న నిర్ణయానికి రచయిత (ఉన్నవ) పాఠకులకు దారి చూపిస్తున్నాడు." - 'మాలపల్లి సాంఘిక, ఆర్థిక, నైతిక, రాజకీయ నవల' (వ్యా) పు. 77.

46. చూడుడు. మాలపల్లి, పు. 350.

47. స. సా. పు. 166.

48. కె. వి. ఎన్. రాఘవన్ - "మాలపల్లి ; ఐతిహాసికత" (వ్యా) పు. 88.

49. ఒకసారి మోహనరావు లేని సమయంలో ఇతని మిత్రుడు వెంకటరావు కమలను వశపర్చుకుందామనే తలంపుతో వచ్చి కమలతో ఇలా అంటాడు: "కమలా ! మోహనరావు దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. వాడెంత దుర్మార్గం చేశాడు. ఇపుడు నీకు దిక్కెవరు ?... నీకు పోషణ చేస్తాను. మా యింటికి నేనే పెద్దను." (మా. ప. 272)

50. కురుగంటి సీతారామభట్టాచార్యులు "ప్రతి వ్యక్తి తన ధర్మాన్ని తాను అవలంబిస్తూ ఉండవలె. అతని కోరికలు, యత్నాలు, తత్సాఫల్యాలు, దైనందిన చర్య, ఆదర్శము, తత్రాపి ప్రయత్నములు, కామతంత్రము. దాన్ని తీర్చుకొనే మార్గము అన్నికూడ ధర్మానికి బద్ధులై ఉండవలె." - 'నవ్యాంధ్ర సాహిత్య వీధులు' పు. 260

51. ముట్నూరి కృష్ణారావు - "ప్రేమోద్వేగమునకు సంఘమును, సంసారమును బలియిచ్చుట ధర్మమునకు విఘాతము". 'సమీక్ష' (వ్యా సం.) పు. 8.

# అనుబంధం* ఒకటి

## 1. భాషా విశేషాలు :

### 1. 1. పదరంభంలో 'యి' - 'వు'లు ఉపయోగించడం.

యినుప (మా. ప. 7) / యిమిడేటట్లు (మా. ప. 43) / వురుకుతీశా (మా. ప. 3) / వుల్లిపాయలు (మా. ప. 4) / వుద్ధరించావు (మా. ప. 59) / వుమ్మేళావెందుకు (మా. ప. 562) /

### 1. 2. 'స్తా'కు బదులుగా 'త్తా' ఉపయోగించడం,

యిత్తామను కొన్నా (మా.ప. 30) / యెత్తింతా మంటే (మా.ప. 63)/

### 1. 3. 'వలెను'కు బదులు 'అలె' ఉపయోగించడం.

నీవు వాండ్లకు గట్టిగా చెప్పాలె (మా.ప. 81) / లోకాపవాదం భరించాలె (మా. ప. 83) / మనుష్యులను పంపాలె (మా ప. 94) / చంపాలెనని (మా. ప. 204) /

### 1. 4. 'ళ్ళ'కు బదులు 'ండ్ల' ఉపయోగించడం.

జీతగాండ్లు (మా. ప. 7) / నీ అంతవాండ్లయితే (మా ప 19) / సృష్టి జేసేవాండ్లు వాండ్లు (మా.ప 111) / కండ్లకు (మా ప. 250)

### 1. 5. 'ఏ'కు బదులు 'యే' ఉపయోగించడం

యెద్దు (మా. ప 1) / యెఱ్ఱ రాళ్ళ (మా ప 3) / యెండను బడి (మా ప. 178) / యేడవడం (మా. ప 660) /

---

* బ్రాకెట్టులలో ఇవ్వబడిన పేజి నెంబర్లు 'మాలపల్లి' చ ము. 1964 లోనివి.

**1. 6. మహాప్రాణాలు ఉపయోగించడం**

ఖిల్లాకొండ (మా.ప. 15)/ ఝట్కా (మా.ప. 58)/ ఠలాయిస్తున్నావట (మా.ప. 60)/ రంగుబిగించిన (మా.ప. 523)/

**1. 7. పదాంత అచ్చులో 'అ' కారానికి బదులు 'ఎ' కారం వాడటం :**

కోరికె (మా. ప. 48)/ రవికె (మా. ప. 523)/.

**1. 8. అనునాసిక ధ్వని కొరకు అరసున్న (ఁ) ఉపయోగించడం :**

గాఁవాఁలె (మా. ప. 22) / వాఁయికెలు (మా. ప. 23).

**1. 9. అన్యదేశ్యాలు :**

రస్తా (మా.ప. 1) / ఖరీదు (మా.ప. 24) / యేక్‌దఫా-ఖసం - నైజీ సబ్‌కొ పూచో (మా. ప. 58) / ఫసంద్ (మా. ప. 58) / దస్కృతులు (మా.ప. 247) / మెహమాను (మా.ప. 409) / సలాం (మా. ప. 411) / శిఫారసు (మా.ప. 412) / తరఫున (మా.ప. 475)

**1. 10. ఆంగ్ల పదాలు :**

సెటిల్ (మా. ప. 59) / పాయింటు దగ్గరే (మా. ప. 59) / గేటు (మా.ప. 59) / మేనేజిమెంటు (మా ప. 410) / పుడ్డింగ్ - వేరీనైస్ సార్ - నో మోర్ - థాంక్యూ సార్ (మా.ప. 135) / రిపోర్ట్ (మా.ప. 165) - డిక్రీ (మా ప. 244)/డబుల్ ప్రమోషన్ (మా.ప. 257)/కమీషన్ (మా.ప. 411)/ షాపు (మా.ప 415) / రిమాండ్ (మా ప 461)/సబుజెయిలు (మా.ప. 463) రిమిషన్ (మా ప 561)/ సస్పెండు (మా ప. 527)/ లిమిటేషన్ (మా.ప. 568)/ డుబ్ - (డిప్యూటి యొక్క పొట్టి రూపం) (మా. ప. 576)

**1 11. భ్రష్టమైన ఆంగ్లపదాలు :**

బొక్కు (మా.ప. 21)/ పబ్లీకు (మా ప. 205)/ టెంపోరీ (మా ప 257)/ డుబ్‌జైలర్ (మా.ప 576).

## 2. వాక్య నిర్మాణం :

### 2. 1. చిన్న వాక్యాలు :

"కమలమ్మ నిలిచి మత్తిల్లి సాహువంక వెఱ్ఱిదానివలె చూచింది. కాఠిన్యం వహించిన మనస్సు వెన్నవలె కరిగిపోయింది. కళవళ పడ్డది, మరిగింది. కళ పెళ్లాడింది గగ్గోలు పడి ఘూర్ణిల్లిపోయింది." (మా.ప. 227).

### 2. 2. దీర్ఘ వాక్య నిర్మాణం :

"తలపై నెమలి పురింజేవురికొని కన్దామరలు అరమోడ్పుజెన్ద, వెడదలై కడుంగడు నిడుదలై లావణ్యముఖసరోవరమున తేలియాడ, నెన్నుదిటిపై కస్తూరి తిలకమును దులకించే ముంగురులు చెర్లాటలాడ, సొబగు దళుకొత్తే చిరునవ్వు తెలికాంతులను లలిత కపోలములపై ప్రసరింప మొగము నోరగానుంచి పగడపుంజిగి నెగజిమ్ము బింబాధరముపై కడాని వంశీలతం జొనిపి నేత్రావి వెదజల్లు ముఖ కమల సమీరంబులచే పిల్లనగ్రోవి నూదుతూ...మనస్సుతో వూరకున్నాడు" (మా. ప 28)

ఈ విధమైన దీర్ఘ వాక్య నిర్మాణం నవలలో పలుచోట్ల చూడవచ్చు.

### 2. 3. ఆలంకారిక వాక్య నిర్మాణం :

"రాజకీయ స్వాతంత్ర్యం గల జాతి విజృంభించే విధాన, విడి చెట్లకు కొమ్మలు, రెమ్మలు విస్తరించిన పోల్కి, బంధముక్తయైన కమలా లావణ్యా సాగరం రాకాసుధాకరునిపై గల వాత్సల్యం చేత పొంగి పొరలెడి పాల్కడలిమాడ్కి తన కుమార స్వరూపుడుగా నున్న మోహన చంద్రుణ్ణి సౌందర్య వైభవంచే వెల్లువ బెట్టి కడాని మేని లతకు పటిక నార్చిన తెరంగున పెంపు గాంచినది." (మా ప. 24)

## 3. భాష :

### 3. 1. రామదాసు ఇంటి భాష :

అ) జోతి : అమ్మా ! రేపెక్కడికే అయ్యా, నీవు పోవడం?

అప్పా : (పగలబడి నవ్వుతాడు)

వెం : ఎక్కడికా ? దేవుడి దగ్గరకు

జో : దేవుడు తన దగ్గరకు మిమ్ముంలను రానిస్తాడా?

మా : ఆ, ఆదేవుడు రానిస్తాడు (మా. ప 19)

ఆ) జో : అమ్మా ! మొద్దుకం చాన గుజ్జుతీసుకుంటే రానేరాదు.

మా : అమ్మాయీ! నీకు పొద్దు గూకులూ గునుపేనేమే.

జో : చూడమ్మా! నా చేతిన యెంత గుజ్జు తుక్కొన్నదో, గీస్తే అట్లాగే వుంది. ఎప్పుడమ్మా చిన్న కంచం కొనిపెట్టడం? (మా ప 20)

### 3. 2. గొడ్ల కాపరుల భాష :

వెం : సాయిబు రొట్టె తెచ్చుకున్నాడే! నాకు కొంచెం పెడతావోయ్?

సా : నీకీ పెట్టి నేనేమి తినాల?

వెం : నా అన్నం పెడతాలే.

సా : మాలవాండ్ల అన్నంకీ తినమంటావూ?
ఆటలు-పాటలకు చూడుడు పుటలు (మా. ప. 36-37-38).

### 3. 3. షావుకార్ల భాష :

సం : వీధిలోకి వచ్చి - యేమండో షావుకారుగారు, పెద షావుకార్లంతా దయ చేశారే, కోస్తా లేచిందా?

షా . గిరాకీ లేదూ, బండలూ లేదు. అడిగే దిక్కే లేదు. మీరు పండినా యెండినా వ్యవసాయం చెయ్యక తప్పదు కదా, వర్తకంలో మేమున్నందుకు దండగో పండగో కొంటూ వుంటాం. (మా. ప 60).

### 3. 4. కోమటింటి దగ్గర భాష :

చం : నీకేమి కావలెనే వెంకీ?

వెం : నాకొక దమ్మిడీది చింతపండూ, వొక దమ్మిడీది వుప్పు, మిరపకాయలూ వొక దమ్మిడీది వుల్లిగడ్డ.

చం : తే, కానీదే. అవి తీసుకో.

వెం : వెయ్యవమ్మా యింకా కాస్త వుప్పు.

చం : ఊఁ, ఇకపో. నీకేమి కావలెనే ముత్తీ?

ము : నాకు అరగిద్దెటికి ఆముదం, వొక గిద్దెటికి పుప్పా, అరగిద్దెటికి చిన వుల్లిపాయా.

చం. : ఊఁ ఇటబట్టు

ము : కాస్త బెల్లం కొసరు బెట్టవమ్మా.

చం . ఇక పో. నీకేమిటే సత్తీ?

స : ఈ పత్తితీసుకొని బియ్యమియ్యవమ్మా, అల్లుడువచ్చాదు (మా.ప. 83-84)

## 3. 5. పిల్లవాడి భాష :

పిల్లవాడు : అప్పా! చిన్న మామయ్య నాకు తాషా బండీ, పీకె కొన్నాడు. మన వూరికి తీసుకుపోదాం.

రామా: అట్లాగే పద

సా : రేపు నా బండెక్కి పోదాం. యేమప్పా?

సా : ...నిన్న మూడు రాళ్ళుమోసింది.

సా : ...పెద్దవే, గోలుగుండ్ల కంటే గూడ పెద్దవే

...పీకె నోట్లోబెట్టి "అప్పా! నీ చేతవుతుందేమో వూదు చూతాం."

సా నాకు ఎవరూ నేర్పలా. నేనే నేర్చుకున్నా.

నేర్పుతాబట్టు. బొక్కంతా నోట్లో పెట్టుకోకుండా ఊదు. (మా ప. 176-177.

## 3. 6. క్రైస్తవుల భాష :

"ఓ నఖానెమ్మె ఫోయే జన్లారా! మీ కొఖ్ఖాటా సెపు కొంటాన్ ఇన్‌ఖోండి, ఖొండి మీఖ్ఖు రఖ్ఖా రెఖల్‌ఖూ, పూజచేయఖండీ, కండీ ఆ యేస్తూ ఆకశ్మం నుండీ వూడిపడినా ఏస్తు, లోఖంలోని పెఘాత్ములఖూ ఏస్తు మీరు నమ్మెండి, నమ్మెంఢీ". (మా. ప. 318)

## 3. 7. భాషలో భావకత్వపు శైలి :

అ..."రైయ్యని పడమటిగాలి తోలుతున్నది. జొన్నపైరు గాలికి కెరటాలు గట్టి ఉయ్యాల లూగుతున్నది. బంగారపు రాగి రేకల గుత్తులవలె సొంపు గులుకుతూ కంకులు పచ్చని సుంకు పోసుకుంటున్నవి" (మా. ప. 2)

ఆ. "కవ్వపు చప్పుళ్ళు వినబడుతున్నవి రాత్రిచేనికి కావలిపోయిన కుఱ్ఱ వాడెవడో గొంతెత్తి శ్రావ్యంగా పాడుతున్నాడు కిఱ్ఱు కిఱ్ఱుమను కావిటి శబ్దములతో జనులు నీళ్ళు మోస్తున్నారు. తూర్పు రేఖలు తెల్లవారు తున్నవి. (మా. ప. 29).

ఇ. "సోమయాజులుగారు కునికిపాట్లు పడుతున్నారు. ఎఱ్ఱరాళ్ళ కుండలాలు దీపం యెదుట తళతళ మెరుస్తున్నవి ఒక చిన్న కాసు బంగారం యెక్కువబెట్టి చేయించుకోవడంచేత కొంచెం బరువై తమ్మెలు నొప్పి యెత్తుతున్నవి. చిన్నప్పుడు గుట్టించిన దోసకాడ నాజూకుగానే ఉన్నది. తీయించవలెనను కుంటే ముసలమ్మ వద్దన్నది. గడియారం కొట్టడం ప్రారంభించింది. (మా. ప. 145).

ఈ. గొల్ల కాపరులలో 'నరిసిగాడు' పాడిన పాటలలోనూ భావ కవిత్వపు ఛాయలు (శైలి) కన్పిస్తవి

సీకూ నీ - వారు లేరు నాకూ నా - వారు లేరు యేటి వొడ్డున యిల్లు గడదం పదరా చెల్ మోహనరంగా. యేరు వస్తే ఈది పోదం పదరా.

మనిద్దరీ మన - సొక్కటైతే, మల్లెపూల - తెప్ప గట్టి
తెప్ప మీదనె - తేలిపోదాం పదరా చల్ మోహనరంగా
తెప్పమీదనే తేలిపోదాం పదరా

కంట కా - టీక బెట్టి కడవా చం - కాన బెట్టి
కన్నీటా - కడవ నింపితి గదరా. (మా.ప. 37)

## 3. 8. గ్రాంథిక భాషా ప్రభావం :

"తలపై నెమిలిపురిం జేవురుకొని కన్దామరలు అరమోడ్పు జెంద, వెడదలై కడుంగడు నిడుదలై లావణ్య ముఖ సరోవరమున తేలియాడ, నెన్నుదుటిపై కస్తూరితిలకము దులకించే ముంగు రులు చెర్లాటలాడ, సొబగు తళుకొత్తే చిరునవ్వు తెలికాంతులను లలితకపోలములపై ప్రసరింప మొగము నోరగానుంచి పగడం పుజిగి నెగజిమ్ము బింబాధరముపై కడాని వంశీలతం జొనిపి

నెత్తావి వదజల్లు ముఖకమలసమీరంబులచే పిల్లన గ్రోవి నూదుతూ, చిగురుటాకుల రవళి నువ్వెత్తుగొనని వేలుగొనలు వేణురంధ్రము లపై బరపుతూ, వైజయంతీ లతాశోభితమై బంగారు చిరుగజ్జియలు కిణికిణి రవంబులతో హేమపీతాంబరాలంకృతమైన జఘనంబుననూ ముల్లోక పావనములైన వ్యత్యస్తాంఘ్రి కమలములనూ తాండవమాడ త్రిభంగి లలితంబై నీలమేఘశ్యామంబై భువనమోహనంబైన శ్రీకృష్ణాఖ్య పరబ్రహ్మము నడుమ నిలువ ఆ జవ్వనంపు మొలక బొచ్చెము లేక అచ్చుబడి అచ్చెరువుగ అందరి కన్నిరూపులై కాటుకుబ్బుపై హత్తికొను క్రొక్కారు మెరుంగులంబోలు గోప కన్యాసహస్రములతో కేలంగేలు గీలించి అంగనపొంత మాధవుడూ, అతనిచెంత నంగనగా నల్లకలువలూ హేమకమలములూ కలిపి గుచ్చిన దండయొక్క రవళి యవఘళింప.-" (మా.ప. 28)

## 4. మాండలికాలు

### 4. 1. గుంటూరు జిల్లా మాండలికాలు*

అప్పెసం = ప్రతిక్షణమూ, ఎప్పుడూ అని (Spacious) / అజీలు = హాజరు / ఇలంబ్రము = విశాలము / ముద్రసుద్ది = పూర్తిగా, ఖచ్చితంగా / ముట్టగిలబడుట = జబ్బుపడుట / కురదలా = కొదవ / కొరవ = జొన్న, సజ్జ / అజ్జాయించు = అనుమానించు / జాడు = పండగా మిగిలిన దంట్లు / అలవార్లు = అలవరచుట / లుగచెడు = ఆరోగ్యం చెడు / పెండెం = Gate / నకరాలు = వేషాలు / గాబు = తొట్టి / గరువు = ఎర్రనేల / కప్పర చీకటి = కొద్దికొద్దిగా చీకటి / అలగాజనం = చిన్న కులాల వాళ్ళు / బోరెం = మిరప తాయలు కుక్కే పెద్ద గోనెసంచి / పేస్తరు = భేదం / పుసులు = ఆరోగ్యం / పులిక = కొద్దిపాటి జ్వరం.

---

* మద్దూరి సుబ్బారెడ్డి - "మాలపల్లితో మాండలికాలు" అనే వ్యాసంలో గుంటూరు మాండలికాలు తెలిపినారు. అందులోనివి కొన్ని తీసుకొనబడినవి. పు. 92 నుండి 101.

**4.2. పల్నాడు మాండలికాలు :***

కులస్సు = వివరము (ఖులాసా అను పదానికి వికృతి) / గోయిగ = ఏపుగ / దుత్త = చిన్న బుంగ (గురిగి) / ఎబ్బరికము = అసహ్యము / అడవ = గోడ / మల్ల గులాలుపడి = వాదులాడి (అటూ ఇటూ ఆలోచనలు చేసి) / తుత్తుర పుల్ల = చురచుర మండేవి / ముక్కు కోతలు = చిక్కులు పెట్టడం / గడ్డి తినడం = లంచం పట్టడం / కొనాకులు మేయడం = పైపైన చూడటం (మిడిమిడి జ్ఞానం)

**4.3. రాయలసీమ మాండలికాలు :****

కొట్టం = పశువుల కొట్టం / మట్టసానికి = తగినంత / మిద్దె = రాతితో గాని మట్టితోగాని కట్టిన ఇల్లు / కామకావచ్చి = తప్పకవచ్చి / మీరుగెన = మీరుగనుక / గుంటి దగ్గర = చిన్న బండరాయి దగ్గర / ఖాయిలా పడడం = అనారోగ్యపడడం / దుబారా = ప్రియం.

## 5. సామెతలు : జాతీయాలు : 'న్యాయములు :

**5.1. సామెతలు - లోకోక్తులు :**

1. మనకు ప్రాప్తం ఎంతో అంత (మా. ప. 2)
2. అందరూ బాగుండేనే బాగు (మా. ప. 2)
3. అడుగులో హంసపాదు. (మా. ప. 17 & 412)
4. ఎప్పుడూ గడచిన రోజులే మంచివి. (మా. ప. 19)
5. రాళ్ళు దేవుళ్ళయితే రాసులు మింగవా (మా. ప. 19)

---

* మందలపర్తి ఉపేంద్రశర్మ - "లక్ష్మీనారాయణులు" అన్న గ్రంథంలో పల్నాడుకు చెందిన మాండలికాలు తెలిపినారు. అందులో నుండి కొన్ని గ్రహించడం జరిగింది. పు. 169 నుండి 175.

** డా. ఎస్. గంగప్ప - "మాలపల్లి భాషా విశేషాలు" అన్న వ్యాసంలో రాయలసీమ మాండలికాలను పేర్కొన్నారు. వాటిలోనివి కొన్ని ఉదహరించడం జరిగింది. పు. 109-110.

6. నిచ్చెన స్వర్గానికి వేయవచ్చు. నరకానికి వేయవచ్చు. (మా ప. 27)
7. మనుష్యులు యెటువాలు బడితే అటు మాట్లాడు కుంటారు. (మా. ప. 30)
8. ఆడబిడ్డ అర్ధమగడన్నారు. (మా. ప. 31)
9. బంగారానికి వెలిగారం తోడయినట్టు (మా. ప 32)
10. తీగెలాగితే అంతా కదులుతుంది. (మా. ప 32)
11. కట్టె వంకలు పొయి తీరుస్తుంది. (మా. ప. 44)
12. మొదటి ప్రయత్నానికే మొన విరిగి పోయింది. (మా. ప. 44)
13. అడక్కపోతే అమ్మయినా పెట్టదు. (మా. ప 54)
14. పొదుగున పాలున్నప్పటికీ దూడకుమ్మంది తల్లిచేపదు. (మా. ప. 54)
15 బిడ్డగనే కోడలుంటే వద్దనే అత్త యెక్కడా వుండదు. (మా. ప 57)
16. లాభం లేని సెట్టి వరదన బోడు (మా. ప. 60)
17. పొయ్యలేక తిరిపెపు మజ్జిగ లేవనేవు. (మా. ప. 64)
18. సంసారం లేని వాండ్లకు సరసాలు మెండు. (మా. ప. 66)
19. వుపాయం లేని వాండ్లను వూళ్లో వుండనీయ గూడదుట. (మా. ప. 67)
20. చిత్తకు చిరుపొట్టలన్నట్లు (మా. ప. 69)
21. తనకు మాలిన ధర్మమా. (మా. ప 86)
22 కళ్ళెం యెక్కడ వుంటే అక్కడికి నెట్టుకొని పోతుంది. (మా. ప. 87)
23. వానా కాలం వచ్చి యెండా కాలం యెచ్చి, (మా ప. 90)
24. గొర్రెకొవ్వెందల్లా గొల్లవాడికే మేలు. (మా. ప. 91)
25 చంక బిడ్డను జారదీసేవాడు (మా. ప. 92)
26. మానవసేవే భగవంతుని సేవ. (మా. ప. 100)
27. సొమ్ముమీద కాపీనం బడితే గాని బాగుపడదు (మా. ప. 107)
28. వాయించిచూతాం యెట్లామోగేదీ తెలుస్తుంది (మా. ప. 107)
29. నీకేమి దెలుసు పిల్లకాకివి. (మా. ప. 113)
30. కీడెంచి మేలెంచమన్నారు. (మా. ప. 114)
31. కోటి విద్యలు కూటికేగా. (మా. ప. 119)
32. వూరు దూరమైన కొద్దీ కాడు దగ్గరవుతుంది. (మా. ప. 122)
33. ప్రతిమించి రాగానబడ్డది. (మా. ప. 124)
34. వోపలేనివాండ్లకు వద్దనేవాండ్లు కన్నతల్లి. (మా. ప. 130)

35. వేగిరింపనేదియు విషమమగు (మా. ప 134 & 414).
36. ఆలస్య మమృతం విషం (మా. ప. 134 & 414).
37. పుట్టికెక్కిన తరువాత స్వర్గానికెక్కవచ్చు. (మా ప. 144)
38. దున్నడానికి దూడలలో, మెయ్యడానికి యెద్దులలో. (మా ప 115)
39. గరపచేలో గుంటక తోలినట్టు. (మా. ప. 147)
40. పొయ్యేటప్పుడు వెంటరాదు వొక పుచ్చిన వక్కైనా. (మా. ప 160)
41. అంతా తోడుదొంగలే (మా. ప. 162)
42. తాటి చెట్టంత వాడికి తలదన్నే వాడుంటాడు. (మా. ప. 162)
43. కత్తి వాటేసినా మొగాన నెత్తురు లేకుండా (మా. ప 164).
44. కాని రోజులు వచ్చేవరకు అన్ని అట్లా తటస్థ పడతవి. (మా. ప. 168)
45. కుండకు మూత వుందిగాని నోటికి లేదు. (మా. ప. 171)
46. వొకమ్మ గన్నబిడ్డ మీద మీకెందుకు జాలి వుంటుంది. (మా. ప. 189)
47. బొందిలో ప్రాణాలుంటే ఎప్పటికైనా చూసుకుంటాం. (మా. ప. 182)
48. పులికైనా బిడ్డ మీద ప్రేమ వుంటుంది. (మా. ప. 186)
49. పనిలేనివాడి మనసు పరిపరి విధాల బోతుంటుంది. (మా. ప. 202)
50. హనుమంతుని దగ్గర కుప్పిగంతులా. (మా. ప. 203)
51. కొండకు నాగలి మోటిస్తే లాభం లేదు. (మా. ప. 204)
52. ఋణ శేషమూ, శత్రుశేషమూ ఉండగూడదు (మా. ప. 206)
53. కుంభకర్ణుని మోస్తరుగా ఆరు నెలలు నిద్రా, ఆరు నెలలు మెళకువానా. (మా. ప. 208)
54. వేరుపడితే మేలురా మగడా (మా ప. 208)
55. ఉద్యోగం పురుష లక్షణం (మా. ప 222)
56. మూడుమూళ్ళు తొమ్మిది మాట్లకూ నిశ్చయం. (మా. ప. 224).
57. పిట్ట బుఱ్ఱున లేచిపోయింది, గూడు మాత్రం మిగిలింది (మా ప. 234)
58. కీడులో మేలు. (మా ప. 237)
59. నొసటన్ వ్రాసిన వ్రాలు కన్న కలదా నూరేండ్లు చింతించినన్. (మా. ప. 237)
60. మన బంగారం మంచిదైతే కంసాలేమి చేస్తాడు. (మా. ప. 240)
61. గురువును మించిపోయిన శిష్యుడు. (మా.ప. 227)

62. గతజల సేతుబంధనం. (మా ప. 261)
63. కదిలిస్తే తొడుగంతా కదులుతుంది. (మా.ప. 266)
64. గుర్రం గుడ్డిదైనా దాణాకు తక్కువ లేదు. (మా.ప. 278)
65. బయటివాడు చూడి గేదంటే యింటివాండ్లు గొడ్డు గేదంటారట. (మా.ప. 279)
66. బ్రాహ్మణ్ణి చెడగొట్టిన పాపం, పతివ్రతను చెరచిన పాపం పోవట. (మా.ప. 288)
67. అమ్మబోతే అడవి, కొనబోతే కొరివి. (మా.ప. 298)
68. వేళ్ళు వంకర బెటితేగాని వెన్నరాదు. (మా.ప. 298)
69. పూలమ్మిన ఊళ్ళో కట్టెలెట్లా అమ్ముతాడు. (మా.ప. 299)
70. అయినదేమో అయింది. కావలసినదేమో కానున్నది. (మా.ప. 299)
71. తోరణం గట్టంగనే పెండ్లి పూర్తి అయిందా. (మా.ప. 307)
72. కావలసిన కార్యాలు గంధర్వులు తీరుస్తారు. (మా.ప. 315)
73. కరిచీ గాటు పడకుండా (మా.ప. 320&518)
74. ఆయన వెయ్యూళ్ళ పూజారి. (మా.ప. 327)
75. కులవృత్తికి సాటిలేదు గువ్వలచెన్నా (మా.ప. 338)
76. జడ్డిగంలోనే మిడత పొడిచింది. (మా.ప. 351)
77. గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్. (మా.ప. 353)
78. కాలము ముంచుకొని వచ్చేవరకు అన్ని వానగూడుతవి. (మా ప. 361)
79. పాపం తీరింది పోయింది తీరంది వుంది. (మా.ప. 361)
80. యదార్థవాది లోక విరోధీ (మా.ప 371)
81. మొండిచేతుల పెండ్లానికి మోరుగాళ్ళ మొగుడు. (మా.ప. 372)
82. ఏదైనా మంచికే వస్తుంది. (మా.ప. 396)
83. కాలం మారిన కొద్దీ మనపని తీసికట్టుగా వుందికాని వేసికట్టుగా లేదు. (మా ప. 401)
84. కలిమిలేములు కావడికుండలు. (మా.ప. 401)
85. మూడుపువ్వులు ఆరుకాయలు. (మా.ప. 401)
86. కాసులను కొట్టి గిద్దలకు వేయడం. (మా ప. 404)
87. బెల్లంకొట్టిన రాయివలె. (మా.ప. 408)

88. మాటలు తులసివుండలు వూడిపడతవి. (మా.ప. 415)
89 చింత చచ్చినా పులుపు చావలేదు. (మా ప. 415)
90. బీదకూటికి బిక్క దేవుడని (మా.ప. 415)
91. అందనిపండ్లకు ఎందుకు అర్రులు చాచడం. (మా.ప. 422)
92. కుక్కాశ గుంద్రాతితో తీర్చావే. (మా. ప. 422)
93. అప్పు చేసి పప్పుకూడు (మా. ప. 434)
94. గోచికంటె గొప్ప దరిద్రమా (మా. ప. 435 & 581)
95. వడ్లల్లో సంకులు లేకుండా ఉంటవా (మా. ప. 441)
96. ఆశకోసులు దాటిస్తుంది. (మా. ప. 442)
97. అయ్యకెత్తరా కోళ్ళగంపని. (మా. ప. 443)
98. గడ్డపార తీసుకుంటే రాయివణకాలె (మా. ప. 445)
99. చంక బిడ్డల జారదీసే మాటలు (మా. ప. 446)
100. ఏలేందుకులేవుగాని ఎత్తుకతినేందుకు ఊళ్ళు చాలాఉన్నవి. (మా.ప. 447)
101. తిడితే తప్పుగాని తిరుచుకుంటే తప్పు లేదు. (మా. ప. 447)
102. పెనంమీద నుంచి మంగళంలోకి దూకినట్లయింది. (మా. ప 447)
103. వ్రతం యెలాగూ చెడ్డది సుఖమెందుకు దక్కించుకోకూడదు. (మా.ప.449)
104. కన్నుపొయ్యేటంత కాటుక పెట్టుకోవదమెందుకు (మా. ప. 450)
105. మొండివాడు రాజుకంటే బలవంతుడు. (మా. ప. 450)
106. కొస కోళ్ళు లేకుండా వుంటపీ? నిల్చినవే లెక్క. (మా. ప. 451)
107. తినబోతూ రుచి అడగడం యెందుకు? (మా. ప. 455)
108. యెంతవరకు పోష్తమో అంత (మా. ప. 457)
109. తల్లి సగం వియ్యంపు రాలన్నారు (మా. ప. 459)
110. వొక పంట నవ్వూ వొక పంట ఏడుపూ (మా. ప 460)
111. కష్టాలు మనుషులకు రాక మాకులకు వస్తవా? (మా ప 493)
112. అంతా ఆరుమూడవుతుంది (మా ప 501)
113 వినదగు నెవ్వరు చెప్పిన. (మా. ప. 505)
114 రోగిపాలే కోరాడు వైద్యుడూ పాలే చెప్పాడు (మా ప 507)
115. కొంటే రానిది కొసరితే వస్తుందట (మా ప 523)
116. నిజం చెబితే నిష్ఠూరం. (మా. ప. 5 8)

117. రజ్జు సర్ప భ్రాంతి. (మా. ప. 532)
118. మేఘాలను నమ్మి చెరువు తెగగొట్టుకున్నట్టు. (మా. ప. 535)
119. తక్కువ నోములు నోచి యెక్కువ కోరికలు కోరితే యేమి ప్రయోజనం? (మా. ప. 535)
120. డబ్బుంటే కొండమీది కోతి దిగి వస్తుంది. (మా. ప. 549)
121. తలలు బోడులైతే తలుపులు బోడులా? (మా. ప. 552)
112. పుణ్యానికి పుట్టెడిస్తే పిచ్చి కుంచమని. (మా. ప. 558)
123. కడుపులో కాలుతుంటే అరగక తిరగ మళ్ళుతవా. (మా. ప. 559)
124. ఆకలి రుచెరుగదు. (మా. ప. 559)
125. అడవి గాసిన వెన్నెల. (మా. ప. 560)
126. దేవుడు వరమిచ్చినా పూజారి వరమియ్యడని. (మా. ప. 564)
127. రామాయణ మంతా విని రామునికి సీత యేమిగావలె. (మా. ప. 566)
128. దీపం ఉండగనే చక్కబెట్టుకోవలసింది. (మా. ప. 566)
129. స్వయంరాజా స్వయం మంత్రి (మా. ప 568)
130. వంగితే నెత్తికెక్కుతారు (మా. ప. 568)
131. కాకుల్లో కలహంస (మా. ప 573)
132. ఇంతబ్రతుకు బ్రతికి ఇంటివెనుకచావా? (మా. ప. 602)
133. శివుడెరికె లేనిది చీమయినా కుట్టదు. (మా. ప. 616)
134 కనకుండా కట్టెడు పత్తిస్తే వినకుండ పీరంగమెట్లాగని (మా. ప. 626)
135. డబ్బులేనివాడు డుబ్బుకు కొఱగాడు (మా. ప 629)
136. దేవుని పెండ్లి కందరూ పెద్దలే (మా ప. 673)

## 5-2. జాతీయాలు - నుడికారాలు :

1. గంపెడు చీకటి నెత్తిన వేసుకొని (మా ప. 57)
2. పోయేటప్పుడు కట్టుకుపోతావా (మా. ప. 98)
3. కొంపగుల్లవుతున్నది. (మా. ప. 105)
4. నూరారయ్యేది (మా. ప. 113)
5. నేలవిడిచి సాముచేసినట్లు (మా ప. 145)
6 కాలుగాలిన పిల్లివలె (మా. ప. 161 & 233)

7. కాలికి బలపం కట్టుకొని (మా. ప. 161)
8. సమయానికి పుట్టి ముంచటం (మా. ప. 168)
9. తలలో నాలికవలె (మా. ప. 166 )
10. శల్యసారథ్యం (మా. ప 244)
11. గుండెలో రాయిపడ్డట్టు (మా. ప. 329)
12. చన్నీళ్ళకు వేన్నీళ్ళుగా (మా. ప. 375)
13. ఆకలి కరకరలాడటం మా. ప 418)
14. ఇసుక మేట వేసినట్టు (మా. ప. 533)

## 5-3. సంస్కృత 'న్యాయములు :

1. శరీర మాద్యంఖలు ధర్మ సాధనం. (మా.ప. 48)
2. సర్వే గుణాః కాంచన మాశ్రయంతే. (మా.ప. 129, 238 & 339)
3. ఏక క్రియా ద్వ్యర్థికరీ. (మా.ప.
4. లోకోభిన్నరుచిః (మా.ప. 143)
5. ఘట్ట కుట్టికా ప్రభాతం. (మా.ప. 144)
6. సంధిమిచ్ఛంతి సాధవః (మా ప. 243 & 613)
7. యత్నేకృతే యదిన సిద్ధ్యతి కోత్రదోషః. (మా.ప. 243 & 506)
8 అధికస్య అధికం ఫలం. (మా.ప. 256)
9. నభూతో నభవిష్యతి. (మా. ప. 294)
10. వణిగ్వరః పట్టణ మధ్య చోరః. (మా ప. 301)
11. సహేంద్రతక్షకాయ స్వాహా. (మా.ప. 303)
12. సంఘే శక్తిః కలౌయుగే. (మా.ప. 385)
13. ఏకస్స్వాదు నభుంజీత. (మా ప. 385)
14 కౌపీన రక్షణార్థం అయం పటాటోపః. (మా ప.
15 శత శ్లోకేన పండితః. (మా ప. 567)
16. లంకణం పరమౌషధం (మా.ప.
17 బహుధా విభజ్య మప్యేవం ననమేయంతు కస్యచిత్ (మా ప. 597)
18. అహింసా పరమో ధర్మః. (మా.ప. 6 2)
19. క్షుధాతురాణాం నరుచిర్న పక్వం. (మా ప. 622)
20. ఉదార చరితా నాంతు వసుధైవ కుటుంబకం. (మా ప.

అనుబంధం : రెండు

# ఉపయుక్త వాఙ్మయసూచి

## తెలుగు గ్రంథాలు :-


అంకయ్య, వి., 'ఆంధ్రకవిత్వము-గాంధీతత్వము' 1980 ప్ర. ము.

అప్పారావు, పి. యస్. ఆర్., 'నాట్యశాస్త్రమ్' (అను) పునర్ముద్రణము. 1983.

ఆంజనేయులు నాయుడు, గురజాడ., 'మాలపల్లి-ఒక పరామర్శ' ఎం. ఫిల్. సిద్ధాంత వ్యాసం (అము) శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి-మార్చి, 1980.

ఆగయ్య, వాడపల్లి, 'పరిపూర్ణ బోధ మార్గదర్శి', 1986.

ఉపేంద్రశర్మ, మందలపర్తి., 'లక్ష్మీనారాయణులు' గాంధీ సాహిత్య ప్రచురణాలయము, హై. 1974.

కృష్ణయ్య, భాగవతుల, 'శుద్ధ నిర్గుణ తత్వ కందార్థ దరువులు-క్షరాక్షరోపాధిద్వయదోష పరమ తత్వకందములు.'

కుటుంబరావు, బి వి, 'ఆంధ్రనవలా పరిణామము' జూన్, 1971.

కృష్ణారావు, నాళము., 'వితంతు వివాహచరిత్ర' హితకారిణీ సమాజము; రాజమహేంద్రవరము - 1950.

కృష్ణారావు, ముట్నూరి., 'సమీక్ష'

గోపాలకృష్ణమచెట్టి, నరహరి., 'శ్రీరంగరాజు చరిత్ర' 1872.

గోపాలరెడ్డి, బండి., 'మాలపల్లి నవలపై ప్రభుత్వనిషేధాలు' విశాలాంధ్ర పబ్లిషర్స్, విజయవాడ - ఏప్రిల్, 1979.

గోపి, ఎన్., 'వ్యాసనవమి' చైతన్య పబ్లికేషన్స్ హై, నవంబర్, 1986

జంగయ్య, నీలా, 'తెలుగులో తత్వకవులు'. 1986.

తారాచంద్., 'భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర' (అను.) ఆచార్య భూపతి లక్ష్మీ నారాయణ, తెలుగు అకాడమి, హైద్రాబాదు-1973.

'తెలుగు మౌలిక అంశాలు' ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయము, హైద్రాబాదు-1987.

'తైత్తిరీయోపనిషత్ప్రశ్నత్రితయమ్' వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్, మద్రాసు - 1928.

దేవమాంబ, తూడి; 'భక్తానంద బోధామృతమ్' ఓరుగల్లు 1969.

నాగభూషణశర్మ, మొదలి; 'తెలుగు సాహిత్యం-గాంధీ ప్రభావం'
—'తెలుగు నవలా వికాసము' ప్ర. ము. 1971.

నాగభూషణదాసు, జవంగుల; 'శ్రీ వీర బ్రహ్మేంద్రస్వాముల వారి బోధామృతము' 1951.

నారాయణరెడ్డి, సి., 'ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు, ప్రయోగములు' జనవరి, 1967 ప్ర. ము.

నిర్మలాదేవి, ఎన్., 'దేవులపల్లి కృష్ణశాస్త్రి సాహితీ సౌరభం' సుధాంశ్ ప్రచురణలు, ఫిబ్రవరి-1985.

భవభూతి., 'ఉత్తర రామ చరితమ్' వావిళ్ళవారి ముద్రణ, మద్రాసు-1940.

బాపిరాజు, అడవి., 'తుపాను' జయంతి పబ్లికేషన్స్, విజయవాడ-జూన్, 1984.

భాగ్యమ్మ, పి., 'మాలపల్లిలో పాత్ర చిత్రణ' ఎం.ఫిల్. సిద్ధాంత వ్యాసం (అము) కాకతీయ విశ్వవిద్యాలయం, సెప్టెంబర్, 1981.

'భారతదేశ సంస్కృతి' ద్వి. భా. తెలుగు అకాడమీ, హైద్రాబాదు-1977.

భూమయ్య, అనుమాండ్ల., 'వేయిపడగలు-ఆధునిక ఇతిహాసము' కులపతి సమితి, వరంగల్లు, డిసెంబరు, 1984.

యాదగిరి, కె., 'రాయప్రోలు సౌందర్య దర్శనం' పిహెచ్.డి. సిద్ధాంత గ్రంథం. కా.వి.వి. వరంగల్లు, మే, 1986.

రంగనాథాచార్యులు, కె.కె., 'నూరేళ్ళ తెలుగునాడు' ఆం. ప్ర. సా. పరిషత్, హైద్రాబాదు, 1984.

రమణారెడ్డి, కె వి , 'మహోదయం' విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ మే, 1969.

రమాపతిరావు, అక్కిరాజు., 'వీరేశలింగం-సమగ్ర పరిశీలన', 1972.

రాజశేఖరరెడ్డి - 'కావ్యమీమాంస'.

రాఘవన్, కె వి.ఎన్., 'వేయిపడగలు-సమకాలీనత, సార్వకాలీనత' తెలుగు అకాడమీ, హై. 1989.

రాధాకృష్ణ, బూదరాజు., 'వ్యావహారిక భాషా వికాసం' విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, విజయవాడ, ఆగష్టు, 1972.

రామరాజు, బిరుదురాజు., 'తెలుగు జానపదగేయ సాహిత్యము' 1958. ప్ర.ము.

రామకోటిశాస్త్రి, కేతవరపు , 'తిక్కన కావ్యశిల్పము' జనవరి, 1978.

రామానుజరావు, దేవులపల్లి., 'సారస్వత నవనీతము' మన్మథ వసంతము.

లక్ష్మీనారాయణ, ఉన్నవ., 'మాలపల్లి' చ.ము. 1964.

లక్ష్మీనరసింహము, చిలకమర్తి., 'స్వీయచరిత్ర' కాలచక్రం ప్రచురణ.

లింగమూర్తి, పరశురామపంతుల., 'సీతారామాంజనేయ సంవాదము' శ్రీ అరుణా బుక్ హౌజ్, మద్రాసు - 1982.

'విమర్శిని'- 'విశ్వనాథ వాఙ్మయ జీవిత విశేష సంచిక' కాకతీయ విశ్వవిద్యాలయం - 1977.

విద్యేశ్వరి, డి., 'తెలుగు నవల మనో విశ్లేషణ' నిధిన్ ఎంటర్ ప్రైజస్, హై. 1980

వీరేశలింగం, కందుకూరి., 'స్వీయచరిత్ర' రెం భా విజ్ఞాన చంద్రికా మండలి ప్రచురణ మద్రాసు. 1985.

——'రాజశేఖర చరిత్ర పీఠిక' ఎమెస్కో ప్రచురణ-హై. 1969

వీరభద్రయ్య, ముదిగొండ., 'తెలుగు కవిత సాంఘిక సిద్ధాంతాలు' శ్రీ అరవింద సొసైటి' హన్మకొండ, జూన్, 1980.

——'వేయిపడగలు' ఒక పరిశీలన కులపతి సమితి ఓరుగల్లు, 1984

వెంకటరంగయ్య, మామిడిపూడి., 'భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర' మొదటి భాగం 1974.
—రెండవ భాగం - 1976.
—మూడవ భాగం - 1977.

వెంకటశాస్త్రి, ముసునూరి., 'విద్యార్థి కల్పతరువు' 1953.

వెంకటసుబ్బయ్య, జి., 'సంఘ సంస్కర్త ఉన్నవ'. జనవరి 1977.

వెంకటేశ్వర్లు, పుల్లాబొట్ల., 'తెలుగు నవలా వికాసము' ఖమ్మం. 1974.

వెంకటేశ్వరరావు, త్రిపురనేని., 'విశ్వదాభిరామ వినురవేమ' వేమన వికాస కేంద్రం, విజయవాడ, ఏప్రిల్. 1981.

'వేమన సూక్తిరత్నాకరము' -Ed. పూర్ణయాచార్యులు. బందరు, 1913.

శివానందస్వామి., 'పరిపూర్ణ బోధ సిద్ధాంత శిరోమణి'. పూర్వాతీత భాగం - 1969.

శేషేంద్రశర్మ, గుంటూరు., 'నా దేశం-నా ప్రజలు' ఫిబ్రవరి, 1977.

శేషాచలాహ్వయుడు, ఏకల., 'శ్రీ శివరామ దీక్షితీయంబను అచల గ్రంథము.' S.V. గోపాల్ అండ్ కో, మదరాసు, 1973.

శ్రీరామమూర్తి, కొర్లపాటి., 'నాథయోగి మన వేమన' రమణశ్రీ .ప్రచురణ, విశాఖపట్టణము - 1987.

'శ్రీ భగవద్గీత'.

"శ్రీ బృహద్వాశిష్ఠము" ఉత్తర భాగం 1973.

సత్యనారాయణ, విశ్వనాథ., "రామాయణ కల్పవృక్షము". బాల. 1976.
— 'కావ్యానందము'. అరవింద ప్రచురణలు. విజయవాడ. 1972.

సంజీవమ్మ, పి., 'తెలుగు నవలలో సామాజిక చైతన్యం' అ.ర.సం. ప్రచురణ. కడప. 1985.

సంపత్కుమారాచార్య, కోవెల., 'ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ; సాంప్రదాయకరీతి' ఫిబ్రవరి, 1981.

సహవాసి, 'ఆధునిక భారత చరిత్ర' మూలం - బిపిన్ చంద్ర, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, సెప్టెంబర్, 1983.

సాంబశివరావు, పూడిపెద్ది., 'జీవబ్రహ్మరహస్య సారామృతము' సి.వి. కృష్ణా బుక్ డిపో, మదరాసు.

స్వామి, ననుమాస., 'మాలపల్లి - గోదాన్ : తులనాత్మక పరిశీలన' సెప్టెంబర్, 1986.

సీతారామాచార్యు, కురుగంటి., 'నవ్యాంధ్ర సాహిత్య వీధులు' జనవరి, 1949 ద్వి. ము.

సుబ్రహ్మణ్యం, జి.వి., 'ప్రథమాంధ్ర మహాపురాణము' ప్ర. ము. జనవరి, 1973.

సుబాని, ఎస్.ఎం., 'వేమన జీవితము, సాహిత్యము. సమగ్ర పరిశీలనము' విశ్వశాంతి సాహిత్యప్రచురణలు. పొన్నూరు, 1988.

సుబ్బారావు, రాయప్రోలు , 'రూపనవనీతమ్' - 1952.

సుదర్శనం, ఆర్.ఎస్., 'సమాజము - సాహిత్యము' చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘం, చిత్తూరు. అక్టోబరు, 1972.

సుప్రసన్నాచార్య, కోవెల., 'సహృదయ చక్రం' శ్రీవాణి ప్రచురణలు. వరంగల్, జూలై, 1983.

సూర్యప్రకాశరావు. కలపాల , 'విప్లవ భారతం' తెలుగు విద్యార్థి ప్రచురణలు.. మచిలీపట్నం, 1981.

స్ఫూర్తిశ్రీ, 'స్ఫూర్తిశ్రీ వ్యాసావళి', రెం భా, 1965.

సోమసుందర్, ఆవంత్స , 'కృష్ణశాస్త్రి కవితాత్మ' ఆగష్టు, 1987.

సోమశేఖర శర్మ. మల్లంపల్లి , 'ఆంధ్ర సంస్కృతీతరంగణి' ఆం ప్ర హై 1976.

## తెలుగు వ్యాసాలు

కమలాదేవి ఛటోపాధ్యాయ., 'గాంధీజీ-భారతీయ సోషలిస్టులు' 'గాంధీమహాత్ముడు నూరేళ్ళు' (వ్యా సం) సంపా. డా. సర్వేపల్లి రాధాకృష్ణన్. 1980. తృ. ము.

కాత్యాయని, కే, 'మాలపల్లి-సాంఘిక, ఆర్థిక, నైతిక, రాజకీయ నవల' విమర్శిని 3. కాకతీయ విశ్వవిద్యాలయ పరిశోధన పత్రిక, వరంగల్లు - జనవరి, 1978

కోటీశ్వరరావు, తుమ్మపూడి., 'పీఠిక' - 'నవనాథ చరిత్ర', ఆం. ప్ర. సా. అ. హై. 1984.

'కృష్ణాపత్రిక'. సంపాదకీయం - 4-10-1958.

గంగప్ప, ఎస్, 'ఉన్నవవారి సాహిత్య జీవిత విశేషాలు'-సాహిత్యోపన్యాసములు-17. ఆం. ప్ర. సా. అకాడమీ, హై. ఆగష్టు, 1980.

—— 'మాలపల్లి : భాషావిశేషాలు' - 'భాషావ్యాసాలు' మే, 1985.

జగన్నాధం చుండి, 'స్వాతంత్ర్యోద్యమం - ప్రధానాంశాలు. సామ్యవాదం' - భారతస్వాతంత్ర్యోద్యమ ప్రదీప్తిసంచిక, ఎడిటర్ : ఆర్. సూర్యనారాయణ మూర్తి, మార్చి, 1980.

తాయారు, యలమంచిలి., 'గాంధీవాదము'- 'మహతి' సమీక్షావ్యాస సంకలనం, యువభారతి సికింద్రాబాదు. 1972

దక్షిణామూర్తి, పోరంకి., 'భాష-శైలి-మాండలికత' - 'తెలుగు వలన నూరు సంవత్సరాలు' ఆంధ్ర.సా. అకా.హై.1973.

దేబర్.యు.ఎన్., 'సాంఘిక పునర్నిర్మాణము."గాంధీమహాత్ముడు నూరేళ్ళు"

నమశ్శివాయ, గూడూరి., 'ఉన్నవ లక్ష్మీనారాయణగారి జీవిత విశేషాలు' సాహిత్యోపన్యాసములు- 17

నాగేశ్వరరావు, కాశీనాధుని ,'తొలిపలుకు' మాలపల్లి, చ.ము. 1964.

నారయణరావు, కోదాటి., 'ఆంధ్రప్రదేశ్‌లో అస్పృశ్యతా నివారణోద్యమము' భారత స్వాతంత్ర్యోద్యమ ప్రదీప్తిసంచిక.

మురార్జీదేశాయ్, 'ఆదర్శపురుషుడు గాంధీజీ'- గాంధీమహాత్ముడు నూరేళ్ళు.

రమాపతిరావు, అక్కిరాజు., 'శైలి, కథా సంవిధానము' 'మన నవల పరిశీలన' చైతన్య సాహితి, వరంగల్.1979.

రాఘవన్, కె.వి.యస్., మాలపల్లి, 'ఐతిహాసికత' ఆంధ్రపత్రిక. 1981-82
—— 'విశ్వనాథ - ఆర్థిక వ్యవస్థ' - విశ్వనాథ సాహిత్య వ్యక్తిత్వం. తెలుగు అకాడమి. హై. 1989.

రామకోటి శాస్త్రి, కేతవరపు., 'సంపాదకీయం' విమర్శిని-4. జనవరి, 1973.
——'మాలపల్లి నవల-సామాజిక స్పృహ' మూసీ, జనవరి, 1972.

రామమోహనరాయ్, కడియాల., 'మారుతున్న కాలం - మాలపల్లి' భారతి, నవంబర్, 1972.

లక్ష్మీనారాయణ, ఉన్నవ,, 'హిందూమతము' - 'ఆంధ్ర సర్వస్వము' సంపా: మాగంటి బాపినీడు. మార్చి, 1961.

లక్ష్మీపతిరావు, ఎమ్., 'బాలగంగాధర తిలక్' - 'భారత స్వాతంత్ర్యోద్యమ ప్రదీప్తి సంచిక'.

విష్ణువర్ధన్‌రెడ్డి, ఎద్దుల., 'మాలపల్లి నవల, దాని విశిష్టత' స్రవంతి, ఆగష్టు, 1977.

వీరభద్రయ్య, ముదిగొండ., 'తాత్విక చింతన' - మన నవల పరిశీలన' 1979.

వీరవెంకట రామచంద్రరావు, ఇలపకుర్తి., 'అచల (సంప్రదాయంలో) గురు పరంపర' - 'వేమన వివిధ దృక్కోణాలు' వేమన వికాస కేంద్రం, విజయవాడ - మే, 1982.

వెంకటరావు, కపిల , 'అచల బోధలు' - ఆంధ్ర పత్రిక - 1947.

వెంకటరత్నం, తెలికిచర్ల., 'ఆధునికాంధ్ర సాహిత్యంపై గిడుగు రామమూర్తి పంతులు గారి ప్రభావం' - సాహిత్యోపన్యాసములు - 4, ఆం. ప్ర. సా. అకా. హై. 1970.

శేషగిరిరావు, చీమకుర్తి., 'సర్కారు జిల్లాల తత్వ కవులు' - 'తెలుగులో తొలి సమాజకవులు' సంపా. కె.కె. రంగనాథాచార్యులు. ఆంధ్ర. సా. పరిషత్ హైద్రాబాదు-1983.

శ్రీ రామమూర్తి, మల్లెల., 'మాలపల్లి నవలారచయిత ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు' ఆంధ్రప్రభ. ఆదివారం అనుబంధం 30-12-84

శ్రీనివాస శిరోమణి., 'మాలపల్లి నిర్మాత ఉన్నత లక్ష్మీనారాయణ గారు' భారతి - నవంబర్, 1945.

సంపత్కుమారాచార్య, కోవెల., 'స్వరూపము - పరిణామము' - 'మన నవల పరిశీలన.'

సాంబశివరావు, వై., 'గాంధీజీ నిర్మాణ కార్యక్రమాంశాలు మాలపల్లి నవలలో చిత్రింపబడిన తీరుతెన్నులు' ఆం. ప్ర. ఓరియంటల్ కాన్ఫరెన్సు., ఆం. ప్ర. సా. ప. హై. 1981.

సీతాపతి, గిడుగు., 'కళాప్రపూర్ణ గిడుగు వెంకటరామమూర్తి పంతులు' (జీవిత చరిత్ర, - వారు రచించిన గ్రంథములు) సాహిత్యోపన్యాసములు-4.

సుబ్రహ్మణ్యం, జి.వి., 'నవ్యసంప్రదాయ కవిత్వోద్యమం' 'విశ్వనాథ సాహిత్య వ్యక్తిత్వం'.

సుబ్బారావు, రాయప్రోలు., 'నవకవిత' - సాధన, ఆగస్టు, 1981.

సుబ్బారెడ్డి, మద్దూరి, 'మాలపల్లిలో మాండలికాలు' - 'సాహిత్య సమితి వ్యాసావళి' తిరుపతి - ఫిబ్రవరి, 1972.

సోమసుందర్., 'మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు - ఒక అద్భుత పరిశోధనా పత్రం' - భారతి - నవంబర్, 1972.

## ఆంగ్ల గ్రంథాలు: వ్యాసాలు :

Benerjea, Akshaya Kumar., 'Philosophy of Goraknath'. Published by - Mahant Dig Vijainath Trust, Goraknath Temple - Gorakhpur.

Gandhi, M.K., 'The Removal of un-touchability' Ahmedabad - 1959.

'India in my Dreams' - Navajivan Publishing House. Ahmedabad - 1959.

Singh. R.K. 'The Spiritual Epic Tradition And Savitri- I. Call beyond - November, 1981.

